సంపత్ కుమార్ మేడవరపు

# రూపధ్యాన రత్నావళి

## (దేవతామూర్తుల రేఖాచిత్రాలు)

సంపాదకులు
శిల్పకళానిధి **శ్రీ గణపతి స్థపతి**

అనువాదకులు
**శ్రీ దురిశేటి వేంకటరామాచార్యులు**




ప్రచురణ
**కార్యనిర్వహణాధికారి**
తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి.
**2005**

శ్రీ స్వర్ణ సుబ్రహ్మణ్యకవిగారు, శ్రీ దురిశేటి వెంకటరామాచార్యులుగారు. శ్రీ రాఘవాచార్యులు గారు, శ్రీ నరసింహాచారిగారు, మరియూ, శ్రీ పెదపాటి నాగేశ్వరరావు గారు, విద్వాంసులుగా ఉండి, ఎంతో సహాయపడి, ఈ అనువాద కార్యక్రమాన్ని పూర్తిచేశారు. వారు అభినందనీయులు.

ఈ రూపధ్యానరత్నావళిని శ్రీ దురిశేటి రామాచార్యులుగారు, గురుతర బాధ్యతతో తెలుగులో తర్జుమా చేశారు.

త్వరలో, తదుపరి గ్రంథం, కాశ్యప శిల్పం ప్రచురణ కాబోతున్నది. సచిత్రముగా కాశ్యప శిల్పం ఇంతవరకూ ముద్రణ కాలేదు. ఈ బృహత్తర కార్యాన్ని త్వరలో పూర్తిచేయబోతున్నాం. మా పూర్వులు రహస్యంగా ఉంచిన దీనిని, రెండు భాగములుగా ప్రచురించబోతున్నాము.

దేవాలయ నిర్మాణం, మూర్తి నిర్మాణం, గ్రామ నిర్మాణం ప్లానులతో సహా వస్తుంది. శిల్పులకు, శిల్పాభిమానులకు, పురావస్తు శాఖీయులకు, పాఠకులకు అందరికీ తోడుపడుతుందని, నా విశ్వాసం.

శిల్పశాస్త్రంలో అనేక గ్రంథాలు ఉన్నవి. ప్రత్యేకంగా ఈ రూపధ్యాన రత్నావళి, శిల్ప శాస్త్రం, ఆంధ్ర శిల్పులకు ఒక వరప్రసాదంగా భావిస్తున్నాను.

శ్రీ రాజరాజేశ్వరి, త్రిపురసుందరి, మరియు భువనేశ్వరీ దేవీ విగ్రహములకు ఎడమపాదం మడిచిన రీతిలో కుడిపాదం క్రిందగా ఉంచిన విధంగా, అటులనే కాక, కుడిపాదం మడిచి ఎడమ పాదం క్రింద ఉంచిన రీతిగానూ చేయు ఆచారమున్నది. ఈ రెండి రీతులలోనూ, ఆ దేవీ విగ్రహములను ఈ శాస్త్రములో చిత్రీకరించుట జరిగినది. పాఠకులు గమనింప ప్రార్థన.

ఇట్లు
బుధజన విధేయుడు
శిల్పకళానిధి, శిల్పకళా విద్యన్మణి
**ఎస్.ఎం. గణపతి స్థపతి**
ప్రధాన సంపాదకులు
శిల్పశాస్త్ర అనువాద ప్రణాళిక
దేవాదాయ ధర్మాదాయ శాఖ,
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము - హైదరాబాదు.

# రూపధ్యాన రత్నావళి

## విషయసూచిక

### గణపతి ధ్యానములు

## శ్రీ కుమారస్వామి రూప భేదములు

## శ్రీ శక్తిరూప ధ్యానములు

రూపధ్యాన రత్నావళి

# వర్ణ ధ్యానములు

## శివమూర్తి ధ్యానములు

అష్టభైరవుల ధ్యానములు



## విష్ణుమూర్తి ధ్యానములు

## శ్రీమన్నారాయణుని శయన విగ్రహములు

ఋ



ౠ



ఌ



ౡ



ఏ



ఐ



ఓ



ఔ



అం

అః



క



కా



కి



కు

గి



గు



గో



గౌ



గం



ఘ



జ



జ్ఞా



చ

రూపధ్యాన రత్నావళి



చా



చి



చం



ఛ



జ



జా



జ్వా

ని



నీ



నృ



నం



ప



పి



పు



పూ



ప్ర

ము



మూ



మో



మృ



య



యో



ర



రా



రి



రు



రే



ల

శి



శీ



శు



శూ



శై



శ్రీ



శం



శిం



ష



షో



స

# తప్పొప్పుల పట్టిక

| పేజీ | పంక్తి | తప్పు | ఒప్పు |
|---|---|---|---|
| 1 | 21 | గణగతుల | గణపతుల |
| 2 | 10 | కపిద్ధ | కపిత్థ |
| 3 | 14 | పరస్పరశ్లిష్ట | పరస్పరాశ్లిష్ట |
| 5 | 4 | ప్రకాంతరేణ | ప్రకారాంతరేణ |
| .. | 5 | సారీయోని | నారీయోని |
| 18 | 7 | కుడిపైకున | కుడిపైపున |
| 24 | 14 | బావించుచున్నాము | భావించుచున్నాము |
| 25 | 20 | శ్రీమయారాధిరూఢం | శ్రీమయూరాధిరూఢం |
| 39 | 22 | తిలకోజ్జలా | తిలకోజ్జ్వలా |
| 40 | 16 | సర్వాహ్లదిని | సర్వాహ్లాదిని |
| 43 | 12 | అష్టభాహా | అష్టబాహా |
| 55 | 17 | సపితే | సహితే |
| 85 | 13 | ప్రత్యషః | ప్రత్యషైః |
| 99 | 13 | శ్రీప్రసన్నలక్ష్మి | శ్రీప్రసన్నలక్ష్మిని |
| 103 | 21 | పూరయతీం | పూరయంతీం |
| 108 | 5 | కంటభూషణా | కంటకభూషణా |
| 115 | 7 | పంచచమాష్టక | పంచమాష్టక |
| 130 | 8 | దమర్వేణ | దమర్వీణ |
| 144 | 6 | శ్రీలతతాదేవి | శ్రీలలితాదేవి |
| 145 | 11 | చంద్రరేఖమునో | చంద్రరేఖతో |
| 447 | 8 | పరనుశివుడు | పరమశివుడు |
| 150 | 14 | వక్రకుండలమ్ | నక్రకుండలమ్ |
| 152 | 7 | అపన్యము | అపసవ్యము |

| | | | |
|---|---|---|---|
| 154 | 26 | అపాస్మారు | అపస్మారు |
| 155 | 11 | శ్రీమన్మపుహాపరమ | శ్రీమన్మహాపరమ |
| 156 | 7 | చతుర్ద్దోధిః | చతుర్ద్దోర్భిః |
| 164 | 9 | పరాభయినవ్ | వరాభయినమ్ |
| .. | 11 | సరూప | సురూప |
| 168 | 19 | సవ్యపౌదం | సవ్యపాదం |
| 175 | 14 | దక్షపాళ్శ్యకె | దక్షపార్శ్వకే |
| 178 | 15 | కింకాల | కంకాల |
| .. | 17 | కంకాల | కంకాల |
| .. | 25 | ప్తెకి | పైకి |
| 182 | 22 | స్కాందోక్తివత్కారు | స్కాందోక్తవత్కారు |
| 187 | 2 | చరటంక | వరటంక |
| 228 | 22 | శంఖచంక్రః | శంఖచక్రః |
| 232 | 23 | ముఖాంబుజః | ముఖాంబుజః |
| 275 | 13 | అథాతఃస్వంప్రవక్ష్యామి | అథాతస్స్వంప్రవక్ష్యామి |
| 280 | 27 | మడోన్మని | మనోన్మణి |
| 284 | 2 | స్రజం | స్రజాం |

ఓం

# ద్వాత్రింశద్గణపతి నామాని

## ముప్పదియిరువురు గణపతుల నామములు

—***—

బాల స్తరుణభక్తౌ చ వీర శ్శక్తి ర్ద్విజ స్తథా
సిద్ధ ఉచ్ఛిష్టవిఘ్నేశౌ క్షిప్రో హేరంబనామకః ॥

లక్ష్మీగణపతి శ్చైవ మహావిఘ్నేశ్వర స్తథా
విజయః కల్పనృత్త శ్చాప్యూర్ధ్వవిఘ్నేశ ఉచ్యతే ॥

ఏకాక్షరో వర శ్చైవ త్ర్యక్షర క్షిప్రదాయకః
హరిద్రాఖ్య శ్చైకదంత స్సృష్టి రుద్దండనామకః ॥

ఋణమోచనకో ఢుంఢి ర్ద్విముఖ స్త్రిముఖ స్తథా
సింహయోగ శ్చ దుర్గా చ దేవ స్సంకటహారకః ॥

ద్వాత్రింశద్విఘ్నరాజాఖ్యా స్తేషాం ధ్యాన ముచ్యతే ॥

బాలగణపతి 1, తరుణగణపతి 2, భక్తగణపతి 3, వీరగణపతి 4, శక్తి గణపతి 5, ద్విజగణపతి 6, సిద్ధగణపతి 7, ఉచ్ఛిష్టగణపతి 8, విఘ్నగణపతి 9, క్షిప్రగణపతి 10, హేరంబగణపతి 11, లక్ష్మీగణపతి 12, మహాగణపతి 13, విజయ గణపతి 14, నృత్తగణపతి 15, ఊర్ధ్వగణపతి 16, ఏకాక్షరగణపతి 17, వరగణపతి 18, త్ర్యక్షరగణపతి 19, క్షిప్రదాయకగణపతి 20, హరిద్రాగణపతి 21, ఏకదంతగణ పతి 22, సృష్టిగణపతి 23, ఉద్దండగణపతి 24, ఋణవిమోచకగణపతి 25, ఢుంఢి గణపతి 26, ద్విముఖగణపతి 27, త్రిముఖగణపతి 28, సింహగణపతి 29, యోగ గణపతి 30, దుర్గాగణపతి 31, సంకటహరగణపతి 32.

అని ఈ గణపతుల పేరులు. ఇక ఈ ముప్పదియిర్వురుగణపతుల ధ్యానములు వరుసన చెప్పబడుచున్నవి.

## 1. శ్రీ బాలగణపతి ధ్యానము

కరస్థకదలీచూతపనసేక్షుకమోదకమ్
బాలసూర్య మిమం వందే దేవం బాలగణాధిపమ్ ॥

ఈ బాలగణపతికి నాల్గుచేతులు. కుడివైపున క్రిందినుండి పైకి మామిడి పండును 1, అరటిపండును 2, అట్లే ఎడమవైపున పనసపండును 1, చెఱకుగడను 2, నాల్గుచేతులలో ధరించి తొండములో మోదకము (లడ్డుకము)ను పట్టుకొని, బాల సూర్యునివలె ప్రకాశించు చున్న బాలగణపతిని, నేను నమస్కరించుచున్నాను.
(రక్తవర్ణము)

## 2. శ్రీ తరుణగణపతి ధ్యానము

పాశాంకుశాపూపకపిత్థజంబు
స్వదంతశాలీక్షు మపి స్వహస్తైః ।
ధత్తే సదా య స్తరుణారుణాభః
పాయా త్స యుష్మాం స్తరుణో గణేశః ॥

ఈ తరుణగణపతికి ఎనిమిది చేతులు, కుడివైపున క్రిందినుండి పైకి తన దంతమును 1, వెలగపండును 2, వరికంకులను 3, అంకుశమును 4, అట్లే ఎడమ వైపున కుడుమును 1, నేరేడుపండును 2, చెఱకుగడను 3, పాశమును 4, ఎనిమిది చేతులతో ధరించి లేతసూర్యునివలె ఎఱ్ఱనగు శ్రీతరుణ గణపతి మిమ్ములను ఎల్లప్పుడు రక్షించునుగాక. (రక్తవర్ణము)

## 3. శ్రీ భక్తగణపతి ధ్యానము

నాలికేరామ్రకదలీగుడపాయసధారిణమ్
శరచ్చంద్రాభవపుషం భజే భక్తగణాధిపమ్ ॥

ఈభక్తగణపతి శరత్కాలమేఘమువలె తెల్లని శరీరకాంతి కలవాడు. ఈతనికి నాల్గుచేతులు. కుడివైపున క్రిందినుండి పైకి మామిడిపండును 1, అరటిపండును 2, అట్లే ఎడమవైపున బెల్లములో చేయబడిన క్షీరాన్నపాత్రమును 1. కొబ్బరికాయను 2, ధరించిన నాల్గుచేతులు కల ఈ భక్తగణపతిని నేను భజింతును. (శ్వేతవర్ణము)

## 4. శ్రీ వీరగణపతి ధ్యానము

బేతాలశక్తిశరకార్ముకచక్రఖడ్గ
ఖట్వాంగముద్గరగదాంకుశనాగపాశాన్ ।
శూలం చ కుంతపరశుధ్వజ ముద్వహంతం
వీరం గణేశ మరుణం సతతం స్మరామి ॥

ఈ వీరగణపతి ఎఱ్ఱని శరీరకాంతి కలవాడు. ఆతనికి పదునారు చేతులు. కుడి వైపున క్రిందినుండి పైకి వరుసన బాణమును 1, అంకుశమును 2, గొడ్డలిని 3, కుంతమును 4, ముద్గరమును 5, శూలమును 6, కత్తిని 7, చక్రమును 8, అట్లే ఎడమ వైపున వింటిని 1, నాగమును 2, గదను 3, ధ్వజమును 4, ఖట్వాంగమును 5, శక్తిని 6, పాశమును 7, గాలమును 8, పదునారు-చేతులతో ధరించి ఉండును. అట్టి వీరగణపతిని నేను ఎల్లప్పుడు స్మరింతును. (రక్తవర్ణము)

## 5. శ్రీ శక్తిగణపతి ధ్యానము

ఆలింగ్య దేవీం హరితాంగయష్టిం
పరస్పరాశ్లిష్టకటిప్రదేశమ్ ।
సంధ్యారుణం పాశసృణీ వహంతం
భయాపహం శక్తిగణేశ మీడే ॥

ఈ శక్తిగణపతి సంధ్యాకాంతివంటి ఎఱ్ఱని శరీరచ్ఛాయతో నుండును. పసుపుపచ్చని శరీరకాంతితో, చక్కని శరీరముకల దేవిని తన వామనిజకరములో కౌగిలించి, ఆమెతో కలసికొనిన కటిప్రదేశము కలిగియుండును.

ఈశక్తిగణపతి కుడిభాగమున నిజకరముచే తనదంతమును 1, పరహస్తముచే అంకుశమును 2, ఎడమపరహస్తముచే పాశమును ధరించి ఉండును. కనుక ఆతనికి నాల్గుచేతులు.

భయమును పోగొట్టునట్టి శ్రీ శక్తిగణపతిని ప్రార్థింతును.
(సిందూరవర్ణము)

## 6. శ్రీ ద్విజగణపతి ధ్యానము

యం పుస్తకాక్షగుణదండకమండలుశ్రీ
విద్యోతమానకరభూషణ మిందువర్ణమ్ ।
స్తంబేరమాననచతుష్టయశోభమానం
త్వాం యః స్మరే ద్ద్విజగణాధిపతే స ధన్యః ॥

శ్రీ ద్విజగణపతి చంద్రునివలె తెల్లని శరీరకాంతి కలవాడు. ఈతనికి నాల్గు చేతులు. నాల్గు ఏనుగు మొగములు.

ఈ ద్విజగణపతి కుడివైపున క్రిందినుండి పైకి జపమాలను 1, దండమును 2, అల్లే ఎడమవైపున పుస్తకమును 1 కమండలువును 2, నాల్గుచేతులతో ధరించి యుండును. ఇట్టిరూపముతో నున్న ఓద్విజగణపతీ ! నిన్ను ఎవ్వడు స్మరించునో వాడు ధన్యుడు. (శుభ్రవర్ణము)

## 7. శ్రీ సిద్ధగణపతి ధ్యానము

పక్వచూతఫలపుష్పమంజరీ
చేక్షుదండతిలమోదకై స్సహ ।
ఉద్వహన్ పరశుమస్తు తే నమః
శ్రీసమృద్ధియుత హేమపింగళ ॥

శ్రీ సిద్ధగణపతి లేతపసుపురంగుగల శరీరకాంతి కలవాడు. ఈతనికి నాలుగు చేతులు. కుడివైపున క్రిందినుండి పైకి మామిడిపండును 1, గొడ్డలిని 2, అల్లే ఎడమ వైపున పూలగుత్తిని 1, చెఱకుగడను 2, తొండముతో నువ్వుల కుడుములను ధరించి యుండును.

శ్రీదేవి సమృద్ధిదేవి యనువారితో కూడియుండి హేమపింగళవర్ణముగల ఓ సిద్ధ గణపతీ ! నీకు నమస్కారము. (పింగళవర్ణము)

## 8. ఉచ్ఛిష్టగణపతి ధ్యానము

నీలాబ్జదాడిమీవీణాశాలీగుంజాక్షసూత్రకమ్
దధ దుచ్ఛిష్టనామాయం గణేశః పాతు మేచకః ॥
(ప్రకారాంతరేణ)
నారీయోనిరసాస్వాదలోలుపం కామమోహితమ్ ॥

ఈ ఉచ్ఛిష్టగణపతి నల్లని శరీరకాంతి కలవాడు.

ఈతనికి నాల్గుచేతులు. కుడివైపున క్రిందినుండి పైకి జపమాలను 1, కలువ పూవును 2, అట్లే ఎడమవైపున వీణను 1, వరికంకిని 2, తొండముతో దానిమ్మపం డును ధరించును. అట్టి ఉచ్ఛిష్టగణపతి ఎల్లరను రక్షించునుగాక ।

(మఱియొకవిధము)

ఈ ఉచ్ఛిష్టగణపతి కామము, మోహము కలవాడు. లేక కామముచే మోహము కల వాడు. అందుచేత తన ప్రియురాలి భగమునందలి రసమును ఆస్వాదించుటయందు ఆసక్తి కలవాడు. (నీలవర్ణము)

## 9. శ్రీ విఘ్నగణపతి ధ్యానము

శంఖేక్షుచాపకుసుమేషుకుఠారపాశ
చక్రస్వదంతసృణిమంజరికాశరౌఘైః ।
పాణిశ్రితైః పరిసమీహితభూషణశ్రీ
ర్విఘ్నేశ్వరో విజయతే తపనీయగౌరః ॥

శ్రీవిఘ్నగణపతి బంగారువలె పచ్చని శరీరకాంతి కలవాడు. ఈతనికి పది చేతులు. కుడివైపున క్రిందినుండి పైకి స్వదంతమును 1, పూలబాణమును 2, అంకుశమును 3, గొడ్డలిని 4, చక్రమును 5, అట్లే ఎడమవైపున పూలగుత్తిని 1, చెఱకువింటిని 2, పాశమును 3, వెల్లిగడ్డిని 4, శంఖమును 5, ధరించి పది చేతులతో, సర్వాభరణములతో, ప్రకాశించుచుండును. (స్వర్ణవర్ణము)

## 10. శ్రీ క్షిప్రగణపతి ధ్యానము

దంతకల్పలతాపాశరత్నకుంభాంకుశోజ్జ్వలమ్
బంధూకకమనీయాభం ధ్యాయేత్ క్షిప్రగణాధిపమ్ ॥

శ్రీక్షిప్రగణపతి ప్రవృత్తిపువ్వువలె అందమైన ఎఱ్ఱని శరీరకాంతి కలవాడు, ఈతనికి నాల్గు చేతులు. కుడివైపున క్రిందినుండి పైకి దంతమును 1, అంకుశమును 2. అట్లే ఎడమవైపున కల్పలతను 1, పాశమును 2, తొండముతో రత్నకలశమును ధరించి యుండును. అట్టి క్షిప్రగణపతిని ధ్యానింపవలెను. (రక్తవర్ణము)

## 11. శ్రీ హేరంబగణపతి ధ్యానము

అభయవరదహస్తః పాశదంతాక్షమాలా
సృణిపరశుందధానో ముద్గరం మోదకం చ ।
ఫల మధిగతసింహః పంచమాతంగవక్త్రో
గణపతి రతిగౌరః పాతు హేరంబనామా ॥

శ్రీహేరంబగణపతి స్వచ్ఛమగు తెల్లని శరీరకాంతి కలవాడు. ఈతనికి - ఐదు ఏనుగు మొగములు, పది చేతులు, సింహవాహనము ఉండును.

ఈగణపతి కుడివైపున క్రిందినుండి పైకి వరుసగ అభయముద్రను 1, తన దంతమును 2, ముద్గరమును 3, జపమాలను 4, అంకుశమును 5, అట్లే ఎడమవైపున వరదముద్రను 1, పండును 2, గొడ్డలిని 3, లడ్డుకమును 4, పాశమును 5, కుడిఎడమల పది చేతులతో ధరించి యుండును. అట్టి శ్రీహేరంబగణపతి ఎల్లరను రక్షించుగాక ! (గౌరవర్ణము)

## 12. శ్రీ లక్ష్మీగణపతి ధ్యానము

బిభ్రాణః శుకబీజపూరకమిలన్మాణిక్యకుంభాంకుశాన్
పాశం కల్పలతాం చ ఖడ్గవిలసజ్జ్యోతిస్సుధానిర్ఝరః ।
శ్యామే నాత్తసరోరుహేణ సహితం దేవీద్వయం చాంతికే
గౌరాంగో వరదానహస్తసహితో లక్ష్మీగణేశో ఽవతాత్ ॥

శ్రీలక్ష్మీగణపతి తెల్లని శరీరకాంతి కలవాడు. కనుక ప్రకాశించుచున్న అమృతప్రవాహమువలె నుండును. ఈతనికి పదిచేతులు. ఇరుప్రైపుల ప్రియురాండ్రగు నిరువురు శ్రీదేవత లుందురు. వారల కుడిఎడమ చేతులయందు ఒక్కొక్క నల్లతామర పూవు ఉండును.

ప్రియురాండ్రను తన కుడిఎడమ నిజకరములతో కౌగిలించి యుండును.

ఆస్వామి కుడిప్రైపున క్రిందినుండి పైకి వరుసన పెంపుడుచిలుకను 1, దానిమ్మ పండును 2, ఖడ్గమును 3, అంకుశమును 4, అట్లే ఎడమప్రైపున వరదముద్రను 1, రత్నపాత్రమును 2, కల్పలతను 3, పాశమును 4, ధరించి మిగిలిన ఎనిమిది చేతులతో ఒప్పారును. ఇట్టి లక్ష్మీగణపతి ఎల్లరను రక్షించుగాక! (గౌరవర్ణము)

## 13. శ్రీ మహాగణపతి ధ్యానము

హస్తీంద్రానన మిందుచూడ మరుణ
చ్ఛాయం త్రిణేత్రం రసా
దాశ్లిష్టం ప్రియయా సపద్మకరయా
స్వాంకస్థయా సంతతమ్ ।
బీజాపూరగదేక్షుకార్ముకలస
చ్చక్రాబ్జపాశోత్పల
వ్రీహ్యగ్రస్వవిషాణరత్నకలశాన్
హస్తైర్వహంతం భజే ॥

శ్రీ మహాగణపతి ఎఱ్ఱని శరీరకాంతితో, ఏనుగు మొగముతో, నెలవంకశిరో భూషణముతో, మూడు కన్నులతో, పదిచేతులతో, అనురాగమువల్ల తనతొడయందున్న ప్రియురాలగు శ్రీదేవీమూర్తిని ఎడమ నిజకరముచేత ఆశ్లిష్టుడై (కౌగలించినవాడై) ఉండును. ఆ దేవీమూర్తికి రెండుచేతులయందు పద్మములుండును.

ఈస్వామి కుడిప్రైపున క్రిందినుండి పైకి తనదంతమును 1, దానిమ్మపండును 2, కలువపూవును 3, వరికంకులను 4, చక్రమును 5, అట్లే ఎడమప్రైపున ప్రియురాలిని 1, గదను 2, చెఱకువింటిని 3, పద్మమును 4, పాశమును 5, తొండముతో రత్నకలశ మును ధరించి ఉండును. అట్టి శ్రీ మహాగణపతిని భజింతును. (రక్తవర్ణము)

# 14. శ్రీ విజయగణపతి ధ్యానము

పాశాంకుశస్వదంతామ్రఫలవా నాఖువాహనః
విఘ్నం నిహంతు న స్సర్వం రక్తవర్ణో వినాయకః ॥

శ్రీ విజయగణపతి ఎఱ్ఱని శరీరకాంతితో, నాల్గుచేతులతో, ఎలుక వాహనముతో, నుండును.

ఈ స్వామి కుడివైపున క్రిందినుండి పైకి తనదంతమును 1, అంకుశమును 2, అట్లే ఎడమవైపున మామిడిపండును 1, పాశమును 2, నాల్గు చేతులతో ధరించి ఉండును. అట్టి శ్రీ విజయగణపతి మాయొక్క ఎల్ల విఘ్నములను నశింపచేయుగాక.

(రక్తవర్ణము)

# 15. శ్రీ నృత్తగణపతి ధ్యానము

పాశాంకుశాపూపకుఠారదంత
చంచత్కరాక్లప్తవరాంగులీకమ్ ।
పీతప్రభం కల్పతరో రధస్థం
భజామి నృత్తోపపదం గణేశమ్ ॥

శ్రీనృత్తగణపతి పచ్చని శరీరకాంతులతో, కల్పవృక్షముయొక్క, క్రింది భాగమున నాట్యము చేయుచుండును. అందువలన నీతడు కల్పనృత్తగణపతి యనబడును.

ఈతనికి నాల్గుచేతులు. కుడివైపున క్రిందినుండి పైకి తనదంతమును 1, అంకుశమును 2, అట్లే ఎడమవైపున గొడ్డలిని 1, పాశమును 2, తొండముచేత అపూపమును (లడ్డును) పట్టుకొని యుండును. నాట్యముచేయుచుండుటచేత ఈ ఐదు వస్తువులు గల ఐదు కరములు కదలుచుండును. అట్టిచేతులయందు నాట్యభంగిమముచేత వంచబడిన అంగుళులు (వ్రేళ్ళు) కల కల్పనృత్తగణపతిని నేను భజింతును. (పీతవర్ణము)

## 16. శ్రీ ఊర్ధ్వగణపతి ధ్యానము

కల్హారశాలికమలేక్షుకచాపబాణ
దంతప్రరోహకగదీ కనకోజ్జ్వలాంగః ।
ఆలింగనోద్యతకరో హరితాంగయష్ట్యా
దేవ్యా కరోతు శుభమూర్ధ్వగణాధిపో మే ॥

ఈ ఊర్ధ్వగణపతి బంగారువలె పచ్చనగు శరీరచ్ఛాయతో, ఎనిమిది చేతులతో నుండును.

ఈ స్వామి కుడివైపున క్రిందినుండి పైకి తనదంతమును 1, బాణమును 2, వరికంకిని 3, ఎఱ్ఱకలువపూవును 4, అట్లే ఎడమవైపున ఆలింగనమునకు ఊర్ధ్వ కరమును 1, చెఱకువింటిని 2, గదను 3, పద్మమును 4, ధరించును.

పచ్చని ఇంపైన శరీరముగల తన ప్రియురాలగు శ్రీమూర్తిని ఆలింగనము చేయవలయు నని ఎడమ నిజకరమును ఎత్తిన ఊర్ధ్వగణపతి నాకు శుభములను ఇచ్చుగాక ! (కనకవర్ణము)

## 17. శ్రీ ఏకాక్షరగణపతి ధ్యానము

రక్తో రక్తాంగరాగాంశుకకుసుమయుత
స్తుందిల శ్చంద్రమౌళి
ర్నేత్రై ర్యుక్త స్త్రిభి ర్వామనకరచరణో
బీజపూరం దధానః ।
హస్తాగ్రాక్లప్తపాశాంకుశరదవరదో
నాగవక్త్రో ఒహిభూషో
దేవః పద్మాసనస్థో భవతు సుఖకరో
భూతయే విఘ్నరాజః ॥

ఈ ఏకాక్షరగణపతి ఎఱ్ఱని శరీరచ్ఛాయతో, ఎఱ్ఱనైన మైపూతతో, ఎఱ్ఱని వస్త్ర ములతో, ఎఱ్ఱని పూవులతో, లావైన శరీరముతో, శిరమునందు నెలవంక భూషణముతో, మూడు కన్నులతో, పొట్టి కాలుచేతులతో, ఏనుగు మొగముతో, పాముల హారములతో పద్మముపై కూర్చుండి ఉండును.

ఈ స్వామి తొండముతో దానిమ్మపండును, కుడివైపున క్రిందినుండి పైకి తన దంతమును 1, అంకుశమును 2, అట్లే ఎడమవైపున వరదముద్రను 1, పాశమును 2, నాల్గు చేతులతో ధరించును.

సుఖముల నిచ్చు ఏకాక్షరగణపతి భక్తులకు ఐశ్వర్యమును ఇచ్చుగాక :

(రక్తవర్ణము)

# 18. శ్రీ వరగణపతి ధ్యానము

సిందూరాభ మిభాననం త్రిణయనం
హస్తే చ పాశాంకుశౌ
బిభ్రాణం మధుమత్కపాల మనిశం
సాధ్వీందుమౌళిం భజే ।
పుష్ట్యాశ్లిష్టతనుం ధ్వజాగ్రకరయా
పద్మోల్లసద్ధస్తయా
తద్యోన్యాహితపాణి మాత్తవసుమ
త్పాత్రోల్లసత్పుష్కరమ్ ॥

ఈ వరగణపతి సిందూరమువలె ఎఱ్ఱనైన శరీరకాంతితో, ఏనుగు మొగముతో, మూడు కన్నులతో, శిరమున నెలవంక భూషణముతో, నాల్గుచేతులతో నుండును.

కుడిచేతియందు ధ్వజమును, ఎడమచేతియందు పద్మమును ధరించిన, పుష్టి అను పేరుగల దేవితో హత్తుకొనిన శరీరముకలవాడై ఉండును.

ఈతని తొండమునందు ధనముగల పాత్రముండును. కుడివైపున క్రిందినుండి పైకి మధువుతో నిండిన కపాలమును 1, అంకుశమును 2, అట్లే ఎడమవైపున నిజకరముతో ప్రియురాలగు పుష్టిదేవియొక్క భగమును స్పృశించుచుండును 1, పాశమును 2, ఉండును. అట్టి శ్రీవరగణపతిని మిక్కిలి భజింతును. (రక్తవర్ణము)

# 19. శ్రీ త్ర్యక్షరగణపతి ధ్యానము

గజేంద్రవదనం సాక్షా చ్చలత్కర్ణసుచామరమ్
హేమవర్ణం చతుర్బాహుం పాశాంకుశధరం వరమ్ ॥
స్వదంతం దక్షిణే హస్తే సవ్యే త్వామ్రఫలం తథా
పుష్కరే మోదకం చైవ ధారయంత మనుస్మరేత్ ॥

శ్రీత్ర్యక్షరగణపతి ఏనుగు మొగముతో, కదలుచున్న విసనకఱ్ఱలవంటి చెవులతో, బంగారువంటి పచ్చని శరీరకాంతితో, నాలుగు చేతులతో నుండును.

తొండమునందు మోదకము (లడ్డును) ధరించియుండును. కుడివైపున క్రింది నుండి పైకి తనదంతమును 1, అంకుశమును 2, అట్లే ఎడమవైపున మామిడి పండును 1, పాశమును 2. నాల్గుచేతులతో ధరించి ఉండును, ఇట్టి త్ర్యక్షరగణపతి స్వామిని దినదినము స్మరింపవలయును. (స్వర్ణవర్ణము)

## 20. శ్రీ క్షిప్రప్రసాదగణపతి ధ్యానము

ధృతపాశాంకుశకల్పలతాస్వదంత శ్చ బీజపూరయుతః
శశిశకలకలితమౌళి స్త్రిలోచనో ఒరుణ శ్చ గజవదనః ॥

భాసురభూషణదీప్తో బృహదుదరః పద్మవిష్ట
రోల్లసితః
విఘ్నపయోధరపవనః కరధృతకమలః సదాస్తు
మే భూత్యై ॥

శ్రీక్షిప్రప్రసాదగణపతి ఎఱ్ఱని శరీరకాంతితో, ఏనుగుమొగముతో, శిరమున చంద్రరేఖతో, సర్వాంగములయందు ప్రకాశించు భూషణములతో, లావైన ఉదరముతో, వికసించిన తామరపూవునందు ఉపవిష్టుడై (కూర్చున్నవాడై) ఉండును.

ఈతనికి నాలుగుచేతులు. కుడివైపున క్రిందినుండి పైకి తనదంతమును 1, అంకుశమును 2, అట్లే ఎడమవైపున కల్పలతను 1, పాశమును 2, అట్లే తొండములో దానిమ్మ పండును ధరించి ఉండును.

అట్టి శ్రీక్షిప్రప్రసాదగణపతి నాకు ఐశ్వర్యమును ఇచ్చుగాక ! (రక్తవర్ణము)

## 21. శ్రీ హరిద్రాగణపతి ధ్యానము

హరిద్రాభం చతుర్బాహుం హరిద్రావదనం ప్రభుమ్
పాశాంకుశౌ ధరం దేవం మోదకం దంత మేవ చ ॥

భక్తాభయప్రదాతారం వందే విఘ్నవినాశనమ్ ।

శ్రీహరిద్రాగణపతి పసుపు పచ్చని శరీరచ్ఛాయ, పసుపు పచ్చని మొగము. నాల్గు చేతులు కలిగి భక్తులకు అభయమును ఇచ్చుచుండును.

ఈస్వామి కుడివైపున క్రిందినుండి పైకి తనదంతమును 1, అంకుశమును 2, అట్లే ఎడమవైపున కుడుమును 1, పాశమును 2, ధరించి యుండును.

అట్టి శ్రీహరిద్రాగణపతిని నమస్కరించుచున్నాను. (హరిద్రావర్ణము)

## 22. శ్రీ ఏకదంతగణపతి ధ్యానము

లంబోదరం శ్యామతనుం గణేశం
కుఠార మక్షస్రజ మూర్ధ్వగాత్రమ్ ।
సలడ్డుకం దంత మధః కరాభ్యాం
వామేతరాభ్యాం చ దధాన మీడే ॥

ఈ ఏకదంతగణపతి నల్లని శరీరకాంతితో, లావైన పెద్ద పొట్టతో, నిలిచిన శరీరముతో (నిలిచినవాడై) నాలుగు చేతులతో నుండును. (వామము ఎడమ, ఇతరము కుడి, ఎడమకన్న ఇతరము అని అర్థము)

ఈస్వామి కుడివైపున క్రిందినుండి పైకి దంతమును 1, జపమాలను 2, అట్లే ఎడమవైపున లడ్డుకమును 1, గొడ్డలిని 2, ధరించి యుండును.

అట్టి ఏకదంతగణపతిని స్తుతింతును. (శ్యామవర్ణము)

## 23. శ్రీ సృష్టిగణపతి ధ్యానము

పాశాంకుశస్వదంతామ్రఫలవా నాఖువాహనః
విఘ్నం నిహంతు నః శోణః సృష్టిదక్షో వినాయకః ॥

ఎఱ్ఱని శరీరకాంతి. ఎలుక వాహనము, నాలుగు చేతులు కల ఈగణపతి సృష్టి చేయుటయందు సమర్థుడు. అందుచే సృష్టిగణపతి యని ప్రసిద్ధుడాయెను.

కుడిపైపున క్రిందినుండి పైకి తన దంతమును 1, అంకుశమును 2, అట్లే ఎడమపైపున మామిడిపండును 1, పాశమును 2, నాల్గుచేతులతో ధరించిన ఈ సృష్టిగణపతి మనయొక్క విఘ్నములను పోగొట్టునుగాక ! (రక్తవర్ణము)

## 24. శ్రీ ఉద్దండగణపతి ధ్యానము

కల్హారాంబుజబీజపూరకగదాదంతేక్షుచాపం సుమం
బిభ్రాణో మణికుంభశాలికలశం పాశంసృణిం చాబ్జకమ్ ।
గౌరాంగ్యా రుచిరారవిందకరయా దేవ్యా సమాలింగతః
శోణాంగః శుభ మాతనోతు భజతా ముద్దండవిఘ్నేశ్వరః ॥

ఈ ఉద్దండగణపతి ఎఱ్ఱని శరీరకాంతి, పన్నెండు చేతులు కలవాడు. కుడిపైపున క్రిందినుండి పైకి తనదంతమును 1, దానిమ్మపండును 2, పువ్వును 3, పద్మమును 4, వరికంకులను 5, అంకుశమును 6, అట్లే ఎడమపైపున చెఱకువింటిని 1, గదను 2, రత్నకలశమును 3, నల్లకలువపువ్వును 4, చంద్రుని 5, పాశమును 6, పన్నెండు చేతులతో ధరించి యుండును.

పసుపుపచ్చని శరీరకాంతిగల, చక్కని పద్మమును చేతియందు ధరించిన తన ప్రియురాలగు దేవీమూర్తిచే కౌగలించుకొనబడి యుండును.

ఇట్టి ఉద్దండగణపతి భజించు తన భక్తులకు శుభములను చేయునుగాక.
(రక్తవర్ణము)

## 25. ఋణవిమోచక గణపతి ధ్యానము

పాశాంకుశౌ దంతజంబు దధానః స్ఫాటికప్రభః
రక్తాంశుకో గణపతి ర్ముదే స్యా దృణమోచకః ॥

ఈ ఋణవిమోచకగణపతి స్ఫటికము వలె స్వచ్ఛమగు తెల్లని శరీరకాంతితో, ఎఱ్ఱని వస్త్రములతో, నాలుగుచేతులతో నుండును.

ఈ స్వామి కుడివైపున క్రిందినుండి పైకి తనదంతమును 1. అంకుశమును 2, అట్లే ఎడమవైపున నేరేడుపండును 1, పాశమును 2, నాల్గుచేతులయందు ధరించి ఉండును.

అట్టి ఋణవిమోచకగణపతి ఎల్లరకు సంతసమును కలిగించునుగాక.

(శ్వేతవర్ణము)

## 26. శ్రీ ఢుంఢిగణపతి ధ్యానము

అక్షమాలాం కుఠారం చ రత్నపాత్రం స్వదంతకమ్
ధత్తే కరై ర్విఘ్నరాజో ఢుంఢినామా ముదే ఽస్తు నః ॥

ఈ శ్రీఢుంఢిగణపతికి నాల్గుచేతులు. ఎఱ్ఱని శరీరకాంతి, కుడివైపున క్రిందినుండి పైకి తనదంతమును 1, జపమాలను 2, అట్లే ఎడమవైపున రత్నపాత్రమును 1, గొడ్డలిని 2, నాల్గుచేతులతో ధరించి ఉండును.

ఇట్టి శ్రీఢుంఢిగణపతి మన కెల్లరకు సంతసమును కలిగించుగాక !

(రక్తవర్ణము)

## 27. శ్రీ ద్విముఖగణపతి ధ్యానము

స్వదంతపాశాంకుశరత్నపాత్రం
కరై ర్దధానో హరినీలగాత్రః ।
రక్తాంశుకో రత్నకిరీటమాలీ
భూత్యై సదా మే ద్విముఖో గణేశః ॥

శ్రీద్విముఖగణపతి ఇంద్రనీలమువలె నల్లని శరీరకాంతులతో, ఎఱ్ఱని వస్త్రములతో, రత్నకిరీటములో, రెండు ముఖములతో, నాల్గుచేతులతో నుండును.

ఈ స్వామి కుడివైపున క్రిందినుండి పైకి తనదంతమును 1, అంకుశమును 2, అట్లే ఎడమవైపున రత్నపాత్రమును 1, పాశమును 2, నాల్గుచేతులయందు ధరించి ఉండును.

ఇట్టి ద్విముఖగణపతి మనకు ఎల్లప్పుడు సంపదల నిచ్చుగాక. (నీలవర్ణము)

## 28. శ్రీ త్రిముఖగణపతి ధ్యానము

శ్రీమత్తీక్ష్ణశిఖాంకుశాక్షవరదాన్
దక్షే దధానః కరైః
పాశం చామృతపూర్ణకుంభ మభయం
వామే దధానో ముదా ।
పీఠే స్వర్ణమయారవిందవిలస
త్సత్కర్ణికాభాసురే
స్వాసీన స్త్రిముఖః పలాశరుచిరో
నాగాననః పాతు నః ॥

శ్రీ త్రిముఖగణపతి మోదుగుపువ్వువలె చక్కనగు ఎఱ్ఱని శరీరకాంతితో, మూడు ఏనుగు మొగములతో, ఆరుచేతులతో, బాగా విప్పారిన బంగరు తామరపువ్వునందు చక్కని కర్ణికయను పీఠమునందు ఆసీనుడై యుండును.

ఈస్వామి కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, అమృతకలశమును 2, పాశమును 3, అట్లే ఎడమవైపున వరదముద్రను 1, జపమాలను 2, అంకుశమును 3, ఆరుచేతులతో ధరించి ఉండును.

ఇట్టి శ్రీ త్రిముఖగణపతి మనల నెల్లరను రక్షించుగాక ! (రక్తవర్ణము)

## 29. శ్రీ సింహగణపతి ధ్యానము

వీణాం కల్పలతా మరిం చ వరదం దక్షే విధత్తే కరై
ర్వామే తామరసం చ రత్నకలశం సన్మంజరీం చాభయమ్ ।
శుండాదండలసన్మృగేంద్రవదనః శంఖేందుగౌరః శుభో
దీవ్యద్రత్ననిభాంశుకో గణపతిః పాయా దపాయా త్స నః ॥

శ్రీ సింహ-గణపతి శంఖము, చంద్రుడు మున్నగువానివలె మిక్కిలి తెల్లనగు శరీరకాంతితో, ఎఱ్ఱని వస్త్రములతో, తొండముతో కూడిన సింహము మొగముతో, ఎనిమిది చేతులతో నుండును.

ఈ స్వామి కుడివైపున క్రిందినుండి పైకి వరుసన అభయముద్రను 1, పూల గుత్తిని 2, రత్నపాత్రమును 3, చక్రమును 4, అట్లే ఎడమవైపున వరదముద్రను 1, కల్పలతను 2, వీణను 3, తామరపూవును 4, ఎనిమిదిచేతులతో ధరించి యుండును.

ఇట్టి శ్రీ సింహగణపతి మనల నెల్లరను కష్టములనుండి రక్షించును గాక !

(శ్వేతవర్ణము)

## 30. శ్రీ యోగగణపతి ధ్యానము

యోగారూఢో యోగపట్టాభిరామో
బాలార్కాభ శ్చేంద్రనీలాంశుకాఢ్యః ।
పాశేక్ష్వక్షాన్ యోగదండం దధానో
పాయా న్నిత్యం యోగవిఘ్నేశ్వరో నః ॥

శ్రీ యోగగణపతి యోగమార్గమున ధ్యాననిమగ్నుడై యోగపట్టముతో, ప్రకాశించుచు, లేతసూర్యుని వంటి ఎఱ్ఱని శరీరచ్ఛాయతో, ఇంద్రనీలమణుల కాంతిగల నీలపు వస్త్రములతో, నాల్గుచేతులతో, నొప్పారుచుండును.

ఈస్వామి కుడివైపున క్రిందినుండి పైకి అక్షమాలను (జపమాలను) 1, చెఱకు గడను 2, అట్లే ఎడమవైపున యోగదండమును 1, పాశమును 2, ధరించును.

ఇట్టి యోగగణపతి మనల నెల్లరను రక్షించుగాక ! (రక్తవర్ణము)

## 31. శ్రీ దుర్గాగణపతి ధ్యానము

తప్తకాంచనసంకాశ శ్చాష్టహస్తో మహత్తనుః
దీప్తాంకుశం శరం చాక్షం దంతం దక్షే వహ న్కరైః ॥
వామే పాశం కార్ముకం చ లతాం జంబు దధ త్కరైః
రక్తాంశుకః సదా భూయా ద్దుర్గాగణపతి ర్ముదే ॥

శ్రీ దుర్గాగణపతి పుటముపెట్టిన మేలిమిబంగారు వంటి పచ్చని శరీరకాంతితో, ఎనిమిది చేతులతో, గొప్పశరీరముతో, ఎఱ్ఱని వస్త్రములతో, నొప్పారుచుండును.

ఈ స్వామి కుడివైపున క్రిందినుండి పైకి తన దంతమును 1, జపమాలను 2, బాణమును 3, అంకుశమును, 4, అట్లే ఎడమవైపున నేరేడుపండును 1, తీగను 2, వింటిని 3, పాశమును 4, ఎనిమిది చేతులతో ధరించియుండును.

ఇట్టి శ్రీ దుర్గాగణపతి ఎల్లప్పుడు మనకు సంతసమును కలిగించుగాక !

(కాంచనవర్ణము)

## 32. శ్రీ సంకటహరగణపతి ధ్యానము

బాలార్కారుణకాంతి ర్వామే బాలాం వహ న్నంకే
లసదిందీవరహస్తాం గౌరాంగీం రత్నశోభాఢ్యామ్ ॥

దక్షే ఽంకుశవరదానం వామే పాశం చ పాయసం పాత్రమ్
నీలాంశుకలసమానః పీఠే పద్మారుణే తిష్ఠన్ ॥

సంకటహరణః పాయాత్ సంకటపూగా ద్గజాననో నిత్యమ్ ॥

శ్రీ సంకటహరగణపతి లేత సూర్యునివంటి ఎఱ్ఱని శరీరకాంతి కలవాడు. ఎఱ్ఱ తామరపూవునందు ఉపవిష్టుడై, తన ఎడమభాగమున పచ్చని శరీరకాంతితో, ప్రకాశించుచున్న నల్ల కలువపూవును చేతితో పట్టుకొనిన ప్రియురాలగు బాలాదేవిని వహించుచుండును.

ఈతనికి నాల్గుచేతులు, ఏనుగు మొగము, ఎడమవైపున క్రిందినుండి పైకి పాయస పాత్రమును 1, పాశమును 2, అట్లే కుడివైపున వరదహస్తమును 1, అంకుశమును 2, నాల్గు చేతులతో ధరించి ఉండును.

నల్లని వస్త్రములతో నొప్పారుచున్న శ్రీ సంకటహరగణపతి కష్టములనుండి మమ్ములను రక్షించుగాక !. (రక్తవర్ణము)

( ప్రకారాంతరేణ )

## శ్రీ వల్లభగణపతి ధ్యానము

బీజాపూర గదేక్షుకార్ముకభుజాచక్రాబ్జ పాశోత్పల
వ్రీహ్యగ్రస్వవిషాణ రత్నకలశ ప్రోద్యత్కరాంభోరుహః ।

ధ్యేయో వల్లభయా చ పద్మకరయాశ్లిష్టో జ్వలద్భూషయా
విశ్వోత్పత్తివినాశసంస్థితికరో విఘ్నో విశిష్టార్థదః ॥

శ్రీ వల్లభగణపతి ప్రకాశించు సకలభూషణములను ఎడమచేతియందు పద్మమును ధరించిన వల్లభయగు ప్రియురాలిచేత కౌగిలించుకొనబడి యుండును. ఈ స్వామి విశ్వముయొక్క ప్రళయమును (సంహారమును) సృష్టిని, రక్షణమును చేయుచుండును. ఈతనికి పది చేతులు.

కుడివైపున క్రిందినుండిపైకి వరుసన తనదంతమును 1, దానిమ్మపండును 2, కలువపువ్వును 3, వరికంకిని 4, చక్రమును 5, అట్లే ఎడమవైపున రత్నకలశమును, గదను 2, చెఱకువింటిని 3, పద్మమును 4, పాశమును 5, పది చేతులతో ధరించి యుండును.

ఇట్టి రూపముతో విశిష్టములైన కోరికల నిచ్చెడు శ్రీ వల్లభ గణపతి ఎల్లరకు ధ్యానింపదగినవాడు,

## శ్రీ సిద్ధిదేవీ ధ్యానము

పీతవర్ణాం ద్వినేత్రాం తా మేకవక్త్రాంబుజద్వయామ్
నవరత్నకిరీటాం చ పీతాంబరసుధారిణీమ్ ॥

వామహస్తే మహాపద్మం దక్షే లంబకరాన్వితామ్
జాజీచంపకమాలాం చ త్రిభంగీం లలితాంగికామ్ ॥

గణేశదక్షిణే భాగే గురుః సిద్ధిం తు భావయేత్ ॥

పచ్చని రంగుగల శరీరముతో, ఒక మొగము, రెండు కన్నులు గలిగి, నవరత్నములు పొదిగిన కిరీటముతో, పీతాంబరము ధరించి ఎడమచేత పెద్ద పద్మమును ధరించి కుడిచేయి క్రిందికి చాపి యుంచినదియు, జాజిపూవులతో, సంపెంగపూవులతో చేసిన మాలనుధరించి త్రిభంగిగా నిలుకబడి లలితమైన అవయవములతోనున్న సిద్ధిదేవిని గణేశుని కుడిప్రక్కన పండితుడు భావింపవలెను.

## శ్రీ బుద్ధిదేవీ ధ్యానము

ద్విహస్తాం చ ద్వినేత్రాం తా మేకవక్త్రాం త్రిభంగికామ్
ముక్తామణికిరీటాం చ దక్షే హస్తే మహోత్పలమ్ ॥

UTHAMA PANCHA THALAM-(VINAYAKA)





ఉత్తమ పంచతాళము వినాయక విగ్రహము మొత్తము ౮౪ భాగములు.
(ఇది కాశ్యప శిల్పశాస్త్రములో చెప్పబడినది)




No. 1 Bala Ganapathi

బాల గణపతి




No. 2 Taruna Ganapathi
తరుణ గణపతి




No. 3 Bhakta Ganapathi
భక్త గణపతి




No. 4 Veera Ganapathi

వీర గణపతి




No 5 Sakthi Ganapathi

శక్తి గణపతి




No. 6 Dwija Ganapathi
ద్విజ గణపతి




No. 7 Siddhi Ganapathi

సిద్ధి గణపతి




No. 8 Uchista Ganapathi

ఉచ్ఛిష్ట గణపతి




No. 9. Vighna Ganapathi

విఘ్న గణపతి




No. 10 Kshipra Ganapathi

క్షిప్ర గణపతి




No. 11 Heramba Ganapathi
హేరంబగణపతి



No. 12. Laxmi Ganapathi

లక్ష్మీ గణపతి




No. 15 Nritha Ganapathi

నృత్త గణపతి




No. 16 Urdhva Ganapathi

ఊర్ధ్వ గణపతి




No. 17- Ekakshara Ganapathi
ఏకాక్షర గణపతి




No. 18 Vara Ganapathi

వర గణపతి




No. 19 Tryakshara Ganapathi
త్ర్యక్షర గణపతి




No. 20 Kshipra Prasada Ganapathi

క్షిప్ర ప్రసాద గణపతి




No. 21 Haridra Ganapathi

హరిద్రా గణపతి




No. 22 Ekadantha Ganapthi

ఏకదంత గణపతి




No. 23 Sristi Ganapathi
సృష్టి గణపతి




No. 24 Uddanda Ganapathi
ఉద్దండ గణపతి




No. 25 Runamochana Ganapathi

ఋణమోచన గణపతి




**No. 26 Dundhi Ganapathi**

దుంఢి గణపతి




No. 27 Dvimukha Ganapathi
ద్విముఖ గణపతి




No. 28 Thrimukha Ganapathi

త్రిముఖ గణపతి




**No. 29 Simha Ganapathi**

సింహ గణపతి




No. 30 Yoga Ganapathi
యోగ గణపతి




No. 31 Durga Ganapathi

దుర్గా గణపతి




No. 32 Sri Sankata Hara Ganapathi
శ్రీ పంకట హర గణపతి




శ్రీ వల్లభ గణపతి

Sri Vallabha Ganapathi



Sri Siddhi Buddhi Sahita Ganapati

శ్రీ సిద్ధి బుద్ధి సహిత గణపతి

హామే ప్రలంబహస్తాం చ దివ్యాంబరసుధారిణీమ్
శ్యామవర్ణసభాం భాస్వత్సర్వాభరణభూషితామ్ ॥

పారిజాతోత్పలామాల్యాం గణేశో వామపార్శ్వకే
ధ్యాత్వా బుద్ధిం సురూపాం సమర్చయే ద్దేశికోత్తమః ॥

శ్రీ బుద్ధిదేవి నల్లని శరీరచ్ఛాయలతో ఒక్క మొగముతో, మూడువంపులుగల (త్రిభంగమగు) శరీరముతో, రెండు కన్నులతో, రెండుచేతులతో, అన్ని అవయవముల యందు ధరింపబడిన ఆభరణములతో, పారిజాతములయొక్క, కలువపూలయొక్క దండలతో శ్రీ గణపతి యెడమవైపున ముత్యముల మణుల కిరీటముతో నుండును.

ఆమె కుడిచేతితో కలువపూవును ధరించి 1, ఎడమచేయి క్రిందికి చాపి 2, ఉండును.

ఉత్తమడగు పండితుడు శ్రీ బుద్ధిదేవిని పైరూపము కలదానినిగా ధ్యానించుచు పూజింపవలెను.



ఓం

# శ్రీ సుబ్రహ్మణ్యస్వామి రూపభేదములు

( శ్రీ కుమారతంత్రమునుండి )

స్కన్దమంత్రాః సమాఖ్యాతా మూర్తిధ్యానా న్యథో శృణు ॥

"ఓకౌశికమహర్షీ ! నేను స్కందుని (కుమారస్వామియొక్క) మంత్రములను చెప్పితిని. ఇక ఆతని మూర్తిధ్యానములను చెప్పెదను వినుము." అని పరమశివుడు స్కందుని మూర్తిధ్యానములను చెప్పుచున్నాడు.

## షోడశమూర్తి ధ్యానభేదాః

జ్ఞానశక్తిధరః స్కందో దేవసేనాపతి స్తథా
సుబ్రహ్మణ్యో గజారూఢః శరకాననసంభవః ॥

కార్తికేయః కుమార శ్చ షణ్ముఖ స్తారకాంతకః
సేనానీ ర్బ్రహ్మశాస్తా చ వల్లీకల్యాణసుందరః ॥

బాల శ్చ క్రౌంచభేత్తా చ శిఖివాహన ఏవ చ
ఏతాని స్వామినామాని షోడశ ప్రత్యహం నరః ॥

యః పఠే త్సర్వపాపేభ్యః స ముచ్యేత మహామునే
ఏతేషాం ప్రతిరూపాణాం ధ్యానభేద మ థోచ్యతే ॥

"ఓకౌశికమహామునీ! జ్ఞానశక్తిధరుడు (1) స్కందుడు (2) దేవసేనాపతి (3) సుబ్రహ్మణ్యుడు (4) గజారూఢుడు (5) శరకాననసంభవుడు (6) కార్తికేయుడు (7) కుమారుడు (8) షణ్ముఖుడు (9) తారకాంతకుడు (10) సేనాని (11) బ్రహ్మశాస్త (12) వల్లీకల్యాణసుందరుడు (13) బాలుడు (14) క్రౌంచభేత్త (15) శిఖివాహనుడు (16)"

అని ఈ పదునారు శ్రీకుమారస్వామియొక్క నామములు.

ఈనామములను దినదినము పఠించు మనుష్యుడు అన్ని పాపములనుండి విడివడును.

ఓ కౌశికమహర్షీ ! ఈ పదునారు మూర్తులయొక్క ధ్యానభేదములను చెప్పుచున్నాను వినుము.

## 1. శ్రీ జ్ఞానశక్తిధరస్వామి ధ్యానము

ఏకాస్యం ద్విభుజం వామే వజ్రం దక్షిణజే కరే
ఇచ్ఛాజ్ఞానక్రియాశక్తిరూపం శక్తిధరం భజే ॥

శక్తిధరుడను ఈ కుమారస్వామికి ఒక మొగము, రెండుచేతులు ఉండును. కుడిచేతియందు శక్తిని 1, ఎడమచేతియందు వజ్రమును 4. ధరించును.

ఈతడు ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తి అను మూడు శక్తులయొక్క రూపమైనవాడు.

అట్టి ఈ జ్ఞానశక్తిధరకుమారస్వామిని నేను భజించుచున్నాను.

## 2. శ్రీ స్కందస్వామి ధ్యానము

కల్పద్రుమం ప్రణమతాం కమలారుణాభం
స్కందం భుజద్వయ మనామయ మేకవక్త్రమ్ ।
కాత్యాయనీసుత మహం కటిబద్ధవామ
హస్తం చ దండధరదక్షిణహస్త మీడే ॥

ఈ స్కందస్వామి యను కుమారుడు, ఎఱ్ఱ తామరపూవువలె ఎఱ్ఱనైన శరీర చ్ఛాయతో, రెండు చేతులతో, ఒక మొగముతో నుండును. ఈతని కుడిచేతియందు దండమను నాయుధ ముండును, ఎడమచేయి నడుమునందు ఉంచబడినదై యుండును.

తనను భజించు భక్తులకు కల్పవృక్షమై (కల్పవృక్షమువలె) కోరికల నిచ్చుచు, పార్వతీపుత్రుడగు అనామయుడగు (జరామరణదుఃఖాదులనెఱుంగని) శ్రీస్కందస్వామిని నేను ఎల్లప్పుడు భజింతును. (రక్తవర్ణము)

# 3. శ్రీ సేనాపతి ధ్యానమ్

నౌ మ్యాదిత్యప్రభం ద్వాదశనయనధరం
షణ్ముఖం మందహాసం
వామాంకే సుస్థితాయా ధృతసరసిరుహా
లింగితాయాః ప్రియాయాః ।
ఉత్తుంగోరుస్తనాగ్రే విహితకరతలం
భీతిఖేటాదిశూల
ప్రాదిన్యుద్దీప్తశక్తిష్వసనఘనగదా
కుక్కుటాబ్జేషుహస్తమ్ ॥

సేనాపతినామముగల శ్రీ కుమారస్వామి సూర్యుని కాంతులవంటి ఎఱ్ఱనగు శరీర ఛాయతో, ఆరు మొగములతో, పండ్రెండు కన్నులతో, చిఱునవ్వులతో నుండును.

ఎడమచేతితో పద్మమును ధరించిన ప్రియురాలు అతని ఎడమతొడపై కూర్చుండి యుండును. ఆమెను ఈ స్వామి కౌగలించుకొని యుండును.

కుడిభాగమున క్రిందినుండి పైకి ఆరుచేతులతో వరుసన అభయముద్రను 1, కత్తిని 2, శూలమును 3, బాణమును 4, శక్తిని 5, కోడిని 6, అట్లే ఎడమభాగమున క్రిందిచేతితో (నిజహస్తముతో) ప్రియురాలగు దేవి ఎత్తైన, లావైన స్తనమును 1, క్రమమున పరహస్తములతో డాలును 2, వింటిని 3, వజ్రమును 4, గదను 5, పద్మమును 6, పండ్రెండు చేతులతో ధరించి ఉండును.

అట్టి సేనాపతి అను పేరుగల శ్రీ కుమారస్వామిని నేను నమస్కరించుచున్నాను.
(రక్తవర్ణము)

# 4. శ్రీ సుబ్రహ్మణ్యస్వామి ధ్యానము

సిందూరారుణ మిందుకాంతివదనం
కేయూరహారాదిభి
ర్దివ్యై రాభరణై ర్విభూషితతనుం
స్వర్గాదిసౌఖ్యప్రదమ్ ।

అంభోజాభయశక్తికుక్కుటధరం
రక్తాంగరాగోజ్జ్వలం
సుబ్రహ్మణ్య ముపాస్మహే ప్రణమతాం
భీతిప్రణాశోద్యతమ్ ॥

శ్రీసుబ్రహ్మణ్యస్వామి సిందూరమువలె ఎఱ్ఱనగు శరీరకాంతులతో, చంద్రుని వెన్నెలవంటి ప్రసాదముచేత మధురమగు మొగముతో, ఎఱ్ఱని మైపూతతో, నాల్గు చేతులలో, కేయూరములు (దండగడియములు), హారములు (బొమ్మునందు వ్రేలాడునవి) మున్నగు వివిధములగు నగలచేత అలంకరింపబడిన అవయవములతో నొప్పారుచుండును.

ఈస్వామి కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, శక్తిని 2, అట్లే ఎడమభాగమున పద్మమును 1, కోడిని 2, నాల్గుచేతులతో ధరించి యుండును.

తనను భజించు భక్తులకు భయమును నశింపజేసి స్వర్గనివాసము మున్నగు సౌఖ్యములను ప్రసాదించునట్టి శ్రీసుబ్రహ్మణ్యస్వామిని మేము ఉపాసించుచున్నాము.

(రక్తవర్ణము)

## 5. శ్రీ గజవాహనస్వామి ధ్యానము

ఏకాననం ద్వినయనం వరకుక్కుటౌ చ
వామద్వయే నిశితశక్త్యభయద్వయం చ ।
బిభ్రాణ మీశ్వరసుతం తపనాయుతాభం
నిత్యం నమామి గజవాహన మిష్టసిద్ధ్యై ॥

గజవాహను డను నామముగల శ్రీకుమారస్వామి పదివేలసూర్యులవంటి ఎఱ్ఱనగు శరీకాంతులతో, ఒకమొగముతో, రెండుకన్నులతో, నాల్గుచేతులతో, ఏనుగు వాహనముతో నుండును.

ఈస్వామి కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, పదునుగల శక్తిని 2, అట్లే ఎడమవైపున వరదముద్రను 1, కోడిని, నాల్గుచేతులతో ధరించును.

పరమేశ్వరపుత్రుడగు ఇట్టి గజవాహనస్వామిని ఇష్టసిద్ధికొరకు నమస్కరించును.



8

## 6. శ్రీ శరవణభవస్వామి ధ్యానము

శక్తిం ఘంటాం ధ్వజసరసిజే కుక్కుటం పాశదండౌ
టంకం బాణం వరద మభయం కార్ముకం చోద్వహంతమ్ ।
పీతం సౌమ్యం ద్విదశనయనం దేవసంఘై రుపాస్యం
సద్భిః పూజ్యం శరవణభవం షణ్ముఖం భావయామి ॥

శ్రీ శరవణభవుడను పేరుగల ఈ కుమారస్వామి బంగారువంటి పచ్చని శరీర చ్ఛాయతో సౌమ్యములగు (ప్రసన్నములగు) ఆరు మొగములతో, పన్నెండు కనులతో, పన్నెండు చేతులతో నుండును.

ఈస్వామి కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, శక్తిని 2, పాశమును 3, బాణమును 4, టంకమును 5, ధ్వజమును 6, అట్లే ఎడమవైపున వరదముద్రను 1, ఘంటను 2, దండమును 3, వింటిని 4, కోడిని 5, పద్మమును పన్నెండు చేతులతో ధరించియుండును.

సకలదేవతాసమూహముచేత ఉపాసింపబడుచు సజ్జనులచేత పూజింపబడుచున్న ఇట్టి రెల్లుగడ్డియందు పుట్టిన కుమారస్వామిని నా హృదయమునందు భావించుచున్నాను.

(హేమవర్ణము)

## 7. శ్రీ కార్తికేయస్వామి ధ్యానము

వరదకులిశఖేటం వామహస్తత్రయే చ
దధత మభయశక్తిం ఖడ్గ మన్యత్రయే చ ।
తరుణరవిసమాభం సాధుభిః పూజ్యమానం
కమలవదనషట్కం కార్తికేయం నమామి ॥

శ్రీ కార్తికేయుడను పేరుగల ఈ కుమారస్వామి బాలసూర్యునివలె నెఱ్ఱనగు శరీరచ్ఛాయతో,విప్పారిన తామరపూవులవలె ప్రకాశించు ఆరు మొగములతో, పన్నెండు కన్నులతో, ఆరు చేతులతో నుండును.

ఈ స్వామి కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, కత్తిని 2, శక్తిని 3, అట్లే ఎడమభాగమున వరదముద్రను 1, డాలును 2, వజ్రమును 3, ఆరు చేతులతో ధరించియుండును.

ఇట్టి సాధుజనులచేత పూజనీయుడగు శ్రీ కార్తికేయస్వామిని నేను నమస్కరించుచున్నాను. (రక్తవర్ణము)

## 8. శ్రీ కుమారస్వామి ధ్యానము

సవ్యద్వయే నిశితశక్త్యసి మాదధానం
వామద్వయే ఒభిమతకుక్కుటఖేటకం తమ్ ।
వల్లీపతిం విబుధలోచనపూర్ణచంద్రం
కళ్యాణదాననిరతం కలయే కుమారమ్ ॥

ఈ శ్రీ కుమారస్వామి కుడివైపున క్రిందినుండి పైకి వాడియగు శక్తిని 1, కత్తిని 2, అట్లే ఎడమవైపున కుక్కుటధ్వజమును 1, ఖేటమును (డాలును) 2, కుడి ఎడమల నాల్గుచేతులతో ధరించియుండును.

ఒక్క మొగముతో, రెండు కన్నులతో, శ్రీ వల్లీదేవికి ప్రియుడై, దేవతా సమూహముయొక్క కన్నులకు పూర్ణిమాచంద్రునివలె సంతోషమును కలిగించుచు భక్తులకు శుభములను ప్రసాదించుచున్న కుమారస్వామిని నా మనస్సునందు భావింతును.

## 9. శ్రీ షణ్ముఖస్వామి ధ్యానము

వందే సిందూరకాంతిం శరవిపినభవం
శ్రీమయూరాధిరూఢం
షడ్వక్త్రం దైవసైన్యం మధురిపుతనయా
వల్లభం ద్వాదశాక్షమ్ ।

శక్తిం బాణం కృపాణం ధ్వజ మపి చ గదాం
చాభయం సవ్యహస్తై
శ్చాపం వజ్రం సరోజం కటక మపి వరం
శూల మన్యై ర్దధానమ్ ॥

శ్రీ షణ్ముఖుడను నామముగల కుమారస్వామి సింధూరమువలె ఎఱ్ఱనగు కాంతులతో, నెమలి వాహనముతో, ఆరు మొగములతో, పన్నెండు కన్నులతో, పన్నెండు చేతులతో, దేవసైన్యములతో, నొప్పారుచుండును.

ఈ స్వామి కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, గదను 2, ధ్వజమును 3, కత్తిని 4, బాణమును 5, శక్తిని 6, అట్లే ఎడమభాగమున వర ముద్రను 1, శూలమును 2, పద్మమును 3, ఖేటమును 4, వింటిని 5, వజ్రమును 6, పన్నెండు చేతులతో ధరించి యుండును.

శ్రీ మహావిష్ణువు పుత్రికయగు శ్రీ వల్లీదేవికి ప్రియుడగు శ్రీ షణ్ముఖ స్వామిని నేను నమస్కరించుచున్నాను.

## 10. శ్రీ తారకారిస్వామి ధ్యానము

వరద మంకుశధ్వజే చ కటకచాపవజ్ర మ
ప్యభయపాశచక్రఖడ్గముసలశక్తి మన్వహమ్ ।
ద్విదశపాణిభి ర్దధాన మరుణకోటిసన్నిభం
భజత తారకారి మత్ర భవవినాశకారణమ్ ॥

శ్రీ తారకారి యను నామముగల కుమారస్వామి కోటిసూర్యులవలె ప్రకాశించు ఎఱ్ఱని శరీరకాంతులతో నుండును.

శ్రీ స్వామి కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, పాశమును 2, చక్రమును 3, కత్తిని 4, రోకలిని 5, శక్తిని 6, అట్లే ఎడమవైపున వరదముద్రను 1, అంకుశమును 2, ధ్వజమును 3, ఖేటమును 4, వింటిని 5, వజ్రమును 6, కుడిఎడమల పన్నెండు బాహువులతో ధరించి ఉండును.

జరామరణదుఃఖములను (ముసలితనము మరణము మున్నగువానివలన కలుగు సంసారదుఃఖములను) పోగొట్టి మోక్షము నిచ్చెడు శ్రీ తారకారియగు శ్రీ కుమార స్వామిని మీ రెల్లరు భజింపుడు. (రక్తవర్ణము)

## 11. శ్రీ సేనానీస్వామి ధ్యానమ్

అభయ మసిరథాంగం చాంకుశం శక్తిశూలం
వరదకులిశపాశం పద్మదండౌ గదాం చ ।
దధత ముభయపక్ష ద్వాదశాయామహస్తై
ర్ద్వాదశకమలనేత్రం దేవసేనాన్య మీడే ॥

సేనాపతి యను నామముగల శ్రీ కుమారస్వామి ఆరు మొగములతో, పద్మముల వలె నున్న పండ్రెండు కన్నులతో, పొడవైన పండ్రెండు చేతులతో నుండును.

ఈ స్వామి కుడిభాగమున క్రిందినుండి పైకి వరుసన అభయముద్రను 1, కత్తిని 2, చక్రమును 3, అంకుశమును 4, శక్తిని 5, శూలమును 6, అట్లే ఎడమ వైపున వరదముద్రను 1, దండమును 2, పద్మమును 3, పాశమును 4, వజ్రమును 5, గదను 6, పండ్రెండు చేతులతో ధరించి ఉండును.

ఇట్టి దేవసేనానియగు కుమారస్వామిని ప్రార్థింతును.

## 12. శ్రీ బ్రహ్మశాస్తృ ధ్యానమ్

వామే కరే చ యుగలే వరకుండికే చ
సవ్యే ఒక్షసూత్ర మభయం దధతం విశాఖమ్ ।
వల్ల్యా యుతం వనజలోచన మేకవక్త్రం
వందామహే వనజసంభవశాసితారమ్ ॥

ఈ బ్రహ్మశాస్త యగు శ్రీ కుమారస్వామి ఒక్క మొగములో, రెండు కన్నులతో, నాల్గు చేతులతో, శ్రీ వల్లీ దేవితో కూడినవాడై ఉండును.

ఈ స్వామి కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, జపమాలను 2, అట్లే ఎడమ భాగమున వరదముద్రను 1, కమండలమును 2, నాల్గు చేతులతో ధరించియుండుచు.

ఇట్టి బ్రహ్మశాస్తృ యగు బ్రహ్మను శాసించునట్టి శ్రీ కుమారస్వామిని మేము ఎల్లరము నమస్కరింతుము.

## 13. శ్రీ వల్లీకల్యాణసుందరస్వామి ధ్యానమం

హస్తద్వంద్వే ఒక్షమాలా ముభయ మపి ధృతం
కుండికాం శ్రోణిబంధం
సవ్యే వామే నిషణ్ణస్రువయుతవిధినా
జుహ్వతా సంప్రయుక్తమ్ ।
సర్వాలంకారయుక్తం జలకలశధృతా
విష్ణునా చారుణాభం
వల్లీకల్యాణమూర్తిం సకలసురగణైః
స్తూయమానం ప్రపద్యే ॥

శ్రీ వల్లికల్యాణసుందరమూర్తి నామముగల కుమారస్వామి సూర్యునివలె ఎఱ్ఱని శరీరకాంతులతో కూడియున్నవాడై యుండును.

ఈ స్వామి కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, జపమాలను 2, అట్లే ఎడమవైపున కటిహస్తమును (నడుమును) 1, కమండలమును 2, నాల్గు చేతులతో ధరించి యుండును.

సర్వాంగములయందు భూషణములను ధరించిన శ్రీ స్వామి స్రువమును పట్టుకొని అగ్నికుండమున హవ్యములను వేల్చుచున్న పురోహితుడగు బ్రహ్మచేత, జలకలశమును (నీటిచెంబును) ధరించిన కూతు నిచ్చెడు మామయగు విష్ణునిచేత పాణిగ్రహణమునకు సిద్ధపరుపబడుచు, సర్వాంగభూషణములను ధరించి దేవత లెల్లరిచేత స్తోత్రము చేయబడుచున్న శ్రీ వల్లికల్యాణమునందు సుందరమూర్తి యగు శ్రీ కుమారస్వామిని ఆశ్రయింతును.

## 14. శ్రీ బాలస్వామి ధ్యానము

పద్మ సవ్యకటిసంయుతవామం
పద్మ కాంతినిభ మేకముఖం చ ।
బాలవృద్ధికర మీశ్వరసూనుం
బాల మున్నతభుజం ప్రణతో ఽస్మి ॥

బాలుడను నామముగల ఈ కుమారస్వామి ఎఱ్ఱని పద్మమువలె ఎఱ్ఱనగు శరీర కాంతితో, ఒక మొగముతో, రెండు కన్నులతో, రెండు చేతులతో, ఎత్తైన భుజములతో, నుండును.

కుడిచేతియందు పద్మమును, ఎడమచేయి నడుమునందును ఉండును.

సంతానవృద్ధికరుడును, పరమేశ్వరునకు ప్రియపుత్రుడగు శ్రీ బాలకుమార స్వామిని నేను నమస్కరించుచున్నాను.

## 14. మఱియొకవిధమైన ధ్యానము

ఏకవక్త్రం ద్వినయనం పద్మద్వయకరద్వయమ్
విప్రప్రియకరం వందే బాలరూపం రవిప్రభమ్ ॥

ఈ బాలకుమారస్వామి ఒక మొగముతో, రెండుచేతులతో, సూర్యునివలె ఎఱ్ఱనైన శరీరచ్ఛాయతో, పద్మములను పట్టుకొని ఉండును.

బ్రాహ్మణులకు (అక్షరపరబ్రహ్మవేత్తలకు) ఇష్టమగు సంసారదుఃఖనాశమును కలిగించునట్టి శ్రీ బాలకుమారరూపుని నమస్కరించుచున్నాను. (రక్తవర్ణము)

## 15. శ్రీ క్రౌంచభేదనస్వామి ధ్యానము

అభయశతకృపాణౌ శక్తిబాణౌ చ సవ్యే
వరదకులిశచాపం ఖేటకం చాన్యహస్తే ।
దధతః మమరసేనానాయకం చాష్టబాహుం
కమలవదనషట్కం క్రౌంచభేత్తార మీడే ॥

శ్రీ క్రౌంచభేదను డను నామముగల ఈ కుమారస్వామి ఆరు మొగములతో, పన్నెండు కన్నులతో, ఎనిమిది చేతులతో నుండును.

ఈ స్వామి కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, బాణమును 2, పదునుగల కత్తిని 3, శక్తిని 4, అట్లే ఎడమవైపున వరదముద్రను 1, వింటిని 2, ఖేటమును 3, వజ్రమును 4, ఎనిమిది చేతులతో ధరించియుండును.

ఇట్టి రూపముతో, దేవసైన్యములకు నాయకుడై, క్రౌంచపర్వతమును భేదించిన కుమారస్వామిని ధ్యానింతును.

## 16. శ్రీ శిఖివాహనస్వామి ధ్యానము

విద్రుమకాభతను మేకముఖాఢ్యం
వజ్రశక్తివరదాభయపాణిమ్ ।
దేవలోకరిపువిఘ్న-చయఘ్నం
నౌమి రుద్రతనయం శిఖివాహమ్ ॥

శ్రీ శిఖివాహనుడగు కుమారస్వామి పగడమువలె ఎఱ్ఱనగు శరీరకాంతితో, ఒక మొగముతో, రెండు కన్నులతో, నాల్గుచేతులతో, నెమలివాహనముతో నుండును.

ఈ స్వామి కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, శక్తిని 2, అట్లే ఎడమవైపున వరదముద్రను 1, వజ్రమును 2, కుడి ఎడమల నాల్గు చేతులతో ధరించును.

ఇట్టి రూపముతో దేవవిరోధులగు దానవులను మర్దించుచు, విఘ్నములను తొలగించు రుద్రుని పుత్రుడగు శ్రీ శిఖివాహన కుమారస్వామిని నమస్కరింతును.

(రక్తవర్ణము)





No. 1 Gnanasakthidhara Swamy

జ్ఞానశక్తిధరస్వామి



No. 2 Skanda

స్కందుడు




No. 3 Deva Seanapathi
దేవ సేనాపతి



No. 4 Subrahmanya Swamy

సుబ్రహ్మణ్యస్వామి



No. 6 Sharavanabhava
శరవణభవుడు



No. 7 Karthikeya Swamy
కార్తికేయస్వామి



No. 8 Kumara Swamy
కుమారస్వామి




No. 9 Shanmukha Swamy

షణ్ముఖస్వామి



No. 10 Tharakari

తారకారి



No. 11 Seanani

సేనాని



No. 12 Brahma Sastha

బ్రహ్మశాస్త



No. 13 Valli Kalyana Murthy

వల్లీ కల్యాణ సుందరమూర్తి



No. 14 Balasubrahmanya (1)

బాలసుబ్రహ్మణ్యుడు



No. 15 Krounchabheda Subrahmanya Swami

క్రౌంచభేద సుబ్రహ్మణ్యస్వామి




No. 16 Sikhivahana Subrahmanya Swamy

శిఖివాహన సుబ్రహ్మణ్యస్వామి

ఓం

# శ్రీ శక్తిరూప ధ్యానములు

— ❋ ❋ ❋ —

## 1. శ్రీ రాజరాజేశ్వరీ ధ్యానము

(ఇది షోడశీకల్పము ననుసరించినది)

కోటికందర్పలావణ్యాశివవామాంకవాసినీమ్
ఏకకాలోదితానేక చంద్రకోట్యర్కకోటిభామ్ ॥

ప్రభాపాటలితానేకకోటిబ్రహ్మాండమండలామ్
జపాకుసుమసంకాశా మంజపా మంజపాత్మికామ్ ॥

కుంకుమోదరసంకాశాం దాడిమీకుసుమారుణామ్
బాలార్కకోటిభాం త్ర్యక్షాం బాలేందుముకుటోజ్జ్వలామ్ ॥

పాశాంకుశేక్షుకోదండపంచబాణలసత్కరామ్
అచంచలతటిత్కోటిప్రభాపింగలవాససమ్ ॥

సమవృత్తసువృత్తోరుజఘనస్తనమండలామ్
కోటీరకోటీఘటితసుధాకరసుధాప్లుతామ్ ॥

ఫాలభూతిలకీభూతలోచనాం కామలోచనామ్
కటాక్షసరణీనిర్యత్కరుణాపూర్ణలోచనామ్ ॥

సూర్యేందుమండలాకారమణితాటంకమండితామ్
శుక్రతారాసమాకారనాసాభరణశోభినీమ్ ॥

దాడిమీబీజసందోహసందేహదశనావలీమ్
వీణారవప్రణాదాయినిజవాణీగుణోదయామ్ ॥

కర్పూరవీటికాగంధసుగంధితదిగంతరామ్
మణిదర్పణదర్పఘ్నకపోలఫలకప్రభామ్ ॥

ప్రసన్నవదనాంభోజాం సమందహసితేక్షణామ్
మణిమంగళసూత్రేణ విలసత్కంబుకంధరామ్ ॥

శ్రితకల్పలతీభూతభుజవల్లీచతుష్టయామ్
రత్నాంగుళీయనివహై ర్లసదంగుళిపల్లవామ్ ॥

తారహారస్ఫురద్గైవేయ స్వర్ణస్తనహాటకభూధరామ్
కుచభారనమన్మధ్యత్రివలీలలితోదరామ్ ॥

అనర్ఘ రత్న ఘటితరశనాజఘనస్థలామ్
సువృత్తజంఘికాకాండాం గూఢగుల్ఫాం గుడాలకామ్ ॥

శింజానమణిమంజీరమంజుపాదాబ్జమంజులామ్
రత్నగ్రైవేయవలయముకుటాంగదకంకణామ్ ॥

కంబుకంఠీం సునాసాఢ్యాం బింబోష్ఠీ ముడుపాననామ్
సర్వశృంగారవేషాఢ్యాం సర్వాభరణభూషితామ్ ॥

చందనాగురుకర్పూరమృగనాభిసుగంధినీమ్
కారణేశశిరోరత్ననిఘృష్టచరణాంబుజామ్ ॥

పంచప్రేతాసనా మీడే పంచప్రణవరూపిణీమ్ ॥

శ్రీరాజరాజేశ్వరీదేవి కోటిమన్మథుల లావణ్యముతో పరమశివుని వామాంకమందు నివసించును. ఒకేకాలమునందు ఉదయించిన అనేక కోటిసూర్యచంద్రులకాంతులలో నుండును. ఆమె శరీరకాంతులచేత అనేకకోట్ల బ్రహ్మాండమండలములు ఎఱ్ఱబడుచున్నవి. కనుకనే ఆమె జపాపుష్పమువలె నెఱ్ఱనైనది. ఆమె అజప. అజపాత్మిక. కుంకుమ

గర్భమువలె, దానిమ్మ పూవువలె నామె ఎఱ్ఱనిది. మూడు కన్నులతో, నెలవంక కిరీటముతో నామె ఉండును.

కుడివైపున క్రిందినుండి పైకి పంచబాణములను 1, అంకుశమును 2, అట్లే ఎడమవైపున క్రిందినుండి పైకి చెఱకు విల్లును 1, పాశమును 2, ఆమె చేతులయందుండును.

నిశ్చలమైన మెఱపుతీగల కోటికాంతులవంటి లేతపచ్చని వస్త్రమును ఆమె ధరించును. ఆమె జఘనస్తనమండలములు సమవృత్తమై, సువృత్తమై యుండును. కిరీటాగ్రమునందు ఘటించిన బాలచంద్రుని అమృతకిరణప్రసారముచేత నామె తడిసియుండును. నొసటపుట్టిన బొట్టువలె నున్న ఫాలలోచనముతో నామె కామాక్షి యగుచున్నది. క్రేగంటిచూపులనెడి కాల్వలనుండి బయల్వెడలిన కరుణారసముతో నామె కన్నులు నిండియుండును. సూర్యచంద్రుల మండలములవంటి మణిమయకర్ణాభరణములతో నామె ఒప్పారుచుండును. శుక్రగ్రహమువలె మిలమిలమెఱయు ముక్కఱ (నాసాభరణము) ఆమెకు కలదు.

ఆమె పలువరస దానిమ్మగింజలవలె నుండును. ఆమె కంఠధ్వని వీణానాదమును వెక్కిరించును. ఆమె కప్పురవిడెముచేత నలుదిక్కులు పరిమళించును. నిద్దమైన అద్దమువలె ఆమె చెక్కిలి కాంతులను విరజిమ్మును. చిఱునవ్వులను చిందు కన్నులతో ఆమె మొగము ప్రసన్నమై యుండును. శంఖమువంటి ఆమె మెడ మణిమంగళసూత్రముచేత ప్రకాశించును. ఆమె నాల్గుచేతులు కల్పలతలు తనను ఆశ్రయించినట్లుండును. చిగురుటాకులవంటి ఆమె వ్రేళ్ళు మణులుపొదిగిన ఉంగరములతో నొప్పారును. బంగారు కొండలవంటి ఆమె స్తనభారము వెలియేళ్ళవంటి ముత్తెముల దండలతో ప్రకాశించును. కుచభరముచేత నామె నడుము కొంచెదిగవంగి ఉదరము మూడుమడతలతో నుండును. అమూల్యములగు రత్నములచేత పొదగబడిన బంగరుమొలనూలు ఆమె జఘనస్థలమున నుండును. ఆమె జంఘలు, ఊరువులు, సువృత్తములై యుండును. ఆమె గుల్ఫములు (చీలమండలు) గూఢములై, కేశపాశము పిడికిళ్ళతో పట్టదగినదై యుండును. ధ్వనించుచున్న చిఱుఘంటలచేత ఆమె కాలి అందెలు ప్రకాశించును. పొదగబడిన రత్నములతో ఆమె కిరీటము, హారములు, దండగడియములు, వలయములు ప్రకాశించును.

ఆమె కంఠము శంఖము; నాసిక చక్కనిది; పెదవి దొండపండు; మొగము చందురుడు; సర్వాభరణములతో నిండిన ఇట్టి శృంగారవేషముతో చందనాగురుకర్పూర

మృగనాభిపరిమళముతో, ఈశ్వరుని శిరోరత్నముల కాంతులపూతలచేత నొప్పారు పాదములతో, పంచప్రేతాసనమునందు పంచప్రణవరూపిణియైయుండిన శ్రీ రాజరాజేశ్వరిని నేను ప్రార్థించుచున్నాను. (సిందూరవర్ణము)

## 2. శ్రీ మహాకాళీ ధ్యానము

(చండీకల్పము ననుసరించి)

ఖడ్గం చక్రగదేషుచాపపరిఘాన్
శూలం భుశుండీం శిరః
శంఖం సందధతీం కరై స్త్రిణయనాం
సర్వాంగభూషావృతామ్ ।
నీలాశ్మద్యుతి మాస్యపాదదశకాం
సేవే మహాకాలికాం
యా మస్తౌత్ స్వపితే హరౌ కమలజో
హంతుం మధుం కైటభమ్ ॥

శ్రీ మహాకాళి దశబాహువులచేత కుడివైపున క్రిందినుండి పైకి వరుసన శూలమును 1, భుశుండిని 2, చక్రమును 3, ఖడ్గమును 4, బాణమును 5, అట్లే ఎడమవైపున క్రిందినుండి పైకి శిరమును 1, గదను 2, శంఖమును 3, పరిఘమును 4, కోదండమును (విల్లు) 5, ధరించి యుండును.

సర్వాంగభూషణములతో, ఇంద్రనీలమణివంటి నల్లని కాంతులతో, పది మొగములతో, ప్రతిముఖమునందు మూడు మూడు కన్నులతో, పదిపాదములతో నొప్పారు శ్రీ మన్మహాకాళికాదేవిని నేను సేవింతును.

ఏ మహాకాళికను విష్ణువు నిదురించుచుండ, తనను హింసింప వచ్చిన మధుకైటభులను చంపుటకొఱకు బ్రహ్మ ధ్యానించెనో. (అట్టి దేవిని కొలుచుచున్నాను అని అర్థము.)
(నీలవర్ణము)

## 3. శ్రీ మహాలక్ష్మీ ధ్యానము

(చండీకల్పము ననుసరించి)

అక్షస్రక్పరశుం గదేషుకులిశం
పద్మం ధనుః కుండికాం
దండం శక్తి మసిం చ చర్మ జలజం
ఘంటాం సురాభాజనమ్ ।

శూలం పాశ సుదర్శనే చ దధతీం
హస్తైః ప్రవాళప్రభాం
సేవే సైరిభమర్దినీ మిహ మహా
లక్ష్మీం సరోజస్థితామ్ ॥

శ్రీ మహాలక్ష్మి కుడివైపున క్రిందినుండి పైకి శూలమును 1, అక్షమాలను 2, పద్మమును 3, దండమును 4, శక్తిని 5, ఖడ్గమును 6, పరశువును 7, బాణమును 8, సుదర్శనచక్రమును 9, అట్లే యెడమవైపున క్రిందినుండి పైకి అమృతకలశమును 1, కుండికను 2, గదను 3, గంటను 4, పాశమును 5, ఖేటమును 6, వజ్రమును 7, ధనుస్సును 8, శంఖమును 9, పదునెనిమిది హస్తములతో ధరించియుండును.

చిగురుటాకులవంటి ఎఱ్ఱని శరీరకాంతులతో సైరిభ (మహిష) మర్దినియయి పద్మపీఠమునకూర్చుండిన శ్రీమహాలక్ష్మిని నేను సేవించుచున్నాను. (ప్రవాళవర్ణము)

# 4. శ్రీ మహాసరస్వతీ ధ్యానము

(నందీకల్పము ననుసరించి)

ఘంటాశూలహలాని శంఖముసలే చక్రం ధను స్సాయకం
హస్తాబ్జై ర్దధతీం ఘనాంతవిలసచ్ఛీతాంశుతుల్యప్రభామ్ ।
గౌరీదేహసముద్భవాం త్రిజగతా మాధారభూతాం మహా
పూర్వా మత్ర సరస్వతీ మనుభజే శుంభాదిదైత్యార్దినీమ్ ॥

శ్రీ మహాసరస్వతి కుడివైపున క్రిందినుండి పైకి శూలమును 1, బాణమును 2, రోకటిని 3, చక్రమును 4, అట్లే ఎడమవైపున క్రిందినుండ పైకి ఘంటను 1, ధనుస్సును 2, నాగలిని 3, శంఖమును 4, ఎనిమిది చేతులయందు ధరించియుండును.

మబ్బులు విడివడుటచేత ప్రకాశించు చంద్రునితో సమమగు స్వచ్ఛకాంతులతో గౌరీదేహమునుండి పుట్టి, శుంభుడు మున్నగు దైత్యులను మర్దించి, ముజ్జగములకు నాధారభూతురాలగు శ్రీమన్మహాసరస్వతీదేవిని నేను భజించుచున్నాను. (శ్వేతవర్ణము)

(లలితోపాఖ్యానపద్ధతితో శ్రీచక్రమునందలి దేవత ప్రారంభింపబడుచున్నది.)

## 5. శ్రీ అణిమాదులగు సిద్ధిదేవతల ధ్యానమం

అణిమా మహిమా చైవ గరిమా లఘిమా తథా
ప్రాప్తిః ప్రాకామ్య మీశత్వం వశిత్వం చాష్టభూతయః ॥

ముక్తిసిద్ధిః సర్వసిద్ధి ర్దశసిద్ధయ ఈరితాః
ఏతా దేవ్య శ్చతుర్బాహా జపాకుసుమసన్నిభాః ॥

చింతామణిం కపాలం చ త్రిశూలం సిద్ధకజ్జలం
దధానా దయయా పూర్ణా యోగిభి శ్చ నిషేవితాః ॥

అణిమసిద్ధి 1, మహిమసిద్ధి 2, గరిమసిద్ధి 3, లఘిమసిద్ధి 4, ప్రాప్తిసిద్ధి 5, ప్రాకామ్యసిద్ధి 6, ఈశత్వసిద్ధి 7, వశిత్వసిద్ధి 8, ముక్తిసిద్ధి 9, సర్వసిద్ధి 10, అను వీరు దశసిద్ధి దేవతలు.

ఈ దేవతలు నాలుగు బాహువులు కలవారు. జపాకుసుమమువలె నెఱ్ఱని దేహ చ్ఛాయ కలవారు.

కుడివైపున క్రిందినుండి పైకి సిద్ధాంజనమును 1, త్రిశూలమును 2, అట్లే ఎడమ వైపున కపాలమును 1, చింతామణిని 2, నాల్గుచేతులతో ధరించి దయాపూర్ణలై యోగులచేత సేవింపబడుచు ఉందురు.

## 6. శ్రీ మహాలక్ష్మీ సహితాష్టమాతృకా ధ్యానము

బ్రాహ్మీ మాహేశ్వరీ చైవ కౌమారీ వైష్ణవీ తథా
వారాహీ చైవ మాహేంద్రీ చాముండా చైవ సప్తమీ ॥

మహాలక్ష్మీ రష్టమీ చ ద్విభుజాః శోణవిగ్రహాః
కపాల ముత్పలం చైవ బిభ్రాణా రక్తవాససః ॥

అథ వాన్యప్రకారేణ కేచి ద్ధ్యానం ప్రచక్షతే
బ్రహ్మాదిసదృశాకారా బ్రహ్మాదిసదృశాయుధాః ॥

బ్రహ్మాదీనాం పరం చిహ్నం ధారయంత్యః ప్రకీర్తితాః ॥

బ్రాహ్మి 1, మాహేశ్వరి 2, కౌమారి 3, వైష్ణవి 4, వారాహి 5, మాహేంద్రి 6, చాముండ 7, మహాలక్ష్మి 8, అను ఈ ఎనమండుగురు అష్టమాతృకలని చెప్పబడు చున్నారు.

వీర లెల్లరు రెండు చేతులతో, ఎఱ్ఱని శరీరములతో, ఎఱ్ఱని వస్త్రములతో నుందురు. రెండు చేతులయందు కుడివైపున కలువపూవును, ఎడమవైపున కపాలమును ధరింతురు.

మఱికొందరు పండితులు మఱియొక విధముగా వీరి మూర్తులను ధ్యానించు చున్నారు. ఈ ఎనమండుగురు బ్రహ్మాదులతో సమానమగు రూపములను బ్రహ్మాదుల యొక్క ఆయుధములను, బ్రహ్మాదులయొక్క చిహ్నములను ధరించుచున్నారు అని భావించుచున్నారు. (రక్తవర్ణము)

## 7. శ్రీ సర్వసంక్షోభిణ్యాది దశముద్రాదేవీ ధ్యానమ్

ముద్రావిరచనాయుక్తై ర్హస్తైః కమలపాణిభిః
దాడిమీపుష్పసంకాశాః పీతాంబరమనోహరాః ॥

చతుర్భుజా భుజద్వంద్వధృతచర్మకృపాణికాః
మదరక్తవిలోలాక్ష్య స్తాసాం నామాని సంశృణు ॥

సర్వసంక్షోభిణీ చైవ సర్వవిద్రావిణీ తథా
సర్వాకర్షిణిముద్రా చ తథా సర్వవశంకరీ ॥

సర్వోన్మాదినిముద్రా చ షష్ఠీ సర్వమహాంకుశా
సర్వఖేచరిముద్రా చ సర్వబీజా తథాపరా ॥

సర్వయోని శ్చ నవమీ తథా సర్వత్రిఖండికా
ఇత్యేతాః కథితా విప్ర దశ ముద్రాధిదేవతాః ॥

సర్వసంక్షోభిణి 1, సర్వవిద్రావిణి 2, సర్వాకర్షిణి 3, సర్వవశంకరి 4, సర్వోన్మాదినిముద్ర 5, సర్వమహాంకుశ 6, సర్వఖేచరిముద్ర 7, సర్వబీజ 8, సర్వ యోని 9, సర్వత్రిఖండిక 10, అను నీ పదుగురు సర్వసంక్షోభిణి మున్నగువారు దశ ముద్రాధిదేవతలు.

వీరు దానిమ్మపూవువలె ఎఱ్ఱని శరీరములు కలవారు. పచ్చని వస్త్రములు ధరించిన సౌందర్యవతులు. మదముచేత ఎఱ్ఱబడిన కన్నులుకలవారు.

వీర లెల్లరు చతుర్భుజములు కలవారు. కుడివైపున క్రిందినుండి పైకి చిన్ముద్రను 1, కత్తిని 2, అట్లే ఎడమవైపున కమలమును 1, డాలును 2, ధరించి ఉందురు. వీరు పదుగురు తమ నామములకు తగిన ఫలమును ఇత్తురు. (రక్తవర్ణము)

# 8. శ్రీ గుప్తయోగినీ ధ్యానము

కామాకర్షిణికా చైవ బుద్ధ్యాకర్షిణికా కలా
అహంకారాకర్షిణీ చ సర్వాకర్షిణికా కలా ॥

స్పర్శాకర్షిణికా నిత్యా రూపాకర్షిణికా కలా
రసాకర్షిణికా చైవ గంధాకర్షిణికా కలా ॥

చిత్తాకర్షిణికా నిత్యా ధైర్యాకర్షిణికా కలా
స్మృత్యాకర్షిణికా నిత్యా నామాకర్షిణికా కలా ॥

బీజాకర్షిణికా నిత్యా చాత్మాకర్షిణికా కలా
అమృతాకర్షిణీ నిత్యా శరీరాకర్షిణీ పరా ॥

ఏతాః షోడశ నిత్యాః స్యుః కలారూపా శ్చ శక్తయః
విద్రుమద్రుమసంకాశా మందప్రహసితాననాః ॥

చతుర్భుజా స్త్రినేత్రా శ్చ చంద్రార్ధమకుటోజ్జ్వలాః
చాపబాణౌ చర్మఖడ్గౌ దధానా దివ్యకాంతయః ॥

గుప్తయోగినులను నీక్రింది పదునారుగురు నిత్యలు, కలారూపిణులగు శక్తులు. క్రమమున వారి పేరులు. కామాకర్షిణి 1, బుద్ధ్యాకర్షిణి 2, అహంకారాకర్షిణి 3, సర్వాకర్షిణి 4, స్పర్శాకర్షిణి 5, రూపాకర్షిణి 6, రసాకర్షిణి 7, గంధాకర్షిణి 8, చిత్తాకర్షిణి 9, ధైర్యాకర్షిణి 10, స్మృత్యాకర్షిణి 11, నామాకర్షిణి 12, బీజాకర్షిణి 13, ఆత్మాకర్షిణి 14, అమృతాకర్షిణి 15, శరీరాకర్షిణి 16. నిత్యలు కలారూపిణులగు ఏ పదునారుగురు గుప్తయోగినులను శక్తులు.

వీరు పవదపుతీగలతో సమమగు నెఱ్ఱని శరీరములు కలవారు. చిఱునగవుల మొగములతో, నాలుగుచేతులతో, మూడుకన్నులతో, నెలవంక కిరీటములతో, ప్రకాశించు దివ్యకాంతులతో, కుడివైపున క్రిందినుండి పైకి ఖడ్గమును 1, బాణమును 2, అట్లే ఎడమవైపున ఖేటమును 1, వింటిని 2, క్రమమున నాల్గుచేతులతో ధరించి యుందురు. (రక్తవర్ణము)

## 9. శ్రీ గుప్తతరయోగినీ ధ్యానము

అనంగకుసుమా నంగమేఖలా చ ద్వితీయకా
అనంగమదనా నంగమదనాతురయా సహ ॥

అనంగరేఖా చానంగవే గానంగాంకుశా పిచ
అనంగమాలి న్యపరా చైతా దేవ్యో జపాత్విషః ॥

ఇక్షుచాపం పుష్పశరాన్ పుష్పకందుక ముత్పలమ్
బిభ్రత్యోఽ దభ్రవిక్రాంతిశాలిన్యో లలితాజ్ఞయా ॥

అనంగకుసుమ 1, అనంగమేఖల 2, అనంగమదన 3, అనంగమదనాతుర 4, అనంగరేఖ 5, అనంగవేగ 6, అనంగాంకుశ 7, అనంగమాలిని 8, అను నీ ఎనమండుగురు గుప్తతరయోగినులు.

వీరు జపాకుసుమములవలె ఎఱ్ఱని మూర్తులతో నుండుదేవతలు. శ్రీలలితాదేవియాజ్ఞచేత నాలుగుచేతులయందు కుడివైపున క్రిందినుండి పైకి పూలబాణమును 1, నల్లకలువను 2, అల్లే ఎడమవైపున చెఱకువింటిని 1, పూలబంతిని 2, ధరించి మిక్కిలి పరాక్రమము కలవారై యుందురు. (రక్తవర్ణము)

## 10. శ్రీ సంప్రదాయయోగినీ ధ్యానము

సర్వసంక్షోభిణీ ముఖ్యాః సంప్రదాయాఖ్యయా యుతాః
వేణీకృతకచస్తోమాః సిందూరతిలకోజ్జ్వలాః ॥

అతితీవ్రస్వభావా శ్చ కాలానలసమత్విషః
వహ్నిచాపం వహ్నిబాణం వహ్నిరూప మసిం తథా ॥

వహ్నిచక్రాఖ్యఫలకం దధానా దీప్తవిగ్రహాః
అసురేంద్రం ప్రతి క్రుద్ధాః కామభస్మసముద్భవమ్ ॥

ఆజ్ఞాశక్తయ ఏవైతా లలితాయా మహౌజసః
సర్వసంక్షోభిణీచైవ సర్వవిద్రావిణీ తథా ॥

సర్వాకర్షిణికా శక్తిః సర్వాహ్లాదినికా తథా
సర్వసమ్మోహినీ శక్తిః సర్వస్తంభినికా తథా ॥

సర్వజృంభిణికా శక్తిః స్తథా సర్వవశంకరీ
సర్వరంజనికా శక్తిః సర్వోన్మాదనికా తథా ॥

సర్వార్థసాధికా శక్తిః సర్వసంపత్ప్రపూరిణీ
సర్వమంత్రమయీ శక్తిః సర్వద్వంద్వక్షయంకరీ ॥

ఇత్యేవం సంప్రదాయానాం నామాని కథితాని వై ॥

సర్వసంక్షోభిణి మొదలుగాగల యీ క్రింది పదునలుగురు శక్తులు "సంప్రదాయ" అను పేరుతో కూడినవారు. వీరు మహాతేజస్వినియగు లలితాదేవియొక్క ఆజ్ఞాశక్తులు.

సర్వసంక్షోభిణి 1, సర్వవిద్రావిణి 2, సర్వాకర్షిణి 3, సర్వాహ్లాదిని 4, సర్వసమ్మోహిని 5, సర్వస్తంభిని 6, సర్వజృంభిణి 7, సర్వవశంకరి 8, సర్వరంజని 9, సర్వోన్మాదిని 10, సర్వార్థసాధిక 11, సర్వసంపత్ప్రపూరిణి 12, సర్వమంత్రమయి 13, సర్వద్వంద్వక్షయంకరి 14, అనునవి వీరినామములు.

వీర లెల్లరు వెంట్రుకలను జడలుగ అల్లుదురు. సిందూరతిలకమును ధరింతురు. మిక్కిలి తీవ్రమగు స్వభావములతో నుందురు. ప్రళయకాలాగ్నితో సమమగు శరీర కాంతులతో నుందురు.

వీరు చతుర్బాహువులు కలవారు కనుక క్రమమున కుడివైపున క్రిందినుండి పైకి అగ్నిబాణమును 1, అగ్నిఖడ్గమును 2, అల్లే ఎడమవైపున అగ్నిచాపమును 1, అగ్ని

చక్రమను నామముగల ఖేటమును (డాలును) 2, ధరించి మహాతేజోవిగ్రహములతో నుందురు. కాముని భస్మమునుండి పుట్టిన దానవేంద్రునియందు కోపముతో వీర లుందురు.
(రక్తవర్ణము)

# 11. శ్రీ కులోత్తీర్ణయోగినీ ధ్యానము

తా శ్చ స్ఫాటికసంకాశాః పరశుం పాశ మేవ చ
గదాం ఘంటామణిం చైవ దధానా దీప్తవిగ్రహాః ॥

దేవద్వేష మభిక్రుద్ధా భ్రుకుటీకుటిలాననాః
ఏతాసా మపి నామాని సమాకర్ణయ కుంభజ ॥

సర్వసిద్ధిప్రదా దేవీ సర్వసంపత్ప్రదా తథా
సర్వప్రియంకరీ దేవీ సర్వమంగళకారిణీ ॥

సర్వకామప్రదా దేవీ సర్వదుఃఖవినాశినీ
సర్వమృత్యుప్రశమనీ సర్వవిఘ్ననివారిణీ ॥

సర్వాంగసుందరీ దేవీ సర్వసౌభాగ్యదాయినీ
దశైతాః కథితా దేవ్యో దయయా పూరితాశయాః ॥

కులోత్తీర్ణ యోగినులను నీ పదుగురు దేవతలు ఈ క్రింది నామములతో నుందురు. సర్వసిద్ధిప్రద 1, సర్వసంపత్ప్రద 2, సర్వప్రియంకరి 3, సర్వమంగళకారిణి 4, సర్వకామప్రద 5, సర్వదుఃఖవినాశిని 6, సర్వమృత్యుప్రశమని 7, సర్వవిఘ్ననివారిణి 8, సర్వాంగసుందరి 9, సర్వసౌభాగ్యదాయిని 10.

వీరు చతుర్భుజములు కలవారు. కావున క్రమముగ కుడివైపున క్రిందినుండి పైకి గొడ్డలిని 1, గదను 2, అట్లే ఎడమవైపున ఘంటామణిని 1, పాశమును 2, ధరింతురు.

వీరు స్ఫటికమువలె తెల్లనగు దేహములతో, కాంతిమంతములగు విగ్రహములతో, దానవుని యెడల కోపముతో, ముడివడిన కనుబొమలతో, కోపించి యుందురు. అయినను వీరు మిక్కిలి దయగలవారు.
(శ్వేతవర్ణము)

## 12. శ్రీ నిగర్భయోగినీ ధ్యానము

నిగర్భయోగినీ నామ్నా ప్రథితా దశ కీర్తితాః
సర్వజ్ఞా సర్వశక్తి శ్చ సర్వైశ్వర్యప్రదాయినీ ॥

సర్వజ్ఞానమయీ దేవీ సర్వవ్యాధివినాశినీ
సర్వాధారస్వరూపా చ సర్వపాపహరా తథా ॥

సర్వానందమయీ దేవీ సర్వరక్షాస్వరూపిణీ
సర్వేప్సితప్రదా దేవీ ముక్తాగౌరసమత్విషః ॥

ఏతా శ్చతుర్భుజా జ్ఞేయా వజ్రం శక్తిం చ తోమరమ్
చక్రం చైవ హి బిభ్రాణా భండాసురవధోద్యతాః ॥

నిగర్భయోగినీనామముతో ప్రసిద్ధలగు పదుగురు దేవతలు కలరు. వీరు వరుసన సర్వజ్ఞ 1, సర్వశక్తి 2, సర్వైశ్వర్యప్రదాయిని 3 సర్వజ్ఞానమయి 4, సర్వవ్యాధి వినాశిని 5, సర్వాధారస్వరూప 6, సర్వపాపహర 7, సర్వానందమయి 8, సర్వరక్ష స్వరూపిణి 9, సర్వేప్సితప్రద 10, అను పేరులు కలవారు.

వీర లెల్లరు ముత్తెములవలె తెల్లని శరీరచ్ఛాయ కలవారు. చతుర్భుజలు. ఆ నాల్గు చేతులతో క్రమమున కుడివైపున క్రిందినుండి పైకి చక్రమును 1, శక్తిని 2, అట్లే ఎడమవైపున తోమరమును 1, వజ్రమును 2, ధరింతురు. భండాసురుని చంపుట కొఱకు ఉద్యమించుచుందురు. (శ్వేతవర్ణము)

## 13. శ్రీ రహస్యయోగినీ ధ్యానము

రహస్యయోగినీ నామ్నా వాగీశ్వర్యో హి సంశ్రుతాః
రక్తాశోకప్రసూనాభా బాణకార్ముకపాణయః ॥

కవచచ్ఛన్నసర్వాంగ్యో వీణాపుస్తకశోభితాః
వశినీ చైవ కామేశీ మోదినీ విమలా తథా ॥

అరుణా చైవ జయినీ సర్వేశీ కౌలినీ తథా
అష్టౌ వేతాః స్మృతా దేవ్యో దైత్యసంహారహేతవః ॥

రహస్యయోగిను లను పేరుతో ఎనమండుగురు వాగీశ్వరులు కలరు. వశిని 1, కామేశి 2, మేదిని 3, విమల 4, అరుణ 5, జయిని 6, సర్వేశి 7, కౌలిని 8, అని వీరల నామములు.

వీరు ఎఱ్ఱని అశోకపుష్పములవంటి శరీరచ్ఛాయ కలవారు. వారి సర్వాంగములు కవచములచేత ఆచ్ఛాదింపబడి యుండును.

వీరు చతుర్భుజములతో కుడిప్రైపున క్రిందినుండి పైకి వీణను 1, బాణమును 2, అట్లే ఎడమప్రైపున పుస్తకమును 1, వింటిని 2, ధరించి యుందురు. దైత్యులను సంహరించుటకు కారణ మగుదురు. (రక్తవర్ణము)

## 14. అతిరహస్యయోగినీ ధ్యానము

తిస్ర స్త్రిపీఠనిలయా అష్టబాహుసమన్వితాః
చాపబాణౌ పానపాత్రం మాతులింగం కృపాణకమ్ ॥

ఫలకం నాగపాశం చ ఘంటాం చైవ మహాధ్వనిమ్
బిభ్రాణా మదిరోన్మత్తా అతిపూర్వరహస్యకాః ॥

కామేశీ చైవ వజ్రేశీ భగమాలి న్య థాపరా
తిస్ర ఏతాః స్మృతా దైత్యే భండే కోపసమన్వితాః ॥

లలితాసమమాహాత్మ్యా లలితాసమతేజసః
ఏతా స్తు నిత్యం శ్రీదేవ్యా అంతరంగాః ప్రకీర్తితాః ॥

కామేశి 1, వజ్రేశి 2, భగమాలిని 3, అను నీ ముగ్గురు దేవతలు అతిరహస్య యోగిను లను వారు. త్రిపీఠనిలయలు. ఎనిమిది చేతులతో కూడినవారు.

కుడిప్రైపున క్రిందినుండి పైకి నాగపాశమును 1, పానపాత్రమును 2, ఖడ్గమును 3, బాణమును 4, అట్లే ఎడమప్రైపున గొప్ప ధ్వనిగల గంటను 1, దానిమ్మపండును 2, ఫలకమును 3, వింటిని 4, ఎనిమిది చేతులలో ధరింతురు.

వీరు మధుపానమ_త్తలు. లలితాదేవితో సమమగు మహాత్మ్యము, తేజము కలవారు. భండుడను దైత్యునియందు కోపము కలవారు. శ్రీదేవికి ాశ్యము అంతరంగలై ఉండువారు. (సింధూరవర్ణము)

## 15. శ్రీ నిత్యక్లిన్న దేవతల ధ్యానము

(ఇది చక్రేశ్వరియైన త్రిపురసుందరితో గూడ పదునారుగురు దేవతల ధ్యానము.)
(ఈ విదానము లలితోపాఖ్యానము ననుసరించినది)

దేవీసమనిజాకారా దేవీసమనిజాయుధాః
జగతా ముపకారాయ వర్తమానా యుగే యుగే ॥

ఈ పదునార్గురు దేవతలు లలితాదేవితో సమమగు రూపము, సమములగు ఆయుధములు కలవారు. వీరు యుగయుగములయందు లోకములకు ఉపకారముచేయుట కొఱకు ప్రవర్తింతురు.

(ఈ ధ్యానమే శరభతంత్రము ననుసరించి ఇటులున్నది)

(శరభతంత్రమునందు భేరుండాధ్యానములేదు. అయినను జ్ఞానార్ణవమునందు చంద్రజ్ఞానవిద్యయందు, లిఖింపబడుటవల్ల దానినికూడ చేర్చుట జరిగినది)

## 16. శ్రీ కామేశీ ధ్యానము

పాశేక్షుచాపౌ మధుపూర్ణపాత్రం
మహాంకుశం పుష్పశరం వరం చ।
కరై ర్దధానా మరుణాం త్రిణేత్రాం
కామేశ్వరీం నిత్య మహం భజామి ॥

కుడివైపున క్రిందినుండి పైకి నిండైన మధుపాత్రమును 1, మహాంకుశమును 2, పుష్పశరమును 3, అల్లే ఎడమవైపున వరదమును 1, పాశమును 2, చెఱకు వింటిని 3, వరుసన ఆరుచేతులతో ధరించి ఎఱ్ఱని శరీరచ్ఛాయతో, మూడునేత్రములతో, నున్న శ్రీ కామేశ్వరిని నేను నిత్యము భజింతును. (రక్తవర్ణము)

# 17. శ్రీ భగమాలా ధ్యానమం

కల్హారపంకజసపాశసృణీక్షుచాపం
పుష్పాయుధం చ దధతీం నిజబాహుషట్కైః ।
బంధూకపుష్పరుచిరా మతిసుందరాంగీ
మంబాం భజామి హృదయే భగమాలినీం తామ్ ॥

కుడివైపున క్రిందినుండి పైకి పుష్పబాణమును 1, పద్మమును 2, పాశమును 3, అట్లే ఎడమవైపున చెఱకువింటిని 1, ఎఱ్ఱకలువపూవును 2, అంకుశమును 3, ఆరు చేతులతో ధరించి ప్రత్తిపువ్వువంటి ఎఱ్ఱని శరీరచ్ఛాయతో సౌందర్యరాశియగు భగమాలినీ మాతృదేవిని నా హృదయమునందు భజింతును. (ప్రత్తిపువ్వువర్ణము)

# 18. శ్రీ నిత్యక్లిన్నా ధ్యానమం

ఉద్యత్సూర్యారుణకిరణనిభాం త్రీక్షణాం విందుఖండా
పీడాం కాంచీమణిమయవిలసద్భూషణాలంకృతాంగీమ్ ।
దోర్భిః పాశం సృణివర మభయం పానపాత్రం దధానాం
నిత్యక్లిన్నా మహ మనుదివసం మానసే భావయామి ॥

శ్రీ నిత్యక్లిన్న ఉదయించుచున్న సూర్యుని ఎఱ్ఱని కిరణములవంటి శరీరకాంతులతో, మూడు కన్నులతో, చంద్రకళాలంకృతమైన కిరీటముతో, బంగరు మొలనూలునందు పొదగబడిన రత్నములకాంతులతో, వివిధభూషణములతో నలంకరింపబడిన సర్వాంగములతో నుండును.

తన నాల్గుచేతులయందు కుడివైపున క్రిందినుండి పైకి వరుసన అభయమును 1, అంకుశమును 2, అట్లే ఎడమవైపున పానపాత్రమును 1, పాశమును 2, ధరించియున్న శ్రీ నిత్యక్లిన్నాదేవిని నేను దినదినమునందు మానసమున భావింతును.

(రక్తవర్ణము)

## 19. శ్రీ భేరుండా ధ్యానము

(జ్ఞానార్ణవమును, చంద్రజ్ఞానవిద్యను అనుసరించినది)

ముక్తాకుందేందుగౌరాం మణిమయమకుటాం
రత్నతాటంకయుక్తా
మక్షస్రక్పుష్పహస్తా మభయవరకరాం
చంద్రచూడాం త్రిణేత్రామ్ ।
గుంజామాలావిరాజత్కుచభరనమనో
న్మధ్యమామబ్జసంస్థాం
నానాలంకారయుక్తాం సురమకుటమణి
ద్యోతిత స్వర్ణపీఠామ్ ।
భక్తాభీష్టాధిదేవీం పరమసుఖకరీం
స్వాకృతిం సుందరాస్యాం
భేరుండాం ముక్తకేశీం త్రిభువనజననీం
చేతసా చింతయామి ॥

శ్రీ భేరుండాదేవి ముత్యములవలె, మొల్లపువ్వులవలె, చంద్రునివలె తెల్లనై మణిమయములైన కిరీటమును, కర్ణాభరణములను ధరించి శిరమున నెలవంకతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, అక్షస్ఫాటమును 2, అల్లే ఎడమవైపున వరముద్రను 1, పుష్పమును 2, ధరించిన నాల్గుచేతులతో, మూడు కన్నులతో, గురువిందపేరులచేత ప్రకాశించు స్తనభారమువలన కొలదిగ వంగిన నడుముతో, పద్మమునందు నివసించును.

వివిధమణిమయభూషణములు ధరించి, దేవతలెల్లరు నమస్కరించుటవలన వారల మణిమయకిరీటముల కాంతులచేత ప్రకాశించు బంగరుపాదపీఠముకలిగి, పరమ సౌందర్య రాశియై, భక్తుల కోరికలను తీర్చుచు. గొప్ప సుఖముల నిచ్చుచు ముజ్జగములకు తల్లియైన ముక్తకేశియగు భేరుండాదేవిని నా మానసమునందు తలంతును.

(శ్వేతవర్ణము)

## 20. శ్రీ వహ్నివాసినీ ధ్యానము

పద్మం శంఖేక్షుచాపం హిమకిరణ మథో
వామహస్తై ర్దధానాం
కల్హారం హేమశృంగం కుసుమమయశరం
మాతులింగం చ దక్షైః ।
తప్తోద్యత్కాంచనాభాం మణిమయమకుటా
మష్టహస్తాం త్రిణేత్రాం
నిత్యాం చిత్తారవిందే ప్రతిదివస మహం
వహ్నివాసీం భజామి ॥

శ్రీ వహ్నివాసిని కుడివైపున క్రిందినుండి పైకి వరుసన హిమకిరణమును 1, చెఱకును 2, శంఖమును 3, పద్మమును 4, అట్లే ఎడమవైపున ఎఱ్ఱకలువపువ్వును 1, దానిమ్మపువ్వును 2, బంగారు కొమ్మును 3, పూలబాణమును 4. ధరించి యుండును.

పుటముపెట్టబడిన మేలిమి బంగరువంటి శరీరచ్ఛాయలతో, మణిమయ కిరీటముతో, ఎనిమిది చేతులతో, మూడుకన్నులతో ప్రకాశించు నిత్యారాలగు శ్రీ వహ్నివాసినీదేవిని దినదినమునందు నా మానసపద్మమున భజింతును. (కనకవర్ణము)

## 21. శ్రీ వజ్రేశ్వరీ ధ్యానము

రక్తాంభోధిస్థపోతే నవమణివిలస
త్పద్మపీఠే నిషణ్ణాం
పాశం కోదండ మిక్షూద్భవ మపి చ సృణిం
దాడిమీజం ఫలం చ ।
బిభ్రాణాం రక్తవర్ణాం త్రిభి రపి నయనైః
సాదరం వీక్షతీం తాం
వజ్రేశీం భావయే ఒహం సురగణమునిభిః
స్తూయమానాం భవానీమ్ ॥

శ్రీ వజ్రేశ్వరి రక్త సముద్రమందలి పడవయందు క్రొత్త మణికాంతులచే నొప్పారు పద్మపీఠమునందు నిషణ్ణురాలై (కూర్చున్నదై) యుండు ఎ.

తన నాల్గు చేతులతో కుడివైపున క్రిందినుండి పైకి దానిమ్మపండును 1, అంకుశము 2, అట్లే ఎడమవైపున చెఱకువింటిని 1, పాశమును 2, ధరించినదై, ఎఱ్ఱని శరీరచ్ఛాయతో నుండి, మూడు కన్నులతో, సాదరముగ చూచుచు, దేవతామునిసమూహములచేత స్తుతింపబడుచున్న భవానియగు శ్రీ వజ్రేశిని నేను నా మనస్సునందు భావించుచున్నాను. (రక్తవర్ణము)

## 22. శ్రీ శివదూతీ ధ్యానము

వామాధో రత్నపాత్రం తదుపరి చ గదాం
ఖేటపాశౌ దధానాం
దక్షైః పద్మం కుఠారం తదుపరి చ మహా
ఖడ్గమ ప్యంకుశం చ।
మధ్యాహ్నార్క ప్రభాభాం నవమణివిలస
ద్భూషణా మష్టహస్తాం
దూతీం నిత్యాం త్రిణేత్రాం సురగణమునిభిః
స్తూయమానాం భజే౽హమ్ ॥

శ్రీ శివదూతి నాల్గు చేతులయందు వరుసన కుడివైపున క్రిందినుండి పైకి పద్మమును 1, గొడ్డలిని 2, కత్తిని 3, అంకుశమును 4. అట్లే ఎడమవైపున నాల్గుచేతుల యందు క్రమముగ క్రిందినుండి పైకి రత్నపాత్రమును 1, గదను 2, ఖేటమును 3, పాశమును 4, ధరించి అష్టహస్తయగుచు నుండును.

మధ్యాహ్న సూర్యుని కాంతివంటి కాంతిగలదగుచు, నవమణివిలసిత భూషణములను ధరించి మూడు కన్నులతో నొప్పారుచు, సురముని సమూహములచేత స్తుతింపబడుచున్న నిత్యురాలగు శ్రీ శివదూతీదేవిని నేను భజించుచున్నాను.

(పాటలవర్ణము)

## 23. శ్రీ త్వరితా ధ్యానమ్

నాగైః కల్పితభూషణాం త్రిణయనాం
గుంజాగుణాలంకృతాం
శ్యామాం పాశవరాంకుశాభయవరాం
దోర్భి ర్యుతాం బాలికామ్ ।
పీతాం పల్లవవాసినీం శిఖిశిఖా
చూడావతంసోజ్జ్వలాం
ధ్యాయా మ్యన్వహ మృక్షసింహనివహైః
పీఠస్థితాం సుందరీమ్ ॥

శ్రీ త్వరితాదేవి సర్వభూషణములచేత నలంకృతయై మూడు కన్నులతో, గురువిందసరులతో నొప్పారుచు, తరుణవయస్కురాలై కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, అంకుశమును 2, అట్లే ఎడమవైపున వరదముద్రను 1, పాశమును 2, చతుర్బాహువులతో ధరించి యుండును.

చిగురుటాకుల వస్త్రమును దాల్చి, నెమలిపింఛముల చూడాభూషణముతో ప్రకాశించుచు, భల్లూకసింహసమూహములతో గూడి పీఠమునందున్న పచ్చని బాలాసుందరి యగు శ్రీ త్వరితాదేవిని ధ్యానింతును. (పీతవర్ణము)

## 24. శ్రీ కులసుందరీ ధ్యానమ్

బాలాదిత్యనిభారుణాం త్రిణయనాం
బాలేందుచూడాన్వితాం
హాలాగంధిసుకోమలాధరయుతాం
లీలావతీం సుస్మితామ్ ।
మాలాం పుస్తక మప్యభీష్ట ముభయం
సంబిభ్రతీం బాహుభి
ర్బాలాం తా మఖిలాంగభూషణధరాం
ధ్యాయామి సంసిద్ధిదామ్ ॥

శ్రీ కులసుందరి లేతసూర్యునివలె నెఱ్ఱనై, మూడు కన్నులతో, బాలచంద్రుని శిరోభూషణముతో, మదిరాగంధముగల దొండపండువంటి క్రిందిపెదవితో, లీలావతియై చిఱునవ్వులను జిమ్ముచు నుండును.

తన నాల్గుహస్తములయందు క్రమమున కుడివైపున క్రిందినుండి పైకి అభయ ముద్రను 1, అక్షమాలను 2, అట్లే ఎడమవైపున వరదముద్రను 1, పుస్తకమును 2, ధరించి సర్వావయవ భూషణములతో నున్న బాలామూర్తియగు శ్రీ కులసుందరీదేవిని సంసిద్ధిని గోరి ధ్యానింపును. (అరుణవర్ణము)

# 25. శ్రీ నిత్యాధ్యానము

ఉద్యద్భానుసమప్రభాం రసముఖాం
పాశాక్షసూత్రం ధనుః
ఖేటం శూల మభీష్టదం చ దధతీం
వామై శ్చ షడ్భిః కరైః ।
దక్షై రంకుశపుస్తకేషుకుసుమం
ఖడ్గం కపాలాభయం
మాణిక్యాభరణోజ్జ్వలాం త్రిణయనీం
నిత్యాం భవానీం భజే ॥

శ్రీ నిత్యాదేవి ఉదయించు సూర్యునివలె నెఱ్ఱని శరీరచ్ఛాయలతో, ప్రేమరస మును వర్షించు నారుమొగములతో నుండును.

ఈమె కుడివైపున క్రిందినుండి పైకి వరుసన అభయముద్రను 1, కపాలమును 2, ఖడ్గమును 3, పూలబాణమును 4, పుస్తకమును 5, అంకుశమును 6, ఆరు చేతులతో ధరించి, అట్లే ఎడమవైపున క్రిందినుండి పైకి వరుసన వరదముద్రను 1, శూలమును 2, డాలును 3, వింటిని 4, అక్షసూత్రమును 5, పాశమును 6, ఆరు చేతులతో ధరించి యుండును.

మణిమయభూషణములతో ప్రకాశించుచు, ప్రతి ముఖమునందు త్రినేత్రియగు భవానీమూర్తియైన శ్రీ నిత్యాదేవిని భజింతును. (రక్తవర్ణము)

## 26. శ్రీ నీలపతాకా ధ్యానము

నీలాభా మరుణాంశుకాం త్రిణయనాం
పంచాననాం సుస్మితాం
వామే పాశపతాకపద్మవిలస
చ్చాపం వరం బిభ్రతీమ్ ।
దక్షే చాంకుశఖడ్గశక్తిసుమహా
బాణాభయాన్ బాహుభిః
పద్మస్థాం మణిమౌక్తికావృతకచాం
నీలధ్వజా మాశ్రయే ॥

శ్రీ నీలపతాక నల్లని శరీరచ్ఛాయలతో, ఎఱ్ఱని వస్త్రములతో, ఐదు మొగములతో, ప్రతిముఖమునందుమూడు మూడు కన్నులతో, చిఱునవ్వులను ప్రసరింపజేయుచు, కుడివైపున క్రిందినుండి పైకి వరుసన అభయముద్రను 1, శక్తిని 2, ఖడ్గమును 3, అంకుశమును 4, బాణమును 5, అట్లే ఎడమవైపున క్రిందినుండి పైకి వరదముద్రను 1, పద్మమును 2, పతాకను 3, పాశమును 4, వింటిని 5, పది చేతులతో ధరించి యుండును.

పద్మమునందుండి మణిమౌక్తికహారములు పయోధరములయందు ప్రకాశించు చుండ మాతృమూర్తియగు నీలధ్వజాదేవిని నేను ఆశ్రయించుచున్నాను. (నీలవర్ణము)

## 27. శ్రీ విజయా ధ్యానము

శంఖం చక్రం చ పాశం సృణి మపి సుమహా
ఖేటఖడ్గౌ చ చాపం
బాణం కల్హారపుష్పం తదను కరగతం
మాతులింగం దధానామ్ ।
ఉద్యద్బాలార్కవర్ణాం త్రిభువనవిజయాం
పంచవక్త్రాం త్రిణేత్రాం
దేవీం పీతాంబరాఢ్యాం కుచభరనమితాం
సంతతం భావయామి ॥

శ్రీ విజయాదేవి పది చేతులయందు కుడివైపున క్రిందినుండి పైకి వరుసన ఎఱ్ఱని కలువపూవును 1, బాణమును 2, ఖడ్గమును 3, అంకుశమును 4, చక్రమును 5,

అక్లే ఎడమవైపున దానిమ్మపండును 1, వింటిని 2, గొప్పశేటమును 3, పాశమును 4, శంఖమును 5, ధరించి యుండును.

ఉదయించుచున్న సూర్యునిం బోలిన ఎఱ్ఱని శరీరచ్ఛాయలతో, పంచవక్త్రియై ప్రతి ముఖమునందు మూడుమూడు కన్నులతో త్రిభువనములను (మూడు లోకములను) జయించి, పదారువన్నె మేలిమిబంగారు రంగులను చిందు వస్త్రములను ధరించి, వక్షోభార ముచేతకొంచెదిగవంగిన శరీరముకల జగన్మాతయగు శ్రీ విజయాదేవిని మానసమున భావించుచున్నాను. (రక్తవర్ణము)

## 28. శ్రీ సర్వమంగళా ధ్యానము

హేమాభాం కరుణాభిపూర్ణనయనాం మాణిక్యభూషోజ్జ్వలాం
ద్వాత్రింశద్దల షోడశాష్టదలయుక్పద్మస్థితాం సుస్మితామ్ ।
భక్తానాం ధనదం వరం చ దధతీం వామేన హస్తేన త
(భక్తానాం చ వరం ధనం చ దధతీం)
ద్దక్షే ణాభయమాతులింగసుఫలం శ్రీమంగళాం భావయే ॥

శ్రీ సర్వమంగళ బంగారుకంతుల నెగజిమ్ము శరీరద్యుతులతో, దయాపూర్ణము లగు కన్నులతో, మణిమయములగు సువర్ణాభరణములతో ప్రకాశించుచు క్రమముగ పైనుండి లోనికి ముప్పదిరెండు, పదునారు, ఎనిమిది దళములుగల బంగరు పద్మమునందు నిషణ్ణురాలై చిఱునవ్వులతో నుండును.

భక్తులకొఱకు కుడివైపున క్రిందినుండి పైకి వరుసన అభయముద్రను 1, దానిమ్మపండును 2, అక్లే ఎడమవైపున వరదముద్రను 1, ధనమును 2, ధరించిన శ్రీ మంగళాంబను భావింతును. (కనకవర్ణము)

## 29. శ్రీ జ్వాలామాలినీ ధ్యానము

కల్పాంతాగ్నిసమప్రభాం స్మితముఖైః
షడ్భిః ర్భుజై ర్ద్వాదశై
ర్యుక్తాం పాశకఖేటకంజసుశరం
శూలం వరం వామతః ।

దక్షే త్వంకుశఖడ్గశక్తిసుశరాం
శ్చాపాభయే బిభ్రతీం
జ్వాలామాలినిసంజ్ఞితాం మణిమయీం
భూషాన్వితా మాశ్రయే ॥

శ్రీ జ్వాలామాలిని ప్రళయకాలమునందలి అగ్నితో సమములగు శరీరకాంతులతో చిఱునవ్వుల గుమ్మరించు నారు మొగములతో, పన్నెండు చేతులతో నుండును.

కుడిపైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, అంకుశమును 2, దర్భలను 3, ఖడ్గమును 4, శక్తిని 5, వింటిని 6, అట్లే ఎడమపైపున వరదముద్రను 1, పాశమును 2, శూలమును 3, ఖేటమును 4, పద్మమును 5, బాణమును 6, ధరించినదై మణులతో, విభూషణములతో ప్రకాశించు శ్రీ జ్వాలామాలినీదేవిని ఆశ్రయింతును.

(రక్తవర్ణము)

## 30. శ్రీ చిత్రా ధ్యానము

బాలార్కకాంతిశశలాంఛితవక్త్రశోభాం
పాశాంకుశౌ చ వర మప్యభయం దధానామ్ ।
చిత్రాంశుకాం చ నవరత్నవిభూషితాంగీం
చిత్రాంబికాం త్రిణయనాం హృది భావయామి ॥

శ్రీచిత్రాదేవి బాలసూర్యునివంటి శరీరచ్ఛాయతో, చంద్రునివంటి ముఖశోభతో కుడిపైపున క్రిందినుండి పైకి వరుసన అభయముద్రను 1, అంకుశమును 2, ఎడమపైపున వరదముద్రను 1. పాశమును 2, ధరించును.

వివిధవర్ణములుగల వస్త్రములనుగట్టి నవరత్నమయములగు బంగారుభూషణములతో సర్వాంగముల నలంకరించి, మూడు కన్నులతో ప్రకాశించు శ్రీ చిత్రాంబికాదేవిని నా హృదయమునందు భావించుచున్నాను. (రక్తవర్ణము)

## 31. శ్రీ త్రిపురసుందరీ ధ్యానము

రాజరాజేశ్వరీవ త్పాశాంకుశేక్షుచాప
పుష్పబాణహస్తా సిందూరవర్ణా కార్యా ॥



11

కుడివైపున క్రిందినుండి పైకి క్రమమున పుష్పబాణములను 1, అంకుశమును 2, ఆల్గే ఎడమవైపున చెఱకువింటిని 1, పాశమును 2, నాల్గుచేతులతో ధరించి సిందూర వర్ణము కలిగిన శ్రీ త్రిపురసుందరీదేవిని ధ్యానింపవలెను.

## 32. శ్రీ షడంగదేవీ ధ్యానము

హృద్దేవీ చ శిరోదేవీ శిఖాదేవీ తథైవ చ
వర్మదేవీ దృష్టిదేవీ హ్యస్త్రదేవీ షడీరితాః ॥

నవలావణ్యపూర్ణాంగ్యః సావధానధృతాయుధాః
పరితో బిందుపీఠం చ భ్రామ్యంత్యో దీప్తమూర్తయః ॥

హృద్దేవి 1, శిరోదేవి 2, శిఖాదేవి 3, వర్మదేవి 4, దృష్టిదేవి 5, అస్త్రదేవి 6, అను నీ యారుగురు షడంగదేవతలు. వీరలు నూతన యౌవనముతో నిండిన అవయవములు గలవారు. శ్రద్ధావతులై ఆయుధములను పట్టుకొని ప్రకాశించుచున్న రూపములతో బిందుపీఠముచుట్టు తిరుగుచుందురు. (రక్తవర్ణము)

## 33. శ్రీ యోగనిద్రాదేవీ ధ్యానము

(పాంచరాత్రపద్మసంహిత)

నిద్రాతుం శయనారూఢా సుసౌమ్యా కమలేక్షణా
పాశపాత్రధరా చేయం ద్విభుజా శ్యామలా స్మృతా ॥

శ్రీ యోగనిద్రాదేవి నిద్రించుటకై శయనమును అధిష్ఠించినదై మిక్కిలి సాధుమూర్తియై పద్మములవంటి కన్నులతో, కుడివైపున పాశమును 1, ఎడమవైపున పాత్రమును 2, రెండు చేతులయందు ధరించి నల్లని కాంతులతో ఒప్పారుచుండును.

## 34. శ్రీ అష్టాదశభుజాభద్రకాళీ ధ్యానము

(ఇది నృసింహప్రాసాదము ననుసరించినది)

అష్టాదశభుజా కార్యా భద్రకాళీ మనోహరా
ఆలీఢస్థానసంస్థానా చతుస్సింహరథే స్థితా ॥

అక్షమాలాం త్రిశూలం చ ఖడ్గం చర్మ చ సర్వదా
బాణచాపౌ చ కర్తవ్యే శంఖపద్మే తథైవ చ ॥

స్రుక్స్రువౌ చ తథా కార్యౌ తథా దివ్యం కమండలుమ్
దండశక్తీ చ కర్తవ్యే కృష్ణాజినహుతాశనౌ ॥

హస్తానాం భద్రకాళ్యాస్తు భవే చ్ఛాంతికరో వరః
ఏకత్రైవ మహాభాగా రత్నపాత్రధరా భవేత్ ॥

నాల్గు సింహములతో కట్టబడిన రథమునందు ఆలీఢపాదముతో పదునెనిమిది బాహువులతో, భద్రకాళీదేవి ప్రకాశించుచుండును.

ఈమె కుడిప్రైపున క్రిందినుండి పైకి వరుసన అభయముద్రను 1, శక్తిని 2, స్రుక్కును 3, పద్మమును 4, ఖడ్గమును 5, జపమాలను 6, త్రిశూలమును 7, అజినమును 8, బాణమును 9, అట్లే ఎడమప్రైపున వరదముద్రను 1, రత్నపాత్రమును 2, స్రువమును 3, దండమును 4, ఖేటమును 5, కమండలువును 6, అగ్నిని 7, శంఖమును 8, వింటిని 9, పదునెనిమిది హస్తములతో ధరించి యుండును.

# మూలాధారాదిసప్తపీఠేశ్వరీ ధ్యానములు

## 35. మూలాధారపీఠస్థశాకినీ ధ్యానము

(ఇది షోఢాకల్పము ననుసరించినది)

మూలాధారస్థపద్మే శ్రుతిదళసహితే
పంచవక్త్రాం త్రిణేత్రాం
స్వర్ణాభా మస్థిసంస్థాం సృణి మపి కమలం
పుస్తకం జ్ఞానముద్రామ్ ।
బిభ్రాణాం బాహుదండైః సులలితవరదా
ద్యాభివీతాం మనోజ్ఞాం
ముద్గాన్నాసక్తచిత్తాం మధుమదముదితాం
శాకినీం భావయే త్వామ్ ॥

శ్రీ శాకినీదేవి నాల్గు దళములుగల మూలాధారపద్మమునందు ఐదు మొగములతో, మూడు మూడు కన్నులతో, బంగరువంటి శరీరచ్ఛాయతో, అస్థులయందు ఉన్నదియై కుడి వైపున క్రిందినుండి పైకి జ్ఞానముద్రను 1, అంకుశమును 2, అట్లే ఎడమవైపున పుస్తకమును 1, కమలమును 2, నాల్గు హస్తములతో ధరించును.

ఈమె మిక్కిలి కోమలములైన వరదాదులచేత చుట్టబడినదై, పెసలతో కూడిన అన్నమునందు ఆసక్తురాలై, మదిరామదముచేత సంతోషము కలిగియుండును. ఇట్టి శాకినీదేవిని నేను మనస్సునందు భావింతును. (స్వష్టవర్ణము)

## 36. శ్రీ స్వాధిష్ఠానపీఠస్థకాకినీ ధ్యానమం

స్వాధిష్ఠానాఖ్యపద్మే రసదళలసితే
వేదవక్త్రాం త్రినేత్రాం
పీతాభాం ధారయంతీం త్రిశిఖగుణకపా
లాభయాజ్ఞాంతవర్గాన్ ।
మేదోధాతుప్రతిష్ఠా మలిమదముదితాం
బంధినీం పూగశక్త్యా
వీతాం దధ్యన్నసక్తా మభిమతఫలదాం
కాకినీం భావయే త్వామ్ ॥

శ్రీ కాకినీదేవి ఆరు దళములతోనుండు స్వాధిష్ఠానమను పద్మమునందు నాల్గు మొగములతో, మూడు మూడు కన్నులతో, పచ్చని శరీరచ్ఛాయతో, కుడివైపున క్రింది నుండి పైకి అభయముద్రను , త్రిశూలమును 2, అట్లే ఎడమవైపున కపాలమును 1, పాశమును 2, నాల్గు బాహువులయందు ధరించి యుండును.

కవర్గమునకు, చవర్గమునకు, మేదోధాతువునకు అధిష్ఠానదేవతయై, మదిరామద ముచేత సంతసించినదియై పూగశక్తితో కూడి, దధ్యన్నమునందు అనురక్తయగుచు ఇష్ట ఫలములను ఇచ్చునట్టి కాకినీదేవిని భావింతును.

## 37. శ్రీ మణిపూరకపీఠస్థలాకినీ ధ్యానము

నాభౌ దిక్పత్రపద్మే త్రివదనవిలస
త్ర్యక్షిణాం కృష్ణవర్ణాం
శక్తిం దంభోళిదండాభయ మపి చ భుజై
ర్ధారయంతీం మహోగ్రామ్ ।
డామర్యాద్యైః పరీతాం పశుజనభయదాం
మాంసధాత్వాసనస్థాం
గౌడాన్నే సక్తచిత్తాం సకలసుఖకరీం
సంస్మరే ల్లాకినీం తామ్ ॥

శ్రీ లాకినీదేవి నాభిస్థానమునందు పదిదళములుగల మణిపూరక పద్మమునందు మూడు మొగములతో, ప్రతిముఖమునందు మూడు కన్నులతో, నల్లని శరీరచ్ఛాయలతో, కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, శక్తిని 2, అట్లే ఎడమవైపున దండమును 1, వజ్రమును 2, నాల్గు హస్తములతో, ధరించును.

డామరి మున్నగు శక్తులచేత చుట్టబడి మహా భయంకరురాలగుచు పశువులకు, మనుష్యులకు, భయమును గూర్చునదై మాంసధాతువునకు అధిష్ఠానమూర్తియై గుడాన్నమునందు అనురక్తురాలగుచు ఎల్లజగములకు సుఖకరియగు ఆ లాకినీదేవిని స్మరింపవలెను. (కృష్ణవర్ణము)

## 38. శ్రీ అనాహతపీఠస్థరాకినీ ధ్యానము

హృత్పద్మే భానుపత్రే ద్వివదనవిలస
ద్దంష్ట్రిణీం శ్యామవర్ణాం
టంకం శూలం కపాలం డమరు మపి భుజై
ర్ధారయంతీం త్రినేత్రామ్ ।
రక్తస్థాం కాలరాత్రిప్రభృతిపరివృతాం
శుద్ధరక్తే ప్రవృత్తాం
శ్రీమద్వీరేంద్రవంద్యా మభిమతఫలదాం
రాకినీం భావయే త్తామ్ ॥

శ్రీ రాకినీదేవి పన్నెండు దళములుగల అనాహతమైన హృదయ పద్మమునందు, రెండు ముఖములయందు భయంకరముగ ప్రకాశించుచున్న దంష్ట్రిలతో (కోరలతో), నల్లని శరీరచ్ఛాయలతో, చతుర్బాహువులతో కుడివైపున క్రిందినుండి పైకి వరుసన శూలమును 1, టంకమును 2, అట్లే ఎడమవైపున కపాలమును 1, డమరుకమును 2, ధరించి ఉండును.

ఈమె మూడు మూడు కన్నులతో, రక్తాధిదేవతయగుచు, కాలరాత్రి మున్నగు శక్తులచేత చుట్టుముట్టబడినదై, (సేవింపబడినదై) పరిశుద్ధ రక్తమునందు ప్రవర్తించిన దగుచు శ్రీమద్వీరేంద్రస్వామిచేత (శివునిచేత), స్తుతింపబడుచు, కోరిన కోర్కెలను ఇచ్చునట్టి శ్రీరాకినీదేవిని మనస్సునందు భావింపవలెను. (శ్యామవర్ణము)

## 39. శ్రీ విశుద్ధపీఠస్థడాకినీ ధ్యానము

గ్రీవాకూపే విశుద్ధే స్వరదళకమలే
రక్తవర్ణాం త్రిణేత్రాం
శ్రీఖట్వాంగం కపాలం త్రిశిఖ మపి మహా
చర్మ సంధారయంతీమ్ ।
వక్త్రైణైకేన యుక్తాం పశుజనభయదాం
పాయసాన్నప్రసక్తాం
త్వక్స్థాం వందే౽మృతాద్యైః పరివృతవపుషం
డాకినీం వీరచండామ్ ॥

శ్రీడాకినీదేవి కంఠస్థానమందున్న పదునారుదళములుకల విశుద్ధ పద్మమునందు ఎఱ్ఱని శరీరచ్ఛాయలతో, మూడు కన్నులతో తన చతుర్బాహువులయందు కుడివైపున క్రిందినుండి పైకి త్రిశూలమును 1, ఖట్వాంగమును 2, అట్లే ఎడమవైపున కపాలమును 1, ఖేటమును 2, ధరించి ఉండును.

ఏకవక్త్రయై, పశువులకు, మనుష్యులకు, భయంకరురాలగుచు పరమాన్నము నందు అనురక్తి గలిగి చర్మాధిదేవతయై అమృతప్రవాహములచేత పరివేష్టితమైన శరీరముతో పరమచండమూర్తియగు శ్రీ డాకినీదేవిని నేను నమస్కరించుచున్నాను.

(రక్తవర్ణము)

## 40. శ్రీ ఆజ్ఞాపీఠస్థహాకినీ ధ్యానము

భ్రూమధ్యే బిందుపద్మే ద్విదలవిలసితే
శుభ్రవర్ణాం కరాబ్జై
ర్బిభ్రాణాం జ్ఞానముద్రాం డమరుక మమలం
చాక్షమాలాం కపాలమ్ ।
షడ్వక్త్రాం మజ్జసంస్థాం త్రిణయనలలితాం
హంసగత్యాదియుక్తాం
హరిద్రాన్నే ప్రసక్తాం సకలసురనుతాం
హాకినీం భావయే త్వామ్ ॥

శ్రీ హాకినీదేవి కనుబొమల నడుమ నుండిన రెండుదళములతో నున్న ఆజ్ఞానామక మగు బిందు పద్మమునందు తెల్లని శరీరచ్ఛాయలతో, ఆరు మొగములతో, ప్రతిముఖము నందు, మూడు, మూడు కన్నులతో నుండును.

తన చతుర్బాహువులయందు కుడివైపున క్రిందినుండి పైకి వరుసన జ్ఞాన ముద్రను 1, జపమాలను 2, అట్లే ఎడమవైపున కపాలమును 1, డమరుకమును 2, ధరించి పసుపుతో కూడిన అన్నమునందు అభిరుచి కలిగి దేవతా గణములచేత నుతింప బడుచు, అంచనడకల నొప్పారు శ్రీ హాకినీదేవిని భావింపవలయును. (శ్వేతవర్ణము)

## 41. శ్రీ జాలంధరపీఠస్థయాకినీ ధ్యానము

మూర్ధవ్యోమస్థపద్మే సకలదళయుతే
యాకినీం భైరవీం తాం
యక్షిణ్యాద్యాం సమస్తాయుధవిలసితకరాం
సర్వవర్ణాం సమష్టిమ్ ।
రాదీనాం సర్వవక్త్రాం సకలసుఖకరీం
సర్వధాతుస్వరూపాం
సర్వాన్నే సక్తచిత్తాం పరశివరసికాం
భావయే ద్యాకినీం తామ్ ॥

శ్రీ యాకినీదేవి శరీరమునకు ఆకాశమువంటి శిరఃస్థానమునందు వేయిరేకులుగల సహస్రార పద్మమునందు ఉపవిష్టురాలై యక్షిణ్యాది శక్తులచేత పరివేష్టింపబడి సర్వవర్ణముల సమష్టి రూపమగు శరీరచ్ఛాయలతో, సమస్తాయుధములతో ప్రకాశించు బాహువులతో నుండును.

రేఫాక్షరము ఆదియందుగల సర్వదైవతములయొక్క సర్వముఖములు కలదియై, సప్త ధాతువులకు అధిష్ఠాన దేవతయై, వివిధములగు సర్వాన్నములయందు ఆసక్తురాలై, సమస్త సుఖములను కలిగించునదై, పరమ శివునితో నిరంతరము ఆనందించునట్టి శ్రీ యాకినీదేవతను భావింపవలెను. (చిత్రవర్ణము)

# సప్తమాతృకాదేవతల ధ్యానములు

## 42. శ్రీ బ్రాహ్మీ ధ్యానము

తత్ర బ్రాహ్మీ చతుర్వక్త్రా షడ్భుజా హంససంస్థితా
పింగాభా భూషణోపేతా మృగచర్మోత్తరీయకా ॥

వరం సూత్రం స్రువం ధత్తే దక్షబాహుత్రయే క్రమాత్
వామే తు పుస్తకం కుండీం బిభ్రతీ చాభయం కరమ్ ॥

శ్రీ బ్రాహ్మీదేవి నాల్గు మొగములతో, ఆరు హస్తములతో, హంసవాహనముతో, లేత పసుపు వర్ణమగు పింగళ శరీరచ్ఛాయతో, లేడి చర్మోత్తరీయముతో, మూడు కుడి చేతులయందు క్రిందినుండి పైకి వరుసన వరముద్రను 1, పాశమును 2, స్రువమును 3, ఎడమచేతులయందు అభయముద్రను 1, పుస్తకమును 2, కమండలువును, ధరించినదై యుండును. (పీతవర్ణము)

## 43. శ్రీ మాహేశ్వరీ ధ్యానము

మాహేశ్వరీ వృషారూఢా పంచవక్త్రా త్రిలోచనా
శ్వేతవర్ణా దశభుజా చంద్రరేఖావిభూషణా ॥

ఖడ్గం వజ్రం త్రిశూలం చ పరశుం చాభయం వరమ్
పాశం ఘంటాం తథా నాగ మంకుశం బిభ్రతీ కరైః ॥

శ్రీ మాహేశ్వరీదేవి వృషభమును అధిష్ఠించినదై ఐదు మొగములతో, ప్రతి ముఖమునందు, మూడు, మూడు కన్నులతో, తెల్లని శరీరచ్ఛాయలతో, నెలవంక శిరో భూషణముతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి వరుసన అభయముద్రను 1, గొడ్డలిని 2, శూల మును 3, వజ్రమును 4, ఖడ్గమును 5, అట్లే ఎడమవైపున వరముద్రను 1, అంకుశ మును 2, నాగమును 3, ఘంటను 4, పాశమును 5, పదిచేతులయందు ధరించినదై యుండును. (శ్వేతవర్ణము)

# 44. శ్రీ కౌమారీ ధ్యానము

షడాననా తు కౌమారీ పాటలాభా సుశీలకా
రవిబాహు ర్మయూరస్థా వరదా శక్తిధారిణీ ॥

పతాకాం బిభ్రతీ దండం పాత్రం బాణం చ దక్షిణే
వామే చాప మథో ఘంటాం కమలం కుక్కుటం తథా ॥

పరశుం బిభ్రతీ చైవ తదధ స్త్వభయాన్వితా ॥

శ్రీ కౌమారీదేవి ఆరు ముగములతో, శ్వేత రక్తమైన పాటల శరీరచ్ఛాయలతో, ప్రసన్నమూర్తితో, మయూర వాహనముతో, ద్వాదశ (పంద్రెండు) బాహువులు కలది యై యుండును.

కుడి భాగమునందు క్రిందినుండి పైకి వరుసన వరముద్రను 1, శక్తిని 2, పతాకను 3, దండమును 4, పాత్రమును 5, బాణమును 6, అట్లే ఎడమ భాగము నందు అభయముద్రను 1, గొడ్డలిని 2, కుక్కుటమును 3, కమలమును 4, గంటను 5, వింటిని 6, పంద్రెండు హస్తములతో ధరించి యుండును. (పాటలవర్ణము)

# 45. శ్రీ వైష్ణవీ ధ్యానము

వైష్ణవీ తార్క్ష్యగా శ్యామా షడ్భుజా వనమాలినీ
వరదా గదినీ దక్షే బిభ్రతీ చ కరే ఽంబుజమ్ ॥

శంఖచక్రాభయాన్ వామే సా చేయం విలసద్భుజా ॥

శ్రీ వైష్ణవీదేవి గరుడవాహనముతో, శ్యామల (నల్లని) శరీరచ్ఛాయలతో వనమాలా భూషణములతో, ఆరు హస్తములు కలదియై యుండును.

కుడిభాగమున క్రిందినుండి పైకి వరుసన వరముద్రను 1, గదను 2, పద్మమును 3, అట్లే ఎడమ భాగమున అభయముద్రను 1, చక్రమును 2, శంఖమును 3, ఆరు చేతులతో ధరించి యుండును. (నీలవర్ణము)

## 46. శ్రీ వారాహీ ధ్యానము

కృష్ణవర్ణా తు వారాహీ మహిషస్థా మహోదరీ
వరదా దండినీ ఖడ్గం బిభ్రతీ దక్షిణే కరే ॥

ఖేటపాత్రాభయాన్ వామే సూకరాస్యా లసద్భుజా ॥

శ్రీ వారాహీదేవి నల్లని శరీర కాంతులతో, వరాహముఖముతో, మహిషవాహనముతో, లావైన ఉదరముతో, (పొట్టతో) ఆరు చేతులతో నుండును.

కుడి భాగమునందు క్రిందినుండి పైకి వరుసన వరముద్రను 1, ఖడ్గమును 2, దండమును 3, ఎడమ భాగమున క్రిందినుండి పైకి వరుసన అభయముద్రను 1, ఖేటమును 2, పాత్రమును 3, ఆరు చేతులయందు ధరించి యుండును. (కృష్ణవర్ణము)

## 47. శ్రీ ఐంద్రీ ధ్యానము

ఐంద్రీ సహస్రదృక్ సౌమ్యా హేమాభా గజసంస్థితా
వరదా సూత్రిణీ వజ్రం బిభ్ర త్యూర్ధ్వం తు దక్షిణే ॥

వామే తు కమలం పాత్రం హ్యభయం తదధః కరే ॥

శ్రీ ఐంద్రీదేవి మిక్కిలి సౌమ్యురాలు. వేయి కన్నులతో, బంగారువంటి పచ్చని శరీరకాంతులతో, ఏనుగు వాహనముతో, నుండును.

ఆమె ఆరు చేతులు కలది. కుడివైపున క్రిందినుండి పైకి వరుసన వరముద్రను 1, సూత్రమును 2, వజ్రమును 3, అట్లే ఎడమ భాగమున అభయముద్రను 1, పాత్రమును 2, పద్మమును 3, ధరించి యుండును.

## 48. శ్రీ చాముండా ధ్యానము

చాముండా ప్రేతగా కృష్ణా వికృతా చాహిభూషణా
దంష్ట్రాలా క్షీణదేహా చ గర్తాక్షీ కామరూపిణీ ॥

దిగ్బాహుః క్షామకుక్షీ చ ముసలం చక్రచామరే
అంకుశం బిభ్రతీ ఖడ్గం దక్షిణే చాథ వామకే ॥

ఖేటం పాశం ధను ర్దండం కుఠారం చాపి బిభ్రతీ ॥

శ్రీ చాముండాదేవి ప్రేతములతో చుట్టబడినదై, నల్లని శరీర కాంతులతో, వికృత ముగ నుండును. సర్పములను భూషణములుగ ధరించును. కోరలతో, లావైన శరీర ముతో, గుంటకన్నులతో, సన్ననిపొట్టతో, పది చేతులతో నుండును.

ఈమె కామరూపిణి. కుడివైపున క్రిందినుండి పైకి ఖడ్గమును 1, అంకుశమును 2, రోకలిని 3, చక్రమును 4, చామరమును 5, అల్లే ఎడమవైపున ఖేటమును 1, పాశ మును 2, దండమును 3, గొడ్డలిని 4, వింటిని 5 ధరించి యుండును. (కృష్ణవర్ణము)

## 49. శ్రీ చండికా ధ్యానము

చండికా శ్వేతవర్ణా సా శివరూపా చ సింహగా
జటిలా వర్తులా త్ర్యక్షా వరదా శూలధారిణీ ॥

కర్త్రికాం బిభ్రతీ దక్షే పాశపాత్రాభయాన్వితా ॥

శ్రీ చండికాదేవి తెల్లని శరీరచ్ఛాయలతో శివరూపముతో (శుభములనిచ్చు రూప ముతో) సింహవాహనముతో, జడలతో, మూడు కన్నులతో, ఆరు చేతులతో, లావుగా నుండును.

ఈమె కుడివైపున క్రిందినుండి పైకి వరుసన వరముద్రను 1, కత్తెరను 2, శూలమును 3 అల్లే ఎడమవైపున అభయముద్రను 1, పాత్రమును 2, పాశమును 3, ఆరు చేతులతో ధరించి యుండును. (శ్వేతవర్ణము)

# శ్రీ నవదుర్గలయొక్క ధ్యానములు

## 50. శ్రీ శైలపుత్రీదుర్గా ధ్యానము

వందే వాంఛితలాభాయ చంద్రార్ధకృతశేఖరామ్
వృషారూఢాం శూలధరాం శైలపుత్రీం యశస్వినీమ్ ॥

బాలచంద్రుని శిరోభూషణముగా ధరించి ఎద్దును ఎక్కినదై శూలమును దాల్చిన కీర్తిమంతురాలగు శ్రీశైల పుత్రీదేవిని నా కోరికలు ఫలించుటకుగాను నమస్కరింతును.

## 51. శ్రీ బ్రహ్మచారిణీదుర్గా ధ్యానము

దధానా కరపద్మాభ్యా మక్షమాలాకమండలూ
దేవీ ప్రసీదతు మయి బ్రహ్మచారి ణ్యనుత్తమా ॥

రెండు చేతులతో అక్షమాలను, (జపమాలను) కమండలువును ధరించి పరమోత్తమురాలవగు ఓ బ్రహ్మచారిణీదేవీ నాయందు అనుగ్రహము కలదానవు కమ్ము.

## 52. శ్రీ చండఖండదుర్గా ధ్యానము

అండజప్రవరారూఢా చండకోపార్భటీయుతా
ప్రసాదం తనుతాం మహ్యం చండఖండేతి విశ్రుతా ॥

గరుడవాహనమును ఎక్కినదై, ప్రచండమగు కోపముగల చండఖండ అని ప్రసిద్ధురాలగు దేవి నాయందు అనుగ్రహము కల దగునుగాక.

## 53. శ్రీ స్కందదుర్గా ధ్యానము

సింహాసనగతా నిత్యం పద్మాంచితకరద్వయా
శుభ దాస్తు సదా దేవీ స్కందమాతా యశస్వినీ ॥

ఎల్లప్పుడు సింహమును అధిష్ఠించినదై, రెండు చేతులయందు పద్మములను ధరించినదై, కుమారస్వామికి తల్లియై కీర్తిని పొందిన శ్రీ స్కందదుర్గాదేవి సదా శుభములను ఇచ్చునది అగుగాక.

## 54. శ్రీ కూష్మాండదుర్గా ధ్యానము

సురాసంపూర్ణకలశం రుధిరప్లుత మేవ చ
దధానా హస్తపద్మాభ్యాం కూష్మాండా శుభ దాస్తు మే ॥

మద్యముతోడను, రక్తముతోడను నిండిన రెండు కలశములను (పాత్రములను) రెండు చేతులతో ధరించిన శ్రీ కూష్మాండ దుర్గాదేవి సదా శుభములను చేకూర్చును గాక.

## 55. శ్రీ కాత్యాయనీదుర్గా ధ్యానము

చంద్రహాసోజ్జ్వలకరా శార్దూలవరవాహనా
కాత్యాయనీ శుభం దద్యా ద్దేవీ దానవఘాతినీ ॥

నిగనిగలాడు కత్తిని ధరించుటచే ఉజ్జ్వలురాలై శార్దూలవాహనము నెక్కి దానవులను మర్దించు శ్రీ కాత్యాయనీ దుర్గాదెవి నాకు శుభములను ఇచ్చునుగాక.

## 56. శ్రీ కాళరాత్రిదుర్గా ధ్యానము

కరాళరూపా కాలాబ్జసమానాకృతివిగ్రహా
కాళరాత్రిః శుభం దద్యా ద్దేవీ చండాట్టహాసినీ ॥

నల్లగలువ వంటి శరీరకాంతులతో, భయంకరమగు రూపముతో, పెదబొబ్బ నవ్వులు గల కాలరాత్రి యను పేరుగల దుర్గాదేవి నాకు శుభము నిచ్చుగాక.

## 57. శ్రీ మహాగౌరీదుర్గా ధ్యానము

శ్వేతహస్తిసమారూఢా శ్వేతాంబరధరా శుచిః
మహాగౌరీ శుభం దద్యా న్మహాదేవప్రమోదదా ॥

తెల్లని ఏనుగు నెక్కి, తెల్లని వస్త్రములను ధరించి పవిత్రురాలై మహాదేవుడగు పరమశివునకు సంతసమును గూర్చు శ్రీ మహాగౌరీదేవి నాకు శుభములను ఇచ్చుగాక.

## 58. శ్రీ సిద్ధిదాయినీదుర్గా ధ్యానమ్

సిద్ధగంధర్వయక్షాద్యై రసురై రమరై రపి
సేవ్యమానా సదా భూయా త్సిద్ధిదా సిద్ధిదాయినీ ॥

సిద్ధులు గంధర్వులు యక్షులు అసురులు దేవతలు మున్నగు నెల్లరిచేత సేవింపబడుచున్న సిద్ధిదాయిని యను దుర్గాదేవి నాకు ఎల్ల సిద్ధులను ఇచ్చుగాక.

## 59. శ్రీ నవదుర్గలయొక్క ధ్యానమ్

(స్కందయామలరీతితో కారణాగమము ననుసరించి)

తత్రపద్మాన్వితే స్థానే పూజ్యా దుర్గా స్తు మూర్తితః
అష్టాదశభుజా చైకా పీనవక్షోభుజోరుకా ॥

సర్వాలంకారసంయుక్తా సర్వసిద్ధిప్రదాయినీ
మూర్ధజం ఖేటకం ఘంటా మాదర్శం తర్జనీం ధనుః ॥

ధ్వజం డమరుకం పాశం బిభ్రతీ వామపాణిభిః
శక్తిముద్గరశూలాని వజ్రం శంఖ ము ఖాంబుజమ్ ॥

శలాకాం మార్గణం చక్రం దధానా దక్షిణైః కరైః
శేషాః షోడశహస్తాః స్యుః శరం డమరుకం వినా ॥

జయమ మిచ్ఛద్భి రేతా స్తు పూజనీయా మనీషిభిః
(వీరల నామములు)
రుద్రా చండా శచీ శైవా చండీ క్రూ రానుచండికా ॥

నవమీ చోగ్రచండా చ నవ దుర్గాః ప్రకీర్తితాః
(వీరల వర్ణములు)
పావకా భాంజనా కృష్ణా నీలా శుక్లా చ ధూమికా ॥

పీతా చ పాండరా జ్ఞేయా హ్యాలీఢా స్తా హరిద్వృతాః ॥

పద్మములతో కూడిన ప్రదేశమునందు స్వరూపమువలననే పూజింపదగిన తొమ్మండుగురు దుర్గాదేవతలు కలరు. ఆ తొమ్మిది మందిలో ఒక్కొరిత లావైన స్తనములు, చేతులు, భుజములు, ఊరువులు (తొడలు) కలది. ఈమె అన్ని నగలను ధరించునది. ఎల్ల సిద్ధులను ఈయగలదు.

ఈమెకు పదు నెనిమిది చేతు లుండును. వానితో కుడివైపున క్రిందినుండి పైకి వరుసన పద్మమును 1, శలాకను 2, శూలమును 3, శంఖమును 4, వజ్రమును 5, చక్రమును 6, బాణమును 7, ముద్గరమును 8, శక్తిని 9, అట్లే ఎడమవైపున తర్జనిని 1, జడను 2, పాశమును 3, ధ్వజమును 4, గంటను 5, అద్దమును 6, వింటిని 7, డాలును 8, డమరుకమును 9, ధరించి యుండును.

మిగిలిన యెనమండుగురు పదునారు హస్తములతో మాత్ర ముందురు. కనుక ఆయుధములలో బాణము, డమరుకము ఉండవు. జయమును కోరిన పండితులు ఈ తొమ్మండుగురు దుర్గాదేవతలను పూజింపవలెను.

రుద్ర 1, చండ 2, శచి 3, శైవ 4, చండి 5, ప్రకూర 6, అప్రకూర 7, చండిక 8, ఉగ్రచండ 9, అని వీరల పేరులు.

వరుసన అగ్నివంటి రంగు 1, కాటుకవంటి రంగు (నలుపు)2, కృష్ణము (నలుపు) 3, నీలము (నలుపు) 4, శుక్లము (తెలుపు) 5, ధూమము (పొగరంగు) 6, పసుపు 7, పాండరము (లేత ఎఱుపు) 8, వీరి వర్ణములు.

## 60. శ్రీ షోడశభుజయగు దుర్గా ధ్యానము

(దుర్గాకల్పము)

త్రిణయనపన్నగయుక్తాం
శూలవ్యగ్రాం భుజైశ్చ షోడశభిః ।
పన్నగవలయవిభూషాం
నీలగ్రీవాం దిగంబరాం వందే ॥

శూలమును ధరించిన పదునారు చేతులతో, మూడు కన్నులతో, పాముల దండలతో, పాముల కంకణములతో, పాముల నగలతో, నల్లని మెడతో, దిగంబరయై యున్న శ్రీ దుర్గాదేవికి నమస్కరింతును. (శ్యామవర్ణము)

# 61. శ్రీ రుద్రాంశ దుర్గా ధ్యానము

(కారణాగమము ననుసరించి)

రక్తాంబరాం శ్యామలినీం ద్వినేత్రాం
కిరీటరత్నాంకితహేమభూషామ్ ।
సశూలఖడ్గాం ధృతశంఖచక్రాం
మృగేంద్రయానాం రవిచంద్రభూషామ్ ॥

ఇష్టార్థదాత్రీం సురవంద్యపాదాం
రుద్రాంశదుర్గాం మనసా స్మరామి ॥

శ్రీ రుద్రాంశ దుర్గాదేవి ఎఱ్ఱని వస్త్రములతో, నల్లని శరీరముతో, రెండు కన్నులతో, రత్న కిరీటముతో, మణులు పొదిగిన బంగరు నగలతో కుడివైపున క్రిందినుండి పైకి చక్రమును 1, శూలమును 2, అట్లే ఎడమవైపున శంఖమును 1, ఖడ్గమును 2, ధరించును.

సింహవాహనమును అధిష్ఠించినదై సూర్యచంద్రులను అలంకరించుకొని, తన పాదములకు దేవతలు నమస్కరించుచుండ కోరిన కోరికలను ఇచ్చునట్టి శ్రీ రుద్రాంశ దుర్గాదేవిని నేను నా మనస్సునందు స్మరించుచున్నాను. (శ్యామలవర్ణము)

# 62. శ్రీ అష్టభుజాకాళీ ధ్యానము

(ఇది కారణాగమమునుండి)

అష్టబాహు మహాకాయా కాలమేఘసమప్రభా
శంఖచక్రగదాకుంభముసలాంకుశపాశయుక్ ॥

వజ్రం కరే బిభ్రతీ సా మహాకాళీ ముదే ఽస్తు నః ॥

మహాశరీరముతో ప్రళయకాలమునందలి మేఘములతో సమమగు నల్లని శరీర కాంతులతో తన ఎనిమిది చేతులయందు కుడివైపున క్రిందినుండి పైకి వరుసన కుంభమును 1, వజ్రమును 2, అంకుశమును 3, చక్రమును 4, అట్లే ఎడమవైపున

గదను, 1. ముసలమును 2. పాశమును 3. శంఖమును 4. ధరించిన శ్రీ మహాకాళీదేవి మాకు సంతోషమును కలిగించును గాక ! (మేఘశ్యామవర్ణము)

## 63. శ్రీ వనదుర్గా ధ్యానము

(ఇది ఆమ్నాయము ననుసరించినది)

అరిశంఖకృపాణఖేటబాణాన్
సధనుఃశూలకతర్జనీం దధానా ।
మమ సా మహిషోత్తమాంగసంస్థా
నవదూర్వాసదృశీ శ్రియే ఒస్తు దుర్గా ॥

నాల్గు కుడిచేతులతో క్రిందినుండి పైకి క్రమమున కుడివైపున తర్జనిని 1, కత్తిని 2, బాణమును 3, చక్రమును 4, అట్లే ఎడమ చేతులతో క్రిందినుండి పైకి, క్రమమున శూలమును 1, ఖేటమును 2, వింటిని 3, శంఖమును 4, ధరించి ఎనిమిది చేతులు కలదై, మహిష శిరమును ఎక్కినదై, లేత గడ్డితో సమమగు శరీరచ్ఛాయలుగల శ్రీ దుర్గాదేవి మాకు సంపదలను ఇచ్చుగాక ! (హేమవర్ణము)

## 64. శ్రీ ప్రత్యంగిరా ధ్యానము

శ్యామాభాం చ త్రినేత్రాం తాం సింహవక్త్రాం చతుర్భుజామ్
ఊర్ధ్వకేశీం చ సింహస్థాం చంద్రాంకితశిరోరుహామ్ ॥

కపాలశూలడమరునాగపాశధరాం శుభామ్
ప్రత్యంగిరాం భజే నిత్యం సర్వశత్రువినాశినీమ్ ॥

శ్రీ ప్రత్యంగిర నల్లని శరీరకాంతులతో, మూడు కన్నులతో, సింహముయొక్క ముఖమువంటి ముఖము కలదై, కుడివైపున క్రిందినుండి పైకి శూలమును 1, డమరుకమును 2, అట్లే ఎడమవైపున కపాలమును 1, నాగపాశమును 2, ధరించిన నాల్గు చేతులతో నుండును.

బాలచంద్రుడు ఆభరణముగా గల ఊర్ధ్వమునకు (పైకి) వ్యాపించిన వెంట్రుకలతో, సింహవాహనము నధిష్ఠించినదై శత్రువుల నెల్లరను సంహరించునట్టి ప్రత్యంగిరాదేవిని నిత్యము నేను భజించుచున్నాను. (శ్యామవర్ణము)

## 65. శ్రీ శూలినీ ధ్యానము

(తత్కల్పము ననుసరించినది)

బిభ్రాణా శూలబాణాస్యరిసదరగదా
పాశచాపాన్ కరాగ్రై
ర్మేఘశ్యామా కిరీటోల్లసితజలధరా
భీషణా భూషణాఢ్యా ।
సింహస్కంధాధిరూఢా చతసృభిరసిఖే
టాన్వితాభిః పరీతా
కన్యాభి ర్భిన్నదైత్యా భవతు భవభయ
ధ్వంసినీ శూలినీ నః ॥

శ్రీ శూలినీదేవి కుడిభాగమున క్రిందినుండి పైకి క్రమమున శూలమును 1, కత్తిని 2, చక్రమును 3, బాణమును 4, అట్లే ఎడమ భాగమున పాశమును, గదను 2, శంఖమును 3, వింటిని 4, ధరించి అష్టభుజయై యుండును.

మేఘమువలె, నల్లని శరీరకాంతులతో, కిరీటమునందు మెరయుచున్న మేఘములతో, వివిధ మణిమయ భూషణములతో కూడినను భయంకరురాలై, సింహస్కంధము నధిష్ఠించి, కత్తి 1, డాలు 2, అను వానిని ధరించిన నల్వురు కన్యలచేత చుట్టబడి దానవులను మర్దించునట్టి శ్రీ శూలినీదేవి మా సంసార భయమును నాశనమును చేయునుగాక.

(మేఘశ్యామ వర్ణము)

## 66. శ్రీ ధూమావతీ ధ్యానము

రక్తాంగీం రక్తవస్త్రాం కరికరవిలస
త్కుండలాం చండదంష్ట్రాం
కంఠోద్యద్రుండమాలాం పరిసరవిలస
చ్ఛేభి పైశాచబృందామ్ ।

ఘోరాం ఘోరాట్టహాసాం కరకలితకపా
లాసిరౌద్రాం త్రిణేత్రాం
శత్రూణాం ప్రాణహంత్రీం శశిశిశుమకుటాం
భావయే ధూమ్రకాళీమ్ ॥

శ్రీ ధూమావతి ఎఱ్ఱని శరీరకాంతులతో, ఎఱ్ఱని వస్త్రములతో, ఏనుగుతొండముల వలె ప్రకాశించు చెవులకుండలములతో, భయంకరములగు కోరలతో, కంఠమందు ధరింపబడిన కపాలమాలలతో, పరిసర ప్రదేశమునందు (తనచుట్టు) గంతులువైచుచున్న (ఆడుచున్న) పిశాచముల గుంపులతో, భయమును కలగించు పెదబొబ్బనవ్వులతో నుండును.

కుడిచేతియందు కత్తిని, ఎడమచేతియందు కపాలమును ధరించి, మూడునేత్రములు కలిగి, బాలచంద్రరేఖగల కిరీటమును ధరించి శత్రువులను చంపు ధూమకాళీదేవిని భావింపవలెను. (రక్తవర్ణము)

## 67. శ్రీ వశ్యముఖీ ధ్యానము

సంధాయ సుమనోబాణం కర్షతి మైక్షవం ధనుః
జగజ్జైత్రీం జపారక్తాం దేవీం వశ్యముఖీం భజే ॥

పుష్పంబాణమును సంధించిన చెఱకువింటిలో, ముజ్జగములను జయించుచు జపాపుష్పము వలె, ఎఱ్ఱని శరీరకాంతులతో నున్న శ్రీవశ్యముఖీదేవిని నేను భజించుచున్నాను. (రక్తవర్ణము)

## 68. శ్రీ ఉగ్రతారా ధ్యానము

(ఆమ్నాయము ననుసరించినది)

ప్రత్యాలీఢపదార్పితాంఘ్రిశవహృ
ద్ఘోరాట్టహాసా పరా
ఖడ్గేందీవరకర్త్రికర్పరభుజా
హుంకారబీజోద్భవా ।
ఖర్వానీలవిశాలపింగలజటా
జూటోగ్రనాగైర్యుతా

జాడ్యం న్యస్య కపాలకే త్రిజగతాం
హంత్యుగ్రతారా స్వయమ్ ॥

ఉగ్రతారాదేవి ప్రత్యాలీఢమ్ముద్ర గల పాదములతో, త్రొక్కిపట్టిన శవముతో, భయంకరమైన అట్టహాసముకలదియై కుడివైపున క్రిందినుండి పైకి క్రమమున ఖడ్గము 1, నల్లకలువను 2, అట్లే ఎడమవైపున కపాలమును 1, శంఖమును 2, నాల్గు చేతులయందు ధరించును.

హుంకారబీజమునుండి ఉద్భవించినదై, పొట్టివి, మిక్కిలి నల్లనివి, కొన్నిపొడవైనవి, లేతపసుపురంగుగలవి (మరికొన్ని) అగు జడలతో ముడిచుట్టి, భయంకరమగు పాములను ధరించి, కపాలమందు మాంద్యమును ఉంచిన ఉగ్రతారాదేవి స్వయముగా మూడులోకములను మర్దించునదై యున్నది. (సింధూరవర్ణము)

## 69. శ్రీ కురుకుల్లా ధ్యానమ్

తత్ర నౌకేశ్వరీ దేవీ కురుకుల్లేతి విశ్రుతా
తమాలశ్యామలాకారా శ్యామకంచుకధారిణీ ॥
రత్నారిత్రకరా నిత్య ముల్లసన్మదమాంసలా
పరితో భ్రామ్యతి మునే మణినౌకాధిరోహిణీ ॥

ఓమునీ! కురుకుల్ల అని ప్రసిద్ధురాలైన నౌకేశ్వరీదేవి మణిమయమగు పడవను ఎక్కి ఉండును. ఆమె చీకటిచెట్టువలె నల్లని శరీరకాంతి కలిగియుండును. నల్లని కంచుకమును (రవికను) ధరించును.

ఈమె రెండు చేతులతో పడవను నడుపుటకు రత్నమయమైన తెడ్డును ధరించి గొప్పయౌవనమదముతో బలిసిన శరీరముగలిగి అంతటా తిరుగుచుండును.

(నీలవర్ణము)

## 70. శ్రీ వారుణీ ధ్యానము

(లలితోపాఖ్యానము ననుసరించి)

సాక్షాచ్చ వారుణీ దేవీ తత్ర నౌకాధినాయికా
యాం సుధామాలినీ మాహుర్యా మాహుర్ రహస్యత్రేశ్వరీమ్ ॥

సా తత్ర మణినౌకాస్థా శక్తిసేనాసమావృతా
ఈషదాలోకమాత్రేణ త్రైలోక్యమందదాయినీ ॥

తరుణాదిత్యసంకాశా మదరక్తకపోలభూః
పారిజాతప్రసూనాస్రక్పరివీతకచోచ్ఛ్రయా ॥

వహంతీ మదిరాపూర్ణం చషకం లోలదుత్పలమ్
పక్వం పిశితఖండం చ మణిపాత్రే త థాన్యకే ॥

వారుణీతరణిశ్రేణీనాయికా తత్ర రాజతే ॥

సుధామాలిని యని, అమృతేశ్వరి యని కొనియాడబడుచున్న శ్రీ వారుణీదేవి ప్రత్యక్షముగా ఓడలకు అధినాయకురాలు. ఆమె మణిమయమగు నోడయందు నివసించుచు శక్తి సేనలతో చుట్టబడియుండును. ఆమె క్రీగంటితో చూచినమాత్రాన మూడు లోకములు సమ్మోహమును పొందును. లేతసూర్యునివలె ఎఱ్ఱనైన శరీరకాంతులతో, మదమువలన ఎఱ్ఱనైన చెక్కిళ్ళతో, పారిజాతవృక్షముల పూలదండలతో నలంకరింపబడిన జుట్టుముడితో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి కదలుచున్న నల్లకలువను 1, వండిన మాంసఖండముతో నింపబడిన మణిపాత్రమును 2, అట్లే ఎడమవైపున మద్యముతో నింపబడిన పాత్రమును 1, వండిన మాంసఖండముతో నింపబడిన మణిపాత్రమును 2, నాల్గు చేతుల యందు ధరించి వారుణికి, (మద్యమునకు) నౌకాసమూహములకు నాయికయై శ్రీ వారుణీ దేవి ప్రకాశించుచున్నది. (రక్తవర్ణము)

## 71. శ్రీ అపరాజితా ధ్యానము

(నారదసంహితలోనిది)

నీలోత్పలనిభాం దేవీం నిద్రాముద్రితలోచనామ్
నీలకుంచితకేశాగ్రాం నిమ్ననాభీవళిత్రయామ్ ॥

వరాభయకరాంభోజాం ప్రణతార్తివినాశినీమ్
పీతాంబరవరోపేతాం భూషణస్రగ్విభూషితామ్ ॥

పరశక్త్యాకృతిం సౌమ్యాం పరసైన్యప్రభంజనీమ్
శంఖచక్రగదాభీతిరమ్యహస్తాం త్రిలోచనామ్ ॥
సర్వకామప్రదాం దేవీం ధ్యాయేత్తామపరాజితామ్ ॥

నల్ల కలువవంటి శరీరకాంతి, నిద్రచేత మూయబడిన కన్నులు, నల్లనివి, వంక కలుగల వెంట్రుకలు, లోతైన పొక్కిలి (బొడ్డు), మూడు మడతలుగల పొట్ట, పచ్చని వస్త్రములు, మణిమయ సువర్ణభూషణములు, చక్కని పూల మాలలు, కలిగి అపరాజితా దేవి ప్రకాశించుచుండును.

ఈమె భక్తుల బాధలను తొలగించును. శక్తిరూపముతో నుండును. సాధురూపమున సౌమ్యభావముతో నున్నను శత్రుసైన్యములను నశింపజేయును.

కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, చక్రమును 2, అట్లే ఎడమ వైపున గదను 1, శంఖమును 2, నాల్గుచేతులయందు ధరించును. మూడుకన్నులతో నుండును. ఎల్ల కోరికలను ఇచ్చును. కావున నీ అపరాజితాదేవిని ధ్యానింపవలెను.

(నీలవర్ణము)

## 72. శ్రీ శత్రువిధ్వంసినీ ధ్యానము

(సుదర్శనసంహిత ననుసరించినది)

శత్రువిధ్వంసినీ రౌద్రా త్రిశిరా రక్తలోచనా
అగ్నిజ్వాలా రౌద్రముఖీ ఘోరదంష్ట్రా త్రిలోచనా ॥
దిగంబరా రక్తకేశీ రక్తపాణి ర్మహోదరీ
ఏతై రావిష్కృతై ర్ఘోరైః శీఘ్రముచ్చాటయే ద్విషః ॥

శ్రీ శత్రువిధ్వంసినీదేవి భయంకరమగు రూపముతో, మూడు శిరములతో, ఎఱ్ఱనగు మూడు మూడు కన్నులతో, అగ్నిజ్వాలలతో, భయంకరములగు కోరలతో, ఎఱ్ఱని వెంట్రుకలు, చేతులు కలిగి, లావైన ఉదరము కలిగి, దిగంబరురాలై ఉండును.

ఈ భయంకరములగు లక్షణములచేత ఈమె శత్రువులను వెంటనే నశింపజేయును.

(నీల వర్ణము)

## 73. శ్రీ స్వస్థావేశిని ధ్యానము
(అహిర్బుధ్న్యసంహిత ననుసరించి)

రక్తాంగీం శవవాసినీం త్రిశిరసం
రౌద్రీం మహాభైరవీం
ధూమ్రాక్షీం భయహారిణీం ఘనశిఖా
నీలాలకాలంకృతామ్ ।
ఢక్కాశూలధరాం మహాబలరిపు
ధ్వంసాం కృశాంగీం మహా
భీమాంగీం త్రిజటాం దవానలమయీం
ధ్యాయే పినాకిస్తుతామ్ ॥

ఎఱ్ఱని శరీరచ్ఛాయలుకల శ్రీస్వస్థావేశినీదేవి శవములను వస్త్రములుగా ధరించును. మూడు శిరములతో, రౌద్రరూపముతో, నీలలోహితములైన (నలుపు ఎఱుపు కలసిన రంగుతోనున్న) కన్నులతో, గొప్పజుట్టు, నల్లనిముంగురుల మూడుజడలతో, కుడిపైపున ఢక్కను, ఎడమపైపున శూలమును, ధరించిన రెండు చేతులతో నుండును.

సన్ననిదైనను భయంకరమగు శరీరముతో, దావాగ్నిజ్వాలలతో, మహాభైరవియై గొప్పబలముగల శత్రువుల నెల్లరను చంపగల శక్తికలదై పినాక మను నాయుధముతో లోకములను జయించు రుద్రునిచే గూడ ప్రశంసింపబడుచున్న శ్రీ స్వస్థావేశినీదేవిని ధ్యానింతును. (రక్తవర్ణము)

## 74. శ్రీ దండనాథావారాహీ ధ్యానము
(లలితోపాఖ్యానము ననుసరించి)

దండనాథా తత్ర దేవీ శతస్తంభాఢ్యమంటపే
కార్తస్వరమయాంభోజకర్ణికామధ్యసంస్థితమ్ ॥

బిందుత్రికోణవృత్తాఢ్యం షడ్దలం వృత్తయుగ్మకమ్
చక్రం విరాజతే తత్ర తప్తకాంచనసన్నిభా ॥

సంధ్యారుణలసచ్చేలా సర్వాభరణమండితా
శంఖచక్రాభయవరాన్ హలం చ ముసలం తథా ॥

పాశాంకుశౌ చ దధతీ చంద్రరేఖావతంసినీ
వారాహవక్త్రసంయుక్తా దండినీ తత్ర వర్తతే ॥

నూరు స్తంభములు కలిగిన మంటపమధ్యభాగమునందు బంగారుపద్మ ముండును. దానికర్ణికల నడుమ రెండువృత్తము లుండును. వాని నడుమ ఆరుదళములు, వానినడుమ బిందు వుండును. ఇది బిందుత్రికోణవృత్తము కలది. షడ్దళము. వృత్త యుగ్మము. ఇట్టి చక్రము ఉండును.

అట్టి చక్రమునందు మేలిమి బంగరువంటి శరీరచ్ఛాయలతో సంధ్యాకాంతులవలె ఎఱ్ఱనైన వస్త్రములతో, మణిమయములగు బంగారునగలతో, కుడిభాగమున క్రిందినుండి పైకి క్రమమున అభయముద్రను 1, అంకుశమును 2, నాగలిని 3, చక్రమును 4, అట్లే ఎడమభాగమున వరదముద్రను 1, పాశమును 2, రోకలిని 3, శంఖమును 4, ధరించిన ఎనిమిది చేతులతో, బాలచంద్రుని శిరోభూషణముగా ధరించి వరాహముఖము కలిగిన దండిని యగు శ్రీ దండనాథాదేవి ప్రకాశించును. (కనకవర్ణము)

## 75. శ్రీ స్వప్నవారాహీ ధ్యానము

(తత్కల్పము ననుసరించినది)

మేఘశ్యామరుచిం మనోహరకుచాం
నేత్రత్రయోద్భాసినీం
కోలాస్యాం శశిశేఖరా మభిలస
ద్దంష్ట్రాప్రభాశోభినీమ్ ।
బిభ్రాణాం స్వకరాంబుజై రసిలతాం
చర్మాపి పాశం సృణిం
వారాహీ మనుచింతయే ద్ధయవరా
రూఢాం శుభాలంకృతామ్ ॥

శ్రీ స్వప్నవారాహి మేఘమువలె నల్లనగు శరీరచ్ఛాయలతో, చక్కని స్తనధారముతో, మూడు కన్నులతో, వరాహముఖముతో, నెలవంక శిరోభూషణముతో, ప్రకాశించుచున్న కోరలకాంతులతో నుండును.

రెండు కుడిచేతులయందు క్రిందినుండి పైకి కత్తిని 1, అంకుశమును 2, అట్లే ఎడమవైపున ఖేటమును 1, పాశమును 2, ధరించి చతుర్బాహువై గుఱ్ఱమును అధిష్ఠించి శుభాలంకారములుకల శ్రీ స్వప్నవారాహీదేవిని దినదినము ధ్యానింపవలెను.

(మేఘశ్యామవర్ణము)

## 76. శ్రీ శుద్ధవారాహీధ్యానము

(వారాహీ కల్పమునుండి)

దంష్ట్రోజ్జ్వలద్వరాహాస్యాం రక్తవస్త్రోత్తరీయకామ్
శూలం కపాలం ముసలం నాగం హస్తైస్తు బిభ్రతీమ్ ॥

ఇందురేఖాలసన్మౌళిం వారాహీం తాం వంహం భజే ॥

ప్రకాశించు కోరలుగల వరాహవదనముతో, ఎఱ్ఱని వస్త్రములతో, కుడివైపున క్రిందినుండి పైకి శూలమును 1, ముసలమును 2, అట్లే ఎడమవైపున కపాలమును 1, నాగమును 2, ధరించి చతుర్బాహువై చంద్రుని రేఖను శిరోభూషణముగా నలంకరించిన శ్రీవారాహీదేవిని నేను భజించుచున్నాను. (నీలవర్ణము)

## 77. శ్రీ లఘుశ్యామలా ధ్యానము

(శ్యామలాకల్పము ననుసరించి)

స్మరే ప్రథమపుష్పిణీం రుధిరబిందుశోణాంబరాం
గృహీతమధుపాత్రికాం మదవిఘూర్ణనేత్రాంచలామ్ ।
కరస్ఫురితవల్లకీం విమలశంఖతాటంకినీం
ఘనస్తనభరాలసాం గలితచూలికాం శ్యామలామ్ ॥

ప్రథమరజస్వలమైనదియు నుకనే రక్తబిందువుల చేత ఎఱ్ఱనగు వస్త్రములు కలిగి, మధుకలశమును చేత ధరించి, మదమత్తురాలగుటచేత తిరుగుచున్న కన్నులతో,

శంఖములు పొదిగిన కర్ణాభరణములతో, వీణను మ్రోగించుచు గొప్ప స్తనభారముచేత అలసురాలగు, జారిన కేశపాశములుగల శ్రీ శ్యామలాదేవిని స్మరింపవలెను.

(శ్యామవర్ణము)

## 78. శ్రీ రాజమాతంగీ ధ్యానము

(తత్కల్పము ననుసరించి)

రత్నాసనాం శ్యామగాత్రీం శృణ్వంతీం శుకజల్పితమ్
అబ్జన్యస్తైకచరణాం చారుచంద్రావతంసకామ్ ॥

వీణా మాలాపయంతీం చ తిలకోద్భాసిఫాలికామ్
సౌగంధికస్రక్కలికాచూలికాం రక్తవాససమ్ ॥

విభూషణై ర్భూషితాం చ మాతంగీం ప్రణమా మ్యహమ్ ॥

రత్నములు పొదిగిన సింహాసనమునందు నల్లని శరీరకాంతితో, ఒకపాదమును తామర పూవునందు మోపి, శిరోభూషణముగా చంద్రుని ధరించి, తిలకమును బెట్టి, సౌగంధిక పుష్పములతో కేశపాశము (జడను) నలంకరించి, ఎఱ్ఱని వస్త్రములతో, వివిధ మణిమయ భూషణములతో, లీలాశుకముయొక్క (పెంపుడు చిలుకయొక్క) ముద్దుపల్కులను వినుచు, వీణను మ్రోగించుచున్న శ్రీ రాజమాతంగిదేవిని నేను నమస్కరించుచున్నాను.

(శ్యామవర్ణము)

## 79. శ్రీ బాలా ధ్యానము

(త్రిపురసుందరీ కల్పమునుండి)

జపాకుసుమసంకాశా పుల్లపద్మాసనస్థితా
అక్షస్రక్పుస్తకాభీతివరహస్తా తు బాలికా ॥

శ్రీ బాలికాదేవి జపాపుష్పమువలె ఎఱ్ఱనైన శరీరచ్ఛాయలతో, వికసించిన పద్మమునందు కూర్చుండి కుడివైపున క్రిందినుండి పైకి క్రమమున అభయముద్రను 1, జపమాలను 2, అట్లే ఎడమవైపున వరముద్రను 1, పుస్తకమును 2, ధరించి ఒప్పారుచుండును.

(రక్తవర్ణము)

## 80. శ్రీ భువనేశ్వరీ ధ్యానము

(మహాలక్ష్మీరత్నకోశమునుండి)

ఉద్యద్భాస్వత్సమాభాం విజితనవజపా
మిందుఖండావనద్ధాం
జ్యోతిర్మాలాం త్రినేత్రాం వివిధమణిలస
త్కుండలాం పద్మసంస్థామ్ ।
హారగ్రైవేయకాంచీమణిగణవలయైః
సంయుతా మంబరాఢ్యా
మహ్యాం పాశాంకుశాభ్యా మభయవరకరాం
భావయే భువనేశీమ్ ॥

శ్రీ భువనేశ్వరీదేవి ఉదయించుచున్న సూర్యునితో సమమగు శరీరకాంతులు కలిగి, కనకనే అప్పుడే విప్పారిన జపాపుష్పములను జయించినదియై, శిరోభూషణమైన చంద్రరేఖతో, నక్షత్రముల హారములతో, మూడు కన్నులతో, వివిధ మణిరత్నములు పొదిగిన బంగరు చెవిపోగులతో, హారములతో (బొమ్మన వ్రేలాడునవి) గ్రైవేయములతో, (మెడను హత్తుకొని ఉండునవి) కాంచీగుణముతో, (నడుమునందుండునది ఒడ్డాణము) మణివలయములతో, (మణికట్టునందుండు కంకణములు గాజులు) చక్కని వస్త్రములతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, అంకుశమును 2, అట్లే ఎడమ వైపున వరముద్రను 1, పాశమును 2, ధరించి చతుర్బాహువులతో, పద్మాసనమునందు ఉపవిష్టురాలయి (కూర్చుండి) ఎల్లదేవతలయందు ప్రప్రథమదేవతయగు శ్రీ భువనేశ్వరీదేవిని మానసమునందు భావింపవలయును. (రక్తవర్ణము)

## 81. శ్రీ మృతసంజీవినీ ధ్యానము

(రుద్రయామళకుహూకల్పము ననుసరించి)

మృతసంజీవినీం దేవీం శాంతరూపాం చ బిభ్రతీమ్
పాశాహింద్రాంకుశగదాఖడ్గశూలవరాభయాన్ ॥

రక్తా వక్షభుజాం వందే ఫుల్లపద్మాసనాం శుభామ్ ॥

ప్రసన్నమైన రూపముతో కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, అంకుశమును 2, ఖడ్గమును 3, శూలమును 4, అట్లే ఎడమవైపున వరముద్రను 1, పాశమును 2, గదను 3, నాగమును 4, ధరించిన ఎనిమిది చేతులతో, వికసించిన పద్మ మునందున్న శుభురాలగు శ్రీ మృతసంజీవినీదేవిని నమస్కరింతును (రక్తవర్ణము)

## 82. శ్రీ బగలాదేవీ ధ్యానము

(తత్కల్పము ననుసరించినది)

చతుర్భుజాం త్రిణయనాం
కమలాసనసంస్థితామ్
త్రిశూలం పానపాత్రం చ
గదాం జిహ్వాం చ బిభ్రతీమ్ ॥

బింబోష్ఠీం కంబుకంఠీం చ
సమపీనపయోధరామ్
పీతాంబరాం మదాఘూర్ణాం
ధ్యాయే బ్రహ్మాస్త్రదేవతామ్ ॥

కుడివైపున క్రిందినుండి పైకి త్రిశూలమును 1, జిహ్వను 2, అట్లే ఎడమ వైపున పానపాత్రమును , గదను 2, ధరించిన చతుర్బాహువులతో, మూడు కన్ను లతో, దొండపండువంటి క్రింది పెదవితో, శంఖమువలె చారలుగల సుందరమగు కంఠ ముతో, సమపీనోన్నతమగు చక్కని స్తనమండలముతో, పచ్చని బంగారు రంగుగల వస్త్రములతో, పద్మమునందు ఉపవిష్టురాలయి (కూర్చుండి) యౌవనాతిశయముచేత అలసురాలగు బ్రహ్మాస్త్రదేవి శ్రీ బగలాదేవిని ధ్యానింపవలెను. (పీతవర్ణము)

## 83. శ్రీ ప్రాణశక్తిదేవతా ధ్యానము

(శారదాతిలకము)

రక్తాంభోధిస్థపోతోల్లసదరుణసరో
జాధిరూఢా కరాబ్జైః
పాశం కోదండ మిక్షూద్భవ మలిగుణ మ
ప్యంకుశం పంచబాణాన్ ।

బిభ్రాణా ఒస్రుక్కపాలం త్రిణయనలసతా
పీనవక్షోరుహాఢ్యా
దేవీ బాలార్కవర్ణా భవతు సుఖకరీ
ప్రాణశక్తిః పరా నః ॥

శ్రీ ప్రాణశక్తి రక్తసముద్రమునందలి పడవయందు విప్పారిన ఎఱ్ఱతామర పూవును అధిష్ఠించినదై కుడివైపున క్రిందినుండి పైకి అంకుశమును 1, ఐదుబాణము లను 2, అట్లే ఎడమవైపున పాశమును 1, తుమ్మెదల నారిగాగల చెఱకు విల్లుని 2, నాల్గు చేతులయందు ధరించియుండును.

రక్తకపాలముల దండలతో, మూడు కన్నులతో, సమపీనోన్నతములైన స్తనము లతో, లేత సూర్యువలె ఎఱ్ఱనైన శరీరచ్ఛాయలతో, పరాదేవతయగు శ్రీ ప్రాణశక్తి మాకు సుఖమును కలిగించుగాక.
(రక్తవర్ణము)

## 84. శ్రీ శుద్ధవిద్యాదేవీ ధ్యానము
(సోమనాథవల్లీ మంత్రశాస్త్రము)

అక్షమాలాం పుస్తకం చ దధానా శ్వేతవిగ్రహా
చిన్ముద్రాభీతిహస్తా చ శుద్ధవిద్యా సదా ఒవతు ॥

కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, జ్ఞానముద్రను 2, అట్లే ఎడమ వైపున జపమాలను 1, పుస్తకమును 2, ధరించి చతుర్బాహువులతో, స్ఫటికమువలె తెల్లని విగ్రహము (మూర్తి)తో నున్న శ్రీ శుద్ధవిద్యాదేవి మమ్ముల నెల్లప్పుడు రక్షించుగాక.
(శ్వేతవర్ణము)

## 85. శ్రీ విద్యాదేవీ ధ్యానము
(మహాలక్ష్మీ రత్నకోశము)

ఆధారే తరుణార్కబింబవదనే హ్యత్యుగ్రదంష్ట్రాంకురే
వీణావాద అనంతభోగనిలయే వీణాదిగానప్రియే ।
నానావర్ణమయే నరాస్థిలులితే సువ్యక్తమాలాధరే
శ్రీవిద్యే త్వరితే మహార్థమహితే శ్రీశాంకరి త్వాం భజే ॥

ముజ్జగములకు ఆధారమైనదానా! లేత సూర్యబింబమువలె ప్రకాశించు మొగము కలదానా: మిక్కిలి భయంకరమగు కోరలుగలదానా! వీణను మ్రోగించువానా: మహా భోగములకు తావైనదానా! వీణ మున్నగువాని గానమునం దభిరుచి కలదానా! వివిధాక్షర ముల రూపమైనదానా! మనుష్యకపాలమును ధరించినదానా! ప్రసిద్ధమైన పూలమాలలను ధరించినదానా! గొప్పప్రయోజనములను ఇచ్చుటచేత మహితురాలా! శ్రీవిద్యవగు శాంకరీదేవీ! నీకు నమస్కారము. (చిత్రవర్ణము)

## 86. శ్రీ కామేశ్వరీ ధ్యానము

(మహాలక్ష్మీరత్నకోశము)

పంకజపాశేక్షుధనుః
కింశుకశాల్యగ్రపంచబాణధరామ్ ।
సతతాభయవరహస్తాం
కలయే కా మపి కలాధరా మంబామ్ ॥

కుడిభాగమున వరుసన క్రిందినుండి పైకి అభయముద్రను 1, వరికంకిని 2, పద్మమును 3, పంచ (పుష్ప) బాణములను 4, అట్లే ఎడమవైపున వరముద్రను 1, పాశమును 2, మోదుగు పువ్వును 3, చెఱకువింటిని 4, ధరించి అష్టబాహువైన శ్రీకళాధరయగు అంబకు నమస్కరింతును. (రక్తవర్ణము)

## 87. శ్రీ వనశంకరీదేవీ ధ్యానము

(పద్మపురాణము)

కల్పాంతానలకాయకాంతిసుభగాం
శూలం కపాలం శరం
చాపం చాపి వరాభయౌ చ పరిఘం
శంఖం చ చక్రం గదామ్ ।
బిభ్రాణాం శశిఖండశోభిమకుటాం
రత్నాంబరాలంకృతాం
వందే తాం వనశంకరీం త్రిణయనాం
వాగీశవిష్ణుస్తుతామ్ ॥

శ్రీ వనశంకరీదేవి కుడివైపున క్రిందినుండి పైకి వరుసన అభయముద్రను 1, శూలమును 2, పరిఘమును 3, చక్రమును 4, శరమును 5, అట్లే ఎడమవైపున వర ముద్రను 1, కపాలమును 2, గదను 3, శంఖమును 4, వింటిని 5, ధరించి పది చేతు లతో నుండును.

చంద్రరేఖాలంకారముగల కిరీటముతో, మణిమయములైన వస్త్రములతో, మూడు కన్నులతో, ప్రళయకాలమందలి అగ్నిచ్ఛాయలవలె ప్రకాశించు శరీరకాంతులతో, బ్రహ్మ, విష్ణువు మున్నగు దేవతలచేత స్తుతింపబడుచున్న శ్రీ వనశంకరీదేవికి నేను నమస్కరించుచున్నాను. (రక్తవర్ణము)

# 88. శ్రీ శాకంభరీ ధ్యానము

(పద్మపురాణము)

శూలం పాశకపాలచాపకులిశం
బాణాన్ సృణిం ఖేటకం
శంఖం చక్రగదాహిఖడ్గ మభయం
ఖట్వాంగదండం ధరామ్ ।
వర్షాభావవశా ద్గతాన్ మునిగణాన్
శాకేన యా ఽరక్షత
త్రైలోక్యా జననీం మహేశదయితాం
తాం స్తౌమి శాకంభరీమ్ ॥

శ్రీ శాకంభరీదేవి కుడిభాగమున క్రిందినుండి పైకి వరుసన అభయముద్రను 1, శూలమును 2, నాగమును 3, కులిశమును 4, ఖడ్గమును 5, అంకుశమును 6, బాణ మును 7, చక్రమును 8, అట్లే ఎడమవైపున కపాలమును 1, దండమును 2, గదను 3, ఖట్వాంగమును 4, ఖేటమును 5, పాశమును 6, వింటిని 7, శంఖమును 8, పదు నారు చేతులతో ధరించి యుండును.

అనావృష్టివలన (వర్షము లేకపోవుటచేత) మరణించిన మునిసమూహములను, పంటలచేత, పైరులచేత రక్షించిన, మూడు లోకములకు తల్లియగు, మహేశ్వరునకు ప్రియురాలగు శ్రీ శాకంభరీదేవిని స్తోత్రముచేయుచున్నాను. (రక్తవర్ణము)

# 89. శ్రీ సురాదేవీ ధ్యానమ్

(తత్కల్పము)

సురాసురై ర్మథ్యమానే క్షీరోదే సాగరోత్తమే
తత్రోత్పన్నాం సురాదేవీం కన్యకారూపధారిణీమ్ ॥

అష్టాదశభుజై ర్యుక్తాం రక్తాంతాయతలోచనామ్
శంఖం ఖడ్గం ధను శ్చైవ కపాలం ముసలం తథా ॥

శక్తిం గదాం వరం ఘంటాం దధానాం వామపాణిభిః
చక్రం ముష్టిం శరం శూలం లోహం ఖేటం చ తోమరమ్ ॥

అభయం భిండివాలం చ దధానాం దక్షిణై ర్భుజైః
త్రినేత్రాం దీర్ఘతన్వంగీం కాలాగ్నిసదృశీం భజేత్ ॥

మందరం వేష్టయిత్వా తు ఫేనిలావర్తభీషణమ్
గోమూత్రక్షీరవర్ణాభా కృష్ణరూపా పరా సురా ॥

త్రాసయం త్యసురాన్ సర్వాన్ దేవానా మభయంకరీ
యా సురా సా హ్యుమాదేవీ యన్మోహః స మహేశ్వరః ॥

దేవతలు, దానవులు ఒకప్పుడు పాలసముద్రమును చిలికిరి. అప్పుడాసముద్రము నుండి కన్యకారూపముతో సురాదేవి పుట్టినది. ఆమెకు పదునెనిమిది చేతులు.

కుడివైపున క్రిందినుండి పైకి వరుసన అభయముద్రను 1, భిండివాలమును 2, లోహమను నాయుధమును 3, తోమరమును 4, ఖేటమును 5, శూలమును 6, బాణమును 7, ముష్టిని 8, చక్రమును 9, అట్లే ఎడమవైపున వరముద్రను 1, ఘంటను 2, గదను 3, శక్తిని 4, ఖడ్గమును 5, కపాలమును 6, వింటిని 7, రోకటిని 8, శంఖమును 9, పదునెనిమిది చేతులతో, ధరించును.

ఎఱ్ఱని కొనదుగల విశాలములగు మూడు కన్నులతో, పొడవగు సన్నని సుందరమగు శరీరముతో, పాలసముద్రమును చిలుకుచున్న మందరపర్వతమును చుట్టుముట్టి నురుగులతో, తరంగములతో, సుడులతో భయంకరమై, ఆవుల మూత్రమువలె కొన్ని

శాపుల, అప్పుపొలవలె కొన్నితావుల, నల్లనిరూపముతో రాక్షసులను భయపెట్టుచు దేవతలకు అభయము నిచ్చుచున్న పరాదేవతయగు నా సుర కేవలము ఉమాదేవియే.

ఇట్లు మిక్కిలి సౌందర్యరాశియగు నా సురాదేవిని చూచి మహేశ్వరుడు కూడ మోహపడెను.

(చిత్రవర్ణము)

## 90. శ్రీ చతుష్షష్టికళాదేవీ ధ్యానమ్

(శాబరతంత్రము)

హస్తైః పద్మం రథాంగం గుణ మథ హరిణం
పుస్తకం వర్ణమాలాం
టంకం శుభ్రం కపాలం వర మమృతలస
ద్ధేమకుంభం దధానామ్ ।
ముక్తావిద్యుత్పయోదస్ఫటికనవజపా
బంధురైః పంచవక్త్రై
స్త్ర్యక్షై-ర్వక్షోజనమ్రాం సకలశశినిభాం
శారదాం తాం నమామి ॥

శ్రీ చతుష్షష్టికళాదేవి కుడిభాగమున క్రిందినుండి పైకి వరుసన అమృతకలశము 1. అక్షమాలను 2. ఉలిని 3. పాశమును 4. చక్రమును 5. అట్లే ఎడమవైపున వరముద్రను 1. పుస్తకమును 2. లేడిని 3. తెల్లని కపాలమును 4. పద్మమును 5. పదిచేతులయందు ధరించును.

ముత్యము వలె కొంచెము తెల్లనై, మెఱుపుతీగ వలె పచ్చనై, మేఘము వలె నల్లనై, స్ఫటికము వలె మిక్కిలి తెల్లనై, జపాపుష్పము వలె ఎఱ్ఱనైన ఐదు మొగములతో, మూడు కన్నులతో, స్తనభారముచేత కొంచెము వంగి పున్నమచంద్రునివంటి మిక్కిలి తెల్లనైన శరీరకాంతులతో అరువదినాల్గు కళలకు అధిష్ఠాత్రియగు నా శారదాదేవిని నమస్కరించుచున్నాను.

(ధవళవర్ణము)

## 91. శ్రీ సర్వవర్ణేశ్వరీ ధ్యానము

(సిద్ధశాబరతంత్రము)

అక్షస్రజం హరిణపోత ముదగ్రటంకం
విద్యాం కరై రవిరతం దధతీం త్రిణేత్రామ్ ।
అర్ధేందుమౌళి మరుణా మరవిందవాసాం
వర్ణేశ్వరీం ప్రణమత స్తనభారనమ్రామ్ ॥

కుడిభాగమున క్రింది నుండి పైకి విద్యాముద్రను 1, జపమాలను 2, అట్లే ఎడమ భాగమున పదునైన ఉలిని 1, లేడిపిల్లను 2, ధరించిన నాల్గు చేతులతో, మూడు కన్నులతో, శిరమున నెలవంక (బాలచంద్రుడు) భూషణములో, ఎఱ్ఱని శరీరకాంతితో, ఎఱ్ఱతామర పూవువంటి వస్త్రములతో, స్తనభారముచేత కొంచెము వంగిన శరీరముగల శ్రీవర్ణేశ్వరీ దేవిని మీరెల్లరు నమస్కరింపుడు. (అరుణవర్ణము)

## 92. శ్రీ ద్వాదశార్ధదేవి ధ్యానము

(మహాలక్ష్మీ రత్నకోశము)

పంచవక్త్రాం త్రిణేత్రాం చ శవస్థాం రక్తవర్ణకామ్
రక్తకంజశిరోమాలాం చంద్రరేఖావతంసకామ్ ॥

అక్షమాలాంకుశవరత్రిశూలకుసుమాశుగాన్
పాశేక్షుచాప మభయయుక్కపాలం పుస్తకం తథా ॥

ధారయంతీం ద్వాదశార్ధదేవీం తాం ప్రణమా మ్యహమ్ ॥

శ్రీ ద్వాదశార్ధదేవి కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, త్రిశూలమును 2, అంకుశమును 3, అక్షమాలను 4, పుష్పబాణమును 5, అట్లే ఎడమభాగమున వరముద్రను 1, కపాలమును 2, పాశమును 3. పుస్తకమును 4, చెఱకువింటిని 5, ధరించును.

ఇట్లు పదిచేతులతో, ఐదు మొగములతో, ప్రతి ముఖమునందు మూడు మూడు కన్నులతో, ఎఱ్ఱని శరీరకాంతులతో, ఎఱ్ఱని తామరపూల దండను, తెల్లని చంద్రరేఖను ధరించిన శిరముతో, శవములయందు నివసించుచున్న శ్రీ ద్వాదశార్ధదేవికి నేను నమస్కరించుచున్నాను. (రక్తవర్ణము)

## 93. శ్రీ తిరస్కరిణీదేవీ ధ్యానము

(మహాలక్ష్మీ రత్నకోశము)

నీలవాజిసమారూఢా నీలాంగీ ఖడ్గధారిణీ
నిద్రానిమీలద్భువనా తిరస్కరిణి కావతు ॥

నల్లని శరీరకాంతులతో నల్లని గుఱ్ఱమును ఎక్కి, ఖడ్గమును ధరించి, సకల జగములను నిద్రచేత కన్నులు మూయువానినిగా చేయుచు, తన ప్రభావముచేత జనులనెల్లరను నిద్రించువారలనుగా చేయుచున్న శ్రీ తిరస్కరిణీదేవి ఎల్లరను రక్షించుగాక ! (నీలవర్ణము)

## 94. శ్రీ అశ్వారూఢాదేవీ ధ్యానము

(మహాలక్ష్మీ రత్నకోశము)

అశ్వారూఢా కరాగ్రే నవకనకమయీం
వేత్రయష్టిం దధానా
దక్షే వామే ఒపి చైవం ఖలినతనులతా
పాశబద్ధా సుసాధ్యా ।
దేవీ నిత్యం ప్రసన్నా శశిధరవిలస
త్కేశపాశా త్రినేత్రా
దద్యా ద ద్యానవద్యా సకలసుఖకుల
ప్రాప్తి హృద్యాం శ్రియం నః ॥

కుడిచేతియందు బంగరుబెత్తమును1, ఎడమచేతియందు కళ్ళెమును2, ధరించి భక్తులకు సులభురాలై, ఎల్లప్పుడు అనుగ్రహము కలిగి చంద్రరేఖ ప్రకాశించు జుట్టుముడితో, మూడు కన్నులతో, పూజ్యురాలగు అశ్వారూఢాదేవి (గుఱ్ఱమును ఎక్కిన) ఎల్ల సుఖములతో కూడిన సంపదలను మాకు ఇచ్చునుగాక. (రక్తవర్ణము)

# 95. శ్రీ ఇంద్రాక్షీదేవీ ధ్యానము

(ఇంద్రాక్షీకల్పము)

ఇంద్రాక్షీం ద్విభుజాం దేవీం పీతవస్త్రద్వయాన్వితామ్
వామహస్తే వజ్రధరాం దక్షిణేన వరప్రదామ్ ॥
నమామి తాం (ఇంద్రాక్షీం సహ) సయువతీం
నానాలంకారభూషితామ్
ప్రసన్నవదనాంభోజా మప్సరోగణసేవితామ్ ॥

ఎడమవైపున వజ్రమును 1, కుడివైపున వరముద్రను 2, ధరించిన రెండు చేతులుకలదై, పచ్చనగు చీరను, ఉత్తరీయమును ధరించి, వివిధములైన భూషణము లను అలంకరించుకొని, పడుచుదనమున నున్న చెలిమికత్తెలతో, అప్సరఃస్త్రీలతో సేవింపబడుచున్న ఇంద్రాక్షీదేవిని నేను నమస్కరించుచున్నాను. (పీతవర్ణము)

# 96. శ్రీ తులజాభవానీ ధ్యానము

(తత్కల్పము)

రక్తాభ్రారుణాం శుభాంబరధరా
మానందపూర్ణాననాం
ముక్తాహారవిభూషణాం కుచభరా
క్రాంతాం సుకాంచీగుణామ్ ।
దేవీం దివ్యరసాన్నపూర్ణకలశా
మంభోజదర్వీకరాం
ధ్యాయే చ్ఛంకరవల్లభాం త్రిణయనా
మభ్రాలకాం సుందరీమ్ ॥

ఎఱ్ఱని శరీరకాంతులతో, శుభములనిచ్చు వస్త్రములతో, సంతోషము నిండిన మొగ ముతో, మంచిముత్తెముల దండలతో, స్తనభారముచే కలిగిన మెల్లని నడకలతో, అంద మైన బంగరు వడ్డాణముతో, ఎడమచేతియందు నాల్గువిధములగు అన్నములుకల బంగారు కలశముతో 1, కుడిచేతియందు కాడతోకూడిన తామరపూవువంటి గరిటతో 2, మూడు కన్ను లతో, మేఘము వలె నల్లనైన ముంగురులతో, సుందరమూర్తియగు శంకరుని ప్రియు రాలు శ్రీ భవానీదేవిని ధ్యానింపవలెను. (రక్తవర్ణము)

## 97. శ్రీ చంద్రాపరమేశ్వరీ ధ్యానము

(తత్కల్పము)

కరలసదరవిందా చారునేత్రారవిందా
నివసతు హృది చంద్రా స్మేరవక్త్రారవిందా ।
నిఖిలవిబుధబృందావంద్యపాదారవిందా
హ్యతిశయితమరందా మోదమాద్యన్మిళిందా ॥

కరధృతకరవాలా కాలదృష్ట్యా కరాళా
గతివిజితమరాళా పక్ష్మపంక్త్యా హ్యరాళా ।
వికచకమలమాలా యోగిసంగీతశీలా
వసతు రుచిరలీలా చంద్రికానందబాలా ॥

స్వర్ణవర్ణాం మహాదేవీం దివ్యసింహాసనే స్థితామ్
ధ్యాయేచ్చ వరదాం దేవీం చందిరాం పరమేశ్వరీమ్ ॥

ఎడమ చేతియందు ప్రకాశించుచున్న తామర పూవుతో, పద్మములవంటికన్నులతో, చిఱునవ్వు మొగముతో, దేవత లెల్లరు స్తుతించుచుండ సుగంధములచేత (వన పరిమళముచేత) తుమ్మెద గుంపులను సంతసపరచుచు కుడి చేతితో ఖడ్గమును ధరించుటచేత భయంకరురాలై, అంచల నడకలతో, తామర పూవుల దండలను ధరించి యోగులు గానము చేయుచుండ సుందరమూర్తి యగు శ్రీ చంద్రాపరమేశ్వరి నా హృదయమందు నివసించునుగాక :

దివ్యసింహాసనమునందు బంగారు వంటి శరీర కాంతులతో వరముల నిచ్చునట్టి శ్రీ చంద్రా పరమేశ్వరీ దేవిని ధ్యానింపవలెను. (శ్యామవర్ణము)

## 98. శ్రీ తులసీదేవీ ధ్యానము

(తులసీమాహాత్మ్యము)

ధ్యాయేచ్చ తులసీం దేవీం శ్యామాం కమలలోచనామ్
ప్రసన్నాం పద్మకల్హారవరాభయచతుర్భుజామ్ ॥

కిరీటహారకేయూరకుండలాదివిభూషితామ్
ధవళాంశుకసంయుక్తాం పద్మాసననిషేదుషీమ్ ॥

శ్రీ తులసీదేవి కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, పద్మమును 2, అట్లే ఎడమవైపున వరముద్రను 1, ఎఱ్ఱకలువ పూవును 2, ధరించును.

నల్లని శరీర కాంతులతో, పద్మమువంటి కన్నులతో, కిరీటము, హారములు (మెడలోనివి) కేయూరములు (దండగడియములు) కుండలములు (చెవుల పోగులు) మున్నగు భూషణములతో, తెల్లని వస్త్రములతో, తామర పువ్వును అధిష్ఠించియున్న శ్రీ తులసీ దేవిని ధ్యానింపవలెను. (శ్యామవర్ణము)

## 99. శ్రీ గాయత్రీ ధ్యానము

(మార్కండేయ పురాణము)

దేవీం పూర్వాహ్ణసంధ్యాయాం గాయత్రీం వహ్నిరూపిణీమ్
కుమారీం రక్తవస్త్రాంగీం రక్తస్రగనులేపనామ్ ॥

చతుర్భుజాం చతుర్వక్త్రాం వరదాం చాష్టలోచనామ్
పద్మాక్షమాలావలయం బిభ్రతీం దక్షిణే కరే ॥

వామే కమండలుం పాణౌ స్రువం సవ్యేతరే కరే
అభయం వామహస్తే చ పద్మపీఠే ప్రతిష్ఠితామ్ ॥

ఋగ్వేదరూపిణీం ప్రాతస్సవనాం హంసవాహనామ్
రసాయనాం చ బృహతీం గార్హపత్యే ప్రతిష్ఠితామ్ ॥

పూర్వాహ్ణమునందు (ఉదయము) గాయత్రి అను పేరుతో, వ్యవహరింపబడుచున్న ఈ దేవి అగ్నివలె ఎఱ్ఱగ నుండును. ఎఱ్ఱని వస్త్రములను ధరించినట్టి ఈ కుమారి ఎఱ్ఱని దండలతో, ఎఱ్ఱని మైపూతతో నుండును.

నాలుగు చేతులు, నాలుగు మొగములు, ఎనిమిది కన్నులు కలది. కుడివైపున క్రిందినుండి పైకి పద్మాక్షమాల (జపమాల)ను 1, స్రువమును 2, అట్లే ఎడమవైపున

అభయముద్రను 1, కమండలువును 2, నాల్గుచేతులయందు ధరించి పద్మ పీఠమునందు కూర్చుండును.

ఋగ్వేదరూపిణియై ప్రాతస్సవనము (యజ్ఞము) కలిగి హంసవాహనముతో నుండును. ఈమె రసాయనరూపిణియగు గొప్ప దేవత. మూడగ్నులలో నీమె గార్హపత్యమను అగ్నియందు ప్రతిష్ఠింపబడినది. (రక్తవర్ణము)

## 100. శ్రీ సావిత్రీ ధ్యానము
(మార్కండేయ పురాణము)

దేవీం మధ్యాహ్నసంధ్యాయాం సావిత్రీం రుద్రరూపిణీమ్
యువతీం శ్వేతవస్త్రాఢ్యాం శుక్లస్రగనులేపనామ్ ॥

చతుర్భుజాం చతుర్వక్త్రాం వరదాం ద్వాదశేక్షణామ్
రుద్రాక్షమాలావలయం బిభ్రతీం దక్షిణే కరే ॥

వామే కరే చ ఖట్వాంగం త్రిశూలం దక్షిణే కరే
వామే కరే ఒభయం దేవీం తథైవార్ధేందుధారిణీమ్ ॥

స్వర్ణపీఠే స్థితాం సౌమ్యాం యజుర్వేదస్వరూపిణీమ్
మధ్యందినాఖ్యసవనే సతీం గోవృషవాహనామ్ ॥

దక్షిణాగ్నిస్వరూపాం తాం ధ్యాయేన్నిత్యం విశుద్ధధీః ॥

మధ్యాహ్నమునందు సావిత్రి యను పేరుతో వ్యవహరింపబడుచున్న ఈ దేవి రుద్రరూపముతో యువతియై యుండును. తెల్లని వస్త్రములతో, తెల్లనిదండలతో, తెల్లని మైపూతతో, నాల్గు చేతులతో, నాల్గుముఖములతో, పండ్రెండు కన్నులతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి త్రిశూలమును 1, రుద్రాక్షలదండను 2, అల్లే ఎడమవైపున అభయముద్రను 1 ఖట్వాంగమును ధరించును.

ఈమె బంగారు పీఠమునందు యజుర్వేదరూపముతో, బాలచంద్రుని శిరమున ధరించి, మధ్యందినమను సవనము కలదియై వృషభవాహనము నధిష్ఠించి యుండును.

మూడగ్నులలో నీమె దక్షిణాగ్నిస్వరూపము కలది. పవిత్రమైన బుద్ధికలవారలు ఈ సావిత్రీదేవిని ధ్యానింపవలయును. (శుక్లవర్ణము)

## 101. శ్రీ సరస్వతీ ధ్యానము

(మార్కండేయ పురాణము)

సరస్వతీం తు సాయాహ్నే సంధ్యాయాం విష్ణురూపిణీమ్
స్థవిరేందీవరశ్యామాం నీలకుంచితమూర్ధజామ్ ॥

చతుర్భుజాం చైకవక్త్రాం పద్మపత్రాయతేక్షణామ్
శంఖం చక్రం గదాం చైవ తథై వాభయదం పునః ॥

పీతాంబరం దధానామ్ చ దివ్యస్రగనులేపనామ్
తృతీయసవనాఖ్యాం చ ధ్యాయే ద్వై విష్ణురూపిణీమ్ ॥

నీలపీఠే స్థితాం సౌమ్యే సామవేదస్వరూపిణీమ్
వరదాం గరుడస్థా (డారూఢా) మాహవనీయే వ్యవస్థితామ్॥

సాయంసంధ్యయందు (సాయంకాలమున) సరస్వతీనామముతో వ్యవహరింపబడు చున్న ఈమె విష్ణురూపము కలది. నల్లగలువవంటి శరీరకాంతితో, వంకరతిరిగిన నల్లని వెంట్రుకలతో, నాల్గు చేతులతో, ఒక్క మొగముతో, తామరపూరేకులవలె విశాలమగు రెండు పెద్ద కన్నులతో నుండును.

ఈమె కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, చక్రమును 2, అట్లే ఎడమవైపున గదను 1, శంఖమును 2, నాల్గు చేతులతో ధరించును.

పచ్చని బంగారువంటి వస్త్రములను గట్టి, దివ్యములగు దండలను, మైపూతలను ధరించుచు, సౌమ్యమగు నల్లని పీఠమునందు కూర్చుండి సామవేదస్వరూపముతో, గరుడ వాహనముతో, మూడవ సవనము కలిగి, మూడగ్నులలో ఆవాహనీయమను అగ్నియం దుండు శ్రీ సర్వతీదేవిని ధ్యానింపవలెను. (శ్యామవర్ణము)

## 102. శ్రీ ద్విభుజాన్నపూర్ణా ధ్యానము

(కారణాగమము)

వామే మాణిక్యపాత్రం మధురసభరితం
బిభ్రతీం పాణిపద్మే
దివ్యై రన్నైః ప్రపూర్ణాం ధృతమణివలయే
దక్షిణే రత్నదర్వీమ్ ।
రక్తాంగీం పీనతుంగస్తనభరవిలస
త్తారహారాం త్రిణేత్రాం
వందే పూర్ణేందుబింబప్రతినిధివదనా
మంబికా మన్నపూర్ణామ్ ॥

ఆరు రుచులు కలిగిన నాల్గు విధములైన అన్నములతో నిండిన మాణిక్య పాత్రమును ఎడమచేతను1, రత్నములు పొదిగిన బంగరు కంకణములు గల కుడిచేత గరిటను2, ధరించి ఎఱ్ఱని శరీరకాంతులతో, సమపీనోన్నతములైన స్తనములయందు ప్రకాశించు ముత్యాలహారములతో, మూడు కన్నులతో, నిండుచందురుని వంటి మొగముతో నున్న, జగన్మాతయగు నన్నపూర్ణాదేవిని నేను నమస్కరింతును. (రక్తవర్ణము)

## 103. శ్రీ చతుర్భుజాన్నపూర్ణా ధ్యానము

(కారణాగమము)

సిందూరాభాం త్రిణేత్రా మమృతశశికలాం
ఖేచరీం రక్తవస్త్రాం
పీనోత్తుంగస్తనాఢ్యా మభినవవిలస
ద్యౌవనారంభరమ్యామ్ ।
నానాలంకారయుక్తాం సరసిజనయనా
మిందుసంక్రాంతమూర్తిం
దేవీం పాశాంకుశాఢ్యా మభయవరకరా
మన్నపూర్ణాం నమామి ॥

ఈ అన్నపూర్ణాదేవి కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, అంకుశమును 2, అట్లే ఎడమభాగమున వరముద్రను 1, పాశమును 2, ధరించి చతుర్బాహువులతో నుండును.

సిందూరమువలె ఎఱ్ఱనగు శరరచ్ఛాయలతో, మూడు కన్నులతో, శిరోభూషణముగా ధరించిన అమృతమయుడగు చంద్రుని కళతో, క్రొత్త యౌవనముయొక్క ప్రారంభముతో, వివిధములగు భూషణములతో, పద్మములవంటి కన్నులతో, ఖేచరి (ఆకాశమునందు తిరుగునది) అగుటచేత చంద్రుని కలిసికొనిన విగ్రహముతో నొప్పారుచున్న అన్నపూర్ణాదేవిని నేను నమస్కరించుచున్నాను.

(సింధూరవర్ణము)

## 104. శ్రీ అగ్నిదుర్గా ధ్యానమ్

(శారదాతిలకము)

విద్యుద్దామసమప్రభాం మృగపతిస్కంధస్థితాం భీషణాం
కన్యాభిః కరవాలఖేటవిలసద్ధస్తాభి రాసేవితామ్ ।
హస్తై శ్చక్రవరాసిఖేటవిశిఖాం శ్చాపాంకుశౌ తర్జనీమ్
బిభ్రాణా మనలాత్మికాం శశిధరాం దుర్గాం త్రినేత్రాం భజే॥

ఈ అగ్నిదుర్గాదేవి కుడివైపున క్రిందినుండి పైకి వరుసన తర్జనిని 1, చక్రమును 2, కత్తిని 3, బాణమును 4, అట్లే ఎడమభాగమున వరముద్రను 1, అంకుశమును 2, ఖేటమును 3, వింటిని 4, ధరించిన ఎనిమిదిచేతులతో నుండును.

మెఱుపుతీగతో సమానమగు శరీరకాంతులతో, సింహవాహనముతో, కనుకనే భయంకరురాలై, కుడి ఎడమల రెండుచేతులతో కత్తిని 1, ఖేటమును 2, ధరించిన కన్యాజనములో, సేవింపబడుచు, చంద్రరేఖను ధరించిన శిరముతో, మూడు కన్నులతో నుందిన అగ్నికి అధిష్ఠానదేవతయగు శ్రీ దుర్గాదేవిని భజించుచున్నాను. (కనకవర్ణము)

## 105. శ్రీ శీతలాదేవీ ధ్యానమ్

(రుద్రయామలము)

ధ్యాయేచ్చ శీతలాం దేవీం రాసభస్థాం దిగంబరామ్
మార్జనీకలశోపేతాం శూర్పాలంకృతమస్తకామ్ ॥

దిగంబరయై (వస్త్రములులేనిది) రాసభమును (గాడిదను) ఎక్కి. కుడిచేతితో చీపురును 1, ఎడమచేతితో నీటిచెంబును 2, ధరించి శిరమునందు అలంకరింపబడిన చేట లతో నున్న శ్రీ శీతలాదేవిని భక్తులు ధ్యానింపవలెను. (కృష్ణవర్ణము)

## 106. శ్రీ లోపాముద్రాదేవతా ధ్యానము

(ఆమ్నాయము ననుసరించి)

పాశాంకుశౌ శరం చాపం
ధారయంతీం త్రిలోచనామ్ ।
సూర్యాభాం చంద్రచూడాం చ
లోపాముద్రాం భజే శివామ్ ॥

కుడిభాగమున క్రిందినుండి పైకి బాణమును 1, అంకుశమును 2. అట్లే ఎడమ భాగమున వింటిని 1, పాశమును 2, ధరించిన నాల్గు చేతులతో, మూడు కన్నులతో, సూర్యునివలె ప్రకాశించుచున్న శరీరచ్ఛాయలతో, శిరమునందు చంద్రరేఖతో నున్న శుభములనిచ్చు శ్రీలోపాముద్రాదేవిని నేను భజింతును. (సిందూరవర్ణము)

## శ్రీ అష్టమహాలక్ష్మీ స్వరూపములు

## 107. శ్రీ ద్విభుజాలక్ష్మీ ధ్యానము

(నృసింహ ప్రాసాదము)

హరే స్సమీపే కర్తవ్యా లక్ష్మీ స్తు ద్విభుజా నృప
దివ్యరూపా ఽంబుజకరా సర్వాభరణభూషితా ॥

ఓరాజా : రెండు చేతులయందు పద్మములున్న, మిక్కిలి దివ్యరూపముగల, ఎల్ల నగలచేత అలంకరింపబడిన ద్విభుజయగు లక్ష్మిని విష్ణుని విగ్రహముయొక్క సమీప ప్రదేశమునందు ప్రతిష్ఠింపవలెను. (హేమవర్ణము)

# 108. శ్రీ గజలక్ష్మి ధ్యానము

(పాంచరాత్రము)

లక్ష్మీః శుక్లాంబరా దేవీ రూపేణాప్రతిమా భువి
పృథ క్చతుర్భుజా కార్యా దేవీ సింహాసనే శుభా ॥

సింహాసనే ఽస్యాః కర్తవ్యం కమలం చారుకర్ణికమ్
అష్టపత్రం మహాభాగ కర్ణికాయాం సుసంస్థితా ॥

వినాయకవ దాసీనా దేవీ కార్యా చతుర్భుజా
బృహన్నాలం కరే కార్యం తస్యా శ్చ కమలం శుభమ్ ॥

దక్షిణే యాదవశ్రేష్ఠ కేయూరప్రాంతసుస్థితమ్
వామే ఽమృతఘటః కార్య స్తథా రాజన్ మనోహరః ॥

తస్యా అన్యౌ కరౌ కార్యౌ బిల్వశంఖధరౌ ద్విజ
ఆవర్జితకరం కార్యం తత్పృష్ఠే కుంజరద్వయమ్ ॥

దేవ్యా శ్చ మస్తకే కార్యం పద్మం చాపి మనోహరమ్ ॥

ఒక చక్కని సింహాసనమును నిర్మించి దానియందు ఎనిమిదిదళములుగల చక్కగ కర్ణికలతో నున్న తామరపూవును నిర్మింపవలెను. సాటిలేని రూపముగల లక్ష్మీదేవిని తెల్లని వస్త్రములతో, నాలుగు చేతులతో నిర్మింపవలెను. ఆమె ఆపద్మమునందు వినాయకునివలె కూర్చుండవలెను.

ఆమె నిజహస్తములలో కుడిచేతియందు పెద్దకాడగల పద్మమును1, నిర్మింపవలెను. ఆ పద్మము ఆకుడిచేతి దండగడియము వరకు ఉండవలెను. ఆమె ఎడమచేతియందు అందమైన అమృతకలశమును2, నిర్మింపవలయును. మారేడు పండును 1, శంఖమును 2, ధరించినట్లు పరహస్తములను నిర్మింపవలెను.

ఆ దేవీవిగ్రహము వెనుక రెండు ఏనుగులను నిర్మింపవలయును. ఆ ఏనుగుల తొండములు కొంచెము వంగి ఉండవలెను. ఆరెండు ఏనుగులు తమతొండములలో ఒక తామరపూవును ఆదేవి శిరమునందు ఉన్నట్లు పట్టుకొనవలయును. (స్వర్ణవర్ణము)

# 109. శ్రీ మహాలక్ష్మి ధ్యానము

(నృసింహ ప్రాసాదము-విశ్వకర్మ)

కొల్లాపురం వినా న్యత్ర మహాలక్ష్మీ ర్య దుచ్యతే
లక్ష్మీవ త్సా తదా కార్యా సర్వాభరణభూషితా ॥

దక్షిణాధఃకరే పాత్ర మూర్ధ్వే కౌమోదకీం తతః
వామోర్ధ్వే ఖేటకం చైవ శ్రీఫలం తదధఃకరే ॥

బిభ్రతీ మస్తకే లింగం పూజనీయా విభూతయే ॥

కొల్లాపురమను ఊరున తప్ప తక్కిన తావులయందు మహాలక్ష్మి నిర్మాణము చేయ దలచినచో ఈ క్రింది విధముగా ఆ విగ్రహ ముండవలయును.

పూర్వము చెప్పిన విధముగా అన్ని భూషణములతో, అలంకరింపబడినదై విగ్రహ ముండవలెను. క్రింది కుడిచేతియందు పాత్రము 1. పై కుడిచేతియందు కౌమోదకి అను గద2. ఉండవలెను. పై ఎడమచేతియందు ఖేటము1. క్రింది యెడమచేతి యందు మారేడు పండు 2. ఉండవలెను.

ఆ దేవీవిగ్రహముశిరమునందు ఒక లింగమును నిర్మింపవలెను. ఈ రూపముతో నున్న ఆ శ్రీమహాలక్ష్మిని సంపదలు కోరిన వారలు పూజింపవచ్చును. (స్వర్ణవర్ణము)

# 110. శ్రీ దేవీ ధ్యానము

(మయూఖము)

పాశాక్షమాలికాంభోజసృణిభిర్యామ్యసౌమ్యయోః
పద్మాసనస్థాం కుర్వీత శ్రియం త్రైలోక్యమాతరమ్ ॥

ఈ శ్రీదేవికి కుడిభాగమున క్రిందినుండి పైకి వరుసన జపమాలను 1. అంకుశ మును 2. అట్లే ఎడమ వైపున పద్మమును 1. పాశమును 2. ధరించినట్లు నాల్గుచేతులు ఉండవలెను. మూడు లోకములకు తల్లియగు లక్ష్మీదేవిని పద్మాసనమునందు ఉన్నట్లు నిర్మింపవలెను, (సువర్ణవర్ణము)

# 111. శ్రీ వీరలక్ష్మి ధ్యానము

(పాంచరాత్రము)

వీరలక్ష్మి రితి ఖ్యాతా వరదాభయహస్తినీ
ఊర్ధ్వపద్మద్వయౌ హస్తౌ తథా పద్మాసనే స్థితా ॥

శ్రీ వీరలక్ష్మిదేవి నిజహస్తములలో ఎడమచేతియందు వరముద్రను 1, కుడిచేతి యందు అభయముద్రను2, పరహస్తములు రెండింటియందు పద్మములను ధరించి పద్మాసనమునందు ఉండును. (సువర్ణవర్ణము)

# 112. శ్రీ ద్విభుజావీరలక్ష్మి ధ్యానము

(పాంచరాత్రము)

దక్షిణే త్వభయం బిభ్రత్యుత్తరే వరదం తథా
ఊరూ పద్మదళాకారౌ వీరశ్రీమూర్తిలక్షణమ్ ॥

ఈమె ద్విభుజ (రెండుచేతులుకలది). కుడిచేతియందు అభయముద్రను ఎడమ చేతియందు వరముద్రను ధరించును. ఊరువులు(తొడలు)పద్మదళములవలె నుండవలెను. కనుక ఈ ద్విభుజ యగు శ్రీ వీరలక్ష్మిదేవి వీరాసనమునం దుండును. (హేమవర్ణము)

# 113. శ్రీ అష్టభుజావీరలక్ష్మి ధ్యానము

(పాంచరాత్రము)

పాశాంకుశాక్షసూత్ర వరాభయగదా
పద్మపాత్రహస్తా కార్యా ॥ (హేమవర్ణః)

క్రిందినుండి పైకి కుడివైపున వరుసన అభయముద్రను 1, అక్షసూత్రమును 2, పద్మమును 3, అంకుశమును 4, అట్లే ఎడమవైపున క్రమమున వరముద్రను 1, పాత్రమును 2, గదను 3, పాశమును 4, ఎనిమిది చేతులతో ధరించి అష్టభుజ వీరలక్ష్మి ఉండును, (హేమవర్ణము)

# 114. శ్రీ ప్రసన్నలక్ష్మీ ధ్యానము

(అథర్వణరహస్యము).

వందే లక్ష్మీం పరశివమయీం శుద్ధజాంబూనదాభాం
తేజోరూపాం కనకవసనాం సర్వభూషోజ్జ్వలాంగీమ్ ।
బీజాపూరం కనకకలశం హేమపద్మే దధానా
మాద్యాం శక్తిం సకలజననీం విష్ణువామాంకసంస్థామ్ ॥

శ్రీ ప్రసన్నలక్ష్మీదేవి శ్రీ మహావిష్ణుని యెడమతొడయందు కూర్చుండును. నిజ హస్తములు రెంటియందు కుడియెడమల దానిమ్మపండును 1, బంగరు కలశమును 2, (పాత్రమును) పరహస్తములు రెంటియందు బంగారు పద్మములను ధరించును.

ఈమె పరశివుని తేజోరూపమైనది. మేలిమిబంగారువంటి శరీరచ్ఛాయలతో, బంగారువర్ణమగు పచ్చని వస్త్రములతో, అవయవము లన్నింటియందు అలంకరింపబడిన మణిమయములగు బంగారు నగలతో నొప్పారును.

ఇట్టి సకలలోకములకు తల్లియగు మొదటి శక్తియగు శ్రీ ప్రసన్నలక్ష్మిని నేను నమస్కరింతును.

# 115. శ్రీ విష్ణుపరివారశక్తులయొక్క ధ్యానము

(పద్మపురాణము)

సువర్ణనిభశోభా శ్రీః స్యాత్ సా భూ ర్దూర్వచ్ఛవిః
సరస్వతీ సితా రక్తా ప్రీతిః శ్యామనిభాకృతిః ॥

కీర్తీ రక్తా భవే చ్ఛాంతిః స్ఫాటికాభా సమీరితా
తుష్టిః పీతా భవేత్ పుష్టిః శ్యామా దేవ్య స్తు తాః స్మృతాః ॥

పద్మద్వయకరా శ్చైవ వరాభయకరా స్తు తాః ॥

శ్రీ విష్ణువుయొక్క పరివారదేవతలు ఎనమండుగురు. వీరు ఆ స్వామిని పరివేష్టించుకొని యుందురు. శ్రీదేవి 1, భూదేవి 2, సరస్వతీదేవి 3, ప్రీతిదేవి 4, కీర్తిదేవి 5, శాంతిదేవి 6, తుష్టిదేవి 7, పుష్టిదేవి 8, అని వారల పేరులు.

శ్రీదేవి బంగారుకాంతి 1, భూదేవి తెల్లనికాంతి 2 సరస్వతీదేవి తెలుపు ఎఱుపు కలిసిన పాటలకాంతి 3, ప్రీతిదేవి నల్లనికాంతి 4, కీర్తిదేవి ఎఱ్ఱనికాంతి 5, శాంతిదేవి స్ఫటికమువలె మిక్కిలి తెల్లనికాంతి 6, తుష్టిదేవి పసుపుపచ్చని కాంతి7, పుష్టిదేవి నల్లని కాంతి 8, కలిగి యుందురు.

వీర లెల్లరు నాల్గు చేతులు కలవారు. నిజహస్తములయందు కుడివైపున అభయముద్రను 1, ఎడమవైపున వరముద్రను 2, ధరించి యుందురు. రెండు పరహస్తములయందు రెండు తామరపూవులను పట్టుకొని యుందురు.

## 116. శ్రీ సౌభాగ్యభువనేశ్వరీ ధ్యానము

(శారదాతిలకము)

సిందూరారుణవిగ్రహాం త్రిణయనాం
మాణిక్యమౌళిస్ఫుర
త్తారానాయకశేఖరాం స్మితముఖీ
మాపీనవక్షోరుహామ్ ।
పాణిభ్యాం మణిపూర్ణరత్నచషకం
రక్తోత్పలం బిభ్రతీం
సౌమ్యాం రత్నఘటస్థసవ్యచరణాం
ధ్యాయే త్పరా మంబికామ్ ॥

సిందూరమువలె ఎఱ్ఱనైన శరీరకాంతులతో, మూడు కన్నులతో, రత్నములుగల శిరమునందు అలంకరింపబడిన చంద్రరేఖతో, చిఱునవ్వు లొలుకు మొగముతో, సమపీనోన్నతములగు స్తనములతో, కుడిచేతియందు రత్నములుపొదిగిన బంగారు గిన్నెను1, ఎడమచేతియందు ఎఱ్ఱని కలువపూవును 2, ధరించి రత్ననిధియందు ఉంచిన ఎడమపాదముతో నున్న పరాదేవతయగు అంబికాదేవిని ధ్యానింపవలెను. (సిందూరవర్ణము)

## 117. శ్రీ మాయాభువనేశ్వరీ ధ్యానము

(శారదాతిలకము)

శ్యామాంగీం శశిశేఖరాం నిజకరై
ర్దానం చ రక్తోత్పలం
రత్నాఢ్యం చషకం పరం భయహరం
సంబిభ్రతీం శాశ్వతీమ్ ।
ముక్తాహారలసత్పయోధరనతాం
నేత్రత్రయోల్లాసినీం
వందే ఽహం సురపూజితాం హరవధూం
రక్తారవిందస్థితామ్ ॥

శ్రీమాయాభువనేశ్వరీదేవి కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, ఎఱ్ఱకలువ పూవును 2, అట్లే ఎడమభాగమున వరదముద్రను1, రత్నములు గలగిన్నెను2, ధరించిన నాల్గుచేతులతో నుండును.

నల్లని శరీరకాంతులతో, శిరమున చంద్రరేఖతో, ముత్యాలసరములచేత అలంకరింపబడిన స్తనభారముతో, మూడు కన్నులతో, ఎఱ్ఱ తామరపూవునందు కూర్చుండి, దేవతలచేత పూజింపబడుచున్న పరమశివుని ప్రియురాలగు తల్లిని నేను నమస్కరించుచున్నాను.

(నీలవర్ణము)

## 118. శ్రీ వజ్రప్రస్తారిణీ ధ్యానము

(శారదాతిలకము)

రక్తాబ్ధౌ రక్తపోతే విదలితకమలా
భ్యంతరే సంనిషణ్ణాం
రక్తాంగీం రక్తమౌలిస్ఫురితశశికలాం
స్మేరవక్త్రాం త్రిణేత్రామ్ ।
బీజాపూరేషుపాశాంకుశముసలధను
స్సృక్కపాలాని హస్తై
ర్బిభ్రాణా మానతాంగీం స్తనభరనమితా
మంబికా మానమామి ॥

శ్రీ వజ్రప్రస్తారిణీదేవి క్రిందినుండి పైకి వరుసన కుడివైపున బాణమును 1, పూలదండను 2, దానిమ్మసందును 3, అంకుశమును 4, అట్లే ఎడమవైపున ధనుస్సును 1, కపాలమును 2, రోకలిని [3, పాశమును 4, ధరించిన ఎనిమిది హస్తములతో నుండును.

ఎఱ్ఱని శరీరకాంతులతో, ఎఱ్ఱని శిరమునందు ప్రకాశించుచున్న చంద్రరేఖతో, చిఱునవ్వు మొగముతో, మూడు కన్నులతో, స్తనభారముచేత కొంచెగ వంగినశరీరముతో రక్తసముద్రమునందలి ఎఱ్ఱని పడవయందు చక్కగ విప్పారిన తామరపూవునందు కూర్చుండిన జగన్మాతకు నేను నమస్కరించుచున్నాను. (రక్తవర్ణము)

## 119. శ్రీ త్రికంటకీదేవీ ధ్యానము
(శారదాతిలకము)

నీలా నాభేః రధస్తా దరుణరుచిధరా
కంఠదేశా త్సితా సా
వక్త్రై ర్దంష్ట్రాకరాళై రుదరపరిగతై
ర్భీషణాంగీ చతుర్భిః ।
దీపౌ కంబుం రథాంగం కరసరసీరుహై
ర్ధారయంతీ జటాంతః
స్ఫూర్జచ్ఛీతాంశుఖండా భవతు భయహరా
దేవతా చ త్రిణేత్రా ॥

శ్రీ త్రికంటకీదేవి నాభికి (పొక్కిలికి, బొడ్డునకు) క్రిందిభాగమున నల్లని శరీర కాంతులతో, మెడవరకు ఎఱ్ఱని కాంతులతో, పైభాగమున తెల్లనికాంతులతో, ఉదరము వరకు (పొట్టవరకు) వ్యాపించిన కోరలచేత భయమును గొలుపు నాల్గు మొగములతో నుండును.

నిజహస్తములగు కుడిఎడమలయందు చక్రమును 1, శంఖమును 2, మిగిలిన రెండుచేతులయందు దీపములను ధరించి చతుర్బాహువై శిరమున జటాజూటమునడుమ చంద్రరేఖ ప్రకాశించుచుండ, మూడు కన్నులతో నున్న శ్రీ త్రికంటకీదేవత మా భయములను పోగొట్టుగాక ! (చిత్రవర్ణము)

## 120. శ్రీ మోహినీనిత్యాదేవీ ధ్యానము

(శారదాతిలకము)

అర్ధేందుమౌళి మరుణా మమరాభివంద్యా
మంభోజపాశసృణిపూర్ణకపాలహస్తామ్ ।
రక్తాంగరాగవసనాభరణాం త్రిణేత్రాం
ధ్యాయే చ్ఛివస్య వనితాం మదవిహ్వలాంగీమ్ ॥

శ్రీ మోహినీ నిత్యాదేవి కుడిభాగమున క్రిందినుండి పైకి పద్మమును 1, అంకుశమును 2, అట్లే ఎడమభాగమున కపాలమును 1, పాశమును 2, నాల్గు చేతులయందు ధరించును.

చంద్రరేఖ ప్రకాశించు శిరముతో, ఎఱ్ఱని శరీరచ్ఛాయలతో, ఎఱ్ఱనైన మైపూతతో, వస్త్రములతో, ఆభరణములతో, మూడు కన్నులతో, మదిరచేత మదమత్తములగు అవయవములతో (కన్నుల మున్నగునవి) దేవతలచేత నుతింపబడుచున్న పరమశివుని ప్రియురాలగు శ్రీ మోహినీదేవిని ధ్యానింపవలెను. (రక్తవర్ణము)

## 121. శ్రీ జయదుర్గా ధ్యానము

(శారదాతిలకము)

కాలాం స్ఫారాం కటాక్షై రలికులభయదాం
మౌళిబద్ధేందురేఖాం
శంఖం చక్రం కృపాణం త్రిశిఖ మపి కరై
రుద్వహంతీం త్రిణేత్రామ్ ।
సింహస్కంధాధిరూఢాం త్రిభువన మఖిలం
తేజసా పూరయంతీం
ధ్యాయే ద్దుర్గాం జయాఖ్యాం త్రిదశపరివృతాం
సేవితాం సిద్ధకామైః ॥

శ్రీ జయదుర్గాదేవి కుడిభాగమున క్రిందినుండి పైకి కత్తిని 1, చక్రమును 2, ఆట్లే ఎడమవైపున త్రిశూలమును 1, శంఖమును 2, ధరించిన నాల్గుచేతులతో నుండును.

నల్లని శరీరకాంతులతో, తుమ్మెదల బారులవంటి క్రీగంటి చూపులతో, నెలవంకను (చంద్రరేఖను) అలంకరించిన శిరముతో, మూడు కన్నులతో, సింహవాహనముతో, ముజ్జగముల వ్యాపించిన తేజములతో, ఫలమును కోరినవారిచేత సేవింపబడుచు, దేవతాగణములచేత పరివేష్టింపబడిన శ్రీ జయదుర్గాదేవిని ధ్యానింపవలయును. (కృష్ణవర్ణము)

## 122. శ్రీ వింధ్యవాసినీదుర్గా ధ్యానము

(శారదాతిలకము)

సౌవర్ణాంబుజమధ్యగాం త్రినయనాం
సౌదామినీసన్నిభాం
శంఖం చక్రవరాభయాని దధతీ
మిందోః కలాం బిభ్రతీమ్ ।
గ్రైవేయాంగదహారకుండలధరా
మాఖండలాద్యై స్తుతాం
ధ్యాయే ద్వింధ్యనివాసినీం శశిముఖీం
పార్శ్వస్థపంచాననామ్ ॥

ఈ దేవి కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, చక్రమును 2, అట్లే ఎడమభాగమున వరముద్రను 1, శంఖమును 2, ధరించిన నాల్గుచేతులతో, మెఱపు తీగలవంటి బంగారు శరీరకాంతులతో నుండును.

శిరమునందు చంద్రకళతో, గ్రైవేయములతో (మెడను హత్తుకొనియుండునవి) హారములతో, (వక్షస్థలమునందు వ్రేలాడునవి) కుండలములతో, (చెవులపోగులు) పార్శ్వమునందున్న సింహముతో, బంగారు పద్మమునందు దేవేంద్రుడు మున్నగు వారిచేత స్తుతింపబడుచుండెడి శ్రీ వింధ్యవాసినీదేవిని ధ్యానింపవలెను. (కనకవర్ణము)

## 123. శ్రీ రిపుమారిణీదుర్గా ధ్యానమ్

(శారదాతిలకము)

తర్జనీం త్రిశిఖం దోర్భ్యాం ధారయంతీం భయంకరీమ్
రక్తాం ధ్యాత్వా రవే ర్బింబే ప్రజపే దయుతం మనుమ్ ॥

మారయే దచిరా దేవ రిపూన్ బంధుసమన్వితాన్ ॥

కుడిభాగమున తర్జనిని1, ఎడమభాగమున త్రిశూలమును2, ధరించి భయంకరురాలై ఎఱ్ఱని శరీరచ్ఛాయలతో నున్న శ్రీ రిపుమారిణీదేవిని సూర్యోదయసమయమున ధ్యానించి మనువు నుద్దేశించి (మన్మబ్రహ్మ మంత్రమును) పదివేలమారులు జపింపవలెను.

ఇట్లు జపించిన బంధువులతో గూడ శత్రువులు నశింతురు. (రక్తవర్ణము)

## 124. శ్రీ త్రిపురభైరవీ ధ్యానమ్

(శారదాతిలకము)

ఉద్యద్భానుసహస్రకాంతి మరుణ
క్షౌమాం శిరోమాలినీం
రక్తాలిప్తపయోధరాం జపవటీం
విద్యా మభీతిం వరమ్ ।
హస్తాబ్జై ర్దధతీం త్రిణేత్రవిలస
ద్వక్త్రారవిందశ్రియం
దేవీం బద్ధహిమాంశురత్నమకుటాం
వందే ఽరవిందస్థితామ్ ॥

కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, జపమాలను 2, అట్లే ఎడమ వైపున వరముద్రను 1, విద్యాముద్రను (పుస్తకమును) 2, ధరించిన నాల్గు చేతులతో, ఉదయించుచున్న వేయిసూర్యుల వెలుగువంటి శరీరకాంతులతో, ఎఱ్ఱని వస్త్రములతో, శిరమున ధరించిన పూలమాలలతో, రక్తముచేత పూయబడిన స్తనములతో, మూడు కన్నులతో, నెలవంక (చంద్రరేఖ) శిరోభూషణముతో పద్మమునందు ఉపవిష్టురాలగు (కూర్చుండిన) శ్రీ త్రిపురభైరవీదేవిని నేను నమస్కరింతును, (రక్తవర్ణము)

# 125. శ్రీ సంవిత్త్రిపురసుందరీ ధ్యానము

(శారదాతిలకము)

చంద్రావతంసకలితాం శరదిందుశుభ్రాం
పంచాశదక్షరమయీం హృది భావయే త్వామ్ ।
శ్రీపుస్తకం జపవటీ మమృతాఢ్యకుంభం
వ్యాఖ్యాం చ హస్తకమలై ర్దధతీం త్రిణేత్రామ్ ॥

ఈ దేవి కుడిభాగమున క్రిందినుండి పైకి జ్ఞానముద్రను1, జపమాలను 2, అట్లే ఎడమవైపున అమృతకలశమును 1, పుస్తకమును 2, నాల్గు చేతులతో ధరించును.

శరత్కాలమునందలి చంద్రునివలె తెల్లనైన శరీరకాంతులతో, మూడుకన్నులతో, శిరమునందు ప్రకాశించు చంద్రకళతో, అచ్చులు మొదలుకొని హల్లులవరకు గల ఏబది యక్షరముల గానముతో నున్న శ్రీ సంవిత్త్రిపురసుందరీదేవిని హృదయమునందు భావింపవలెను. (శ్వేతవర్ణము)

# 126. శ్రీ బాలాత్రిపురసుందరీ ధ్యానము

(శారదాకల్పము)

సద్యస్సముద్యతసహస్రదివాకరాభాం
విద్యాక్షసూత్రవరదాభయహస్తచిహ్నామ్ ।
నేత్రోత్పలై స్త్రిభి రలంకృతపద్మవక్త్రాం
త్వాం హారభారరుచిరాం త్రిపురే భజంతి ॥

కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, జపమాలను 2, అట్లే ఎడమభాగమున వరముద్రను 1, పుస్తకమును 2, ధరించిన చతుర్బాహువులతో అప్పుడే ఉదయించిన వేయి సూర్యులవలె నున్న శరీరకాంతులతో, మూడుకన్నులతో, వక్షస్థలమున ప్రకాశించు ముత్యాలదండలతో నున్న నిన్ను ఓ త్రిపురసుందరీదేవీ భక్తులు భజింతురు. (రక్తవర్ణము)

# 127. శ్రీ నిత్యాదేవీ ధ్యానము

(శారదాతిలకము)

నిత్యం భజే బాలశశాంకచూడాం
పాశాంకుశౌ కల్పలతాం కపాలమ్ ।
హస్తై ర్వహంతీ మరుణాం త్రిణేత్రా
మాస్ఫాలయంతీం కరవల్లకీమ్ తామ్ ॥

కుడిభాగమున క్రిందినుండి పైకి అంకుశమును 1, కల్పలతను 2, అట్లే ఎడమ భాగమున పాశమును 1, కపాలమును 2, ధరించి, రెండుకరములతో వీణను మ్రోగించుచు, ఆరు చేతులతో, మూడు కన్నులతో, శిరమునందు చంద్రరేఖతో, ఎఱ్ఱని శరీర చ్ఛాయలతో నున్న శ్రీ నిత్యాదేవిని నేను భజించుచున్నాను. (రక్తవర్ణము)

# 128. శ్రీ త్వరితాదేవీ ధ్యానము

(శారదాకల్పము)

శ్యామాం బర్హికలాపశేఖరయుతా
మాబద్ధపర్ణాంశుకాం
గుంజాహారలసత్పయోధరయుతా
మష్టాహిపాన్ బిభ్రతీమ్ ।
తాటంకాంగదమేఖలాం గుణరణ
న్మంజీరభాభూషితాం
కైరాతీం వరదాభయోద్యతకరాం
దేవీం త్రిణేత్రాం భజే ॥

కుడిచేతియందు అభయముద్రను 1, ఎడమచేతియందు వరముద్రను 2. ధరించి ద్విబాహువై, నల్లని శరీరచ్ఛాయలతో, నెమలి ఈకలను శిరమున ఆభరణముగా ధరించి, ఆకులను వస్త్రముగా కట్టి, చెవులపోగులను (తాటంక), దండగడియములను (అంగద), నడుమున వడ్డాణమును (మేఖల), పాదములకు అందెలను (మంజీర), గురివిందపేరులను (దండలను). వక్షస్థలమున వ్రేలాడునట్లు ధరించి, మూడు కన్నులతో కిరాతస్త్రీవలె నున్న శ్రీ త్వరితాదేవిని నేను భజించుచున్నాను. (శ్యామవర్ణము)

## 129. శ్రీ కాళరాత్రి ధ్యానము

(నృసింహ ప్రాసాదము)

ఏకవేణీ జపాకర్ణపూరా నగ్నా ఖరస్థితా
లంబోష్ఠీ కర్ణికాకర్ణీ తైలాభ్యక్తశరీరిణీ ।
వామపాదోల్లసల్లోహలతా కంటకభూషణా
వర్ధనమూర్ధధ్వజా కృష్ణా కాలరాత్రి ర్భయంకరీ ॥

వెంట్రుకలు ఒక్క జడగా అల్లి, జపాకుసుమములను చెవులకు అలంకరించి, దిసమొలతో, గాడిదవాహనముతో, వ్రేలాడుచున్న క్రింది పెదవితో, ఎడమపాదము నందు భూషణముగానున్న ఇనుపకడియముతో, వ్రేలాడుచున్న చెవులపోగులతో ముండ్ల వంటి నగలతో, నువ్వులనూనె పూయబడిన శరీరముతో, శిరమును (కపాలమును) ధ్వజముగా ధరించిన నల్లని శ్రీ కాళరాత్రిదేవి మిక్కిలి భయంకరమైనది. (నీలవర్ణము)

## 130. శ్రీ వాగీశ్వరీ ధ్యానము

(పాంచరాత్రము)

శ్వేతపద్మాసనారూఢా శుక్లవర్ణా చతుర్భుజా
జటామకుటసంయుక్తా రత్నకుండలమండితా ॥

యజ్ఞోపవీతినీ హారముక్తాభరణభూషితా
దుకూలవసనా దేవీ నేత్రత్రయసమన్వితా ॥

సుదండం దక్షిణే హస్తే వామహస్తే తు పుస్తకమ్
దక్షిణే చాక్షమాలాం చ కుండికాం వామహస్తకే ॥

వాగీశ్యాకృతి రాఖ్యాతా ॥

కుడిభాగమున క్రిందనుండి పైకి దండమును 1, జపమాలను 2, అట్లే ఎడమ భాగమున పుస్తకము1, కుండికను (కమండలువును)2, ధరించి నాల్గుచేతులతో, తెల్లని తామర పూవునందు కూర్చుండి తెల్లని శరీరకాంతులతో, జటాజూటముతో (వెంట్రుకల

ముడి) రత్నముల చెవుల పోగులతో, యజ్ఞోపవీతముతో (జందెము), ముత్యాలహార ముతో, తెల్లని పట్టువస్త్రముతో, మూడు కన్నులతో నున్న శ్రీవాగీశ్వరీదేవిని నేను నమస్కరింతును. (శ్వేతవర్ణము)

## 131. శ్రీ ధేనువాగీశ్వరీదేవీ ధ్యానము

(ఆశ్వలాయనకల్పము)

శుద్ధస్ఫాటికసంకాశాం శుక్లమాల్యాంబరావృతామ్
అంకుశే నాక్షసూత్రేణ పాశపుస్తకధారిణీమ్ ॥

ముక్తాహారై స్సమాయుక్తాం దేవీం దివ్యచతుర్భుజామ్
సితేన దర్పణాభేన వస్త్రేణ పరిభూషితామ్ ॥

సుస్తనీం వేదిమధ్యాం తాం చంద్రార్ధకృతశేఖరామ్
జటాకలాపసంయుక్తాం పూర్ణచంద్రనిభాననామ్ ॥

త్రిలోచనీం మహాదేవీం స్వర్ణనూపురధారిణీమ్
కటకైః స్వర్ణరత్నాఢ్యై ర్మహావలయభూషితామ్ ॥

కేయూరై ర్మేఖలాద్యై శ్చ ద్యోతయంతీం జగత్త్రయమ్
శబ్దబ్రహ్మమయీం ధ్యాయేత్ ధేనువాగీశ్వరీం పరామ్ ॥

శ్రీ ధేనువాగీశ్వరీదేవి కుడిభాగమున క్రిందినుండి పైకి జపమాలను 1, అంకుశ మును 2, అట్లే ఎడమవైపున పుస్తకమును 1, పాశమును 2, ధరించిన చతుర్బాహువు లతో నుండును.

స్ఫటికమువలె మిక్కిలి తెల్లనైన శరీరకాంతులతో, తెల్లనైన పూలదండలతో, వస్త్రములతో, ముత్యాలదండలతో, సమపీనోన్నతమైన చక్కని స్తనభారముతో, యజ్ఞ వేదివలె సన్ననగు నడుముతో, శిరమునందు అలంకరింపబడిన చంద్రరేఖతో, జటాజూట ముతో, మూడు కన్నులతో, బంగారముచే నిర్మింపబడిన నూపురములు, (కాలిఅందెలు) కటకములు, వలయములు(చేతిగాజులు), కేయూరములు (దండగడియములు), మేఖలలు (వడ్డాణము), మున్నగువాని కాంతులచేత జగములను ప్రకాశింపజేయుచు, శబ్ద బ్రహ్మ రూపమైన శ్రీధేనువాగీశ్వరిని ధ్యానింపవలెను. (శ్వేతవర్ణము)

## 132. శ్రీ సౌభాగ్యవాగీశ్వరీ ధ్యానము

(శారదాతిలకము)

తరుణశకల మిందో ర్బిభ్రతీ శుభ్రకాంతిః
కుచభరనమితాంగీ సన్నిషణ్ణా సితాబ్జే ।
నిజకరకమలోద్యల్లేఖినీ పుస్తకశ్రీః
సకలవిభవసంపైః పాతు వాగ్దేవతా నః ॥

కుడిప్రైపున గంటమును I, ఎడమప్రైపున పుస్తకమును, ధరించి ద్విబాహుప్రై తెల్లని శరీరకాంతులతో, శిరమున అలంకరించిన బాలచంద్రునితో, స్తనభారముచేత కొంచిగ వంగిన శరీరముతో తెల్లని తామరపూవునందు ఆసీనయగు (కూర్చుండిన) శ్రీవాగ్దేవత సమస్తములగు సంపదల నిచ్చి మమ్మెల్లరను రక్షించుగాక! (శ్వేతవర్ణము)

## 133. శ్రీ పద్మానామకలక్ష్మీ ధ్యానము

(పాంచరాత్రము క్రియాపాదము)

పద్మా పద్మాసనాసీనా పద్మాభా పద్మవాసినీ
హేమరత్నోజ్జ్వలన్నక్రకుండలం కర్ణమండనమ్ ॥

చంద్రబింబామలముఖీ కర్ణపూరాయతేక్షణా
నయనావనా సురమ్యాంగి కుంచితభ్రూసువిభ్రమా ॥

రక్తోష్ఠీ పీనగండా చ కంచుకాచ్ఛాదితస్తనీ
శిరసో మండనం శంఖచక్రసీమంతపద్మకమ్ ॥

నాగహస్తసమౌ బాహూ కేయూరకటకోజ్జ్వలౌ
పంకజం శ్రీఫలం వామే దక్షిణే బిభ్రతీపరా ॥

శోభనాంబరసంపన్నా విపులశ్రోణికా తథా
మేఖలాకటిసూత్రాంకా లక్ష్మీ ర్లక్ష్మీవివర్ధనీ ॥

పద్మ యను ఈ లక్ష్మీదేవి పద్మమునందు ఆసీనురాలై ఉండును, పద్మములవంటి శరీరకాంతితో నుండును. రత్నములు పొదిగిన బంగారు మకరకుండలములు చెవుల కుండును, చంద్రబింబమువంటి ముఖము, చెవులవరకు వ్యాపించిన పెద్దకన్నులు, చక్కని యౌవనము, చూచుటకు ఇంపైన అన్ని అవయవములు, కొంచెము ముడివడిన కనుబొమ్మలు, ఎఱ్ఱని క్రిందిపెదవి, లావైన చెక్కిళ్ళు (బుగ్గలు), రవిక యందు కప్పబడి బహిర్గతములుకాని స్తనములు ఈమెకు కలవు. శంఖము, చక్రము, కల పద్మాకారముగల పాపట చేరు గో, (పాపటయందు పెట్టుకొను నగ) దండగడియము లతో, కంకణములతో, అలంకరింపబడిన ఏనుగుతొండములవంటి కుడివైపున మారేడు పండును, ఎడమవైపున పద్మమును ధరించిన చేతులు, చక్కని వస్త్రములు, విశాలమైన కటిచక్రము (నడుముక్రింది పిరుదల ప్రదేశము). ఆ కటిచక్రమున బంగారువడ్డాణము, ఈమెకు ఉండును.

ఇట్టి లక్షణములు కలిగిన ఈ లక్ష్మి సేవించినవారికి సంపదలను వృద్ధిసేయును.
(పద్మవర్ణము)

## 134. శ్రీ చతుష్షష్టియోగినీ ధ్యానమ్

(నామములు రుద్రయామళము)

అష్టాష్టకం ప్రవక్ష్యామి యోగినీనాం సమాసతః
ఆద్యష్టకం సువర్ణాభం త్రిశూలం డమరుం తథా ॥

పాశం చాసిం దధానం త ద్ధ్యాయేత్ సర్వాంగసుందరమ్
అథ ద్వితీయకం ధ్యాయేత్ అక్షమాలా మంథాంకుశమ్ ॥

దధానం పుస్తకం వీణాం సుశ్వేతం మణిభూషణమ్
జ్వాలాం శక్తిం గదాం కుంతం దధానం నీలవర్ణకమ్ ॥

ధ్యాయే త్తృతీయం శుభద మష్టకం శుభలక్షణమ్
ఖడ్గం ఖేటం పట్టిసం చ దధానం పరశుం తథా ॥

ధూమ్రమపర్ణం చతుర్థం త ద్ధ్యాయే దష్టక మాదరాత్
కుంతం ఖేటం చ పరిఘం భిండివాలం తథైవ చ ॥

పంచమాష్టక మేతద్ధి శ్వేతం స్యా త్సుమనోహరమ్
పీతం షష్ఠ మ్మృషీ రక్త మష్టమం చ తటిత్ప్రభమ్ ॥

కుంతాదికం సమం ప్రోక్తం షడార భ్యాష్టమాంతకమ్ ॥

1 దివ్యయోగా 2 మహాయోగా 3 సిద్ధియోగా 4 మహేశ్వరీ
5 పిశాచినీ 6 డాకినీ చ 7 కాలరాత్రి 8 ర్నిశాచరీ (1)

9 కంకాలీ 10 రౌద్రవేతాలీ 11 హుంకారీ 12 భువనేశ్వరీ
13 ఊర్ధ్వకేశీ 14 విరూపాక్షీ 15 శుష్కాంగి 16 నరభోజినీ (2)

17 ఫట్కారీ 18 వీరభద్రా చ 19 ధూమ్రాక్షీ 20 కలహప్రియా
21 రక్తాక్షి 22 రాక్షసీ 23 ఘోరా 24 విశ్వరూపా 25 భయంకరీ (3)

26 కామాక్షీ 27 చోగ్రచాముండా 28 భీషణా 29 త్రిపురాంతకా
30 వీరకౌమారికా 31 చండీ 32 వారాహీ 33 ముండధారిణీ (4)

34 భైరవీ 35 హస్తినీ 36 క్రోధదుర్ముఖీ 37 ప్రేతవాహినీ
38 ఖట్వాంగదీర్ఘలంబోష్ఠీ 39 మాలతీ 40 మంత్రయోగినీ (5)

| | | | | |
|---|---|---|---|---|
| 41 అస్థినీ | 42 చక్రిణీ | 43 గ్రాహ | 44 కంకాళీ | 45 భువనేశ్వరీ |
| 46 కంటకీ | 47 కాముకీ | 48 శుభ్రా | 49 క్రియాదూతీ | 50 కరాళినీ(6) |
| 51 శంఖినీ | 52 పద్మినీ | 53 క్షీరా | 54 హ్యసంధా చ | 55 ప్రహారిణీ(7) |
| 56 లక్ష్మీశ్చ | 57 కాముకీలోలా | 58 కాకదృష్టి | 59 రథోముఖీ | |
| 60 ధూర్జటీ | 61 మాలినీ | 62 ఘోరా | 63 కపాలీ | 64 విషభోజినీ(8) |

చతుష్షష్టిః సమాఖ్యాతా యోగిన్యో వరసిద్ధిదాః ॥

ఈ యోగినులు అరువదినలుగురు 64. ఎనమండుగురు, ఎనమండుగురు ఒక్కొక్క అష్టకముగ వ్యవహరింప బడుదురు. ప్రత్యష్టకమునందుండు ఎనిమిదిమంది యోగినులకు ఆభరణములు ఆయుధములు సమముగా నుండును. ముందుగా వారల పేరులు వివరింపబడుచున్నవి.

| ప్రథమాష్టకము | ద్వితీయాష్టకము | తృతీయాష్టకము | చతుర్థాష్టకము |
|---|---|---|---|
| 1 దివ్యయోగిని | 1 కంకాలి | 1 ఫట్కారి | 1 భయంకరి |
| 2 మహాయోగిని | 2 రౌద్రభేతాళి | 2 వీరభద్ర | 2 కామాక్షి |
| 3 సిద్ధయోగిని | 3 హుంకారి | 3 ధూమ్రాక్షి | 3 ఉగ్రచాముండ |

| | | | |
|---|---|---|---|
| 4 మహేశ్వరి | 4 భువనేశ్వరి | 4 కలహప్రియ | 4 భీషణ |
| 5 పిశాచిని | 5 ఊర్ధ్వకేశి | 5 రక్తాక్షి | 5 త్రిపురాంతక |
| 6 డాకిని | 6 విరూపాక్షి | 6 రాక్షస | 6 వీరకౌమారి |
| 7 కాలరాత్రి | 7 శుష్కాంగి | 7 ఘోర | 7 చండి |
| 8 నిశాచరి | 8 నరభోజిని | 8 విశ్వరూప | 8 వారాహి |

| పంచమాష్టకము | షష్ఠాష్టకము | సప్తమాష్టకము | అష్టమాష్టకము |
|---|---|---|---|
| 1 ముండధారిణి | 1 అస్థిని | 1 క్రియాదూతి | 1 కాముకీలోల |
| 2 భైరవి | 2 చక్రిణి | 2 కరాళిని | 2 కాకదృష్టి |
| 3 హస్తిని | 3 గ్రాహ | 3 శంఖిని | 3 అధోముఖి |
| 4 క్రోధదుర్ముఖి | 4 కంకాళి | 4 పద్మిని | 4 ధూర్జటి |
| 5 ప్రేతవాహిని | 5 భువనేశ్వరి | 5 క్షీర | 5 మాలిని |
| 6 ఖట్వాంగదీర్ఘలంబోష్ఠి | 6 కంటకి | 6 అసంధ | 6 ఘోర |
| 7 మాలతి | 7 కాముకి | 7 ప్రహారిణి | 7 కపాలి |
| 8 మంత్రయోగిని | 8 శుభ్ర | 8 లక్ష్మి | 8 విషభోజిని |

ఈ అరువది నలుగురు యోగినులు చతుర్బాహువులే. అందు ప్రథమాష్టక యోగినులు కుడిభాగమున క్రిందినుండి పైకి కత్తిని 1, ఢమరుకమును 2, అట్లే ఎడమ భాగమున త్రిశూలమును 1, పాశమును 2, ధరింతురు. శరీరచ్ఛాయ బంగారువర్ణము.

ద్వితీయాష్టకయోగినులు కుడిభాగమున క్రిందినుండి పైకి వీణను 1 అంకుశమును 2 అట్లే ఎడమభా. మున పుస్తకమును 1, అక్షమాలను 2, ధరింతురు. మిక్కిలి తెల్లని శరీరచ్ఛాయను, మణిమయములగు బంగారునగలను ధరింతురు.

తృతీయాష్టకయోగినులు కుడిభాగమున క్రిందినుండి పైకి జ్వాలను 1 (అగ్నిని), శక్తిని 2, అట్లే ఎడమభాగమున గదను 1, కుంతమును 2, ధరింపరు. నల్లని శరీరచ్ఛాయలతో నుందురు. వీరు శుభముల నిత్తురు.

చతుర్థాష్టకయోగినులు కుడిభాగమున క్రిందినుండి పైకి ఖడ్గమును 1 పట్టిస మను నాయుధమును 2, ఎడమభాగమున ఖేటమును 1, గొడ్డలిని 2, ధరింతురు. ధూమ్ర వర్ణమగు (నలుపు ఎఱుపు కలిసినరంగు) శరీరచ్ఛాయలతో నుందురు.

పంచమాష్టకయోగినులు కుడిభాగమున క్రిందినుండి పైకి పరిఘమును 1, కుంత మను నాయుధమును 2, అట్లే ఎడమవైపున ఖేటమును 1, భిండివాలమును 2, ధరింతురు. మిక్కిలి చక్కని తెల్లని శరీరచ్ఛాయలతో నుందురు.

షష్ఠాష్టక యోగినులకు ఆయుధములు, ఆయుధధారణము పంచమాష్టక యోగినులకు వలెనే ఉండును. శరీరచ్ఛాయ బంగారువలె పచ్చగనుండును.

సప్తమాష్టక యోగినులకు ఆయుధములు, ఆయుధధారణము పంచమాష్టక యోగినులకు వలెనే ఉండును. శరీరచ్ఛాయ మెఱుపుతీగవలె పచ్చగనుండును.

అష్టమాష్టక యోగినులకు ఆయుధములు, ఆయుధధారణము పంచమాష్టక యోగినులకువలెనే ఉండును, శరీరచ్ఛాయ మెఱుపుతీగవలె పచ్చగనుండును.

## 135. శరీరస్థషట్చక్రదేవతా ధ్యానమ్

(వేదాంతయోగశాస్త్రము)

ఆధారే లింగనాభౌ హృదయసరసిజే
తాలుమూలే లలాటే
ద్వేపత్రే షోడశారే ద్విదశదశదలే
ద్వాదశార్ధే చతుష్కే ।
నాసాంతే ఫాలమధ్యే డఫకఠసహితే
కంఠమధ్యే స్వరాణాం
హం క్షం తత్వార్థయుక్తం సకలదలగతం
వర్ణరూపం నమామి ॥

గుదప్రదేశము ఆధారచక్రమునకు స్థానము. దీనినే మూలాధారచక్ర మనియును అందురు. ఈ చక్రములను, పద్మములనియును వ్యవహరింతురు. ఈ మూలాధారమను చక్రమునకు (పద్మమునకు) నాల్గుదళము లుండును. ప్రతిదళమునందు ఒక్కొక్కవర్ణ ముండును. ఆ వర్ణములు (అక్షరములు) వ, శ, ష, స. దీని వర్ణము ఎఱుపు. ఇది మొదటి చక్రము,

రెండవది స్వాధిష్ఠానచక్రము. ఈ చక్రమునందు ఆరుదళము లుండును. ప్రతి దళమునందు ఒక్కొక్క వర్ణ ముండును (అక్షరముండును). కనుక ఆరు అక్షరములు. ఆ వర్ణములు బ,భ,మ,య,ర,ల. దీనిది లింగస్థానము. దీని వర్ణము తెలుపు.

మూడవది మణిపూరక చక్రము. దీని ప్రదేశము నాభి. ఈ చక్రమునందు పది దళము లుండును, ప్రతిదళమునందు ఒక్కొక్క వర్ణ ముండును. కావున పది అక్షరము లుండును. డ,ఢ,ణ,త,థ,ద,ధ,న,ప,ఫ. అనునవి ఆ యక్షరములు. దీని వర్ణము నలుపు.

నాల్గవది అనాహతచక్రము (పద్మము). దీని ప్రదేశము హృదయము. ఈపద్మము నందు పన్రెండు దళము లుండును. కావున పన్రెండు దళములయందు పన్రెండు అక్షరము లుండును. క,ఖ,గ,ఘ,ఙ,చ,ఛ,జ,ఝ,ఞ,ట,ఠ. అనునవి ఆ యక్షరములు. దీనివర్ణము పసుపు.

ఐదవది విశుద్ధచక్రము. దీని స్థానము కంఠము. ఈ పద్మమునందు పదునారు రేకులు (దళములు) ఉండును. ప్రతిదళమునందు ఒక్కొక్క అక్షరముండును. ఆ పదునారు అ,ఆ,ఇ,ఈ,ఉ,ఊ,ఋ,ౠ,ఌ,ౡ,ఏ,ఐ,ఓ,ఔ,అం అః అనునవి.

ఆరవది ఆజ్ఞాపద్మము. దీనిస్థానము కనుబొమల నడుమ ప్రదేశము. దీనికి రెండు దళములు. హం, క్షం, అను రెండు వర్ణములు ఆరెండు రేకులయందు ఉండును.

సహస్రారపద్మము (చక్రము) అను పేరుతో శిరమునం దూర్ధ్వభాగమున నొక చక్రముండును. దానిపేరు "సహస్ర+అరము". అనగా వేయి దళములు (రేకులు) కలది అని అర్థము, దానియందు పరమాత్ముడు చిద్రూపుడై (జ్ఞానరూపుడై , చైతన్య రూపుడై ) ఉన్నాడని యోగశాస్త్రము చెప్పుచున్నది.

సాధకుడగు జీవుడు ప్రాణాయామ సాధనముచేత మూలాధారమందున్న కుండలినీ (పామువలె చుట్టుకొని యుండునది) శక్తిని మేలుకొలిపి, క్రమముగ స్వాధిష్ఠానము, మణిపూరకము, అనాహతము, విశుద్ధము, ఆజ్ఞ అను పద్మములను పొందుచు, వాని యందలి అక్షరములను పఠించుచు, వానియందలి పరిమళములను ఆఘ్రాణించుచు, వాని వాని తేజములను చూచుచు, ఆ పద్మములయందలి రుచులను ఆస్వాదించుచు పరమాత్మ స్థానమగు సహస్రార పద్మమునుండి స్రవించు మకరందమును (అమృతమును) ఆస్వాదించుటయే కైవల్యము అని యోగులు చెప్పుదురు.

ఈ యోగమునకు ఎనిమిది అంగములు కలవు. 1 యమము, 2, నియమము 3 ఆసనము, 4 ప్రాణాయామము, 5 ప్రత్యాహారము, 6 ధారణ, 7 ధ్యానము, 8 సమాధి, అనునవి. వీనినే అష్టాంగములు అందురు. కనుక ఈ యోగమునకు అష్టాంగ యోగము అని ప్రసిద్ధి. ఈ యోగ సాధనము కలవాడు యోగి.

# వర్ణధ్యానములు

(సిద్ధశాబరతంత్రము)

## 136. అకార ధ్యానము

అజాముఖీ రక్తవర్ణా హంసగా ధవళాంశుకా
శరాసనం వరం దక్షే ధత్తే వామే శరాభయౌ ॥

ఈ అకారదేవతకు మేకముఖము. కనుక అజాముఖి అని ఈమెకు పేరు, ఎఱ్ఱని శరీరకాంతి, హంసవాహనము, తెల్లని వస్త్రములు కలది.

కుడిభాగమున క్రిందినుండి పైకి వరదముద్రను 1, వింటిని 2, అట్లే ఎడమ భాగమున అభయముద్రను 1, బాణమును 2, ధరించి చతుర్బాహువై యుండును.

(రక్తవర్ణము)

## 137. ఆకార ధ్యానము

ఆకారా హ్యాథర్వణీ తు శ్యామా శుక్లాంబరాశుగా
ధత్తే ఖట్వాం చ ఖేటం చ క్రమే ణైవ వరాభయౌ ॥

ఈ ఆకారదేవత అథర్వణవేదమునకు సంబంధించినది. కనుక ఈమెపేరు ఆథర్వణి. నల్లనిది. తెల్లని వస్త్రములు కలది. త్వరగా పోవునది.

కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, ఖట్వాంగమును 2, అట్లే ఎడమభాగమున వరముద్రను 1, ఖేటమును 2, ధరించి చతుర్బాహువై యుండును.

(శ్యామవర్ణము)

## 138. ఇకార ధ్యానము

ఇకారాఖ్యా త్విలాదేవీ శ్వేతా మత్తేభగా శుభా
చంద్రహాసవరౌ దక్షే వామే ధత్తే గదాభయౌ ॥

ఈ ఇకారదేవత పేర ఇలాదేవి. ఈమె తెల్లనిది. ఏనుగు వాహనము, ఈమె శుభరాలు.

కుడిభాగమున క్రిందినుండి పైకి వరముద్రను 1, కత్తిని 2, అట్లే ఎడమభాగమున అభయముద్రను 1, గదను 2, ధరించి చతుర్బాహువై యుండును.

(శ్వేతవర్ణము)

## 139. ఈకార ధ్యానము

ఈశ్వరీ స్వర్ణవర్ణాభా వృషారూఢా సితాంశుకా
శారికాం చ వరం దక్షే వామే ధత్తే ఽంకుశాభయౌ ॥

ఈ ఈకారాధి దేవత ఈశ్వరి యను నామముకలది. బంగరురంగు శరీరకాంతి కలది. ఈమెకు ఎద్దు వాహనము. తెల్లని వస్త్రములను కట్టును.

కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, అంకుశమును 2, అట్లే ఎడమ భాగమున వరముద్రను 1, గోరువంకను 2, (దర్పను) ధరించి చతుర్బాహువై యుండును.

(స్వర్ణవర్ణము)

## 140. ఉకార ధ్యానము

ఉగ్రా దేవీ హ్యుకారాఖ్యా షడ్భుజా సింహగా సితా
దక్షే శూలాంకుశవరాన్ వామే పాశగదాభయాన్ ॥

ఈ ఉకారదేవత ఉగ్ర అను పేరు కలది. ఈమెకు సింహము వాహనము. తెల్లని శరీరచ్ఛాయ కలది.

కుడివైపున క్రిందినుండి పైకి వరముద్రను 1, అంకుశమును 2, శూలమును 3, అట్లే ఎడమవైపున అభయముద్రను 1, గదను 2, పాశమును 3, ధరించి షడ్బాహువై (ఆరు చేతులు కలది) యుండును. (శ్వేతవర్ణము)

# 141. ఊకార ధ్యానము

ఊకారోర్జస్వలా దేవీ శార్దూలవరవాహనా
రక్తా చతుర్భుజా ధత్తే ఖడ్గఖేటవరాభయాన్ ॥

ఈ ఊకారాధిదేవత ఊర్జస్వల అను పేరుకలది. ఈమెకు పులి వాహనము, ఎఱ్ఱని శరీరకాంతి.

కుడిభాగమున క్రింది నుండి పైకి అభయముద్రను 1, ఖడ్గమును 2, అట్లే ఎడమ భాగమున వరముద్రను 1, ఖేటమును 2, ధరించి చతుర్బాహువై యుండును. (రక్తవర్ణము)

# 142. ఋకార ధ్యానము

ఋతంధామా ఋకారాఖ్యా రక్తవర్ణా వృషస్థితా
దక్షే పాశవరౌ ధత్తే తథా వామే ఽంకుశాభయౌ ॥

ఈ ఋకారాధిదేవతకు ఋతుధామ అని పేరు. ఎఱ్ఱని శరీరకాంతి కలది. ఈమెకు ఎద్దు వాహనము.

ఈమె కుడిభాగమున క్రిందినుండి పైకి వరముద్రను 1, పాశమును 2, అట్లే ఎడమ భాగమున అభయముద్రను 1, అంకుశమును 2, ధరించి చతుర్బాహువై యుండును. (రక్తవర్ణము)

# 143. ౠకార ధ్యానము

ౠకారాఖ్యా రేణుకేయం షడాస్యా షడ్భుజా సితా
శూలం పాశం వరం దక్షే వామే ఖడ్గగదాభయాన్ ॥

దధానా రక్తసింహస్థా క్రూరా లోకభయంకరీ ॥

ఈ ఋూకారదేవత రేణుక అను పేరు కలది. ఈమెకు ఆరు మొగములు, ఆరు చేతులు ఉండును. తెల్లని శరీరకాంతి కలది.

ఈమె కుడిప్రైపున క్రిందినుండి పైకి వరుసన వరముద్రను 1, పాశమును 2, శూలమును 3, అట్లే యెడమప్రైపున అభయముద్రను 1. గదను 2, ఖడ్గమును 3, ఆరు చేతులయందు ధరించి యుండును. ఎఱ్ఱని సింహము ఈమె వాహనము, భయంకరురాలు (క్రూరురాలు.) (శ్వేతవర్ణము)

## 144. ౡకార ధ్యానము

ౡతంభరా ౡకారాఖ్యా శ్యామా వ్యాఘ్రవరస్థితా
చతుర్ముఖాష్టహస్తేయం ధత్తే ఽస్త్రాణి కరైః పరైః ॥

త్రిశూలపాశడమరువరాన్ వామకరై స్తథా
ఖడ్గం కపాలముసలాభయాన్ పీతాంబరా శుభా ॥

ఈ ౡకారాధిదేవత ౡతంభర యను నామము కలది. నల్లని శరీరకాంతి, వ్యాఘ్రవాహనము, నాల్గు మొగములు, ఎనిమిది చేతులు కలిగియుండును.

ఈమె కుడిప్రైపున క్రిందినుండి పైకి క్రమమున వరముద్రను 1, డమరుకమును 2, పాశమును 3, త్రిశూలమును 4, అట్లే ఎడమప్రైపున అభయముద్రను 1, ముసలమును 2, కపాలమును 3, ఖడ్గమును 4, ధరించి బంగరురంగు పచ్చని వస్త్రములతో శుభురాలై యుండును. (శ్యామవర్ణము)

## 145. ౡూకార ధ్యానము

ౡూకారా ౡూంజికా ఖ్యైషా పుష్పదంతగజస్థితా
రక్తా దశభుజార్ధేన దక్షాద్క్రమశః కరైః ॥

త్రిశూలపాశముసలచంద్రహాసవరాన్ శుభాన్
వామైః కరైః ఖడ్గఖేటగదాశక్త్యభయాం స్తథా ॥

ఈ శాకారాధిదేవత శాంజిక అను పేరు కలది. ఈమెకు పది చేతులు కలవు. పుష్పదంత మను ఏనుగు వాహనము.

ఈమె కుడివైపున క్రిందినుండి పైకి వరుసన వరముద్రను 1, చంద్రహాస మును 2, రోకలిని 3, పాశమును 4, శూలమును 5, అట్లే ఎడమువైపున అభయముద్రను 1, ఖేటమును 2, ఖడ్గమును 3, గదను 4, శక్తిని 5, ధరించి ఎఱ్ఱని శరీరచ్ఛాయతో నుండును. (రక్తవర్ణము)

## 146. ఏకార ధ్యానము

ఏకారాఖ్యా రేవతీ స్యా ద్దశాస్యా రుండమాలినీ
రక్తా వింశద్భుజా సింహవాహనా ఫాలలోచనా ॥

కరై ర్ధత్తే చక్రశూలపాశఖడ్గకమండలూన్
అక్షసూత్రం చ చిన్ముద్రాం భుశుండీం ముద్గరం వరమ్ ॥

వామై ర్ధత్తే కరైః శంఖం ఖండేందుమృగఖేటకాన్
కపాలం దహనం కోషం దండం చైవ గదాభయౌ న్ ॥

ఈ ఏకారాధి దేవత రేవతి అను పేరు కలది. పది మొగములు, ఇరువది చేతులు, నొసట కన్ను, సింహవాహనము కలది. మనుష్యశిరములను మెడలో దండగా వేసి కొనును.

ఈమె కుడివైపున క్రిందినుండి పైకి వరముద్రను 1, ముద్గరమును 2, భుశుండి అను ఆయుధమును 3, చిన్ముద్రను 4, అక్షసూత్రమును 5, ఖడ్గమును 6, కమండల మును 7, పాశమును 8, శూలమును 9, చక్రమును 10, అట్లే ఎడమవైపున అభయ ముద్రను 1, గదను 2, దండమును 3, అగ్నిని 4, కపాలమును 5, ఖేటమును 6, లేడిని 7, చంద్రుని 8, ఖండి యను నాయుధమును 9, శంఖమును 10, ఇరువది చేతుల యందు ధరించి ఎఱ్ఱని శరీరచ్ఛాయతో నుండును. (రక్తవర్ణము).

## 147. ఐకార ధ్యానము

ఐకారాఖ్యా శుష్కపూర్వా రేవతీ త్రిశిరా హితా
మయూరగా షడ్భుజేయం రక్తకేశై శ్చ సంవృతా ॥

అర్ధే ర్ధత్తే కరై శ్చక్రం త్రిశూలం చ వరం తథా
వామైః శంఖం గదాం గుర్వీం కరై ర్ధత్తే ఒభయం తథా ॥

ఈ ఐకారదేవత శుష్కరేవతి అను పేరు కలది. ఈమెకు మూడు శిరములు. ఆరు చేతులు, నెమలి వాహనము, ఎఱ్ఱని వెంట్రుకలు ఉండును.

ఈమె కుడివైపున వరముద్రను 1, త్రిశూలమును 2, చక్రమును 3, అట్లే ఎడమవైపున అభయముద్రను 1, గదను 2, శంఖమును 3, ఆరు చేతులతో ధరించి యుండును. (శుద్ధవర్ణము)

## 148. ఓకార ధ్యానము

ఓకారా త్వశ్వినీ దేవీ రక్తవర్ణా షడాననా
మయూరగా ద్వాదశబాహుః స్యా ద్ధత్తే దక్షే ఒంకుశం శరమ్ ॥

ఖడ్గం పాశం చ చిన్ముద్రాం వరం చాకేకరేక్షణా
వామే శూలం కార్ముకం చ ఖేటం ముసల మేవ చ ॥

పుస్తకం చాభయం చైవ సర్వశత్రుభయంకరీ ॥

ఈ ఓకారదేవత అశ్వినీ యను పేరు కలది. ఆరు మొగములు, పన్నెండు చేతులు, నెమలి వాహనము ఈమెకు కలవు.

ఈమె కుడివైపున క్రిందినుండి పైకి వరుసగ చిన్ముద్రను 1, పాశమును 2, శంఖమును 3, ఖడ్గమును 4, బాణమును 5, అంకుశమును 6, అట్లే ఎడమవైపున అభయముద్రను 1, పుస్తకమును 2, రోకలిని 3, ఖేటమును 4, వింటిని 5, శూలమును 6 పన్నెండు చేతులతో ధరించి ఎఱ్ఱని శరీరచ్ఛాయతో నుండును. ఈమె శత్రువు లెల్లరకు భయమును కలిగించును, (రక్తవర్ణము)

## 149. ఔకార ధ్యానము

ఔకారాఖ్యా హ్యఘోరా దేయం కరాలీ దీర్ఘజిహ్వకా
ఏకవక్త్రా వక్రనేత్రా భ్రుకుటీకుటిలేక్షణా ॥

నీలమేఘనిభా రౌద్రీ భేరుండవరవాహనా
షడ్భుజార్ధకరైర్ధత్తే శూలం ఖడ్గం వరం తథా ॥
గదాఖేటభయాన్ వామే దధానా చ మహోదరీ ॥

ఈ ఔకారదేవత అఘోర అను పేరు కలది. ఈమె భయంకరురాలు. పొడవైన నాల్క, ఒక్క మొగము, కనుబొమలు ముడివడి వంకరలైన కన్నులు, నల్లని శరీర కాంతి, భేరుండ మను వాహనము, ఆరు చేతులు, ఈమెకు కలవు.

ఈమె కుడివైపున క్రిందినుండి పైకి వరుసన వరముద్రను 1, ఖడ్గమును 2, శూలమును 3, అట్లే ఎడమవైపున అభయముద్రను 1, ఖేటమును 2, గదను 3, ధరించి యుండును. ఈమె మహోదరి (పెద్దపొట్టకలది). (శ్యామవర్ణము)

## 150. అంకారదేవతా ధ్యానమ్

అంజనా భాంజనా దేవీ పంచాస్యా జటిలా కృశా
మహోదరీ మహావ్యాఘ్రవరవాహన మాస్థితా ॥
చతుర్భుజా శూలపాశవరాభయకరా మతా ॥

ఈ అంకారదేవత అంజన అను పేరు కలది, కాటుకవలె నల్లని శరీరకాంతి, ఐదు మొగములు, జడలు (జుట్టు), బక్కచిక్కిన శరీరము, పెద్దపొట్ట, వ్యాఘ్రవాహనము, నాల్గు భుజములు ఈమెకు కలవు.

ఈమె కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, శూలమును 2, అట్లే ఎడమవైపున వరముద్రను 1, పాశమును 2, ధరించి యుండును. (కృష్ణవర్ణము)

## 151. అఃకార ధ్యానమ్

అ ఇత్యాఖ్యా త్వజా దేవీ త్రిశిరాశ్చ త్రిలోచనా
రక్తా పీతాంబరా క్రూరతరక్షువరవాహనా ॥
షడ్భుజా శూలపట్టాసివరదానకరాంచితా
వామే ఒంకుశముహాఖేటాభయాన్ ధత్తే కరైః క్రమాత్ ॥

ఈ అఃకార దేవత అజ అను పేరు కలది. ఈమెకు మూడు శిరములు ప్రతి శిర మున మూడు మూడు కన్నులు, ఎఱ్ఱని శరీరచ్ఛాయ, పచ్చని (బంగారురంగు) వస్త్రములు, క్రూరమైన సివంగి వాహనము, ఆరు చేతులు ఉండును.

ఈమె కుడివైపున క్రిందినుండి పైకి వరముద్రను 1, కత్తిని 2, శూలమును 3. అట్లే ఎడమవైపున అభయముద్రను 1, ఖేటమును 2, అంకుశమును 3, ఆరు చేతులలో ధరించి యుండును. (రక్తవర్ణము)

## 152. కకార ధ్యానము

భూతవిన్యాసినీ శుభ్రా గజారూఢా చతుర్భుజా
త్రిశూలం చ వరం దక్షే వామే ఽంకుశ మ థాభయమ్ ॥

ఈ కకారదేవత భూతవిన్యాసిని అని పేరు కలది, ఈమెకు తెల్లని శరీరకాంతి, ఏనుగు వాహనము, నాల్గు చేతులు ఉండును.

ఈమె కుడివైపున క్రిందినుండి పైకి వరముద్రను 1, త్రిశూలమును 2, అట్లే ఎడమవైపున అభయముద్రను 1, అంకుశమును 2, నాల్గుచేతులతో ధరించును.
(శ్వేతవర్ణము)

## 153. ఖకార ధ్యానము

ఖంజరీటస్థితా పీతా త్రిశిరా శ్చ త్రిశూలినీ
ఖాఖ్యా ఖద్యోతినీ ఖడ్గవరాభయకరా మతా ॥

ఈ ఖకారదేవత ఖద్యోతిని అను పేరుకలది. ఈమెకు ఖంజరీటము (కాటుకపిట్ట) వాహనము. పసుపు పచ్చని కాంతిగల శరీరము, మూడు శిరములు, నాల్గుచేతులు ఉండును.

ఈమె కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, త్రిశూలమును 2, అట్లే ఎడమభాగమున వరదముద్రను 1, ఖడ్గమును 2, నాల్గుచేతులతో ధరించును.
(పీతవర్ణము)

# 154. గకార ధ్యానము

గాఖ్యా ధూమ్రనిభా చతుర్వక్త్రా సింహస్థా ఽష్టభుజా శుభా
ధూమ్రమాభా దక్షిణే ధత్తే శూలం చాక్షం స్రువం వరమ్ ॥

వామే తు పుస్తకం కుండం కపాల మభయం క్రమాత్ ॥

ఈ గకారదేవత ధూమ్రా అను పేరు కలది. ఈమెకు నాల్గు మొగములు, సింహ వాహనము, ఎనిమిది చేతులు, ధూమ్ర (నలుపు ఎఱుపు) వర్ణమగు శరీరకాంతి ఉండును.

ఈమె కుడిప్రైపున క్రిందినుండి పైకి వరుసన వరముద్రను 1, స్రువమును 2. అక్షసూత్రమును 3, శూలమును 4, అట్లే ఎడమప్రైపున అభయముద్రను 1, కపాలమును 2, కమండలమును 3, పుస్తకమును 4, ఎనిమిది చేతులతో ధరించి యుండును.

(ధూమ్రవర్ణము)

# 155. ఘకార ధ్యానము

కృష్ణవర్ణా ఘరూపా చ సూకరాస్యా కృశోదరీ
షడ్భుజా శూలఖట్వాంగవరాన్ దక్షభుజైః క్రమాత్ ॥

వామే ఖడ్గం తథా ఖేటం మభయం శత్రుభంజనీ ॥

ఈ ఘకారదేవత శత్రుభంజని. అఘరూప అనుపేరు కలది. ఈమెకు వరాహము యొక్క ముఖము, సన్నని పొట్ట, ఆరుచేతులు ఉండును.

ఈమె కుడిప్రైపున క్రిందినుండి పైకి వరుసన వరముద్రను 1, ఖట్వాంగమును 2, శూలమును 3, అట్లే ఎడమప్రైపున అభయముద్రను 1, ఖడ్గమును 2, ఖేటమును 3, ఆరు చేతులతో ధరించి ఉండును. (కృష్ణవర్ణము)

# 156. ఙకార ధ్యానము

అనంతశక్తి ర్ఙవేశీ రక్తా బర్హిణవాహనా
షడాన నేషుచాపాసిఖేటదానాభయాన్వితా ॥

ఈ ఙకారదేవత అనంతశక్తి యను పేరు కలది. ఈమెకు ఎఱ్ఱని శరీరకాంతి, నెమలి వాహనము, ఆరు మొగములు, ఆరు చేతులు ఉండును.

ఈమె కుడివైపున క్రిందినుండి పైకి వరుసన, అభయముద్రను 1, ఖడ్గమును 2, బాణమును 3, అట్లే ఎడమవైపున వరముద్రను 1. ఖేటమును 2, వింటిని 3, ఆరు చేతులతో ధరించి ఉండును, (రక్తవర్ణము)

## 157. చకార ధ్యానము

సుషుమా చైకవక్త్రైషా హయారూఢా చతుర్భుజా
ఖడ్గఖేటధరా చాఖ్యా వరాభయకరా శుభా ॥

ఈ చకారదేవత సుషుమ అను పేరు కలది. ఈమెకు ఏకముఖము, గుఱ్ఱము వాహనము, నాల్గు చేతులు ఉండును.

ఈమె కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, ఖడ్గమును 2, అట్లే ఎడమభాగమున వరముద్రను 1, ఖేటమును 2. నాల్గుచేతులతో ధరించి ఉండును.
(స్వర్ణవర్ణము)

## 158. ఛకార ధ్యానము

ఛే నిర్ఝరారుంధతీయం పీతా మర్కటవాహనా
త్రిశూలం క్షురికాం పాశం ఖేటం చ దధతీ శుభా ॥

ఈ ఛకారదేవత నిర్ఝరారుంధతి అను పేరు కలది. ఈమెకు బంగారురంగు శరీరము, కోతివాహనము, నాల్గు చేతులు కలవు.

ఈమె కుడిభాగమున క్రిందినుండి పైకి త్రిశూలమును 1, కత్తిని 2, అట్లే ఎడమవైపున పాశమును 1, ఖేటమును 2. ధరించి ఉండును (పీతవర్ణము)

## 159. జకార ధ్యానము

జో భోగదా హి రక్తా స్యాత్త్రినేత్రా సింహవాహనా
చతుర్భుజా ఖడ్గఖేటవరాభయకరాన్వితా ॥

ఈ జకారాధిదేవత భోగద అను పేరు కలది. ఈమె ఎఱ్ఱని శరీరకాంతి, మూడు కన్నులు, సింహవాహనము, నాలుగు చేతులు కలది.

ఈమె కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, ఖడ్గమును 2, అట్లే ఎడమభాగమున వరముద్రను 1, ఖేటమును 2, ధరించును. (రక్తవర్ణము)

## 160. ఝకార ధ్యానము

ఝంఝా నిర్ఝరసదీ దేవీ శరన్మేఘనిభాంబుజమ్
పాశం వరాభయౌ ధత్తే నక్రస్థా శుభదా నృణామ్ ॥

ఈ ఝకారదేవత నిర్ఝరసది అను పేరు కలది. ఈమెకు శరత్కాలమేఘమువలె తెల్లని శరీరకాంతి, మొసలి వాహనము, నాల్గు చేతులు కలవు.

ఈమె కుడిభాగమున క్రిందినుండి పైకి వరుసన అభయముద్రను 2, పద్మమును 2, అట్లే ఎడమభాగమున వరముద్రను 1, పాశమును 2, ధరించి యుండును. మనుష్యులకు శుభముల నిచ్చును. (శుభ్రవర్ణము)

## 161. ఞకార ధ్యానము

ఞాఖ్యా ప్రబోధినీ శంఖా సింహస్థా చిత్స్వరూపిణీ
త్రిశూలాంబుజచిన్ముద్రాభయాన్వితకరా శుభా ॥

ఈ ఞకారాధిదేవత ప్రబోధిని అను పేరు కలది. ఈమెకు తెల్లని శరీరకాంతి, సింహవాహనము. నాలుగు చేతులు కలవు. ఈమె జ్ఞానస్వరూపిణి.

ఈమె కుడిభాగమున క్రిందినుండి పైకి జ్ఞానముద్రను 1. త్రిశూలమును 2, అట్లే ఎడమభాగమున అభయముద్రను 1, పద్మమును 2, ధరించును. ఈమె శుభములనిచ్చును. (శుభ్రవర్ణము)

## 162. టకార ధ్యానము

టాఖ్యా చ ధారిణీ దేవీ శూలటంకవరాభయాన్
ధత్తే పంక్తిమతంగస్థా పాటలాభా సితాంశుకా ॥

ఈ టకారాదిదేవత ధారిణి అను పేరుకలది. ఈమె మదపుటేనుగు వాహనము. లేతఎఱుపురంగు శరీరకాంతి, తెల్లని వస్త్రములు కలది. ఈమెకు నాల్గుచేతులు.

ఈమె కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, శూలమును 2, అట్లే ఎడమభాగమున వరదముద్రను 1, టంకమును 2, ధరించును. (పాటలవర్ణము)

## 163. ఠకార ధ్యానము

క్రియాసరస్వతీ త్యాఖ్యా టంకాంకుశవరాభయాన్
ధత్తే సింహవరారూఢా చైకవక్త్రా రుణా వంతా ॥

ఈ ఠకారాదిదేవత క్రియాసరస్వతి అను పేరుకలది. ఈమెకు సింహవాహనము నాలుగు చేతులు కలవు. ఎఱ్ఱని శరీరకాంతి, ఒక మొగము ఉండును.

ఈమె కుడిపైపున అభయముద్రను 1, టంకమును 2, అట్లే ఎడమభాగమున వరముద్రను 1, అంకుశమును 2, ధరించును. (అరుణవర్ణము)

## 164. డకార ధ్యానము

డకారిణీ పంచవక్త్రా సితా టంకగదాధరా
చతుర్బాహుః కుక్కుటస్థా వరాభయకరా చ సా ॥

ఈ డకారాదిదేవత ఐదు మొగములు, తెల్లని శరీరకాంతి, కోడిపుంజు వాహనము, నాలుగు చేతులు కలది.

ఈమె కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, టంకమును 2, అట్లే ఎడమభాగమున వరదముద్రను 1, గదను 2, ధరించును. (శుభ్రవర్ణము)

## 165. ఢకార ధ్యానము

ఢరూపిణీ శ్రీధనాఖ్యా పంచవక్త్రా మయూరగా
తటిద్గౌరీ కరై ర్ధత్తే శూలటంకవరాభయాన్ ॥

ఈ ఢకారాధిదేవత శ్రీధన యను పేరు కలది. ఈమెకు అయిదు మొగములు, నెమలి వాహనము, మెఱుపుతీగవంటి పచ్చని శరీరకాంతి. నాలుగు చేతులు కలవు.

ఈమె కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, టంకమును 2, అట్లే ఎడమభాగమున వరముద్రను 1, శూలమును 2, ధరించును. (హేమవర్ణము).

# 166. ణకార ధ్యానము

ణో ఒనంతశక్తి ర్దేవేశీ రక్తా బర్హిణవాహనా
ఏకవక్త్రా శూలశక్తివరాభయకరా శుభా ॥

ఈ ణకారాధిదేవత అనంతశక్తి యను పేరు కలది. ఈమెకు ఎఱ్ఱని శరీరకాంతి, నెమలి వాహనము, ఒక మొగము, నాల్గు చేతులు కలవు.

ఈమె కుడిప్రైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, శక్తిని 2, అట్లే ఎడమ ప్రైపున వరముద్రను 1, శూలమును 2, ధరించును. ఈమె శుభములను ఇచ్చును. (రక్తవర్ణము).

# 167. తకార ధ్యానము

తాఖ్యా సరస్వతీ శుభ్రా సితపద్మాసనాంశుకా
ఏకవక్త్రా కరై ర్ధత్తే వీణాతంత్రీవరాభయాన్ ॥

ఈ తకారాది దేవత సరస్వతి అను పేరు కలది. ఈమెకు తెల్లని శరీరకాంతి, తెల్లని తామరపూవు ఆసనము, తెల్లని వస్త్రములు, ఒక మొగము, నాల్గు చేతులు కలవు.

ఈమె కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, వీణను 2, అట్లే ఎడమభాగమున వరముద్రను 1, (తంత్రులను) పాశమును 2, ధరించి యుండును. (శుభ్రవర్ణము)

# 169. థకార ధ్యానము

పంచవక్త్రా సితా థాఖ్యా నీలకంఠా సరస్వతీ
శూలికాం కపురం ధత్తే వృషారూఢా వరాభయౌ ॥

ఈ థకారాధిదేవతకు సరస్వతి అని పేరు. ఈమెకు ఐదు మొగములు, తెల్లని శరీరము, నల్లని మెడ (కంఠము), వృషభవాహనము (ఎద్దు), నాలుగు చేతులు కలవు.

ఈమె కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, డమరుకమును 2, అట్లే ఎడమభాగమున వరముద్రను 1, గోరువంకను (తమిళ వ్యాఖ్యానము ననుసరించి, దర్పను) 2, ధరించును. (శ్వేతవర్ణము)

## 169. దకార ధ్యానము

ఏకవక్త్రారుణా దాఖ్యా అష్టభుజా భోగదాయినీ
ధత్తే అష్టౌ శారికాం వీణాం డమర్వేణవరాభయాన్ ॥

ఈ దకారాధిదేవతకు భోగదాయిని అని పేరు. ఒక మొగము, ఎఱ్ఱని శరీర కాంతి, ఎనిమిది చేతులు ఈమెకు కలవు.

ఈమె కుడివైపున క్రిందినుండి పైకి వరుసన అభయముద్రను 1, డమరుకమును 2, వీణను 3, తామరపువ్వును 4, అట్లే ఎడమవైపున వరముద్రను 1, లేడిని 2, గోరువంకను (దర్పను) 3, తామరపూవును 4, ఎనిమిది చేతులతో ధరించి ఉండును.

(అరుణవర్ణము)

## 170. ధకార ధ్యానము

శ్యామలా చామలా ధాఖ్యా హ్యేకవక్త్రా చతుర్భుజా
వృషస్థా శారికా అబ్జం కరై ర్ధత్తే వరాభయౌ ॥

ఈ ధకారాధిదేవతకు శ్యామల, అమల అని పేరులు. ఈమెకు నల్లని శరీర ఛ్ఛాయ, ఒక మొగము, నాలుగు చేతులు, వృషభవాహనము కలవు.

ఈమె కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, పద్మమును 2, అట్లే ఎడమవైపున వరముద్రను 1, గోరువంకను (దర్పను) 2, నాల్గు చేతులయందు ధరించును. (శ్యామవర్ణము)

# 171. నకార ధ్యానము

నో ఒనంతశక్తి ర్దేవీ మత్తమాతంగసంస్థితా
ఏకవక్త్రా తటిద్గౌరీ ధత్తే పద్మవరాభయాన్ ॥

ఈ నకారాధిదేవత అనంతశక్తి అను పేరు కలది. ఈమెకు మదగజము వాహనము, ఒక మొగము, నాల్గు చేతులు కలవు.

ఈమె కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, పద్మమును 2, అట్లే ఎడమవైపున వరదముద్రను 1, పద్మమును 2, నాల్గుచేతులయందు ధరించును. మెఱుపు తీగవంటి పచ్చని శరీరకాంతి ఈమెకు కలదు. (హేమవర్ణము)

# 172. పకార ధ్యానము

పా ధ్యేచ్ఛాశక్తిరూపేయం శూలశక్తివరాభయాన్
ధత్తే కరైః పంచవక్త్రా ఫుల్లపద్మాసనా ఒరుణా ॥

ఈ పకారాధిదేవత ఇచ్ఛాశక్తి అను పేరుకలది. ఈమెకు ఐదు మొగములు, ఎఱ్ఱని శరీరచ్ఛాయ, చక్కగ విప్పారిన పద్మము ఆసనము, నాలుగు చేతులు కలవు.

ఈమె కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, శూలమును 2, అట్లే ఎడమవైపున వరముద్రను 1, శక్తిని 2, నాల్గు చేతులయందు ధరించును.
(రక్తవర్ణము)

# 173. ఫకార ధ్యానము

పంచవక్త్రోగ్రసింహస్థా పాటలాతపకోమలా
ఫాఖ్యా శక్త్యైణాసిఖేటవరాభయధరా శరాన్ ॥

పాశం చ డమరుం శూలం క్రమేణ దశభిః కరైః ॥

ఈ ఫకారాధిదేవతకు సింహవాహనము, లేతఎండ వంటి కోమలమైన శరీరకాంతి, ఐదు మొగములు, పది చేతులు కలవు.

ఈమె కుడివైపున క్రిందినుండి పైకి వరుసన అభయముద్రను 1, డమరుకమును 2, బాణమును 3, కత్తిని 4, చిలుకను 5, అట్లే ఎడమవైపున వరముద్రను 1, శూలమును 2, పాశమును 3. ఖేటమును 4. లేడిని 5, ధరించును. (పాటలవర్ణము)

## 174. బకార ధ్యానము

చిచ్ఛ్యామలా బభ్రువర్ణా సింహారూఢా బరూపిణీ
ధత్తే క్రమేణ దశభిః కరైః పూర్వవదాయుధాన్ ॥

ఈ బకారదేవత చిచ్ఛ్యామల అని పేరు కలది. ఈమెకు ఎఱుపు పసుపు కలిసిన రంగుగల శరీరకాంతి, సింహవాహనము, ఐదు మొగములు, పది చేతులు కలవు.

ఈమె కుడివైపున క్రిందినుండి పైకి వరుసన అభయముద్రను 1, శూలమును 2, బాణమును 3, కత్తిని 4, చిలుకను 5, అట్లే ఎడమభాగమున వరముద్రను 1, డమరుకమును 2, పాశమును 3, ఖేటమును 4, లేడిని 5, ధరించును. (బభ్రువర్ణము)

## 175. భకార ధ్యానము

భాఖ్యా తు శ్యామలా చైకవక్త్రా భద్రాసనే స్థితా
ఉద్యద్రవినిభా ధత్తే శరచాపవరాభయాన్ ॥

ఈ భకారాదిదేవత శ్యామల అను పేరు కలది, ఈమెకు ఒక మొగము, వృషభము(ఎద్దు) వాహనము, ఉదయించుచున్న సూర్యునివంటి ఎఱ్ఱని శరీరకాంతి, నాలుగు చేతులు కలవు.

ఈమె కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, బాణమును 2, అట్లే ఎడమవైపున వరముద్రను 1, వింటిని 2, ధరించును. (సిందూరవర్ణము)

## 176. మకార ధ్యానము

మో విద్యాశ్యామలా దేవీ హయాస్యా స్ఫటికప్రభా
వీణావాదనతత్త్వజ్ఞా వరాభయకరా శుభా ॥

ఈ మకారాధిదేవతకు విద్యాశ్యామల అని పేరు, ఈమెకు గుజ్జుపుమొగము, స్ఫటికమువలె మిక్కిలి తెల్లనైన శరీరచ్ఛాయ, రెండు చేతులు కలవు.

ఈమె వీణావాదనమునందు మిక్కిలి ప్రేమకలది. కుడివైపున అభయముద్రను 1, ఎడమవైపున వరముద్రను 1, రెండు చేతులతో ధరించి యుండును. (శ్వేతవర్ణము)

## 177. యకార ధ్యానమ్

యా ఖ్యేయం దీపినీ దేవీ సింహస్థా ఒష్టభుజా సితా
శూలచాపేషుపాశాసిఖేటదానాభయాన్వితా ॥

ఈ యకారాధిదేవతకు దీపిని అని పేరు. ఈమెకు సింహము వాహనము, ఒక శిరము, ఎనిమిది చేతులు, తెల్లని శరీరకాంతి ఉండును.

ఈమె కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1. శూలమును 2. కత్తిని 3. బాణమును 4, అట్లే ఎడమవైపున వరముద్రను 1, పాశమును 2, ఖేటమును 3, వింటిని 4, ధరించును. (శుభ్రవర్ణము)

## 178. రేఫ ధ్యానమ్

రేఫాఖ్యా రేచికా శ్యామా సింహస్థా లోహితాంశుకా
పంచాస్యా ఒష్టకరైర్ధత్తే దక్షవామక్రమేణ సా ॥

ఖడ్గఖేటాంకుశగదాపాశశూలవరాభయాన్ ॥

ఈ రేఫాధిదేవత రేచిక అను పేరు కలది. ఈమెకు సింహవాహనము, ఎఱ్ఱని వస్త్రములు, ఐదు మొగములు, ఎనిమిది చేతులు, నల్లని శరీరకాంతి, యుండును.

ఈమె కుడివైపున క్రిందినుండి పైకి వరుసన అభయముద్రను 1, అంకుశమును 2, ఖడ్గమును 3, శూలమును 4. అట్లే ఎడమవైపున వరముద్రను 1, గదను 2, డాలును, 3, పాశమును 4. ఎనిమిది చేతులతో ధరించును. (శ్యామవర్ణము)

## 179. లకార ధ్యానము

లాత్మికా మోహినీ దేవీ స్వర్ణాభా గజసంస్థితా
షడ్భుజా ఒంకుశశూలాసి ఖేటదానాభయాన్వితా ॥

ఈ లకారాధిదేవతకు మోహిని అని పేరు. ఈమెకు బంగరువంటి పచ్చని శరీర ఛ్చాయ, ఏనుగు వాహనము, ఆరు చేతులు ఒక మొగము కలవు.

ఈమె కుడివైపున క్రిందినుండి పైకి వరుసన అభయముద్రను 1, కత్తిని 2, అంకుశమును 3, అట్లే ఎడమవైపున వరముద్రను 1, ఖేటమును 2, శూలమును 3, ఆరు చేతులతో ధరించి ఉండును. (బంగారువర్ణము)

## 180. వకార ధ్యానము

వాఖ్యా పారాయణీ దేవీ స్ఫాటికా భారుణాంశుకా
స్ఫుటపద్మాసనా ధత్తే పద్మద్వయవరాభయాన్ ॥

ఈ వకారదేవతకు పారాయణి అనిపేరు. ఈమెకు స్ఫటికమణివలె మిక్కిలి తెల్లనగు శరీరకాంతి, ఎఱ్ఱని వస్త్రములు. చక్కగ విప్పారిన పద్మము ఆసనము, ఒక మొగము, నాలుగు చేతులు కలవు.

ఈమె కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, పద్మమును 2, అట్లే ఎడమవైపున వరముద్రను 1, పద్మమును 2, ధరించును. (శ్వేతవర్ణము)

## 181. శకార ధ్యానము

శాఖ్యా మంగళగౌరీ తం తప్తజాంబూనదప్రభా
సహస్రపద్మపీఠస్థా దివ్యాభరణభూషితా ॥
చతుర్భుజా కరైర్ధత్తే పద్మద్వయవరాభయాన్ ॥

ఈ శకారాధిదేవతకు మంగళగౌరి అనిపేరు. ఈమెకు పుటము పెట్టిన పదారువన్నె మేలిమి బంగారువంటి శరీరకాంతి. వేయిరేకులుగల విప్పారిన పద్మము

ఆసనము, దివ్యములైన ఆభరణములచేత అలంకరింపబడిన అవయవములు, నాలుగు చేతులు, ఒక మొగము కలవు.

ఈమె కుడివైపున అభయముద్రను 1, పద్మమును 2, అట్లే ఎడమవైపున వరముద్రను 1, పద్మమును 2, ధరించును. (కనకవర్ణము)

## 182. షకార ధ్యానము

రక్తా షాన్మక్రియా దేవీ రాజహంసవరస్థితా
పీతాంబరా కరైర్ధత్తే పద్మద్వయవరాభయాన్ ॥

ఈ షకారాధిదేవతకు అన్మక్రియ అని పేరు. ఈమెకు ఎఱ్ఱని శరీరకాంతి, రాజహంస వాహనము, బంగరువన్నె వస్త్రములు, నాలుగుచేతులు, ఒక్క మొగము కలవు.

ఈమె కుడివైపున అభయముద్రను 1, పద్మమును 2, అట్లే ఎడమవైపున వరముద్రను 1, పద్మమును 2, ధరించును. (రక్తవర్ణము)

## 183. సకార ధ్యానము

సిద్ధక్రియా సకారాఖ్యా సితాంబుజనివాసినీ
పాటలాభా కరైర్ధత్తే చిదంబుజవరాభయాన్ ॥

ఈ సకారాధిదేవతకు సిద్ధక్రియ అని పేరు. ఈమెకు తెల్లని తామరపూవు ఆసనము, పాటల (తెలుపు ఎఱుపు కలసినరంగు) వర్ణముగల శరీరచ్ఛాయ, నాలుగుచేతులు, ఒక మొగము కలవు.

ఈమె కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, చిన్ముద్రను 2, అట్లే ఎడమవైపున వరముద్రను 1, పద్మమును 2, నాల్గుచేతులతో ధరించి ఉండును.

(పాటలవర్ణము)

## 184. హకార ధ్యానము

అధ్యాయినీ హకారాఖ్యా మత్తమాతంగవాహనా
పాటలాభా కరైర్ధత్తే చిదంబుజవరాభయాన్ ॥

ఈ హకారాది దేవతకు అధ్యాయిని అని పేరు. ఈమెకు మదపుటేనుగు వాహనము. సకారాది దేవతవలె పాటల వర్ణముగల శరీరచ్ఛాయ కలదు.

ఈమె కుడివైపున అభయముద్రను 1, చిన్ముద్రను (జ్ఞానముద్రను) 2, అట్లే ఎడమవైపున వరముద్రను 1, పద్మమును 2, నాల్గు చేతులయందు ధరించును.

(పాటలవర్ణము)

## 185. ళకార ధ్యానము

ళో బంధమోచనీ దేవీ స్వర్ణాభా గజసంస్థితా
షడ్భుజాంకుశశూలాసిఖేటదానాభయాన్వితా ॥

ఈ ళకారాదిదేవతకు బంధమోచని అనిపేరు. ఈమెకు బంగారువంటి చక్కని పచ్చని శరీరచ్ఛాయ, ఏనుగు వాహనము, ఆరు చేతులు, ఒక మొగము కలవు.

ఈమె కుడివైపున క్రిందినుండి పైకి వరుసన అభయముద్రను 1, కత్తిని 2, అంకుశమును 3, అట్లే ఎడమవైపున వరముద్రను 1, ఖేటమును 2, శూలమును 3, ఆరు చేతులతో ధరించును. (స్వర్ణ వర్ణము)

## 186. క్షకార ధ్యానము

క్షో మాయామాలినీ దేవీ పంచాననవరస్థితా
పంచాస్యా పాటలా ధత్తే ఖడ్గశూలవరాభయాన్ ॥

ఈ క్షకారాదిదేవతకు మాయామాలిని అనిపేరు. ఈమెకు సింహవాహనము, ఐదు మొగములు, నాలుగు చేతులు, తెలుపు ఎఱుపు కలిసిన పాటలవర్ణము శరీరచ్ఛాయ కలదు.

ఈమె కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, శూలమును 2, అట్లే ఎడమభాగమున వరముద్రను 1, ఖడ్గమును 2, నాల్గు చేతులతో ధరించును.

(పాటలవర్ణము)






(As per Kasyapa Silpasastra)

స్త్రీ విగ్రహమునకు తగిన మధ్యమ దశతాళము కొలతలు

(ఈ కొలతల వివరములు కాశ్యప శిల్ప శాస్త్రములో వివరింపబడినవి)



No. 1 Sri Raja Rajeswari Devi

శ్రీ రాజరాజేశ్వరీదేవి




No. 2 Sri Mahakali Devi

శ్రీ మహాకాళీదేవి




No. 3 Sri Maha Lakshmi Devi

శ్రీ మహాలక్ష్మీదేవి



No. 4 Sri Maha Saraswathi Devi
శ్రీ మహాసరస్వతీదేవి




No. 5 Sri Anima Sidhi Devata

శ్రీ అణిమా సిద్ధి దేవతాః



No. 6 Sri Ashta Matrika Devi
శ్రీ అష్టమాతృక దేవి



No. 7 Sri Dasa Mudra Devi

శ్రీ దశముద్రా దేవి



No. 8 Sri Gupta Yogini Devi
శ్రీ గుప్తయోగినీ దేవి



No. 9 Sri Gupta Tara Yogini Devi
శ్రీ గుప్తతరయోగినీ దేవి



No. 10 Sri Sampradaya Yogini Devi

శ్రీ సాంప్రదాయ యోగినీ దేవి




No. 15 Sri Nithya Klinna Devi
శ్రీ నిత్య క్లిన్నాదేవి




No. 16 Sri Kameshi Devi
శ్రీ కామేశీదేవి




No. 15 Sri Nithya Klinna Devi
శ్రీ నిత్య క్లిన్నాదేవి




No. 16 Sri Kameshi Devi

శ్రీ కామేశీదేవి



No. 11 Sri Kulotheerna Yogini Devi
శ్రీ కులోత్తీర్ణయోగిని దేవి




No. 12 Sri Nigarbha Yogini Devi
శ్రీ నిగర్భయోగిని దేవి



No. 14 Sri Athi Rahasya Yogini Devi
శ్రీ అతిరహస్య యోగిని దేవి




No. 13 Sri Rahasya Yogini Devi
శ్రీ రహస్యయోగిని దేవి



No. 17 Sri Bhaga Malini Devi

శ్రీ భగమాలినిదేవి



No. 18 Sri Nitya Klinna Devi
శ్రీ నిత్య క్లిన్నాదేవి



No. 19 Sri Bherunda Devi

( ) భేరుండాదేవి




No. 20 Sri Vindhya Vasini Devi

శ్రీ వింద్యా వాసినీదేవి




No. 17 Sri Bhaga Malini Devi

శ్రీ భగమాలినిదేవి



No. 18 Sri Nitya Klinna Devi

శ్రీ నిత్య క్లిన్నాదేవి




No. 21 Sri Maha Vajreswari Devi
శ్రీ మహా వజ్రేశ్వరీదేవి




No. 22 Sri Siva Dhoothi Devi

శ్రీ శివదూతిదేవి




No. 23 Thwaritha Devi

శ్రీ త్వరితాదేవి




No. 24 Sri Kula Sundari Devi
శ్రీ కులసుందరీ దేవి




No. 25 Sri Nithya Devi

శ్రీ నిత్యా దేవి




No. 26 Sri Neela Pathaka Devi

శ్రీ నీలపతాక దేవి




No. 27 Sri Vijaya Devi

శ్రీ విజయా దేవి




No. 28 Sri Sarva Mangala Devi
శ్రీ సర్వమంగళా దేవి



No. 29 Sri Jwala Malini Devi
శ్రీ జ్వాలామాలినీ దేవి




No. 30 Sri Chitra Devi
శ్రీ చిత్రాదేవి




No. 31 Sri Thripura Sundari Devi
శ్రీ త్రిపుర సుందరీదేవి




No. 33 Sri Yoga Nidra Devi
శ్రీ యోగ నిద్రాదేవి




No. 34 (18 H ınds) Sri Bhadra Kali Devi
(18 చేతుల) శ్రీ భద్రకాళి దేవి




No. 35 Sri Sakini Devi

శ్రీ శాకిని దేవి




No. 36 Sri Swadhishtana Peethastha Kakini Devi
శ్రీ స్వాధిష్టాన పీఠస్థ కాకినీ దేవి




No. 37 Sri Lakini Devi

శ్రీ లాకినీ దేవి



No. 38 Sri Rakini Devi

శ్రీ రాకినీ దేవి



No. 39 Sri Dakini Devi

శ్రీ డకినీ దేవి




No. 41 Sri Jalandhara Peethastha Yakini Devi

శ్రీ జాలంధర పీఠస్థ యాకినీ దేవి




No. 42 Sri Brahmi Devi
శ్రీ బ్రాహ్మీ దేవి




No. 43 Sri Maheswari Devi

శ్రీ మహేశ్వరీ దేవి




No. 44 Sri Kowmari Devi
శ్రీ కౌమారీ దేవి




No. 45 Sri Vaishnavi Devi
శ్రీ వైష్ణవీ దేవి




No. 46 Sri Varahi Devi
శ్రీవారాహిదేవి




No. 47 Sri Aindri Devi
శ్రీ ఐంద్రీ దేవి




No. 48 Sri Chamunda Devi
శ్రీ చాముండా దేవి




No. 49 Sri Chandika Devi
శ్రీ చండికా దేవి




No. 51 Sri Brahma Charini Durga Devi
శ్రీ బ్రహ్మ చారిణీ దుర్గా దేవి




No. 53 Sri Skanda Durga Devi

శ్రీ స్కంద దుర్గా దేవి




No. 54 Sri Kushmanda Durga Devi
శ్రీ కూష్మాండ దుర్గా దేవి




No. 59 Sri Nava Durga Devi
(Common Shape of all 9 Durgas)
శ్రీ నవదుర్గల సామాన్యరూపము




No. 60. Sri Shodasa Bhuja Durga Devi
శ్రీ షోడశ భుజ దుర్గా దేవి




No. 61 Sri Rudramsa Durga Devi

శ్రీ రుద్రాంశ దుర్గా దేవి




No. 62 Sri Ashta Bhuja Kali Devi
శ్రీ అష్ట భుజ కాళీ దేవి



No. 63 Sri Vana Durga Devi
శ్రీ వన దుర్గా దేవి




No. 64 Sri Prathyangira Devi
శ్రీ ప్రత్యంగిరా దేవి




No. 65 Sri Soolini Devi

శ్రీ శూలినీ దేవి




No. 66 Sri Dhoomravathi Devi
శ్రీ ధూమ్రావతి దేవి




No. 67 Sri Vasyamukhi Devi

శ్రీ వశ్యముఖీ దేవి




No. 68. Sri Ugratara Devi

శ్రీ ఉగ్రతారా దేవి



No. 69. Sri Kuru Kulla Devi
శ్రీ కురు కుల్లా దేవి




No. 70 Sri Varuni Devi

శ్రీ వారుణీ దేవి




No. 71 Sri Aparajita Devi
శ్రీ అపరాజితా దేవి




No. 73 Sri Swasthavesini Devi
శ్రీ స్వస్థావేశినీ దేవి




No. 74 Sri Dandanadha Varahi Devi

శ్రీ దండనాథా వారాహి దేవి




No. 76 Sri Suddha Varahi Devi
శ్రీ శుద్ధ వారాహీ దేవి




No. 77 Sri Laghu Syamala Devi

శ్రీ లఘు శ్యామలా దేవి




No. 78 Sri Raja Mathangi Devi
శ్రీ రాజ మాతంగి దేవి




No. 79 Sri Bala Devi

శ్రీ బాలా దేవి




No. 80 Sri Bhuvaneswari Devi

శ్రీ భువనేశ్వరి దేవి




No. 81 Sri Mrutha Sanjivini Devi
శ్రీ మృత సంజీవినీ దేవి




No. 82 Sri Bagala Devi

శ్రీ బగలా దేవి




No. 83 Sri Prana Sakti Devi
శ్రీ ప్రాణ శక్తి దేవి




No. 84 Sri Suddha Vidya Devi
శ్రీ శుద్ధ విద్యా దేవి




No. 85 Sri Vidya Devi

శ్రీ విద్యా దేవి




No. 86. Sri Kama Kaleswari Devi

శ్రీ కామ కాళేశ్వరీ దేవి




No. 87 Sri Vana Sankari Devi

శ్రీ వన శంకరీ దేవి




No. 88 Sri Sakambari Devi
శ్రీ శాకాంబరీ దేవి




No. 89 Sri Sura Devi
శ్రీ సురా దేవి




No. 90. Sri Chathusshasti Kala Devi
శ్రీ చతుష్షష్ట కళా దే




No. 91 Sri Sarva Varneswari Devi

శ్రీ సర్వ వర్ణేశ్వరీ దేవి




No. 92 Sri Dawadasardha Devi
శ్రీ ద్వాదశార్ధ దేవి




No. 93 Sri Tiraskarini Devi

శ్రీ తిరస్కరిణీ దేవి



No. 94 Sri Aswarudha Devi

శ్రీ అశ్వాహూఢా దేవి



No. 95 Sri Indrakshi Devi

శ్రీ ఇంద్రాక్షీ దేవి



No. 96 Sri Thulaja Bhavani Devi
శ్రీ తుంజా భవానీ దేవి



No. 97 Sri Chandra Parameswari Devi

శ్రీ చంద్రాపరమేశ్వరీదేవి




No. 98 Sri Thulasi Devi
శ్రీ తులసీదేవి




No. 99 Sri Gayathri Devi

శ్రీ గాయత్రీదేవి




No. 100 Sri Savitri Devi

శ్రీ సావిత్రీదేవి




No. 101 Sri Saraswathi Devi

శ్రీ సరస్వతీదేవి




No. 102 Sri (Dvibhuja) Annapurna Devi
శ్రీ (ద్విభుజ) అన్నపూర్ణాదేవి



No. 103 Sri Chathurbhuja Annapoorna Devi
శ్రీ చతుర్భుజ అన్నపూర్ణాదేవి




No. 104 Sri Agni Durga Devi
శ్రీ అగ్నిదుర్గా దేవి




No. 105 Sri Seetala Devi
శ్రీ శీతలా దేవి




No. 106 Sri Lopamudra Devata Devi
శ్రీ లోపాముద్ర దేవతా దేవి




No. 107 Sri Dwibhuja Lakshmi Devi
శ్రీ ద్విభుజాలక్ష్మి దేవి



No. 108 Sri Gaja Lakshmi Devi
శ్రీ గజలక్ష్మి దేవి



No. 109 Sri Maha Laxmi Devi

శ్రీ మహాలక్ష్మి దేవి




No. 111 Sri Veera Laxmi Devi
శ్రీ వీరలక్ష్మి దేవి




No. 112 Sri Dwibhuja Veera Laxmi Devi
శ్రీ ద్విభుజ వీరలక్ష్మి దేవి




No. !13 Sri Ashtabhuja Veera Lakshmi Devi

శ్రీ అష్టభుజ వీరలక్ష్మీదేవి




No. 114 Sri Prasanna Lakshmi Devi
శ్రీ ప్రసన్న లక్ష్మీదేవి




No. 115 Sri Vishnu Parivara Sakthi Devi
శ్రీ విష్ణు పరివారశక్తి దేవి




No. 112 Sri Dwibhuja Veera Laxmi Devi
శ్రీ ద్విభుజ వీరలక్ష్మి దేవి




No. 113 Sri Ashtabhuja Veera Lakshmi Devi
శ్రీ అష్టభుజ వీరలక్ష్మీదేవి




No. 114 Sri Prasanna Lakshmi Devi

శ్రీ ప్రసన్న లక్ష్మీదేవి




No. 115 Sri Vishnu Parivara Sakthi Devi
శ్రీ విష్ణు పరివారశక్తి దేవి




No. 116 Sri Sowbhagya Bhuvaneswari Devi
శ్రీ సౌభాగ్య భువనేశ్వరీదేవి




No. 117 Sri Maya Bhuvaneswari Devi
శ్రీ మాయా భువనేశ్వరీదేవి




No. 118 Sri Vajra Prastharini Devi

శ్రీ వజ్ర ప్రస్తరిణీదేవి




No. 119 Sri Trikantaki Devi
శ్రీ త్రికంటకీదేవి



No 120. Sri Mohini Nithya Devi

శ్రీ మోహినీ నిత్యాదేవి




No. 121 Sri Jaya Durga Devi

శ్రీ జయదుర్గాదేవి




No. 122 Sri Vindhya Vasini Devi
శ్రీ వింధ్య వాసినీదేవి




No. 123 Sri Ripumarini Devi
శ్రీ రిపుమారిణీదేవి




No. 124 Sri Tripura Bhairavi Devi

శ్రీ త్రిపుర భైరవీదేవి




No. 125 Sri Samvit Tripura Devi

శ్రీ సంవిత్త్రిపురాదేవి




No. 126 Sri Bala Thripura Sundhari Devi

శ్రీ బాలా త్రిపురసుందరీదేవి




No. 127 Sri Nithya Devi
శ్రీ నిత్యాదేవి




No. 124 Sri Tripura Bhairavi Devi

శ్రీ త్రిపుర భైరవీదేవి




No. 125 Sri Samvit Tripura Devi

శ్రీ సంవిత్త్రిపురాదేవి




No. 1 26 Sri Bala Thripura Sundhari Devi

శ్రీ బాలా త్రిపురసుందరీదేవి



No. 127 Sri Nithya Devi
శ్రీ నిత్యాదేవి



No. 128 Sri Thwaritha Devi
శ్రీ త్వరితాదేవి




No. 129 Sri Kalarathri Devi
శ్రీ కాళరాత్రీదేవి




No. 130 Sri Vageeswari Devi
శ్రీ వాగీశ్వరీదేవి




No. 131 Sri Dhenu Vageeswari Devi
శ్రీ ధేనువాగీశ్వరీదేవి




No. 132 Sri Sowbhagyavageeswari Devi
శ్రీ సౌభాగ్య వాగీశ్వరీదేవి




No. 133 Sri Padma (Laxmi) Devi
శ్రీ పద్మా (లక్ష్మీదేవి)




No. 134 Sri Chathusshashti Yogini Devi (1)
శ్రీ చతుష్షష్టి యోగినీదేవి




No. 134 Sri Chathusshashti Yogini Devi (2)
శ్రీ చతుష్షష్టి యోగినీదేవి




No. 134 Sri Chatusshasti Yogini Devi (3)
శ్రీ చతుష్షష్టి యోగినీదేవి




No. 134 Sri Chatusshasti Yogini Devi (4)
శ్రీ చతుష్షష్టి యోగినీదేవి




No. 134 Sri Chatusshasti Yogini Devi (5)
శ్రీ చతుష్షష్టి యోగినీదేవి




No. 136 Sri Akara Devata

శ్రీ అ[illegible]ర దేవత



No. 138 Sri Ekara Devi

శ్రీ ఇకారదేవి




No. 139 Sri 'Ee'Kara Devi

శ్రీ 'ఈ'కార దేవి




No. 140 Sri Ukara Devi
శ్రీ ఉకారదేవి



No. 141 Sri 'Oo'kara Devi

శ్రీ 'ఊ'కార దేవి




No. 142 Sri Rukara Devi
శ్రీ ఋకార దేవి




No. 143 Sri Rookara Devi

శ్రీ రూకార దేవి




No. 144 Sri Lukara Devi

శ్రీ ఌకారదేవి




No. 145 Sri Loo kara Devi

శ్రీ [illegible]కార దేవి




No. 146 Sri 'A'kara Devi
శ్రీ 'ఎ'కార దేవి



No. 147 Sri 'I'kara Devi

శ్రీ 'ఐ'కార దేవి




No. 148 Sri 'O'kara Devi

శ్రీ 'ఓ'కార దేవి




No. 149 Sri 'Ow'kara Devi

శ్రీ 'ఓ'కార దేవి




No. 150 Sri 'Aam'kara Devi
శ్రీ 'అం'కార దేవి




No 151 Sri Visarga Devi

శ్రీ అఃకార దేవి




No. 152 Sri 'Ka'kara Devi
శ్రీ 'క' కార దేవి




No. 153 Sri Khakara Devi

శ్రీ 'ఖ' కార దేవి




No. 154 Sri 'Ga' Kara Devi
శ్రీ 'గ' కార దేవి




No. 155 Sri 'Gha' Kara Devi
శ్రీ 'ఘ' కార దేవి




No. 156 Sri 'Gna' Kara Devi

శ్రీ 'ఞ'కార దేవి




No. 157 Sri 'Cha'kara Devi

శ్రీ 'చ'కార దేవి




No. 158 Sri 'Cha'Kara Devi

శ్రీ 'చ'కార దేవి




No. 159 Sri 'Ja'kara Devi
శ్రీ, జకార దేవి




No. 160 Sri 'Jha'kara Devi
శ్రీ 'ఝ'కార దేవి




No. 162 Sri Takara Devi

శ్రీ 'ట'కార దేవి



No. 163 Sri 'Tta'kara Devi

శ్రీ 'ట'కార దేవి



No. 164 Sri 'Da'kara Devi

శ్రీ 'డ'కార దేవి



No. 165 Sri 'Dha'kara Devi

శ్రీ 'ధ'కార దేవి




No. 167 Sri 'Tha'kara Devi

శ్రీ ఠకార దేవి



No. 168 Sri 'Tha'kara Devi
శ్రీ 'ఠ'కార దేవి




No. 169 Sri Dakara Devi

శ్రీ 'ద'కార దేవి




No. 170 Sri 'Dha'kara Devi

శ్రీ 'ధ'కార దేవి



No. 171 Sri 'Na'kara Devi

శ్రీ 'న'కార దేవి




No. 17. Sri 'Pa'kara Devi
శ్రీ 'ప'కార దేవి



No. 173 Sri 'Pha'kara Devi
శ్రీ 'ఫ'కార దేవి




No. 174 Sri 'Ba'kara Devi
శ్రీ 'బ'కార దేవి




No. 175 Sri 'Bha'kara Devi
శ్రీ 'భ'కార దేవి




No. 176 Sri 'Ma'kara Devi
శ్రీ 'మ' కార దేవి




No. 177 Sri 'Ya'kara Devi
శ్రీ 'య'కార దేవి




No. 178 Sri Refa Devi
శ్రీ రేఫా దేవి




No. 179 Sri 'La'kara Devi

శ్రీ 'ల'కార దేవి




No. 180 Sri 'Va'kara Devi

శ్రీ 'వ'కార దేవి




No. 181 Sri Sha'kara Devi
శ్రీ శాకారదేవి



No. 182 Sri 'Sha'kara Devi
శ్రీ 'ష'కార దేవి




No. 183 Sri 'Sa'kara Devi
శ్రీ 'స'కార దేవి



No. 184 Sri 'Ha'kara Devi
శ్రీ హకార దేవి




No. 185 Sri 'Lla'kara Devi
శ్రీ 'ఌ'కార దేవి




No. 186 Sri 'Ksha'kara Devata

శ్రీ 'క్ష'కార దేవత




Sri Chamundi Devi

శ్రీ చాముంటీ దేవి

ఓం

# శివమూర్తి ధ్యానములు

—※ ※ ※—

## 1. మహేశ్వర ధ్యానము

(శివపంచాక్షరి మంత్రము ననుసరించినది)

శాంతం పద్మాసనస్థం శశిధరమకుటం
పంచవక్త్రం త్రిణేత్రం
శూలం వజ్రం చ ఖడ్గం పరశుమభయదం
దక్షభాగే వహంతమ్ ।
నాగం పాశం చ ఘంటాం ప్రళయహుతవహం
సాంకుశం వామభాగే
నానాలంకారయుక్తం స్ఫటికమణినిభం
పార్వతీశం నమామి ॥

శ్రీ మహేశ్వరమూర్తి స్ఫటికమువలె మిక్కిలి తెల్లనైన శరీరకాంతితో, పరమ శాంతమైన రూపముతో. పద్మాసనముతో, చంద్రకళచే నలంకరింపబడిన కిరీటముతో, (జటాజూటముతో,) సద్యోజాతము, వామదేవము, అఘోరము, తత్పురుషము, ఈశానము, అను నైదు మొగములతో, మూడు కన్నులతో (ప్రతిముఖమునందు), పదిచేతులతో, భూషణము లన్నింటిచే నలంకరింపబడిన సర్వాంగములతో నుండును.

కుడిభాగమున క్రిందినుండి పైకి వరుసన అభయముద్రను 1, గొడ్డలిని 2, కత్తిని 3, వజ్రమును 4, శూలమును 5, అట్లే ఎడమభాగమున నాగమును 1, పాశమును 2, గంటను 3, ప్రళయాగ్నిని 4, అంకుశమును 5, పదిచేతులతో ధరించి యుండును.

ఇట్టి రూపముతో, ప్రకాశించు పార్వతీప్రియుడగు శ్రీ మన్మహేశ్వరస్వామిని నమస్కరించుచున్నాను. (శ్వేతవర్ణము)

## 2. శ్రీ గౌరీ ధ్యానము

(నృసింహప్రాసాదము)

గౌరీ శుక్లాంబరా దేవీ రూపే ణాప్రతిమా భువి
పృథ క్చతుర్భుజా కార్యా దేవీ సింహాసనే శుభా ॥

సింహాసనే ఒస్యాః కర్తవ్యం కమలం చారుకర్ణికమ్
అష్టపత్రం మహాభాగా కర్ణికాయాం సుసంస్థితా ॥

వినాయకవ దాసీనా దేవీ కార్యా మహాభుజా
బృహన్నాలం కరే కార్యం తస్యా శ్చ కమలం శుభమ్ ॥

దక్షిణే యాదవశ్రేష్ఠ కేయూరప్రాంతసన్నిభమ్
వామే ఒమృతఘటః కార్య స్తథా రాజన్ మనోహరః ॥

తస్యా అన్యౌ కరౌ కార్యౌ బిల్వశంఖధరా వితి ॥

ఒక చక్కని సింహాసనమును నిర్మించి దానియందు ఎనిమిది దళములు కలిగిన చక్కని కర్ణికలో ఒక అందమైన పద్మమును నిర్మింపవలెను. ఆ పద్మకర్ణికయందు సాటిలేని రూపముతో, తెల్లని వస్త్రములతో, నాల్గుచేతులతో, వేరుగా వినాయకుని వలె కూర్చుండిన శ్రీ గౌరీదేవిని నిర్మింపవలెను.

కుడిభాగమున క్రిందినుండి పైకి పెద్దకాడగలిగిన పద్మమును (దండగడియము వరకు ఉండునట్లు)1, మారేడుపండును 2, అట్లే ఎడమభాగమున అమృతకలశమును 1, శంఖమును 2, ధరించిన నాల్గుచేతు లుండవలెను.

ఓ యాదవశ్రేష్ఠుడవగు మహారాజా : ఈ గౌరీదేవి మరకతమణులవలె అతి పచ్చని రంగుకలది. (మరకతవర్ణము)

# 3. శ్రీ మహాకైలాసమూర్తి ధ్యానము

(స్కాందము-శంకరసంహిత-ఉపదేశకాండము)

శృణుత బ్రాహ్మణాః సర్వే గుహ్యా ద్గుహ్యతరం పరమ్
అస్తి మేరో రుదగ్భాగే మహాన్ కైలాసపర్వతః ॥

సాంబస్య సగుణ స్యాయం సభక్త స్యేందుమౌళినః
సంవాసో యోజనానాం చ వింశత్కోటిభి రాయతః ॥

ఔన్నత్య మేత ద్ద్విగుణ మస్య జ్ఞేయం ద్విజోత్తమాః
నవరత్నమయం తస్య మధ్యే శిఖర ముత్తమమ్ ॥

త త్రాలయో మహేశస్య నానారత్నవిచిత్రితః
ప్రాకారగోపురాట్టాలవలభీభి ర్విరాజితః ॥

తథా సింహాసనే తత్ర మహా ఞ్ఛంభు స్సదాశివః
ప్రఫుల్లకమలోల్లాసపంచవింశన్ముఖోజ్జ్వలః ॥

ధృతనానాయుధోద్భాసిపంచాశత్కరమండితః
ఫుల్లరక్తాంబుజాత్తశ్రీబాహ్వాంఘ్రియుగళోజ్జ్వలః ॥

విచిత్రరత్నఖచితభూషణై రపి భూషితః
అనేకకోటిసూర్యాభః పరమానందవిగ్రహః ॥

అప్రాకృతతనుః శ్రీమాన్ లక్ష్యలక్షణవర్జితః
యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ ॥

గంగాశ్రయజటాజూట శ్చంద్రరేఖావిభూషితః
భస్మోద్ధూళితసర్వాంగో వ్యాలయజ్ఞోపవీతవాన్ ॥

కపాలమాలాధారీ చ వ్యాఘ్రచర్మాంబరావృతః
ప్రతివక్త్రం త్రిణయనో భక్తసర్వార్థసిద్ధిదః ॥

ప్రసార్య దక్షిణం పాదం కుంచయిత్వేతరం పదమ్
అభయం చక్రశూలే చ టంకబాణౌ గదాంబుజే ॥

ఖడ్గతోమరశక్తీ శ్చ పరశుప్రాసపన్నగాన్
హలాంకుశాక్షమాలా శ్చ చ్ఛురికాం ధ్వజదండకౌ ॥

వజ్రకుంతాస్థిదంష్ట్రా శ్చ క్రకచం భిండివాలకమ్
పంచవింశతిబాహాభి ర్దధానో దక్షిణైః శుభైః ॥

వరచాపౌ మృగం శంఖం ఖేటపాశపరశ్వధాన్
ముద్గరం డమరుం ఘంటాం రుద్రవీణాం చ పుస్తకమ్ ॥

కపాలముండఖట్వాంగభుశుండీపరిఘా నపి
ఫలకం పట్టసం వేత్రం కమండలుహంతాశనౌ ॥

కర్తరీం-ముసలం పింఛం బిభ్ర ద్వామై స్తథా కరైః
మహాన్ సదాశివ స్సో ఽయం రాజతే తత్ర పర్వతే ॥

ఓ బ్రాహ్మణశ్రేష్ఠులారా ! రహస్యములలో పరమరహస్యమగు ఈ విషయమును వినుడు !

మేరుపర్వతముయొక్క ఉత్తరభాగమున కైలాసమను గొప్పపర్వతము కలదు. అది ఎదమభాగమున సర్వమంగళాదేవితో నున్న చంద్రశేఖరుడగు పరమశివునకు నివాసము. ఆస్వామి ఆపర్వతమున భక్తులతో, ప్రమథగణములతో నుండును.

ఆకైలాసము ఇరువదికోట్ల ఆమడలపొడవుతో, నలుబదికోట్ల ఆమడలఎత్తుతో, నుండును. అట్టి పర్వతమునందు ప్రాకారములతో, గోపురములతో (ప్రధానద్వారములు), అట్టగృహములతో (బురుజులు), వలభీమార్గములతో, ఆ పరమశివుని నివాసమందిరము కలదు. అందు అడుగడుగున వివిధరత్నములు పొదగబడినవి. అందుచే నది చిత్రవిచిత్రవర్ణములతో నుండును.

అట్టి నివాసమందిరమందు గొప్పసింహాసన మున్నది. దానియందు శ్రీమన్మహా పరమశివుడు చక్కగ వికసించిన కమలములవంటి ఇరువదియైదు ముఖములతో వివిధములగు ఆయుధములను పట్టుకొనిన ఏబది చేతులతో విప్పారిన ఎఱ్ఱతామరపూలవంటి హస్తములతో, పాదములతో, వివిధములగు మణులు పొది

గిన బంగారు నగలతో, కోటిసూర్యుల కాంతులను వెక్కిరించు ఆనందదాయకమగు రూపముతో, వాక్కులకు మనస్సునకు అందరాని, లక్ష్యలక్షణములకు దూరమగు మహా తేజముతో, గంగాజటాజూటముతో, నెలవంక శిరోభూషణముతో, భస్మోద్ధూళితములగు (విభూతిపూసికొనిన) సర్వాంగములతో, పాముల జందెముతో, కపాలముల మాలలతో (దండలతో), పులితోలు వస్త్రముతో, ప్రతిముఖమునందు మూడుమూడు కన్నులతో, కుడికాలును బాగుగా చాపి, ఎడమకాలును కుంచించి (ముడిచి) భక్తులకోరికల నెల్ల ప్రేమతో నను్గ్రహించుచు నతివసించును.

కుడిభాగమున క్రిందినుండి పైకి క్రమమున అభయముద్రను 1, చక్రమును 2, శూలమును 3, టంకమును 4, బాణమును 5, గదను 6, పద్మమును 7, ఖడ్గమును 8, తోమరమును 9, శక్తిని 10, గొడ్డలిని 11, ప్రాసమును 12, నాగమును 13, నాగలిని 14 అంకుశమును 15, జపమాలను 16, చిన్నకత్తిని 17, ధ్వజమును 18, దండమును 19, వజ్రమును 20, కుంతమును 21, ఎముకను 22, దంష్ట్రను 23, అంపమును 24, భిండి పాలమును 25,

అట్లే ఎడమవైపున వరముద్రను 1, వింటిని 2, లేడిని 3, శంఖమును 4, ఖేటమును 5, పాశమును 6, గొడ్డలిని 7, ముద్గరమును 8, డమరుకమును 9, గంటను 10, రుద్రవీణను 11, పుస్తకమును 12, కపాలమును 13, పుట్టిను 14, ఖట్వాంగమును 15, భుశుండిని 16, పరిఘమును 17, ఫలకమును 18, పట్టిసమును 19, వేత్రమును 20, (బెత్తమును), కమండలువును 21, అగ్నిని 22, కత్తెరను 23, రోకలిని 24, పింఛమును 25,

కుడిఎడమల ఏబదిహస్తములతో ధరించి మహోజ్జ్వలమగు రూపముతో శ్రీమన్మహాపరమేశ్వరుడు ఉండును. (శ్వేతవర్ణము)

## 4. ముప్పదిరెండు భుజములుగల అఘోరమూర్తి ధ్యానము

(శివతత్త్వరత్నాకరము)

ఏకవక్త్రం సదానందం ద్వాత్రింశద్భుజసంయుతమ్
జటామకుటసంయుక్తం త్రిణేత్రం చంద్రశేఖరమ్ ॥

అభయం ఖడ్గశూలం చ చక్రం డమరుకం తథా
పధాన ముష్టిబాణౌ చ గదాం పద్మం కపాలకమ్ ॥

జ్ఞానముద్రాం కుంతహస్త మంకుశం చాక్షమాలికామ్
ఖట్వాంగం పరశుం చైవ దధానం దక్షిణైః కరైః ॥

వరం చ ఫలకం చైవ టంకం పాశం చ ముద్గరమ్
నాగ మగ్నిం మృగం ఘంటాం ధను శ్చ కటిహస్తకమ్ ॥

రత్నం చ కుముదం కుంభం ముసలం పుస్తకం తథా
ఏతదాయుధసంయుక్తం రుండమాలావిభూషితమ్ ॥

నమా మ్యహం కాలముండశిరస్థ మభయప్రదమ్ ॥

ఈ అఘోరమూర్తి ఒక ముఖములో, మూడు కన్నులతో, ముప్పదిరెండు చేతులతో, జటాజూటముల, నెలవంక శిరోభూషణముతో, కపాలముల దండలతో. కాల ముండుడు అనువాని శిరమునం దుండును.

కుడిభాగమున (క్రిందినుండి పైకి వరుసన అభయముద్రను 1, కత్తిని 2, శూలమును 3, చక్రమును 4, చమయకమును 5, ఎముకను 6, బాణమును 7, గదను 8, పద్మమును 9, కపాలమును 10, జ్ఞానముద్రను 11, కుంతమును 12, అంకుశమును 13, జపమాలను 14, ఖట్వాంగమును 15, గొడ్డలిని 16.

అట్లే ఎడమభాగమున వరముద్రను 1, ఖేటమును 2, టంకమును 3, పాశమును 4, ముద్గరమును 5, నాగమును 6, అగ్నిని 7, మృగమును 8, గంటను 9, ధనుస్సును 10, కటిహస్తమును (నడుమున) 11, రత్నపాత్రమును 12, కలువపువ్వును 13, కుంభమును 14, ముసలమును 15, పుస్తకమును 16.

కుడిఎడమల ముప్పదిరెండు చేతులతో ధరించి అన్నిభయములను పోగొట్టునట్టి శుభమూర్తియైన ఈ అఘోరమూర్తికి నమస్కారము చేయుచున్నాను. (నీలవర్ణము)

## 5. శ్రీ దశభుజుడైన అఘోరమూర్తి ధ్యానము

(పాంచరాత్రము)

పరశుం డమరుం ఖడ్గఖేటౌ బాణశరాసనే
శూలం కపాల మభయవరౌ దధత మిష్టదమ్ ॥

త్రిలోచనం భీషణాస్యం నీలాంగం రక్తవాససమ్
అహిభూషితసర్వాంగం తమఘోర ముపాస్మహే ॥

ఈ అఘోరమూర్తి నల్లని శరీరచ్ఛాయతో, భయంకరమైన మొగముతో, మూడు కన్నులతో, పదిచేతులతో, ఎఱ్ఱని వస్త్రములతో, పాముల నలంకరించిన సర్వాంగములతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి క్రమమున అభయముద్రను 1. శూలమును 2. బాణమును 3. కత్తిని 4. ఢమరుకమును 5. అట్లే ఎడమవైపున వరముద్రను 1. కపాలమును 2. వింటిని 3. ఖేటమును 4. గొడ్డలిని 5.

కుడిఎడమల పదిచేతులతో ధరించిన ఆ యఘోరమూర్తిని మేమెల్లరము ఉపాసనము చేయుచున్నాము. (నీలవర్ణము)

## 6. శ్రీ మహాకాళీసమేత మహాకాల ధ్యానము
(లలితోపాఖ్యానము)

మహాకాలో ఘనశ్యామః కాల్యాలింగిత విగ్రహః
శ్యామకంచుకధారీ చ మదారుణవిలోచనః ॥

బ్రహ్మాండచషకే పూర్ణం పిబ న్విశ్వరసాసవమ్
మహాకాళీం ఘనశ్యామా మనంగార్ద్రా ముపాంగయన్ ॥

సింహాసనే సమాసీనః కల్యాణకలనాత్మకే
కాలమృత్యుముఖై ర్యుక్తః సర్వలోకైకభక్షకః ॥

లలితాధ్యానసంపన్నో లలితాపూజనోత్సుకః
వితన్వన్ లలితాభక్తే ష్వాయుషో దీర్ఘదీర్ఘతామ్ ॥

శ్రీమహాకాలస్వామి మేఘము వలె నల్లనగు శరీరకాంతులతో, శ్రీ మహాకాళీదేవి చేత కౌగిలించుకొనబడిన విగ్రహముతో, నల్లని వస్త్రములను ధరించిన రూపముతో, మదముచేత ఎఱ్ఱబడిన కన్నులతో, శుభాత్మకమైన (శుభమైన) సింహాసనము నధిష్ఠించి

కాలమృత్యువు మున్నగు పరిజనముచేత పరివేష్టింపబడి (చుట్టుముట్టబడి సేవింపబడుచు) యుండును.

మేఘమువలె నల్లనై, అనురాగముచేత నిండిన, శ్రీ మహాకాళీదేవిని తన కడగంటి చూపులచేత చూచుచు ఉండును.

ఇట్టి సర్వలోకభక్షకుడగు ఈస్వామి బ్రహ్మాండమును గిన్నెయందు విశ్వరస మను మద్యమును నింపి త్రాగుచు, శ్రీ లలితాదేవీధ్యానముతో శ్రీలలితాదేవికి భక్తులగు వారలయొక్క ఆయుస్సులను పెంచుచుండును. వారలను చిరకాలము జీవించువారినిగా చేయుచుండును. (నీలవర్ణము)

## 7. అమృతమృత్యుంజయ ధ్యానము

(కారణాగమము)

చంద్రోపరిష్ఠా త్సంబద్ధపద్మాసనవిరాజితమ్
చంద్రవర్ణం స్రవద్దివ్యామృత చంద్రకళాధరమ్ ॥

యోగముద్రైక సంబద్ధాధరహస్తద్వయాన్వితమ్
అమృతాపూర్ణ కనక కలశాహస్త కరద్వయమ్ ॥

సోమసూర్యాగ్ని నేత్రం చ బద్ధపింగజటాధరమ్
నాగాభరణసంభూషం నాగయజ్ఞోపవీతినమ్ ॥

వ్యాఘ్రచర్మాంబరధరం దేవం భక్తానుకంపినమ్
భస్మానులేపినం రుద్రం మృత్యుంజయం శివం స్మరేత్ ॥

ఈ అమృతమృత్యుంజయమూర్తి చంద్రునివలె తెల్లనగు శరీరచ్ఛాయలతో, శిరమున సంకరింపబడిన అమృతమును స్రవించు చంద్రరేఖతో, యోగధ్యానముద్ర చేత బంధింపబడిన రెండు పెదవులతో, రెండు చేతులలో, అమృతమును నింపిన బంగారు కలశమును పట్టుకొనిన మఱిరెండు చేతులతో, (మొత్తము నాల్గుచేతులతో) లేతపసుపురంగుగల జడలచేత కట్టబడిన జటాజూటముతో, చంద్రుడు, అగ్ని, సూర్యుడు అను మూడుకన్నులతో, పాముల భూషణములతో, పాముల జందెముతో, పులితోలు వస్త్రముతో, భస్మమును పూసికొనిన సర్వావయవములతో, చంద్రుని పైభాగముననున్న పద్మాసనమునందు ఉపవిష్టుడై (కూర్చున్నవాడై) ఉండును.

భక్తులను అనుగ్రహించు మృత్యుంజయుడగు ఇట్టి రుద్రుని స్మరింపవలెను.
(శుభ్రవర్ణము)

## 8. నీలకంఠ ధ్యానము

(పాంచరాత్రము)

జటాబద్ధకలానాథం భోగిభూషణభూషితమ్
అక్షమాలాం చ శూలం చ కపాలం దధతం కరైః ॥

ఖట్వాంగ మపి పంచాస్యం వసానం వ్యాఘ్రచర్మ చ
త్రిణేత్ర మబ్జనిలయం బాలార్కసదృశప్రభుమ్ ॥

సాధకాభీష్టదాతారం నీలకంఠ మహం భజే ॥

శ్రీ నీలకంఠస్వామి బాలసూర్యునివలె ఎఱ్ఱనగు శరీరకాంతులతో, జటాజూటమున అలంకరింపబడిన చంద్రరేఖముతో, పాముల నగలతో, ఐదు మొగములతో, ప్రతిముఖము నందు మూడుమూడు కన్నులతో, నాల్గుచేతులతో, పులితోలువస్త్రముతో, పద్మమను ఆసనమున నుండును.

కుడిభాగమున క్రిందినుండి పైకి శూలమును 1, జపమాలను 2, అట్లే ఎడమ భాగమున కపాలమును 1, ఖట్వాంగమును 2, నాల్గుచేతులతో ధరించిన ఈ నీలకంఠ స్వామి భక్తుల కోరికలను ఇచ్చుచుండును. అట్టి శ్రీస్వామిని నేను భజింతును.
(అరుణవర్ణము)

## 9. శ్రీ రుద్రమూర్తి ధ్యానము

కైలాసాభం పంచవక్త్రం దేవ్యా యుక్తం త్రిలోచనమ్
నీలకంఠం సర్పభూషం వ్యాఘ్రచర్మాంబరావృతమ్ ॥
అక్షమాలావరాభీతికమండలులసత్కరమ్
చంద్రగంగాజటాజూటం రుద్రం తం ప్రణమా మ్యహమ్ ॥

శ్రీరుద్రమూర్తి కైలాసమువలె తెల్లనగు శరీరకాంతులతో, ఐదు మొగములతో, ప్రతిముఖమునందు మూడుమూడు కన్నులతో, నాల్గుచేతులతో, నల్లని (విషమువలన

నల్లనైన) కంఠముతో, పాముల భూషణములతో, పులితోలు వస్త్రముతో, చంద్రకళచేత, గంగాదేవిచేత అలనకరింపబడిన జటాజూటములో నుండును.

కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, జపమాలను 2, అట్లే ఎడమపైపున వరముద్రను 1, కమండలమును 2, కుడిఎడమల నాల్గుచేపలతో, ధరించి పరమేశ్వరీదేవితో నున్న శ్రీరుద్రమూర్తిని నేను నమస్కరింతును. (శ్వేతవర్ణము)

## 10. సపరివారుడైన ఉమామహేశ్వరుని ధ్యానము

(కారణాగమము)

వామే శైలసుతా పుర స్తు వృషభః
పశ్చా త్సురేంద్రాదయో
దైత్యారి శ్చ విధి శ్చ పార్శ్వతలయో
ర్వాయ్వాదికోణేషు చ ।
భృంగినారదబాణభైరవగజా
స్యస్కందవీరేశ్వరా
మధ్యే శుభ్రసరోజకోమలరుచం
శంభుం భజే పాండురమ్ ॥

ఎడమభాగమున ఉమాదేవి, ముందుభాగమున వృషభము (ఎద్దు) వెనుక భాగమున ఇంద్రాదిదేవతలు, కుడిఎడమల ఉభయపార్శ్వములయందు నారాయణుడును, బ్రహ్మయును, వాయవ్యకోణమున భృంగియును, నారదుడును, ఈశాన్యకోణమున బాణదైత్యుడును, కాలభైరవుడును, ఆగ్నేయకోణమున గణపతియును, కుమారస్వామియును, నైరృతికోణమున వీరభద్రుడు పరివేష్టించియుండ, ఈ పరిజనుల నడుమ స్ఫటికమువలె మిక్కిలి తెల్లనగు తామరపుష్పకాంతులుగల కోమల శరీరచ్ఛాయలతో ప్రకాశించు ఉమామహేశ్వరస్వామిని భజింతును. (శ్వేతవర్ణము)

## 11. శ్రీ సభాపతి ధ్యానము

(కారణాగమము)

కైలాసశైలశిఖరే త్రిజగజ్జనిత్రీం
గౌరీం నివేశ్య కనకాంచితరత్నపీఠే ।

నృత్యంత మాదిపురుషం శశిశేఖరం తం
దేవాః ప్రదోషసమయే ఒనుభజంతి సర్వే ॥

బ్రహ్మ తాలధరో హరి స్సపటహో వీణాకరా భారతీ
వంశద్వంద్వయుతౌ సుభాస్వరకరా
మార్తాండసోమౌ శుభౌ ।

గాకౌ తుంబురునారదౌ సముురజౌ నంది కుమార స్తథా
రుద్రో నృత్తకరః స్వభావజనితం నాట్యం సదా పాతు నః ॥

ఆదిపురుషుడైన శ్రీమన్మహాపరమశివుడు సాయంసమయమున కైలాసపర్వత శిఖరమునందు బంగారు పీఠమున ముజ్జగములకు మాతృమూర్తియగు శ్రీ గౌరీదేవిని ప్రతిష్ఠించి ఆదేవియందలి భక్తిపారవశ్యమున నృత్యముచేయసాగెను. అంత నాపరమేశ్వరుని పరివారసభ్యులగు దేవతాశ్రేష్ఠు లెల్లరు ఆతని ననుసరించి ఈక్రిందివిధమున భజింప దొడగిరి.

బ్రహ్మ తాళము వేయసాగెను. విష్ణువు మృదంగమును ప్రమోగించెను. సరస్వతీదేవి వీణావాదమును చేసెను. సూర్యుడు చంద్రుడును చేత పిల్లనగ్రోవులను పట్టి పాడిరి. తుంబురుడును, నారదుడును, పాటలు పాడిరి. నందియు, కుమారుడును, మురజములను ప్రమోగించిరి. ఈసంగీతకమున కనుగుణముగ భక్తుల దుఃఖములను పోద్రోలి శుభముల నిచ్చు రుద్రుడగు శంభుడు నృత్యమునుచేసెను.

సహజసిద్ధ మగు ఈనృత్యము మనల నెల్లరను రక్షించును గాక !

(గౌరవర్ణము)

## 12. సద్యోజాతాది పంచమూర్తుల ధ్యానము

(శైవకారణాగమము)

### సద్యోజాత ధ్యానము

కుందేందుశంఖస్ఫటికావభాసో
వేదాక్షమాలావరదాభయాంకః ।
త్ర్యక్ష శ్చతుర్వక్త్ర ఉరుప్రభావః
సద్యోఽధిజాతో ఒవతు మాం ప్రతీచ్యామ్ ॥

ఈసద్యోజాతమూర్తి మొల్లపువ్వు, చంద్రుడు, శంఖము, స్ఫటికము మున్నగు వానివలె మిక్కిలి తెల్లని కాంతులతో, మూడు కన్నులతో, నాలుగు మొగములతో, నాలుగుచేతులతో ఉండును.

కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, జపమాలను 2, అట్లే ఎడమ భాగమున వరదముద్రను 1, పుస్తకమును 2 (వేదమును), కుడిఎడమల నాల్గు చేతులతో ధరించి యుండును.

మహాప్రభావశాలియగు శ్రీసద్యోజాతమూర్తి పడమరదిక్కునందు నన్ను రక్షించునుగాక : (శ్వేతవర్ణము)

## 13. వామదేవమూర్తి ధ్యానము

వరాక్షమాలాభయటంకహస్తః
సరోజకింజల్కసమానవర్ణః ।
త్రిలోచన శ్చారుచతుర్ముఖో మాం
పాయా దుదీచ్యాం దిశి వామదేవః ॥

శ్రీవామదేవమూర్తి పద్మమునందలి కింజల్కములవలె బంగారు శరీరకాంతులతో నాలుగు మొగములతో, ప్రతిముఖమునందును మూడుమూడు కన్నులతో, నాల్గుచేతులతో నుండును.

కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, టంకమును 2, అట్లే ఎడమభాగమున వరదముద్రను 1, జపమాలను 2, కుడిఎడమల నాల్గుచెతులతో ధరించిన శ్రీవామదేవమూర్తి ఉత్తరదిక్కునందున్నవాడై నన్ను రక్షించునుగాక. (కనకవర్ణము)

## 14. అఘోరమూర్తి ధ్యానము

కుఠారవేదాంకుశపాశశూల
కపాలఢక్కాక్షగుణాన్దధానః ।
చతుర్ముఖో నీలరుచి స్త్రిణేత్రః
పాయా దఘోరో దిశి దక్షిణస్యామ్ ॥

ఈ అఘోరమూర్తి నల్లని శరీరకాంతులతో, నాలుగు మొగములతో, ప్రతి ముఖమునందు మూడుమూడు కన్నులతో, ఎనిమిది చేతులతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి శూలమును 1, గొడ్డలిని 2, జపమాలను 3, అంకుశమును 4, అట్లే ఎడమవైపున కపాలమును 1, ఢక్కను 2, పుస్తకమును 3 (వేదమును), పాశమును 4, ఎనిమిది చేతులతో ధరించిన అఘోరమూర్తి దక్షిణదిక్కునందున్నవాడై ఎల్లరను రక్షించునుగాక : (నీలవర్ణము)

## 15. శ్రీ తత్పురుషమూర్తి ధ్యానము

ప్రదీప్తవిద్యుత్కనకావభాసో
విద్యావరాభీతికుఠారపాణిః ।
చతుర్ముఖ స్తత్పురుష స్త్రిణేత్రః
ప్రాచ్యాం స్థితో రక్షతు మా మజస్రమ్ ॥

శ్రీ తత్పురుషమూర్తి మిక్కిలి కాంతులుగల మెఱుపుతీగలవలె, బంగారువలె పచ్చని శరీరచ్ఛాయలతో, నాల్గు మొగములతో, ప్రతిముఖమునందు మూడుమూడు కన్నులతో, నాల్గు చేతులతో నుండును.

కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, గొడ్డలిని 2, అట్లే ఎడమవైపున వరదముద్రను 1, విద్యాముద్రను 2, (పుస్తకమును) కుడిఎడమల నాల్గుచేతులతో, ధరించిన శ్రీతత్పురుషమూర్తి తూర్పున నున్నవాడై నన్ను ఎల్లప్పుడు రక్షించునుగాక : (కనకవర్ణము)

## 16. ఈశానమూర్తి ధ్యానము

వేదాభయేష్టాంకుశపాశటంక
కపాలఢక్కాక్షకశూలపాణిః ।
సితద్యుతిః పంచముఖో ఽవతా న్మా
మీశాన ఊర్ధ్వం పరమప్రకాశః ॥

ఈశానమూర్తి తెల్లని శరీరకాంతులతో, ఐదు ముఖములతో, పదిచేతులతో నుండును.

కుడిభాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, శూలమును 2, జపమాలను 3, అంకుశమును 4, టంకమును 5, అట్లే ఎడమభాగమున వరముద్రను 1, కపాలమును 2, వేదమును 3, శంఖమును 4, ఢక్కను 5, కుడిఎడమల పదిచేతులతో ధరించి ఊర్ధ్వదిక్కునందు మిక్కిలిప్రకాశించు ఈశానమూర్తి నన్ను రక్షించుగాక !

(శ్వేతవర్ణము)

# ఏడుగురు తాండవమూర్తుల ధ్యానములు

## 17. ఆనందతాండవ ధ్యానము

చతుర్భుజం త్రినేత్రం చ ప్రసారితజటాన్వితమ్
గౌరవర్ణసమాయుక్తం బర్హిపింఛసమన్వితమ్ ॥

వామే దక్షిణధుత్తూర మర్ధచంద్ర సమన్వితమ్
దక్షిణే స్వజటాగ్రే తు జాహ్నవ్యా పరిమండితమ్ ॥

వామకర్ణే పత్రభృతం దక్షిణే వక్రకుండలమ్
సర్వాభరణసంయుక్త ముపవీతసమన్వితమ్ ॥

వ్యాఘ్రాజినాంబరోపేతం పాదకింకిణికాయుతమ్
ప్రసారితభుజం వామే దక్షిణే ఒభయహస్తకమ్ ॥

డమరుం సవ్యహస్తే తు వహ్నిం వై వామకే దధత్
వక్రం తు దక్షిణం పాద మపస్మారోపరిస్థితమ్ ॥

ఊర్ధ్వగం వామపాదం తు పాదాగ్రం దక్షిణానుగమ్
ఆనందతాండవం ప్రోక్తం దిదృక్షూణాం మహాద్భుతమ్ ॥

శ్రీ మన్మహాపరమశివుని ఆనందతాండవనాట్యము, తెల్లని శరీరకాంతులతో, నాల్గు చేతులతో, మూడు కన్నులతో, వ్రేలాడుచున్న జటలతో, శిరమున దక్షిణభాగమున

నెమలిపింఛముతో, ఉమ్మెత్తపువ్వు, చంద్రరేఖ, గంగానది మున్నగు భూషణములతో, ఎడమచెవియందు తాటంకము (పోగు), కుడిచెవియందు మకరకుండలము ప్రకాశింప అలంకరింపబడిన సర్వాభరణములతో, పులితోలు వస్త్రముతో, పాదములకు చిఱుగంటలతో నుండును.

ఆ స్వామి కుడివైపున క్రిందినుండిపైకి అభయముద్రను 1, డమరుకమును 2, ఎడమవైపున గజహస్తమును 1, అగ్నిని 2, ధరించి యుండును.

ఆ పరమశివుని కుడికాలు అపస్మారుడను వానిపై వంకరగా నుండును. ఎడమ కాలు పైకెత్తబడి ఉండును. ఆపాదాగ్రము (పాదముకొన) దక్షిణమునకు తిరిగి యుండును.

చూచువారలకు మనోహరమైన శ్రీపరమశివుని ఈనాట్యమును ఆనందతాండవ మందురు. (గౌరవర్ణము)

## 18. సంధ్యాతాండవ ధ్యానము

చతుర్భుజం త్రినేత్రం చ జటామకుటభూషణమ్
అభయం డమరుం సవ్యే వామే పింఛం సవిస్మయమ్ ॥

అపస్మారం వినా పీఠే వామాంఘ్య్రాకుంచితం స్థితమ్
ఊర్ధ్వే తు దక్షిణం పాద ముపసవ్యానుగం దధత్ ॥

తత్పాదం కుంచితం వాథ సర్పకంకణభూషితమ్
సంధ్యాతాండవ మేవం స్యాత్ వర్ణాదిః పూర్వవ ద్భవేత్ ॥

శ్రీమన్మహాపరమశివుని సంధ్యాతాండవనృత్యము తెల్లని శరీరకాంతులతో, నాల్గు చేతులతో, మూడు కన్నులతో చక్కగ బిగించిముడిచిన జటాజూటముతో, జటాజూటమునందు దక్షిణభాగమున నెమలిపింఛము, ఉమ్మెత్తపువ్వు, చంద్రరేఖ, గంగానది మున్నగు నలంకారములతో, ఎడమ చెవియందు తాటంకము, కుడి చెవియందు మకర కుండలము ప్రకాశింప పులితోలు వస్త్రముతో, సర్వావయవములందు పాముల భూషణములతో, చిఱుగంటలు కట్టబడిన పాదములతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, డమరుకమును 2, అల్లే

ఎడమవైపున నెమలిపింఛమును 1, విస్మయముద్రను 2, కుడిఎడమల ధరించిన నాల్గు చేతులతో నుండును.

మఱియును ఆనందతాండవమునందు వలె అపస్మారుడైన దైత్యు డిట లేడు. కేవలము పీఠమునందే నాట్యము జరుగును. కొంచిగ వంచబడిన ఎడమకాలు, పైకి ఎత్తబడిన కుడికాలు, కుడిపాదము కొన ఎడమభాగమునకు వంచబడియుండును.

(గౌరవర్ణము)

(అపస్యము అని కుడికి సవ్య మని ఎడమకు పేరులు. కాని యిచట ఆరెండు పదములు పరస్పరము ఎడమ కుడులకు వాడబడినవి)

## 19. ఉమాతాండవ ధ్యానము

ఏకవక్త్రం త్రిణయనం జటామండలభూషితమ్
గౌరాంగం షడ్భుజోపేత ముభయం డమరుం తథా ॥

శూలం దక్షిణపార్శ్వే తు కపాలం విస్మయం తథా
గజహస్తోపమం హస్తం సవ్యపార్శ్వానుగం దధత్ ॥

త మేవ వామపాదం చ హ్యపస్మారోపరిస్థితమ్
ఉద్ధృతం దక్షిణం పాదం వామపాదానుగం తథా ॥

వామపార్శ్వే హ్యుమాదేవీసహితం జాహ్నవీయుతమ్
సర్వాభరణసంయుక్తం వ్యాఘ్రచర్మోత్తరీయకమ్ ॥

శ్రీమన్మహాపరమశివుని ఉమాతాండవము ఒక మొగముతో, మూడు కన్నులతో, ఆరు చేతులతో, తెల్లని శరీరకాంతులతో, చక్కగ బిగించిముడిచిన జటాజూటముతో, ఎడమ భాగమున ఉమాదేవితో, జటాజూటమునందు దక్షిణభాగమున నెమలిపింఛము, ఉమ్మెత్తపువ్వు, చంద్రరేఖ, గంగానది మున్నగు నలంకారములతో, ఎడమ చెవియందు తాటంకమును, కుడిచెవియందు మకరకుండలము ప్రకాశింప పులితోలు వస్త్రముతో, అన్ని అవయవములందు పాముల భూషణములతో, చిఱుగంటలు కట్టబడిన పాదములతో నుండును.

మఱియును కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, శూలమును 2, డమరుకమును 3, అట్లే ఎడమవైపున గజహస్తమును 1, కపాలమును 2, విస్మయ ముద్రను 3, ధరించి కుడిఎడమల ఆరుచేతులతో ఉండును.

మఱియు ఎడమకాలు అపస్మారుడనువానిపై నను, ఆయెడమకాలి ననుసరించియే కుడికాలు పైకి ఎత్తబడి యుండును.

దీనిని ఉమాతాండవ మందురు. ఇచట చెప్పబడని లక్షణములను పూర్వతాండవ ములనుండి గ్రహింపవలెను. (గౌరవర్ణము)

## 20. శ్రీ గౌరీతాండవ ధ్యానము

శాంతం చతుర్భుజోపేతం రక్తవర్ణం స్మితాననమ్
కరోటిం బకపుష్పం చ ధుత్తూరం చార్కపుష్పకమ్ ॥

బాలచంద్రజటాజూటం సువికీర్ణజటాన్వితమ్
సర్పకంకణసంయుక్త మపస్మారోపరిస్థితమ్ ॥

దక్షిణం కుంచితం పాదం వామపాదం తదూర్ధ్వగమ్
సవ్యే దధాన మభయ మన్యస్మిన్ డమరుం కరే ॥

అన్యస్మిన్ పూర్వతో వ్యాల మపరే వహ్నిపాత్రకమ్
వామే గౌరీసమాయుక్త మవామే నందికేశినమ్ ॥

సువికీర్ణజటాభారం జటామకుటసంయుతమ్
వామే మౌళిసమాయుక్తం శేషం ప్రథమనృత్తవత్ ॥

గౌరీతాండవ మిత్యుక్తమ్ ॥

శ్రీమన్మహాపరమశివుని గౌరీతాండవము ఎఱ్ఱని శరీరకాంతులతో, నాలుగు చేతులతో, చిఱునవ్వులను వెదజల్లు మొగముతో, "కరోటి" యను పువ్వును, మందారపు పువ్వును, ఉమ్మెత్తపువ్వును, జిల్లేడుపువ్వును, చంద్రరేఖను ధరించిన జటాజూటముతో, వ్రేలాడుచున్న జడలతో, ఎడమభాగమున గౌరీదేవితో, కుడిభాగమున నందికేశ్వరునితో, సర్వాంగములయందు సర్పభూషణములతో నుండును.

మఱియును కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, డమరుకమును 2 అల్లే ఎడమభాగమున నాగమును 1, అగ్నికుండమును 2, కుడిఎడమల ధరించిన నాల్గుచేతు లతో నుండును.

మఱియును సర్పకంకణములతో, చిఱుగంటలతో కూడిన కుడికాలు కొంచెము వంగినదియై అపస్మారు డనువానిపై నుండును. ఎడమకాలు పైకెత్తబడి యుండును.

మిగిలిన లక్షణములు పూర్వనృత్తములవలెనే యుండును. దీనిని గౌరీతాండవ మందురు. (రక్తవర్ణము)

## 21. శ్రీ కాలికాతాండవ ధ్యానమ్

ఏకవక్త్రం ద్వినయనం జటాసంకీర్ణమస్తకమ్
భుజాష్టకసమాయుక్తం సవ్యపాదం సముద్ధృతమ్ ॥

సవక్రం వామపాదం త మపస్మారోపరిస్థితమ్
అభయం శూలపాశం చ డమరుం దక్షిణే కరే ॥

కపాలం చాగ్నిపాత్రం చ ఘంటాం వామకరే వరమ్
గజహస్తోపమం హస్తం ప్రసృతం దక్షిణానుగమ్ ॥

దథం లక్షణసంయుక్తం శేషం ప్రథమనృత్తవత్
కాళికాతాండవం ప్రోక్తమ్ ॥

శ్రీమన్మహాపరమశివుని కాలికాతాండవము తెల్లని శరీరకాంతులతో, ఒక మొగ ముతో, రెండు కన్నులతో, ఎనిమిది చేతులతో, వ్రేలాడుచున్న జడలతో, శిరమున కుడివైపున నెమలిపింఛము, ఉమ్మెత్తపువ్వు, చంద్రరేఖ, గంగానది మున్నగు భూషణ ములతో, ఎడమ చెవియందు తాటంకము, కుడిచెవియందు మకరకుండలము ప్రకాశింప అలంకరింపబడిన సర్వాభరణములతో, పులితోలు వస్త్రముతో, పాదములకు చిఱుగంట లతో నుండును.

మఱియును కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, శూలమును 2, పాశమును 3, డమరుకమును 4 అల్లే ఎడమవైపున గజహస్తమును 1, కపాలమును 2, గంటను 3, అగ్నిపాత్రమును 4, కుడిఎడమల ఎనిమిది చేతులతో ధరించియుండును.

మఱియును వంచబడిన ఎడమకాలు అపస్మారు డనువానిపై నుండును. కుడి కాలు సముద్ధృతమై (ఎత్తబడినదై) యుండును. (గౌరవర్ణము)

## 22. శ్రీ త్రిపురతాండవ ధ్యానము

దోర్భిః షోడశభి ర్యుక్తం వామే గౌరీసమాశ్రితమ్
స్కందం దక్షిణపార్శ్వే తు సవ్యహస్తే ధృతాంజలిమ్॥

అభయం డమరుం చైవ వజ్రం శూలం చ బిభ్రతమ్
పాశం టంకం తథా దండం నాగం వై దక్షిణైః కరైః॥

సవ్యానుగం కరం చైవ వామే పూర్వకరం తథా
అనలం పుస్తకం చైవ వరదం కేతుఖేటకమ్॥

ఘంటాం చైవ కపాలం చ వామపార్శ్వే ఒష్టభిః కరైః
సర్వలక్షణసంయుక్తం శేషం ప్రథమనృత్తవత్॥

త్రైపురం తాండవం ప్రోక్తమ్॥

శ్రీమన్మహాపరమశివుని త్రిపురతాండవము తెల్లని శరీరకాంతులతో, పదునారు చేతులతో, ఎడమభాగమున గౌరీదేవితో, కుడిభాగమున కుడిచేత దోసిలొగ్గి కుమార స్వామితో, మూడు కన్నులతో, వ్రేలాడుచున్న జడలతో, కుడివైపున నెమలిపింఛము, ఉమ్మెత్తపువ్వు, చంద్రరేఖ, గంగానది మొదలగు భూషణములతో, ఎడమ చెవియందు తాటంకము, కుడి చెవియందు మకరకుండలము ప్రకాశింప అలంకరింపబడిన సర్వాభరణ ములతో, పులితోలు వస్త్రముతో పాదములయందు చిఱుగంటలతో నుండును.

మఱియును కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, నాగమును 2, దండమును 3, టంకమును 4, పాశమును 5, శూలమును 6, వజ్రమును 7, డమరుక మును 8, అట్లే ఎడమవైపున గజహస్తమును 1, (నిజహస్తము కుడవైపునకు చాచి నదై), వరముద్రను 2, కపాలమును 3, గంటను 4, ఖేటమును 5, పుస్తకమును 6, అగ్నిని 7, ధ్వజమును 8, కుడిఎడమల పదునారు చేతులతో ధరించియుండును.

మఱియును కుడికాలు అపస్మారు డనువానిపై వంకరగా నుండును. ఎడమకాలు పైకి ఎత్తబడి యుండును, అపాద్యాగము (పాదముకొన) దక్షిణమునకు తిరిగియుండును.

చూచువారలకు మనోహరమగు పరమశివుని ఈ తాండవమును త్రిపురతాండవ మందురు. (గౌరవర్ణము)

# 23. శ్రీ సంహారతాండవ ధ్యానము

త్రిణేత్రం చాష్టహస్తం చ సువికీర్ణజటాన్వితమ్
కుంచితం వామపాదం త మపస్మారోపరి స్థితమ్ ॥

ఉద్ధృతం దక్షిణం పాదం వ్యాఘ్రచర్మోత్తరీయకమ్
అభయం శూలపాశౌ చ డమరుం దక్షిణైః కరైః ॥

కపాలం చాగ్నిపాత్రం చ దధం విస్మయహస్తకమ్
గజహస్తోపమం వామే చతుర్భిః సమన్వితమ్ ॥

గజహస్తోపమం సవ్య మపసవ్యానుగం తథా
నందీశం సవ్యభాగే తు వామే గౌరీసమన్వితమ్ ॥

సప్తమం నృత్త మాఖ్యాతం జగద్వృద్ధికరం భవేత్
(సంహార తాండవ మిదం) శిష్టం ప్రథమ నృత్తవత్ ॥

శ్రీమన్మహాపరమశివుని సంహారతాండవము తెల్లని శరీరకాంతులతో, ఎనిమిది హస్తములతో, ఎడమభాగమున గౌరీదేవితో, కుడిభాగమున నందీశ్వరునితో, మూడు కన్నులతో, వ్రేలాడుచున్న జడలతో, శిరమున దక్షిణభాగమున నెమలిపింఛము, ఉమ్మెత్తపువ్వు, చంద్రరేఖ గంగానది మున్నగు భూషణములతో, ఎడమచెవియందు తాటంకమును, కుడిచెవియందు మకరకుండలమును ప్రకాశింప అలంకరింపబడిన సర్వాభరణములతో, పులితోలు వస్త్రముతో, పాదములకు చిఱుగంటలతో, నుండును.

మఱియును కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, శూలమును 2, పాశమును 3, డమరుకమును 4, అట్లే ఎడమవైపున క్రింది నిజహస్తము కుడివైపునకు చాపబడినదై యుండును 1, కపాలమును 2, అగ్నిపాత్రమును 3, విస్మయముద్రను 4, కుడిఎడమల ఎనిమిది చేతులతో ధరించియుండును.

మఱియును వంచబడిన ఎడమకాలు అపస్మారుడను వానిపై నుండును. కుడికాలు ఎత్తబడినదై యుండును.

ఇట్టి ఈపరమశివుని తాండవమును సంహారతాండవము అందురు. (గౌరవర్ణము)

## ఈ ఏడు తాండవముల నామములు

(శైవకారణాగమము)

ఆనందతాండవం పూర్వం సంధ్యాతాండవ ముత్తరమ్
ఉమాతాండవ మేవం స్యా ద్గౌరీతాండవ మప్యథో ॥
కాలికాతాండవం చైవ షష్ఠం త్రిపురతాండవమ్
సంహారతాండవం సప్తమ మిత్థం సప్తతాండవాః ॥

పై నవివరించిన తాండవముల నామములు ఈ క్రింది విధముగ నుండును.

1 ఆనందతాండవము
2 సంధ్యాతాండవము
3 ఉమాతాండవము
4 గౌరీతాండవము
5 కాలికాతాండవము
6 త్రిపురతాండవము
7 సంహారతాండవము

అని ఏడు నామములు.

## 24. భవుడు మున్నగు నష్టమూర్తుల ధ్యానము

(శైవాగమ శేఖరము)

భవః శర్వ స్తథేశానః పశుపత్యుగ్రకౌ తథా
రుద్రో భీమో మహాదేవః కీర్తితా స్త్వష్టమూర్తయః ॥

చతుర్భుజా స్త్రిణేత్రా శ్చ జటామకుటధారిణః
వరాభయకరా శ్చైవ టంకకృష్ణధరా స్తథా ॥

సర్వాభరణసంయుక్తా రక్తక్షౌమధరా ఇమే

ఏతేషాంవర్ణాః :-
శుక్లః శ్యామ శ్చ రక్త శ్చ కృష్ణో గోక్షీరసన్నిభః ॥
కేసరో విద్రుమో నీలో భవాదీనాం చ వర్ణకాః ॥

భవుడు (1), శర్వుడు (2), ఈశానుడు (3), పశుపతి (4), ఉగ్రుడు (5), రుద్రుడు (6), భీముడు (7), మహాదేవుడు (8), అను నీ ఎనమండుగురు అష్ట మూర్తులు.

వీర లెల్లరు నాల్గుచేతులలో, మూడుకన్నులతో, జటాజూటముతో, అన్ని అవయవ ములయందు అలంకరింపబడిన ఎల్లభూషణములతో, ఎఱ్ఱని వస్త్రములతో, నుందురు.

వీర లెల్లరు కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, టంకమును 2, అల్లే ఎడమవైపున క్రిందినుండి పైకి వరముద్రను 1, లేడిని 2, కుడిఎడమల చతుర్బాహువులతో ధరింతురు.

వీరల వర్ణములు క్రిందివిధముగ నుండును.

1. భవుడు — తెలుపు. 2. శర్వుడు — నలుపు.
3. ఈశానుడు — ఎఱుపు. 4. పశుపతి — నలుపు.
5. ఉగ్రుడు — కొంచెము పసుపుకలసిన తెలుపు.
6. రుద్రుడు — కుంకుమపువ్వు ఎఱుపు.
7. భీముడు — పవడము ఎఱుపు.
8. మహాదేవుడు — నలుపు.

# ఏకాదశ రుద్రుల నామములు

(శైవాగమము)

శంభుః పినాకీ గిరిశః స్థాణు ర్భర్గః సదాశివః
శివో హర స్తథా శర్వః కపాలీ భవ ఏవ చ॥

ఏకాద శైతే కథితా రుద్రా లోకహితే రతాః॥

శంభుడు 1, పినాకి 2, గిరిశుడు 3, స్థాణుడు 4, భర్గుడు 5, సదాశివుడు 6, శివుడు 7, హరుడు 8, శర్వుడు 9, కపాలి 10, భవుడు 11, అను నీపదునొకండు ఏకాదశరుద్రుల పేరులు.

వీర లెల్లరు లోకమునకు మేలుచేయుచున్నారు.

## 25. శ్రీ శంభు ధ్యానము

బ్రహ్మవిష్ణుమహేశానదేవదానవరాక్షసాః
యస్మాత్ప్రజజ్ఞిరే దేవా స్తం శంభుం ప్రణమామ్యహమ్॥

ఏ శంభునివలన బ్రహ్మ, విష్ణువు, మహేశ్వరుడు, దేవతలు, దానవులు, రాక్షసులు పుట్టిరో ఆ శంభునకు నేను నమస్కరించుచున్నాను. (శోణవర్ణము)

## 26. శ్రీ పినాకి ధ్యానము

క్షమారథసమారూఢం బ్రహ్మసూత్రసమన్వితమ్
చతుర్వేదై శ్చ సహితం పినాకిన మహం భజే॥

భూమి యను రథమును ఎక్కి బ్రహ్మసూత్రమును (జందెమును) ధరించి, ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వవేదము, అను నాలుగువేదములతో కూడిన, పినాకమను వింటిని ధరించిన శ్రీపినాకిని నేను భజించుచున్నాను.

(హరిద్వర్ణము)

## 27. శ్రీ గిరీశ ధ్యానము

కైలాసశిఖరప్రోద్యన్మణిమంటపమధ్యగః
గిరిశో గిరిజాప్రాణవల్లభో ఒస్తు సదా ముదే॥

కైలాసపర్వతముయొక్క ఎత్తైన శిఖరమునందలి చక్కనిమణులచే (రత్నములచే) నిర్మింపబడిన మంటపముయొక్క (భవనముయొక్క) నడిమిభాగమున నివసించుచు, పార్వతీదేవికి ప్రియుడగు శ్రీగిరిశుడు (పర్వతమునందు పరుండువాడు) ఎల్లప్పుడు మీకు సంతోషమును కలిగించునుగాక! (నీలవర్ణము)

## 28. శ్రీ స్థాణు ధ్యానము

వామాంగకృతసంవేశగిరికన్యాసుఖావహమ్
స్థాణుం నమామి శిరసా సర్వదేవనమస్కృతమ్॥

ఎడమ భాగమున నివసించు పార్వతీదేవిని సుఖముకలుగునట్లు మోయుచు, దేవత లెల్లరిచేత నమస్కరింపబడెడు శ్రీస్థాణువునకు నేను శిరసా నమస్కరించుచున్నాను. (శ్వేతవర్ణము)

## 29. శ్రీ భర్గ ధ్యానము

చంద్రావతంసో జటిల స్త్రిణేత్రో భస్మపాండరః
హృదయస్థః సదా భూయా ద్భర్గో భయవినాశనః ॥

శిరోభూషణమైన బాలచంద్రునితో, జడలతో, మూడుకన్నులతో, బూదిపూయుటచేత తెల్లనైన శరీరముతో, ఎల్లజంతువుల హృదయపద్మములయందు నివసించుచు, భయమును పోగొట్టుచున్న శ్రీభర్గుడు మమ్మనుగ్రహించునుగాక : (శ్యామవర్ణము)

## 30. శ్రీ సదాశివ ధ్యానము

బ్రహ్మా భూత్వా సృజన్ లోకం
విష్ణుం ర్భూత్వా థ పాలయన్
రుద్రో భూత్వా హర న్నంతే
గతి ర్మే ఒస్తు సదాశివః ॥

బ్రహ్మగా లోకములను సృజించుచు, విష్ణువుగా వానిని పాలించుచు, రుద్రుడుగా తుదకు వానిని సంహరించుచు ఎల్లప్పుడు శుభముల నిచ్చునట్టి శ్రీసదాశివుడు నాకు దిక్కగునుగాక. (శ్యామలవర్ణము)

## 31. శ్రీ శివ ధ్యానము

గాయత్రీప్రతిపాద్యా యా ప్యోంకారకృతసద్మనే
కల్యాణగుణధామ్నే ఒస్తు శివాయ విహితా నతిః ॥

"ఓం త త్సవితు ర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో యో నః ప్రచోదయాత్" అను గాయత్రీమంత్రముచేత ప్రతిపాదింపబడుచు (నిరూపింపబడుచు), ప్రణవరూపమైన ఓంకారమునందు నివసించుచు, కల్యాణములగు గుణములకు నిలయమైన (నివాసమైన), శుభప్రదుడగు శ్రీ శివునకు నమస్కరించుచున్నాను. (పీతవర్ణము)

## 32. శ్రీ హర ధ్యానము

ఆశీవిషహారకృతే దేవౌఘప్రణతాంఘ్రయే
పినాకాంకితహస్తాయ హరా యాస్తు నమస్కృతిః ॥

ఆశీవిషములను (పాములను) హారములు చేసికొని (సర్పభూషణుడై) పినాకమను ధనుస్సును (వింటిని) పట్టుకొని, దేవతలచేత పాదాభివందనము చేయబడుచున్న శ్రీహరునకు నమస్కరించుచున్నాను. (కృష్ణవర్ణము)

## 33. శ్రీ శర్వ ధ్యానము

తిస్రృణాం చ పురాం హంతా కృతాంతమదభంజనః
ఖడ్గపాణి స్తీక్ష్ణదంష్ట్రః శర్వాఖ్యో ఽస్తు ముదే మమ ॥

త్రిపురములను ధ్వంసముచేసి, మృత్యుదేవత యను యముని మర్దించి, మృత్యుంజయుడై, ఖడ్గమును పట్టినచేతితో, వాడియగు కోరలలో నుండెడు శ్రీశర్వుడు నాకు సంతసమును కలిగించునగాక. (బభ్రువర్ణము)

## 34. శ్రీ కపాలి ధ్యానము

దక్షాధ్వరధ్వంసకరః కోపయుక్తముఖాంబుజః
శూలపాణిః సుఖా యాస్తు కపాలీ మే హ్యహర్నిశమ్ ॥

దక్షప్రజాపతియొక్క యజ్ఞమును (తనను అవమానపరచి నందులకు) ధ్వంసముచేసి, కోపముచే ఎఱ్ఱనగు మొగముతో, త్రిశూలమును పట్టుకొనిన చేతితో నున్న శ్రీకపాలి ఎల్లప్పుడు నాకు సుఖమును కలిగించునుగాక : (శోణవర్ణము)

## 35. శ్రీ భవ ధ్యానము

యోగీంద్రనుతపాదాబ్జం ద్వంద్వాతీతం జనాశ్రయమ్
వేదాంతకృతసంచారం భవం తం శరణం భజే ॥

మహాయోగులచేత స్తుతింపబడుచు, సుఖదుఃఖములు, జరామరణములు మున్నగువానిని అతిక్రమించి, వేదాంతములగు ఈశావాస్యము, కేనము, కఠము, ఛాందోగ్యము, బృహదారణ్యకము మున్నగు ఉపనిషత్తులయందు సంచరించుచు (తిరుగుచు), సకలజనులకు ఆశ్రయుడగు శ్రీభవుని నేను శరణము పొందుచున్నాను.

(శ్వేతవర్ణము)

# ఈ ఏకాదశరుద్రుల స్వరూపములు

త్రిణేత్రా రుద్రసదృశా జటామకుటధారిణః
రుద్ర స్త్రిణేత్రో హ్యరుణో జటామండలభూషణః ॥

చతుర్భుజో నీలకంఠ శ్చేందురేఖావిభూషితః
వైయాఘ్రచర్మవసనః సర్వాభరణభూషితః ॥

కరాభ్యా మపి ముఖ్యాభ్యాం వరదో ఒభయదో ఒనిశమ్
అపరాభ్యాం చ హస్తాభ్యాం బిభ్రాణః పరశుం మృగమ్ ॥

(ద్వితీయాంతములను ప్రథమాంతములుగా మార్చుట జరిగినది.)

ఏతేషాం వర్ణాః :-

శోణ శ్చ హరితో నీలః శ్వేతః శ్యామలమేచకౌ
పీతః కాల స్తథా బభ్రువర్ణకః పాటలః సితః ॥
ఏకాదశానాం రుద్రాణాం వర్ణో ఒయం సముదాహృతః

రుద్రుడను దైవతము మూడు కన్నులతో, ఎఱ్ఱని శరీరచ్ఛాయతో, జటాజూటముతో, నాల్గు చేతులతో, విషపానముచే నల్లనైన కంఠముతో, నెలవంక శిరోభూషణముతో, పులితోలు వస్త్రములో, అలంకరింపబడిన సర్వాభరణములతో, కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, గొడ్డలిని 2, అట్లే ఎడమవైపున వరముద్రను 1, లేడిని 2, కుడిఎడమల ధరించిన నాల్గుచేతులతో నుండును.

పైన వివరింపబడిన ఏకాదశరుద్రులు శరీరవర్ణములు కాక మిగిలిన లక్షణముల యందు రుద్రునకు వలె నుందురు. శరీరవర్ణములు మాత్రమే ప్రత్యేకము వివరింపబడినవి.

1. శంభుడు — ఎఱుపు. 2. పినాకి — ఆకుపపచ్చన.
3. గిరిశుడు — నలుపు 4. స్థాణుడు — తెలుపు
5. భర్గుడు — నలుపు. 6. సదాశివుడు — నలుపు.
7. శివుడు — పసుపు. 8. హరుడు — నలుపు.
9. శర్వుడు — ధూమ్రవర్ణము. 10. కపాలి — లేతఎఱుపు.
11. భవుడు - తెలుపు.

# ఇరువదియైదు శివలీలామూర్తుల ధ్యానములు

(శైవకారణాగమము)

## 36. శ్రీ చంద్రశేఖర ధ్యానము

అభయవరదహస్తం సౌమ్యశృంగారభావం
విపులవదననేత్రం చంద్రబింబాంశమౌళిమ్ ।
భుజతనుసమపాదస్థానకం విద్రుమాభం
హరిణపరశుపాణిం పద్మపీఠస్థ మీడే ॥

శ్రీ చంద్రశేఖరస్వామి పవడమువలె ఎఱ్ఱనగు శరీరకాంతులతో, మధురమగు అనురాగభావమును వ్యక్తముసేయు రూపముతో, విశాలమైన మొగముతో, మూడు కన్నులతో, నెలవంక శిరోభూషణముతో, మిక్కిలి చక్కని సమమగు పాదపీఠముతో,

కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, గొడ్డలిని 2, అట్లే ఎడమవైపున వరదముద్రను 1, లేడిని 1, కుడిఎడమల ధరించిన నాల్గు చేతులతో నుండును.

ఇట్టిరూపముతో, చక్కని విప్పారిన పద్మమునందున్న శ్రీచంద్రశేఖరస్వామిని ప్రార్థించుచున్నాను. (ప్రవాళవర్ణము)

## 37. శ్రీ గౌరీ ధ్యానము

శ్యామాం త్రిణేత్రాం ద్విభుజాం త్రిభంగీం
సవ్యాపసవ్యస్థితకుంచితాంఘ్రిమ్ ।

సవ్యే తు నీలోత్పలపాణి మీడే (చారుహస్తాం)
దేవస్య వామస్థితపద్మపీఠామ్ ॥

నల్లని శరీరచ్ఛాయతో, మూడు కన్నులతో, రెండుచేతులతో, ఎడమకుడి పాదము అను కొంచెము వంచుటచేత త్రిభంగీరూపమైన (మూడు వంపులుగల) శరీరసౌందర్యముతో, కుడిచేతితో నల్లకలువపూవును ధరించి శ్రీచంద్రశేఖరస్వామికి ఎడమభాగమున పద్మపీఠమునందు నిలిచిఉన్న శ్రీగౌరీదేవిని ప్రార్థింతును. (శ్యామవర్ణము)

## 38. ఉమామహేశ్వర ధ్యానము

ధవళాబ్జసుఖాసనసన్నిహితం
మృగడింభకటంకవరాభయినమ్ ।
సుముఖం పర ముత్పలదృగ్వశదం
హ్యుమయా సహ నౌమి సరూప మిమమ్ ॥

తెల్లతామరపూవునందు ఉమాదేవితో కూడి కూర్చుండి, కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1. టంకమును 2. అట్లే ఎడమవైపున క్రిందినుండి వరముద్రను 1 లేడిని 2. ధరించిన నాల్గుచేతులతో, నల్లగలువవంటి చూపులతో, ప్రసన్నముఖముతో, పరమాత్మయై యున్న శ్రీమహేశ్వరునకు నమస్కరించుచున్నాను. (శ్వేతవర్ణము)

## 39. శ్రీ వృషభారూఢ ధ్యానము

సవ్యే స్యా ద్వక్రతుండాన్వితకటకకరం
గోపతేః పృష్ఠసంస్థం
వామస్యార్ధం సదక్షం వరకరయుగలే
టంకకృష్ణం దధానమ్ ।
ఫాలస్థాక్షం ప్రసన్నం త్రిణయనలసితం
బద్ధవేణీ కిరీటం
వామే గౌర్యా సమేతం నమత శుభకరం
తం వృషారూఢ మీశమ్ ॥

తెల్లని శరీరచ్ఛాయలతో, మూడుకన్నులతో, నాల్గుచేతులతో, చక్కగముడువ బడిన (కట్టబడిన) జటాజూటముతో, వృషభవాహనమునందు కుడివైపున తొడయందున్న వినాయకుని కౌగిలించుకొనిన నిజకరముతో జపమాలను 1, పరహస్తముతో టంకమును 2, ఎడమవైపున ఉపవిష్టురాలైన (కూరుచుండిన) గౌరీదేవిని కౌగిలించుకొనిన ఎడమ నిజకరముతో కటకముద్రను 1, పరకముతో లేడిని 2, ధరించిన నాల్గు చేతులతో,

శుభముల నిచ్చునట్టి ప్రసన్నుడగు వృషభారూఢమూర్తిని (వృషభము నధిష్ఠించిన స్వామిని) మీ రెల్లరు నమస్కరింపుడు. (శ్వేతవర్ణము)

## 40. శ్రీ నాట్యమూర్తి ధ్యానము

" శయ్యాపస్మారకోర్ధ్వస్థితపద విలస
ద్వామ ముద్ధృత్య పాదం
జ్వాలామాలాసుమధ్యే నటఫణిశిర
స్థూలమాసేదివాన్ యః ।
భస్మోద్ధూళిత మంగవిద్రుమనిభం
హస్తాగ్రపాదాగ్రయో
రగ్నిం దోలవరాభయం డమరుకం
ధృత్వా నటేశం భజే ॥ "

"ఈపద్యమున పూర్వార్ధము మొదటిరెండు స్రగ్ధరాపాదములు. ఉత్తరార్ధము శార్దూలవిక్రీడితము. ఇట్లు ఛందోభంగము, అన్వయభంగము, వ్యాకరణభంగము ఉండుట వల్ల పద్యమంతయు స్రగ్ధరగా వీలైనంతవరకు దోషరహితముగా మార్పుచేయబడినది"

శయ్యాపస్మారకే ఒస్మిన్ స్థిత మత విలస
ద్వామ ముద్ధృత్య పాదం
జ్వాలామాలాసుమధ్యే ధృతఫణిశిరసి
స్థూల మాసేదివాన్ యః ।

భస్మే నాలిప్త మీడే తరుణరవినిభం
హస్తపాదై శ్చ వహ్నిం
డోలం చాభీతిముద్రా మపి చ డమరుకం
బిభ్రతం తం నటేశమ్ ॥

అగ్నిజ్వాలల నడుమ పాముశిరమును పట్టుకొని అపస్మారు డనువాడు పరుండి యుండును. నటరాజగు పరమశివుడు ఎడమపాదమును పైకెత్తి కుడికాలుతో ఆతనిపై నిలిచి యుండును. ఆతడు ఎఱ్ఱనైన హస్తపాదములతో, విభూతి పూయబడిన సర్వాంగ ములతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, డమరుకమును 2, అల్లే ఎడమవైపున దోలాహస్తమును 1, అగ్నిని 2, కుడిఎడమల నాల్గుచేతులతో ధరించి యుండును.

అట్టి రూపముతో నున్న శ్రీనటరాజమూర్తిని నేను స్తుతించుచున్నాను.

## 41. శ్రీ భిక్షాటనమూర్తి ధ్యానము

చతుర్భుజం త్రిణేత్రం చ నగ్నం చైవ స్మితాననమ్
భస్మదిగ్ధం విద్రుమాభం కట్యాం పన్నగసంవృతమ్ ॥

(అవృత్తాలంకృతం భృంగీ పాదం పాదుకసంయుతమ్)

అవృత్తాలంకృతో భృంగీ పాదం పాదుకసంయుతమ్
దక్షిణం తత్కరాగ్రం తు హరిణాస్యానుగం భవేత్ ॥

దక్షిణే పరహస్తే తు డమరుం చైవ కారయేత్
వామే త్వపరహస్తే తు త్రిశూలం పింఛధారిణమ్ ॥

కుంచితం దక్షిణం పాదం వామపాదం తు సుస్థితమ్
సమభంగస్థానకం చ గమనోన్ముఖరూపకమ్ ॥

కపాలోపేతహస్తం చ వృషనాభిసమం భవేత్
ఏవం భిక్షాటనం ప్రోక్తం గుండోదర మథో శృణు ॥

దేవస్య వామపార్శ్వే తు గుండోదర మథఃస్థితమ్
హస్తద్వయసమాయుక్తం కపాలం శిరసి న్యసేత్ ॥

భూతాకారసమాయుక్తం కుండలే కర్ణయోర్న్యసేత్
దంష్ట్రాకరాళవక్త్రం చ పూర్వోక్తం లక్షణాన్వితమ్ ॥

శ్రీ భిక్షాటనమూర్తి దిగంబరుడై నాలుగు చేతులతో, మూడు కన్నులతో, చిఱునవ్వు మొగముతో, విభూతిపూసిన అవయవములతో, పవడమువలె ఎఱ్ఱనైన శరీరముతో, నడుమునందు అలంకరింపబడిన (కట్టబడిన) పాములతో, ఉండును.

శ్రీస్వామివారి వెనుకభాగమున వృషభము, కుడిభాగమున భృంగి లేదియుండును. ఎడమభాగమున, గుండోదరుడనువాడు ఉండును.

శ్రీస్వామి కుడినిజహస్తము లేడివైపునకు తిరిగినదై యుండును. కుడిపరహస్తమునందు ఢమరుకముండును. ఎడమ నిజహస్తమునందు కపాలము, పరహస్తమునందు నెమలిఈకలచే నలంకరింపబడిన త్రిశూలము ఉండును. కపాలము వెనుకనున్న వృషభమునాభికి సమతలమున నుండును.

శ్రీస్వామి కుడిపాదము కుంచితమై (కొంచెమువంగినదై) ఉండును. ఎడమపాదము తిన్నగ (స్థిరముగ) నిలిచినదై యుండును. ఆతని శరీరము సమభంగమై (తిన్నగ) నిలిచి ప్రయాణమునకు సిద్ధపడుచున్నట్లు ఉండును.

కుడివైపుననున్న భృంగి భూషణములతో, అలంకరించుకొని యుండును. ఎడమన నున్న గుండోదరుడు రెండుచేతులతో, శిరమున కపాలముతో, స్వామికి కొంచెము క్రిందిభాగమున నుండును. ఆతడు కోరలచేత భయమును గొలుపుమొగము, భూతాకారము కలిగియుండును. వానిచెవులకు కుండలము లుండవలెను.

## 42. శ్రీ కామదహనమూర్తి ధ్యానమ్

ఉగ్రరూపం తు కామారిం చతుర్భుజసమన్వితమ్
కృష్ణటంకసమాయుక్త మభయం వరదాన్వితమ్ ॥

కామనిగ్రహరూపం తు పద్మపీఠోపరిస్థితమ్
దక్షిణే లంబితం పాదం వామపాదం తు శాయితమ్ ॥

కార్యః కామరిపు స్త్వేవం వక్ష్యే ఒహం కాలనాశనమ్ ॥

శ్రీకామదహనమూర్తి ఎఱ్ఱని శరీరచ్ఛాయలతో, భయంకరమగు రూపముతో, నాలుగు చేతులతో, పద్మపీఠమునం దుండును.

కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, టంకమును 2, అట్లే ఎడమ వైపున వరదహస్తమును 1, లేడిని 2, కుడిఎడమల నాల్గుచేతులతో ధరించి యుండును.

ఆస్వామి కుడికాలు ఆసనమునుండి లంబితమై (వ్రేలాడుచున్నదై) ఎడమకాలు శాయితమై (కుడికాలునందు పరుండబెట్ట బడినదై) యుండును.

శ్రీ కామదహనమూర్తిని ఈవిధముగా నిర్మింపవలెను. ఇక కాలహరమూర్తి ధ్యానము చెప్పెదము. (రక్తవర్ణము)

## 43. శ్రీ కాలహరమూర్తి ధ్యానము

బంధూకాభ ముముం త్రిణేత్రభుజినం
శూలాబ్జహస్తోజ్జ్వలం
టంకం సూత్రవరం సుపాశసహితం
దంష్ట్రాకరాళాస్యకమ్ ।
వామే కుంచితపాద ముద్ధృతతలం
కాలస్య వక్షస్థలే
ఛిన్నాభిన్నజటాధరం గిరిజయా
యుక్తం జగద్దైవతమ్ ॥
ఉద్ధృతం వామంపాదం తు కాలవక్షస్థలే స్థితమ్
సవ్యపాదం లింగమూర్ధ్ని స్థితం రౌద్రముఖం భజేత్ ॥

శ్రీకాలహరమూర్తి మూడు కన్నులతో, నాల్గుచేతులతో, కోరలచేత భయంకర మగు మొగముతో, చిన్నభిన్నములైన (మిక్కిలి చెదరిపోయిన) జటాజూటముతో శ్రీగిరిజాదేవితో, కూడియుండును.

కుడివైపున క్రిందినుండి పైకి శూలమును 1, టంకమును 2, అట్లే ఎడమవైపున పద్మమును 1, పాశమును 2, కుడిఎడమల నాల్గుచేతులతో ధరించియుండును.

ఆస్వామి ఎడమకాలు కుంచితమై (వంచబడినదై) మృత్యుదైవతమగు కాలుని (యముని) వక్షస్థలమునం దుండును. కుడికాలు లింగముయొక్క శిరమునం దుండును. (రక్తవర్ణము)

# అంగమూర్తుల ధ్యానము

## 44. శ్రీ మార్కండేయ ధ్యానము

మార్కండేయః స్థితో దక్షే లింగమూలం తు సంస్పృశన్
ద్విభుజ శ్చ ద్వినేత్ర శ్చ భస్మరుద్రాక్షసంయుతః ॥
శివార్చనపరః శాంతః శివధ్యానపరో భవేత్ ॥

శ్రీమార్కండేయుడు స్వామివారికి కుడిభాగమున రెండుచేతులతో, రెండు కన్నులతో, విభూతిపూసిన సర్వాంగములతో, రుద్రాక్షమాలలతో, శివుని పూజించుచు లింగమూలమును తాకుచు (కౌగిలించి) శివధ్యానములో, నుండవలెను. (శ్వేతవర్ణము)

## 45. మృత్యు ధ్యానము

దేవస్య వామపార్శ్వే తు కాలం మృత్యుస్వరూపకమ్
కిరీటకుండలోపేతం సందంష్ట్రం ఘోరరూపకమ్
తన్మధ్యే మహిషస్థిత్యా కాలరూప మిహోచ్యతే ॥

శ్రీ పరమేశ్వరుని ఎడమభాగమున మృత్యుదేవతారూపుడగు కాలుని (యముని) నిర్మింపవలెను. అతడు కిరీటము..., కుండలములతో, కోరలతో, భయంకరుడై ఉండవలెను.

ఆ పరమేశ్వరునకు యమునకు నడుమ మహిషము (యముని వాహనము దున్నపోతు) ఉండవలెను. ఇట్టివిధముగా కాలుని రూపము ఉండవలెనని చెప్పబడినది. (శ్యామవర్ణము)

## 46. శ్రీ త్రిపురారిమూర్తి ధ్యానము

చతుర్భుజం త్రిణేత్రం చ శృంగం పరశుధారిణమ్
ధనుర్బాణసమాయుక్త ముమయా సహితం తథా ॥

సర్వాభరణసంయుక్తం దివ్యాంబరసమావృతమ్
పత్రం దధం వామకర్ణే దక్షిణే కుండలాన్వితమ్ ॥

ఉపవీతసమాయుక్తం సమభంగయుతం శివమ్
జటామకుటసంయుక్తం విలసద్విద్రుమాంగకమ్ ॥

ఏవం త్రిపురసంహారం (రూపం ప్రోక్తం మహాత్మభిః॥)

శ్రీ త్రిపురసంహారమూర్తియొక్క రూపమును పెద్దలిట్లు చెప్పుచున్నారు. శ్రీ స్వామివారు పవడమువలె ఎఱ్ఱనగు శరీరచ్ఛాయతో, నాల్గుచేతులతో, మూడు కన్నులతో, యజ్ఞోపవీతముతో (జందెముతో), ప్రకాశించుచున్న ఆభరణములతో, వస్త్రములతో, ఎడమభాగమున ఉమాదేవితో, సమభంగయుతముగ (తిన్నగనిలిచి), జటాజూటముతో ఉండును.

కుడివైపున క్రిందినుండి పైకి బాణమును 1, టంకమును 2, అట్లే ఎడమవైపున ధనుస్సును 1. లేడిని 2, నాలుగుచేతులతో ధరించును. ఆస్వామి ఎడమ చెవియందు తాటంకము (ఉమాదేవిది) కుడిచెవియందు కుండలము (పరమ శివునిది) ఉండును.

(విద్రుమవర్ణము)

## 47. శ్రీ జలంధరహరమూర్తి ధ్యానము

రక్తాభ మంగ్రనయినం ద్విభుజం చ త్రిణేత్రకమ్
ఉపవీతసమాయుక్తం సర్వాలంకారశోభితమ్ ॥

పాదయోః పాదుకాయుక్తం కించి ద్వై గమనోన్ముఖమ్
దక్షహస్తే స్థితం ఛత్రం వామే పూర్ణకమండలుమ్ ॥

సంవికీర్ణజటాభారం గంగాచంద్రసమన్వితమ్
కర్ణకుండలసంయుక్తం హారనూపురసంయుతమ్ ॥

### శ్రీ జలంధర స్వరూపమ్

ద్విభుజం చ ద్వినేత్రం చ కిరీటకటకాన్వితమ్
సర్వాలంకారసంయుక్తం కక్షే ఖడ్గసమన్వితమ్ ॥

కృతాంజలిపుటోపేతం హస్తే చక్రం దధం పరమ్
జాలంధర మంథ ప్రోక్తం (పీతరక్తా వయం హరః) ॥

శ్రీ జలంధరహరుడైన పరమశివుడు ఎఱ్ఱని శరీరచ్ఛాయలతో, భయంకరములగు మూడు కన్నులతో, రెండుచేతులతో, జంధెముతో, సర్వాంగములయందు నాగభూషణములతో, పాదములయందు పాదుకలతో, ప్రయాణమునకు సిద్ధపడుచున్న రూపముతో, గంగాదేవితో, చంద్రకళతో కూడి విడివడిన జటాజూటముతో, చెవుల కుండలములతో, హారములతో, పాదములకు నూపురములతో, నుండును.

ఆస్వామి కుడిచేతియందు గొడుగు, ఎడమచేతియందు నీటితో నిండిన కమండలువు ఉండును. ఇట్టిస్వామికి నమస్కరించుచున్నాను.

జలంధరుడు రెండుచేతులతో, రెండుకన్నులతో, కిరీటము, హారములు, కేయూరములు (దండగడియములు), టకములు, మున్నగు సర్వాలంకారములతో, కక్షమునందు (బాహుమూలమున చంకలో) ఖడ్గముతో, చక్రముగల చేతులతో నమస్కారమును చేయుచుండును.

ఈ వర్ణనము జలంధరుని చంపుసమయమునకు చెందినది. అందుచే స్వామిని, జలంధరుని వర్ణించుట జరిగినది.

శ్రీస్వామిది రక్తవర్ణము, జలంధరునిది పీతవర్ణము (పసుపు).

## 48. శ్రీ బ్రహ్మశిరశ్ఛేత్తృమూర్తి ధ్యానము

గౌరవర్ణం త్రిణేత్రం చ జటామౌళివిరాజితమ్
తాటంకం కుండలం సవ్యావామశ్రుత్యోశ్చ బిభ్రతమ్ ॥
వ్యాఘ్రచర్మాంబరధరం చతుర్భుజసమన్వితమ్
వజ్రం పరశుకం దక్షే వామే బ్రహ్మకరోటికమ్
అపరం శూలహస్తం చ శేషం పూర్వోక్తవత్ స్మరం ॥

బ్రహ్మశిరమును ఛేదించు పరమశివుడు పసుపుపచ్చని శరీరచ్ఛాయలతో, మూడు కన్నులతో, నాలుగు చేతులతో, గంగాదేవితో, చంద్రకళతో కూడిన జటాజూటముతో, కుడి ఎడమ చెవులయందు కుండలము తాటంకములతో, సర్వాంగములయందు నాగభూషణములతో, జంధెముతో, పాదములయందు పాదుకలతో, పులితోలు వస్త్రముతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి వజ్రమును 1, గొడ్డలిని 2, అట్లే ఎడమవైపున బ్రహ్మకపాలమును 1, శూలమును 2, కుడిఎడమల నాలుగుచేతులతో ధరించియుండును.

ఇట్టి రూపముతో నున్న బ్రహ్మశిరశ్ఛేత్తయగు శ్రీ పరమశివునకు నమస్కరించు చున్నాను. (గౌరవర్ణము)

## 49. శ్రీ గజాసురసంహారమూర్తి ధ్యానము

స్థిత్వా హస్తిశిర స్యదక్షచరణం వామాంగదక్షోద్ధృతం
పుచ్ఛోర్ధ్వావృతచర్మ ముద్ధృతకరే శూలాసిశృంగోజ్జ్వలమ్
టంకం కృష్ణమృగం ధరం పరకరే భస్మాననేందుప్రభం
వామోమాతిభయోన్ముఖీ సుతయుతా
సూచ్యాఢ్యహస్తం హరమ్ ॥

(ఇదం పద్యం నాన్వేతి. తతః పరిష్కృతమ్)

(ఈ పద్యమన్వయించుట లేదు. కనుక పరిష్కరింపబడినది.)

పరిష్కృతః పాఠః

స్థిత్వా హస్తిశిర స్యదక్షచరణే
నోద్ధృత్య దక్షం పదం
ధృతోర్ధ్వం గజచర్మ భిన్న మపరై
ర్దక్షై స్త్రిశూలం హ్యసిమ్ ।
టంకం సూచివిషాణకృష్ణహరిణం
వామైః సుధాంశుప్రభం
భీష్మాస్యం భయభీతయా ససుతయా
గౌర్యా యుతం తం భజే ॥

శ్రీ గజాసురసంహారమూర్తి గజాసురుని శిరమును ఖండించి ఆశిరమునందు ఎడమకాలితో నిలిచి, కుడికాలును మీదికెత్తి, నిజకరములతో చీల్చబడిన గజాసురుని చర్మమును పైకెత్తి, భయంకరమగు మొగముతో, తెల్లని శరీరకాంతుతో, ఎనిమిది చేతులతో నుండును.

కుడివైపున మిగిలిన మూడు చేతులతో, క్రిందినుండి పైకి వరుసన త్రిశూలము 1, కత్తిని 2, టంకము 3, అట్లే ఎడమవైపున సూచీముద్రను 1, శృంగము 2, నల్లలేడిని 3, మిగిలిన ఆరుచేతులతో ధరించియుండును.

గజాసురసంహారమును చేసి, పరమభయంకరమగు రూపముతో నున్న శ్రీస్వామి వారిని చూచి, సమీపమందు కుమారునితోనున్న శ్రీగౌరీదేవి భయముతో కంపించుచుండెను.

ఇట్టి శ్రీ గజాసురసంహారమూర్తిని నేను భజింతును.

# 50. శ్రీ వీరభద్రమూర్తి ధ్యానమ్

చతుర్భుజం త్రిణేత్రం చ జటామకుటసంయుతమ్
దక్షిణే ఖడ్గబాణౌ చ వామే చాపం గదాం ధరమ్ ॥

దంష్ట్రాకరాళవదనం భీమం భైరవగర్జితమ్
ముండమాలాసమాయుక్తం పాదుకోపరి సుస్థిరమ్ ॥

భద్రకాళీసమాయుక్తం కరాళం హృది విన్యసేత్ ॥

## శ్రీ దక్షబ్రహ్మ స్వరూపమ్

వీరస్య దక్షభాగే తు దక్షబ్రహ్మాణ మాస్థితమ్
అజవక్త్రం ద్వినయనం శృంగద్వయవిభూషితమ్
నమస్కారాంజలిం విప్రం శివధ్యానపరాయణమ్ ॥

శ్రీ వీరభద్రమూర్తి నల్లని శరీరచ్ఛాయలతో, నాలుగు చేతులతో, మూడు కన్నులతో, జటాజూటముతో, కోరలుగల భయంకరమగు మొగముతో, ప్రచండమగు సింహనాదముతో (గర్జనము), కపాలముల (పుర్రెల) దండలతో, పాదములయందు పాదుకలతో, వక్షస్థలమున (రొమ్మున)కరాళ ముద్రతో, భద్రకాళీమహాదేవితో, కూడి యుండును.

కుడివైపున క్రిందినుండి పైకి ఖడ్గమును 1, బాణమును 2, అట్లే ఎడమవైపున గదను 1, వింటిని 2, కుడిఎడమల నాల్గుచేతులతో ధరించి యుండును.

శ్రీ వీరభద్రమూర్తికి కుడిభాగమున మేకపోతు మొగముతో, రెండుకన్నులతో, రెండు మేక కొమ్ములతో, నమస్కారము చేయుచున్నదోసిలితో, నల్లని శరీరకాంతులతో, శ్రీ పరమశివుని ధ్యానించుచున్న విప్రుడగు శ్రీదక్షబ్రహ్మను నిలిచినవానినిగా నిర్మింపవలెను. (నీలవర్ణము)

## 51. శ్రీ హరిహర ధ్యానము

సవ్యాంగే విద్రుమాభం శశధరమకుటం
భస్మరుద్రాక్షభూషం
వామాంగే శ్యామలాభం మణిమకుటయుతం
పీతవస్త్రాతిశోభమ్ ।
సవ్యే టంకాభయం స్యా దితరకరయుగే
శంఖకౌమోదకీ స్యాత్
కించిల్లాలాటనేత్రం విలసతు పురతః
శ్రీహరే రర్ధదేహమ్ ॥

సవ్యే టంకం పరస్మిన్ కటకసుజలజం
సింధువేణీసునద్ధం
వామార్ధే సత్కిరీటం రుధిరజలనిభం
వ్యాఘ్రచర్మాంబరాఢ్యమ్ ।
ఫాలార్ధే లోచనార్ధాకలితసమపదం
శుభ్రయజ్ఞోపవీతం
హర్యర్ధం నౌమి శంభుం సకలశుభకరం
సర్వసంపత్కరాఢ్యమ్ ॥

కుడిభాగమున శంకరుడు, ఎడమభాగమున విష్ణువు గల శ్రీ హరిహరమూర్తి రూపము వివరింపబడుచున్నది. ఇందు కుడిభాగము శివునిది. ఎడమభాగము విష్ణునిది.

కుడిభాగమున శివుడు పవడమువలె ఎఱ్ఱనైన శరీరచ్ఛాయలతో, బూది పూయబడిన సర్వాంగములతో, చంద్రరేఖగల జటాజూటములతో, రుద్రాక్షమాలలతో, నొసట

మూడవ కంటితో, శిరమున గంగాదేవితో, పులితోలు వస్త్రముతో, తెల్లని జందెముతో, నుండును.

ఎడమభాగమునందు విష్ణువు నల్లనిశరీరచ్ఛాయలతో, రత్నములుపొదిగిన బంగరు కిరీటముతో, పచ్చని (బంగరురంగు) వస్త్రములతో, కుండలములు, హారములు, దండ గడియములు,కంకణములు, మున్నగు బంగారునగలతో నుండును.

ఈ హరిహరమూర్తికి నాలుగుచేతులు. కుడిభాగమున (ఈశ్వరునిది)నిజహస్తము నందు అభయముద్రను 1, పరహస్తమునందు టంకమును 2, ధరించిన శివుడును,

ఎడమభాగమున (విష్ణునిది) నిజహస్తమునందు గదను 1, పరహస్తమునందు శంఖమును 2, ధరించిన విష్ణువును తమతమ ఆయుధములతో నుందురు.

ఎల్లసంపదలను ఇచ్చునట్టి శుభకరుడైన ఈ హరిహరమూర్తియగు శంభునకు నమస్కరించుచున్నాను.

(ఈశ్వరుడు రక్తవర్ణము, విష్ణువు శ్యామవర్ణము)

## 52. అర్ధనారీశ్వరమూర్తి ధ్యానమ్

చతుర్భుజం త్రినేత్రం చ శివాంశం దక్షపార్శ్వకే
వాపహార్ధం వామభాగే తు సీమంతతిలకాలకమ్ ॥

నేత్రార్ధం తు లలాటే తు సంయుక్తం దక్షిణాంశకే
దక్షిణే కుండలం కర్ణే దధం వామే తు పత్రకమ్ ॥

కట్యాం వా కలితం వామే ఒభయటంకౌ చ దక్షిణే
వరదోత్పలకే వామే కేయూరకటకాన్వితమ్ ॥

ఉమాంశే తు స్తనం కుర్యా త్స్వహారయుతం తు వా
శ్రోణ్యర్ధం దక్షిణే శంభో ర్వ్యాఘ్రచర్మకృతాంబరమ్ ॥

ఉమార్ధం కటిసూత్రం తు చిత్రవస్త్రపరిచ్ఛదమ్
నూపురాలంకృతం వామే సవ్యపాదం తు కుంచితమ్ ॥

స్వయం ప్రవాలవర్ణః స్యాత్ సుకృష్ణం వామభాగకమ్
అర్ధనారీశ్వరం ప్రోక్తం (రూపం సర్వశుభప్రదమ్) ॥

దేవీభాగః శ్యామవర్ణ ఈశ్వరోరక్తవర్ణకః ॥

కుడిభాగమున శంకరుడు, ఎడమభాగమున పార్వతియు గల అర్ధనారీశ్వరమూర్తి వివరింపబడుచున్నది. ఇందు కుడిభాగము శంకరునిది. ఎడమభాగము పార్వతిది.

కుడిభాగమునం దీశ్వరుడు ఎఱ్ఱని శరీరచ్ఛాయలతో, గంగాదేవి, చంద్రరేఖగల జటాజూటముతో, (హరిహరమూర్తియందు చెప్పినది) సగము నొసటికంటితో, చెవి యందు కుండలముతో, పులితోలు వస్త్రముగల సగముభాగము నడుముతో నుండును.

ఎడమభాగమున పార్వతి నల్లని శరీరచ్ఛాయలతో, పాపటతో, తిలకముతో, ముంగురులతో కూడిన మొగముతో, తాటంకము (కర్ణభూషణము)గల చెవితో, వామ స్తనముతో నుండును.

కుడిఎడమలయందు నాల్గుచేతులు. ఈశ్వరుడు నిజహస్తమునందు అభయముద్రను 1, పరహస్తమునందు టంకమును 2, పార్వతి నిజహస్తమును నడుమునందుంచుట లేక ఆ హస్తమునందు వరముద్రను1, పరహస్తమునందు కలువపువ్వును2 ధరించియుండును.

కుడిపాదము (ఈశ్వరునిది) కుంచితమై (కొంచెము ముడువబడినదై )యుండును. ఎడమపాదము (పార్వతిది) నూపురముతో, (ఆభరణముతో) అలంకరింపబడి యుండును.

ఈవిధమగు నర్ధనారీశ్వరరూపము ఎల్లశుభములను ఇచ్చునదిగా చెప్పబడినది.
(ఈశ్వరుడు రక్తవర్ణము, దేవి శ్యామవర్ణము)

## 53. శ్రీ కిరాతార్జున ధ్యానము

చతుర్భుజం త్రిణేత్రం చ జటామకుటసంయుతమ్
సర్వాభరణసంయుక్తం దివ్యాంబరసమావృతమ్ ॥

ధనుర్బాణయుతం రక్తం కృష్ణాపరశుసంయుతమ్
ఉపవీతసమాయుక్తం సముభాగతనుం కురు ॥

వామే గౌరీసమాయుక్తం దక్షిణే త్వర్జునః స్థితః

## అర్జున స్వరూపము

ఏకవక్త్రం ద్వినయనం జటామకుటసంయుతమ్ ॥

సర్వాభరణసంయుక్తం కృతాంజలిపుటం స్థితమ్ ॥
ఏవం కైరాత మాఖ్యాతమ్ ॥
(దేవో రక్తవర్ణః, అర్జునః శ్యామవర్ణః)

శ్రీ కిరాతార్జునమూర్తి ఎఱ్ఱని శరీరచ్ఛాయతో, నాల్గుచేతులతో, మూడు కన్నులతో, జటాజూటముతో, అన్నినగలతో, దివ్యములై ప్రకాశించు వస్త్రములతో, ఎడమ భాగమున గౌరీదేవితో, కుడిభాగమున అర్జునునితో ఉండును.

కుడిభాగమున క్రిందినుండి పైకి బాణమును 1, టంకమును 2, అట్లే ఎడమభాగమున ధనుస్సును 1, లేడిని 2, కుడిఎడమల నాల్గుచేతులతో ధరించును.

ఎడమ భాగముననున్న అర్జునుడు ఒక మొగముతో, రెండుకన్నులతో, జటాజూటముతో, అంగము లన్నిటియందు భూషణములతో, శ్రీస్వామివారికి నమస్కరించుచు ఉండును.

(స్వామి ఎఱుపు, అర్జునుడు నలుపు)

## 54. శ్రీ కంకాలమూర్తి ధ్యానము

భస్మాలేపత్రిపుండ్రం రుచిరమణిలస
త్పిచ్ఛకంకాలదక్షం
టంకం వామే కరాబ్జే దధత మఖిలస
త్సాంద్రసిందూరశోభమ్ ।

(శూలం కృష్ణమృగాస్యలంబితకరం
బద్ధేందుచూడం హరం
వందే దేవమునీశ్వరైః పరివృతం
వైయాఘ్రచర్మాంబరమ్)

(ఈ పద్యమునందు ఉత్తరార్ధము శార్దూలము. కనుక ప్రస్ఫరగా మార్చబడినది. మూలమునందు శార్దూలపాదములు కుండలీకరింపబడినవి.)

శూలం కృష్ణస్య వక్త్రే ప్రసృతకరతలం
బద్ధబాలేందుచూడం
వందే దేవైర్మునీంద్రైః పరివృత వంభవం
వ్యాఘ్రచర్మోత్తరీయఃమ్ ॥

చతుర్భుజం త్రిణేత్రం చ జటామకుటసంయుతమ్
పాదయోః పాదుకాయుక్తం కించి ద్వై గమనోన్ముఖమ్ ॥

సర్వాభరణసంయుక్తం యజ్ఞసూత్రోత్తరీయకమ్
శంఖం తు వామకర్ణే తు దక్షిణే నక్రకుండలమ్ ॥

కించి త్ప్రహసితాస్యం చ నానాలీలాసమావృతమ్
ఛురికాం దక్షకట్యాం తు దధానం భూతసంయుతమ్ ॥

భిక్షాన్న మోచనాయాతమృగపక్ష్యాదిసంయుతమ్
దేవస్య వామపార్శ్వే తు మహాభూతం ప్రకల్పయేత్ ॥

ద్విభుజం చ ద్వినేత్రం చ కరాళ వదనాన్వితమ్
కపాలం శిరసి న్యస్య దేవవామే తు సంస్థితమ్ ॥

ఏవం కింకాల్ల మహాఖ్యాతమ్
(దేవో రక్తవర్ణః, భూతః కృష్ణవర్ణః)

శ్రీ కింకాలమూర్తి ఎఱ్ఱని శరీరచ్ఛాయలతో, సర్వాంగములయందు విభూతితో పూయబడిన త్రిపుండ్రములతో, చంద్రరేఖ నలంకరించిన జటాజూటములతో, పులితోలు ఉత్తరీయముతో, మూడు కన్నులతో, నాలుగు చేతులతో, పాదములయందు పాదుకలతో, సర్వాభరణములతో, ఉత్తరీయమువలెనున్న జందెముతో, కుడిచెవియందు మకరకుండలములతో, ఎడమచెవియందు శంఖముతో, చిఱునవ్వుల మొగముతో, ప్రయాణమునకు సిద్ధపడుచున్న రూపముతో, పరివేష్టించిన భూతములతో, భిక్షాన్నకణములకై వచ్చిన మృగములతో, పక్షులతో నుండును.

కుడిపైపున క్రిందినుండి పైకి శూలమును 1, మణులతోకూడిన నెమలి పింఛమును ఎముకను 2, అట్లే ఎడమభాగమున లేడిముఖముపైకి చూపబడిన నిజహస్తమును 1 టంకమును 2, నాల్గుచేతులతో ధరించును. నడుమున కుడిభాగమున చిన్నకత్తి యుంచును.

శ్రీ స్వామివారి ఎడమభాగమున రెండు చేతులతో, రెండు కన్నులతో, భయంకరమగు మొగముతో, తలయందు కపాలముతో నున్న ఒకభూతమును నిర్మింపవలెను.

(శ్రీ స్వామి రక్తవర్ణము, భూతము నీలవర్ణము)

## 55. శ్రీ చండేశానుగ్రహమూర్తి ధ్యానమ్

చండేశం పీతవర్ణం యుగకరసహితం
దక్షహస్తే చ టంకం
వామే కృష్ణం దధానం వరకరసహితం
పార్వతీవామభాగమ్ ।
చండేశ స్యోత్తమాంగే ప్రతినిహితకరం
దక్షభాగే త్రిణేత్రం
సర్వాలంకారయుక్తం శశికలధరం
గంగయా యుక్త మీడే ॥

దేవస్య దక్షభాగే తు చండేశం తు ప్రకల్పయేత్
దేవస్య బాహుమాత్రేణ చండేశాయామ ఉచ్యతే ॥

న్యస్తవ్యోమప్రసాదేన చండేశో భక్తిసంయుతః
చండేశ్వరం స్వర్ణవర్ణం బాలభూషణభూషితమ్ ॥

దేవం శిరసి చండస్య లీలయా పరిశోభితమ్
చండేశానుగ్రహం ప్రోక్తమ్॥

(దేవ శ్చండేశ శ్చ పీతవర్ణౌ॥)

చండేశుడను బాలభక్తుని శ్రీస్వామి అనుగ్రహించెను. అందుచేత శ్రీస్వామికి గూడ చండేశుడను పేరు కలిగినది. ఇచట చండేశుడను భక్తుని అనుగ్రహించిన శ్రీ స్వామిరూపము, భక్తుడగు చండేశుని రూపము వర్ణింపబడుచున్నవి.

శ్రీస్వామి పచ్చని శరీరకాంతులతో, నాలుగుచేతులతో, మూడు కన్నులతో, గంగతో, చంద్రరేఖతో కూడిన జటాజూటముతో, సర్వాలంకారములతో, ఎడమభాగమున పార్వతితో నుండును.

కుడినిజకరము చండుని శిరముపై నుండును. నిజవామకరమునందు వరముద్ర ఉండును. పరకరములలో కుడిచేతియందు టంకము 1, ఎడమచేతియందు మృగము(లేడి) ఉండును.

శ్రీ స్వామివారి కుడివైపున చండేశ్వరుని నిర్మింపవలెను. అతని పొడవు శ్రీస్వామివారి బాహువంత ఉండవలెను. తన శిరమున స్వామి అనుగ్రహముతో, చేయి పెట్టుటచేత చండేశుడు భక్తియుతు డాయెను. అతడు సర్వభూషణములతో నుండవలెను.
(స్వామి, చండేశుడును పీతవర్ణము)

## 56. శ్రీ విషాపహరమూర్తి ధ్యానము

ఏకవక్త్రం త్రిణయనం జటామకుటసంయుతమ్
చతుర్బాహుం సురక్తం సమృగం పరశుధారిణమ్ ॥

దక్షహస్తే గరం ధృత్వా పానోన్ముఖమువేక్షణమ్
వరదం వామహస్తే తు సర్వాలంకారసంయుతమ్ ॥

దేవస్య వామపార్శ్వేతు దేవీం చైవ హి కారయేత్ ॥

శ్యామాం ద్వినేత్రాం ద్విభుజాం త్రిభంగీం
సవ్యాపసవ్యస్థితకుంచితాంఘ్రిమ్
కంఠే నిపీడ్య స్థితసవ్యలంబాం
చింతాకులా మీశ్వరతుష్టిదాత్రీమ్ ॥

పీతవస్త్రాం ద్వినయనాం వాంఛితార్థఫలప్రదామ్ ॥
(దేవోరక్తవర్ణః, దేవీ తు శ్యామవర్ణః)

శ్రీ విషాపహరస్వామి మిక్కిలి ఎఱ్ఱనగు శరీరచ్ఛాయలతో, ఒక్క మొగముతో, మూడు కన్నులతో, చంద్రరేఖాలంకృతమగు జటాజూటముతో, చతుర్బాహువులతో (నాలుగు), సర్వాలంకారములతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి గరళపాత్రమును 1, టంకమును 2, అట్లే ఎడమ వైపున వరముద్రను 1, లేడిని 2, నాల్గుచేతులతో ధరించి, గరళము త్రాగుటకు సిద్ధపడి మదముచే ఎఱ్ఱబడిన కన్నులతో, నుండును.

స్వామివారి వామభాగమున నల్లని శరీరచ్ఛాయలతో, రెండుకన్నులతో, రెండు చేతులతో, త్రిభంగమగు (మూడువంపులుగల) రూపముతో, కొంచెముగ వంచిన కుడి

ఎడమపాదములతో, స్వామి కంఠము కౌగిలించిన కుడిచేతితో, బంగారు (పచ్చని) వస్త్రములతో, తన స్వామి విషపానము చేయనున్నాడను దుఃఖమున నున్నను, ఆతనికి ధైర్యమును, సంతృప్తిని, కలిగించుచు, భక్తుల కోర్కెలను తీర్చునట్టి ముజ్జగముల తల్లియగు దేవిని (పార్వతిని) కూర్చున్నదానినిగా నిర్మింపవలెను.

(స్వామి ఎఱుపు, దేవి నలుపు)

## 57. శ్రీ చక్రదానమూర్తి ధ్యానము

విష్ణుం స్త్రీశపురస్థితో ంజలికరో
దేవస్య పాదాబ్జయోః
సంస్థాప్యాక్షిలసత్సహస్రకమల్యా మనిశం
పీతాంబరం కౌస్తుభమ్ ।
యస్తస్మై దయయా పరం పశుపతిం
పద్మాక్ష ఇత్యాఖ్యయా
టంకం కృష్ణమృగం వరం చ దధతం
చక్రప్రదం తం భజే ॥

ఏకవక్త్రం త్రినేత్రం చ జటామకుటసంయుతమ్
దధ మేణం చ పరశుం వరదం చైవ వామకే ॥

దక్షిణే చక్రసంయుక్తం దాతృరూప మిహోచ్యతే
దేవస్య వామభాగే తు శ్యామరూపం సుసంస్థితమ్ ॥

సర్వాభరణసంయుక్తం పీతవస్త్రోత్తరీయకమ్
శంఖచక్రసమాయుక్త ముత్తరే చాంజలిం న్యసేత్ ॥

ఏవం లక్షణసంయుక్తం విష్ణురూప మిహోచ్యతే ॥

(దేవశ్శ్వేతవర్ణః, విష్ణుః శ్యామవర్ణః)

చక్రదానమూర్తి యగు పరమశివుడు ఒక్క మొగముతో, మూడు కన్నులతో, తెల్లని శరీరచ్ఛాయతో, చంద్రరేఖాలంకృతమైన జటాజూటముతో, నాలుగు చేతులతో నుండును,

కుడివైపున క్రిందినుండి పైకి విష్ణువుకు ఈయుదలచిన సుదర్శనచక్రమును 1, టంకమును 2, అల్లే ఎడమవైపున వరముద్రను 1, లేదిని 2, ధరించిన నాల్గుచేతులతో నుండును.

శ్రీ స్వామివారి ఎడమభాగమున నల్లని శరీరకాంతులతో, సర్వాభరణములతో, పచ్చని పట్టుబట్టలతో, శ్రీస్వామికి నమస్కరించుచు దోసిలిపట్టిన నిజకరములతో, శ్రీ స్వామివారి పాదములయందు పద్మమువంటి తన కన్నుతో కూడిన మాలను కౌస్తుభ మణిని, పీతాంబరమును సమర్పించుచున్న చూపులతో, పరకరములయందు చక్రమును. శంఖమును. ధరించి విష్ణువు ఉండవలెను.

దయాపూర్ణుడనుచు "ఓపద్మాక్ష" అని పిలిచి చక్రమును అనుగ్రహించుచున్న చక్రప్రదుడగు శ్రీ చక్రదానమూర్తిని నేను ధ్యానించుచున్నాను.

(శ్రీ స్వామిది శ్వేతవర్ణము. విష్ణువిది శ్యామవర్ణము.)

## 58. శ్రీ విఘ్నేశ్వర ప్రసన్నమూర్తి ధ్యానము

చతుర్భుజం త్రినేత్రం చ జటామకుటసంయుతమ్
అభయం శిరసి న్యస్య వరదం వామహస్తకే ॥

కృష్ణాపరశుసంయుక్తం విఘ్నేశో దక్షిణే స్థితః
శయానం దక్షిణం పాదం దధం వామం తు లంబితమ్ ॥

సర్వాభరణసంయుక్తం శ్యామవర్ణం సుశోభితమ్
దేవస్య వామపార్శ్వే తు దేవీం ప్రహసితాననామ్ ॥

సర్వాలంకారసంయుక్తాం సవ్యే తూత్పలధారిణీమ్
వామే వరదసంయుక్తాం ద్విభుజాం చ త్రినేత్రకామ్ ॥

దక్షిణే శయితం పాదం దధం వామే తు లంబితమ్
ఏకపీఠస్థితాం దేవీ మువహా స్కందోక్తివత్కురు ॥

విఘ్నేశం రక్తవర్ణం చ కిరీటమకుటాన్వితమ్
నమస్కారాంజలికరం పాశాంకుశసమన్వితమ్ ॥

సర్వలక్షణసంయుక్తం సర్వాభీష్టఫలప్రదమ్
విఘ్నప్రసాద మిత్యుక్తమ్॥
(దేవో దేవీ చ శ్యామలౌ, విఘ్నేశో రక్తవర్ణః స్యాత్)

శ్రీ విఘ్నేశ్వరప్రసన్నస్వామి నల్లని శరీరచ్ఛాయలతో, మూడు కన్నులతో, నాల్గుచేతులతో, చంద్రరేఖాలంకృతమైన జటాజూటముతో, సర్వాభరణముల నలంకరించుకొని యుండును.

శ్రీస్వామివారి కుడినిజహస్తము విఘ్నేశ్వరుని శిరమునందు అభయముద్రతో నుండును 1. వామహస్తమునందు వరదముద్ర ఉండును 2. కుడిఎడమల పరహస్తముల యందు టంకము 1, లేడి 2 యుండును.

శ్రీస్వామివారి కుడిపాదము శయనించి యుండును. ఎడమకాలు ప్రేలాడు చుండును.

శ్రీస్వామి ఎడమభాగమున చిఱునవ్వు మొగముతో నల్లని శరీరచ్ఛాయలతో, రెండు చేతులతో, మూడు కన్నులతో, అవయవములన్నిటియందు ధరింపపడిన నగలతో, గౌరీదేవి యుండును.

ఆమె కుడిచేతియందు కలువపువ్వు, ఎడమచేతియందు వరముద్ర ఉండును. ఆమె కుడికాలు శయనించినదై ఎడమకాలు ప్రేలాడుచున్నదై యుండును.

శ్రీస్వామివారికి కుడిభాగమున విఘ్నేశ్వరుడుఎఱ్ఱని శరీరచ్ఛాయలతో, కిరీటము మున్నగు భూషణములతో, నాలుగుచేతులతో, నుండును.

ఆతని నిజకరములు శ్రీస్వామివారికి నమస్కరించుచు దోసిలివిపట్టి యుండును. పరకరములలో కుడిదానియందు అంకుశము 1, ఎడమదానియందు పాశము ఉండును.

ఎల్లలక్షణములతో కూడిన ఈ విఘ్నప్రసాదస్వామి రూపము ఎల్లరకు కోరిన ఫలముల నిచ్చును.

(శ్రీస్వామి శ్రీదేవియును నలుపు, శ్రీ విఘ్నేశ్వరుడు ఎఱుపు.)

## 59. శ్రీ సోమాస్కందమూర్తి ధ్యానము

ఉద్యద్భానునిభం చతుష్కరయుతం
కేయూరహారాదిభి
ర్దివ్యం వస్త్రధరం జటామకుటినం
సంశోభినేత్రత్రయమ్ ।

వామే గౌరియుతం సుఖాస ముభయో
ర్మధ్యే కుమారస్థితిం
సోమాస్కందవిభుం మృగాభయవరాన్
టంకం దధానం భజే ॥

సోమాస్కందేశ్వరం ప్రోక్తం భోగశక్తిసమన్వితమ్
చతుర్భుజం త్రిణేత్రం చ జటామకుటమండితమ్ ॥

సర్వాభరణసంయుక్తం వరదాభయహస్తకమ్
కృష్ణం టంకం దధానం చ దక్షిణే వామకే ఒపి చ ॥

పత్రం తు వామకర్ణే తు దక్షిణే నక్రకుండలమ్
ఉపవీతధరం చైవ శయానం వామపాదకమ్ ॥

లంబితం దక్షిణం పాదం వామే గౌరీసమన్వితమ్
తయోర్మధ్యగతం స్కందం సర్వలక్షణసంయుతమ్ ॥

సోమాస్కంద మితి ప్రోక్తం గంగాచంద్రసమన్వితమ్
సోమాస్కందస్య పార్శ్వే తు భోగశక్తి శ్చ వామకే ॥

వీరాం తు దక్షిణే పార్శ్వే చాసీనాం వా స్థితాం తు వా
పంచవింశతిమూర్తీనాం సోమాస్కందో మహాన్ మతః ॥

ఉత్సవారంభకాలే తు సోమాస్కందో విశేషతః
ధరాం తు కుముదం దేవీం వామే వరదసంయుతమ్ ॥

శయానం దక్షిణం పాదం వామపాదం తు లంబితమ్

స్కంద ధ్యానము :—

బాలరూపం స్థితం స్కందం ద్వినేత్రం ద్విభుజాన్వితమ్ ॥

తరళాబ్జధరం హస్తే సర్వాభరణభూషితమ్ ॥

సోమాస్కంద మితి ప్రోక్తమ్ ॥

(దేవో రక్తవర్ణః, దేవీ శ్యామవర్ణా, స్కందో నీలవర్ణః)

శ్రీ సోమాస్కందమూర్తి ఉదయించుచున్న లేత సూర్యునివలె ఎఱ్ఱని శరీరచ్ఛాయ లతో, మూడు కన్నులతో, గంగాదేవీ చంద్రరేఖలచే నలంకరింపబడిన జటాజూటముతో, జందెముతో, ఎడమభాగమున భోగశక్తియగు గౌరీదేవితో, నాలుగు చేతులతో, ఆభర ణము లన్నింటిచేత నలంకరింపబడిన సర్వాంగములతో, కుడిచెవియందు మకరకుండల ముతో, ఎడమచెవియందు తాటంకముతో, (స్త్రీలు ధరించునది) మధ్యభాగమున కుమార స్వామితో, సుఖముగ నాసీనుడై దివ్యమగు వస్త్రములను ధరించి యుండును. గౌరీదేవి వీరశక్తియైనచో కుడివైపున కూర్చుండిగాని, నిలిచిగాని ఉండును.

కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, టంకమును 2, అట్లే ఎడమ వైపున వరముద్రను 1, లేడిని 2, నాల్గు చేతులతో ధరించి ఉండును.

శ్రీ స్వామి ఎడమకాలు శయనించి యుండును. కుడికాలు వ్రేలాడుచుండును.

వామభాగమునందున్న గౌరీదేవికుడిచేతియందు కలువపూవును, ఎడమచేతియందు వరదముద్రయును, ఉండవలెను. ఆమె కుడికాలు శయనించి ఎడమకాలు వ్రేలాడుచు పీఠమునం దుండవలెను.

వారి మధ్యమున నున్న స్కందుడు బాలరూపముతో, రెండు కన్నులతో, రెండు చేతులతో, సర్వాభరణములతో, హస్తమునందు పద్మముతో నుండవలెను,

ఇది సోమాస్కందమూర్తిరూపము. ఇరువదియైదు శివమూర్తులలో నిది మిక్కిలి ప్రశస్తమైనది. ఉత్సవ కాలములయందు ఈ సోమాస్కంద రూపుడైన శ్రీ పరమశివునకు విశేషప్రాధాన్యము కలదు.

(శ్రీ స్వామి రక్తవర్ణుడు, దేవి శ్యామవర్ణ, స్కందుడు నీలవర్ణుడు)

## 60. శ్రీ ఏకపాదమూర్తి ధ్యానము

ధ్యాయే త్కోటిరవిప్రభం త్రిణయనం
శీతాంశుగంగాధరం
హస్తే టంకమృగం వరాభయకరం
పాదైకయుక్తం విభుమ్ ।

శంభో ర్దక్షిణవామపక్ష భుజయో
ర్బ్రహ్మాచ్యుతాభ్యాం స్థితం
తత్తల్లక్షణ మాయుధైః పరివృతం,
హస్తద్వయాభ్యాంజలిమ్ ॥

బ్రహ్మాండప్రళయే సుసంస్థితపదం
బ్రహ్మాండమధ్యస్థితమ్
హ్యేవం లక్షణసంయుతం పురహరం
పాదైకమూర్తీకృతమ్ ॥

ఏకపాద మితి ఖ్యాతమ్॥
(రక్తవర్ణః పక్షాంతరే శ్వేతవర్ణో ఒపి ప్రసిద్ధః)

ఏకపాదమూర్తి కోటిసూర్యుల వలె మిక్కిలి ఎఱ్ఱని శరీరచ్ఛాయలతో, గంగాదేవి చంద్రరేఖలచే నలంకరింపబడిన జటాజూటముతో, నాలుగు చేతులతో, ఒక్క పాదముతో నుండును.

కుడిపైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, టంకమును 2, అట్లే ఎడమ పైపున వరముద్రను 1, లేడిని 2, నాలుగు చేతులతో ధరించును.

శ్రీ స్వామికి కుడి భాగమున బ్రహ్మయును, ఎడమ భాగమున విష్ణువును. తమ తమ ఆయుధములను పరకరముల రెంటితో ధరించి, రెండు నిజకరములతో నమస్కరించుచు నుందురు.

శ్రీ స్వామివారి ఏకపాదము బ్రహ్మాండమధ్యమున (నడుమ) ఆధార స్తంభము వలె ప్రళయ కాలమున కూడ చెదరక నిలచి యుండును.

ఈ లక్షణములతో కూడిన పురహరుని మూర్తి ఏకపాదరూప మని ప్రసిద్ధమైనది. (రక్తవర్ణము శ్వేతవర్ణ మనియు ప్రమాణము)

# 61. శ్రీ సుఖాసీనమూర్తి ధ్యానము

అరుణాభసుభస్మవిలేపనధృ
ద్ధరణీచరటంకవరాభయదమ్ ।
అరుణాంబరశోభి లసచ్ఛుభదం
గుణనేత్రసుఖాసనరూప మిదమ్ ॥

చతుర్భుజం త్రిణేత్రం చ జటామకుటసంయుతమ్
అభయం దక్షిణే హస్తే వరదం వామహస్తకే ॥

కృష్ణాపరశుసంయుక్తం వామదక్షిణహస్తయోః
శయానం దక్షిణం పాదం దధం వామం తు కుంచితమ్ ॥

ఉమాసహితపత్సర్వం స్కందగౌరీవివర్జితమ్
సుఖాసన మితి ప్రోక్తమ్ ॥ (రక్తవర్ణః)

శ్రీ సుఖాసీనమూర్తి ఎఱ్ఱని శరీరచ్ఛాయలతో, మూడు కన్నులతో, గంగాదేవీ చంద్రరేఖలచే నలంకరింపబడిన జటాజూటముతో, జందెముతో, నాలుగు చేతులతో, ఆభరణము లన్నింటిచేత అలంకరింపబడిన సర్వావయవములతో, ఎఱ్ఱని వస్త్రములతో, సుఖాసీనుడై యుండును.

శ్రీ స్వామి కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, టంకమును (గొడ్డలిని) 2, అట్లే ఎడమవైపున వరముద్రను 1, లేడిని 2 ధరించిన నాల్గు చేతులతో నుండును.

శ్రీ స్వామి కుడికాలు శయనించి యుండును. ఎడమకాలు కొంచెము కుంచితమై (వంచబడినదై) యుండును.

ఎల్ల సుఖములను ఇచ్చునట్టి ఈ రూపము సుఖాసీన మని చెప్పబడినది.

(రక్తవర్ణము)

# 62. శ్రీ దక్షిణామూర్తి ధ్యానము

భూతివ్యాపాండురాంగః శశిశకలధరో
జ్ఞానముద్రాక్షమాలా
వీణాపుస్తై ర్విరాజత్కరతలకమలో
యోగపట్టాభిరామః ।
వ్యాఖ్యాపీఠే నిషణ్ణః సకలమునివరైః
సేవిత స్సుప్రసన్నః
సవ్యాలః కృత్తివాసాః సతత మవతు నో
దక్షిణామూర్తి రీశః ॥

(నారదో జమదగ్ని శ్చ వసిష్ఠభృగుదక్షిణే)

దక్షిణే జమదగ్ని శ్చ వసిష్ఠభృగునారదాః
భరద్వాజః శౌనక శ్చాప్యగస్త్యో భార్గవ స్తథా ॥

వామపార్శ్వే విభాతవ్యాః కిన్నరాద్యైః సుసేవితే
కైలాసపర్వతే తస్మిన్ వటవృక్షస్య మూలకే ॥

ఆసీనం సకలేశం తు శాంతరూపం మహేశ్వరమ్
దక్షిణామూర్తి మాహు స్తే ఉపస్మారం శాయయే దధః ॥

సురలు, అసురులు, కిన్నరులు, కింపురుషులు, ప్రమథులు, మున్నగు సకలపరిజనములు సేవించుచుండ కైలాసపర్వతమునందలి వటవృక్షమూలమునందు (మర్రిచెట్టు మొదట) దక్షిణామూర్తి, వ్యాఖ్యానమూర్తి అను పేరులతో మహేశ్వరుడు సుఖాసీనుడై యుండును.

ఆ స్వామి విభూతిచేత తెల్లనగు సర్వావయవములతో, చంద్రరేఖచే నలంకరింపబడిన జటాజూటముతో, పాముల భూషణములతో, పులితోలు వస్త్రముతో, నాల్గుచేతులతో నడుమున యోగపట్టముతో, వ్యాఖ్యాపీఠమునందు కూర్చుండి సమస్తమునిగణములచేత సేవింపబడుచు అభిరాముడై ప్రసన్నుడై యుండును.

కుడివైపున క్రిందినుండి పైకి జ్ఞానముద్రను 1, జపమాలను 2, అట్లే ఎడమ వైపున పుస్తకమును 1, వీణను 2, నాల్గు చేతులయందు ధరించి యుండును.

ఆ స్వామి కుడి భాగమున జమదగ్ని, వసిష్ఠుడు, భృగువు, నారదుడును, ఎడమ భాగమున భరద్వాజుడు, శౌనకుడు, అగస్త్యుడు, భార్గవుడును ఉండవలయును. క్రింది భాగమున (పాదముల క్రింద) అపస్మారుడను వానిని పరుండబెట్టవలెను.

సకలలోకములకు ప్రభుడగు, శాంతరూపుడగు ఈ మహేశ్వరుని దక్షిణామూర్తి, లేక వ్యాఖ్యానమూర్తి అని వృద్ధులగు ఋషులు పలుకుదురు.

ఇట్టి స్వామి మనల నెల్లరను రక్షించును గాక ! (శుద్ధవర్ణము)

## 63. శ్రీ లింగోద్భవమూర్తి ధ్యానము

లింగాకారస్య మధ్యే తు చంద్రశేఖరవ త్స్థితమ్
సలకాభస్థితం పాదం లింగోద్భవసమన్వితమ్ ॥

వికించి ర్హంసరూపేణ చోర్ధ్వగో వామపార్శ్వకే
దక్షే వరాహరూపస్య రూపే ణాధోగతో హరిః ॥

వామదక్షిణపార్శ్వస్థౌ కృతాంజలిసమన్వితౌ
స్వరూపేణ ద్విపాదస్థౌ వజవిష్ణూ విభోః పదే ॥

ఏవం లింగావతార స్తు సర్వశాంతికరః సదా ॥

తుంగాంగవిస్తృతనతాంసకలంబమానైః
సంపన్నచిహ్నభుజభూషణవర్ణభేదైః ।
శోభాన్వితం శుభకరం సకలప్రజానా
మైశ్వర్యసంఘపరివృద్ధికరం విదధ్యాత్ ॥

శ్రీ లింగోద్భవమూర్తి లింగముయొక్క మధ్యభాగమున చంద్రశేఖరుడైన పరమ శివుని రూపముతో నుండవలెను. ఆ చంద్రశేఖరుని పాదము లింగమునం దుండ వలెను. అప్పు డామూర్తి లింగోద్భవ మగును.

శ్రీ చంద్రశేఖరుడు కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1. గొడ్డలిని 2, అట్లే ఎడమవైపున వరముద్రను 1. లేడిని 2, కుడియెడమల ధరించిన నాల్గు చేతులలో నుండును.

ఆ స్వామికి ఎడమవైపున హంసరూపములో నున్న బ్రహ్మను పైకి వెళ్ళుచున్నట్లు నిర్మింపవలెను. కుడివైపున వరాహరూపములో నున్న విష్ణువును క్రిందికి వెళ్ళుచున్నట్లు నిర్మింపవలెను.

వామదక్షిణభాగములయందున్న బ్రహ్మయు. విష్ణువును తమ తమ స్వరూపములతో, రెండు పాదములతో, నమస్కారాంజలిని పట్టిన నిజకరములతో, పరకరములయందు తమ తమ ఆయుధములతో. ముఖములయందు క్రమము హంసముయొక్క వరాహముయొక్క రూపములతో నుండవలయును.

ఆయుధములు, చేతులు, ఆభరణములు, వర్ణములు, మున్నగునవి ఎట్లుండును పై శ్లోకమునందు మూపురములు మున్నగునవి ఏరీతిగా చెప్పెనో, సుందరమైన ఆ మూర్తి శుభములను ఇచ్చుచు సర్వప్రజలకు ఐశ్వర్యమును వృద్ధిచేయునదగును.

పైన వివరించిన లక్షణములతో కూడిన శ్రీ లింగోద్భవమూర్తి విశ్వప్రపంచమునకు శాంతి చేకూర్చును. (శుద్ధవర్ణము)

## 64. శ్రీ శరభమూర్తి ధ్యానము

మహామేరుసమాకార మష్టపాదం రవిప్రభమ్
ద్వాత్రింశద్బాహుసంయుక్తం సూర్యసోమాగ్నిలోచనమ్ ॥

దుర్గాకాలద్విపక్షం చ సుతీక్ష్ణఘనగర్జితమ్
ఊర్ధ్వకేశం మహాబాహుం నానాలంకారభూషితమ్ ॥

వజ్రముష్ట్యభయం చక్రం శక్తిం దండాంకుశౌ తథా
ఖడ్గఖట్వాంగపరశూ నక్షమాలాస్థికాలకమ్ ॥

ధనుశ్చ ముసలం చాగ్నిం దధానం దక్షిణైః కరైః
వరదం పాశహస్తం చ గదాం బాణధ్వజౌ తథా ॥

క్రకచం క్రోడశంఖౌ చ ఖేటం నాగం చ పంకజమ్
కపాలం పుస్తకం కుంతం దుర్గాశ్లిష్టకరాంబుజమ్ ॥
హలం వామే దధానం చ భీషణం కరపంకజైః
దంష్ట్రోల్లాసం మహాసింహచ్ఛటాచ్ఛటనిపీడితమ్ ॥

శ్రీ శరభమూర్తి ఎఱ్ఱని శరీరచ్ఛాయలతో, మహామేరు పర్వతమువంటి ఆకారముతో, ఎనిమిది పాదములతో, ముప్పదిరెండు చేతులతో, సూర్యుడు చంద్రుడు అగ్ని అను ముప్పుర యాపములతో నున్న మూడు కన్నులతో, దుర్గవలె నల్లనగు రెండు రెక్కలతో, భయంకరమగు ఉరుమువంటి గర్జనముతో, పైకిలేచి ఉన్న వెంట్రుకలతో, గొప్ప పొడపైన చేతులతో, సర్వాంగములయందు భూషణములతో, మహాభీషణమగు కోరల కాంతులతో, సింహముల సమూహములను మర్దించుచు ఉండును.

ఈ స్వామి కుడిప్రై పున క్రిందినుండి పైకి అభయముద్రను 1. ముష్టి యను నాయుధమును 2. అంకుశమును 3. గొడ్డలిని 4. దండమును 5. బాణమును 6. రోకలిని 7. ఖట్వాంగమును 8. చక్రమును 9. ఖడ్గమును 10. అగ్నిని 11. శక్తిని 12. శూలమును 13. జపమాలను 14. వజ్రమును 15. ఎముకను 16.

అల్లే ఎడమవైపున శ్రీ దుర్గాదేవిని 1. వరదముద్రను 2. పాశమును 3. గదను 4. వింటిని 5. ధ్వజమును 6. అంపమును 7. వరాహ ముఖమును 8. శంఖమును 9. ఖేటమును 10. నాగమును 11. పద్మమును 12. కపాలమును 13. పుస్తకమును 14. కుంతమును 15. నాగలిని 16. కుడిఎడమల ముప్పదిరెండు చేతులతో, ధరించియుండును.

ఇట్టి రూపముతో నున్న శ్రీ శరభమూర్తికి నమస్కరించుచున్నాము.

## 65. శ్రీ వీరభద్ర ధ్యానము

మూలపాఠః :

నీలాభం రక్తవస్త్రం భ్రుకుటియుతముఖం
జ్వాలకేశం త్రిణేత్రం
సవ్యే ఖడ్గం చ దండం త్రిశిఖపరశుం
వామభాగే కపాలమ్ ।

ఖేటం ఘంటాం వహంతం ముసల మపి దధత్
కింకిణీమాల యాఢ్యం
సంహత్వాగ్న్యతసక్థి స్ఫురతు మమ పురో
వీరభద్రస్వరూపమ్ ॥

పరిష్కృతపాఠః :

నీలాభం రక్తవస్త్రం భ్రుకుటియుతముఖం
జ్వాలకేశం త్రిణేత్రం
సవ్యే ఖడ్గం చ దండం త్రిశిఖరపరశుం
వామభాగే కపాలమ్ ।
ఖేటం ఘంటాం వహంతం ముసల మపి దధత్
కింకిణీమాల యాఢ్యం
సింహత్వగ్బద్ధసక్థి స్ఫురతు మమ పురో
వీరభద్రస్వరూపమ్ ॥

శ్రీ వీరభద్రస్వామి నల్లని శరీరకాంతులతో, ఎఱ్ఱని వస్త్రములతో, కనుబొమలు ముడిపడిన (కోపించిన) ఒక్క ముఖముతో, ఎఱ్ఱని (అగ్నివలె) నున్న కేశములతో, (జుట్టుతో) మూడు కన్నులతో, ఎనిమిది చేతులతో, సింహ చర్మముతో కట్టబడిన మోకాళ్ళ క్రింది ప్రదేశములతో (పిక్కలతో) నుండును.

ఆ స్వామి కుడిభాగమున క్రిందినుండి పైకి కత్తిని 1, దండమును 2, శూలమును 3, గొడ్డలిని 4, అట్లే ఎడమ భాగమున ఖేటమును 1, కపాలమును 2, గంటను 3, రోకలిని 4, కుడి ఎడమల ఎనిమిది చేతులలో ధరించి యుండును.

చిఱుగంటలదండలతో నొప్పారు ఇట్టి శ్రీ వీరభద్రస్వామియొక్క రూపము నా కన్నులముందు ప్రకాశించునుగాక !

## 66. శ్రీ దక్షిణామూర్తి ధ్యానము

అచల ఉపరిశృంగే శంభుయోగాసనస్థం
ధవళ మమలవర్ణం చైకవక్త్రం త్రిణేత్రమ్ ।

కరగతశశిసర్పం పుస్తకజ్ఞానముద్రం
మునినుతపదయుగ్మం దక్షిణామూర్తి (దేవమ్) వీడే ॥

శ్రీ దక్షిణామూర్తి మిక్కిలి ఎత్తైన పర్వత శిఖరమునందు స్వచ్ఛమగు మిక్కిలి తెల్లని శరీరకాంతులలో, మూడు కన్నులుగల ఒక్క మొగముతో, నాల్గు చేతులతో, కళ్యాణకరమైన యోగాసనమునం దుండును.

కుడిభాగమున క్రిందినుండి పైకి జ్ఞానముద్రను 1, నాగపాశమును 2. అట్లే ఎడమపైపున పుస్తకమును 1, అగ్నిని 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును.

ఇట్టి రూపముతో సకల మునిజనముచేత నుతింపబడు పాదములుగల శ్రీ దక్షిణామూర్తి స్వామిని నేను ప్రార్థింతును.

## 67. శ్రీ శాస్త్ర ధ్యానమ్

(మయమతము)

మోహినీతనయః శాస్తా ద్విభుజః శ్యామసన్నిభః
పీఠస్థః కుంచితాంఘ్రిం స్వవామపాదం ప్రలంబితమ్ ॥
గజహస్తోపమో వామబాహుర్జానూరుబాహ్యతః
మండలీభూతరూపో వా వక్రదండధరో ఽథవా ॥
స్నిగ్ధనీలాంజనాకీర్ణాః కుండలీభూతమూర్ధజాః
గజవాహనకేతుః సన్ హారాద్యాభరణాన్వితః ॥
నీలవర్ణహయో వాథ వృషో వా వాహనధ్వజః
చతుర్భుజ స్త్రియుక్తో వా సర్వత్ర కుక్కుటధ్వజః ॥

శ్రీ శాస్త మోహినీదేవత యొక్క పుత్రుడు. ఈ స్వామి నల్లని శరీరచ్ఛాయలతో, రెండు కన్నులతో గాని మూడు కన్నులతో గాని, రెండు చేతులతో పీఠమునందు ఆసీనుడై జటామండలముతో నుండును.

ఈతని కుడికాలిని ప్రలంబితమునుగా (చాపబడినదిగా) నిర్మింపవలెను. ఎడమ చేయి ఎడమ మోకాలునకు, తొడకు వెలుపల 1, కుడిచేయి వంకరగల దండమును 2, ధరించి ఉండవలెను.

ఈతడు కాటుకవలె నల్లనైన, ఉంగరములవలె చుట్టుకొనిన వెంట్రుకలతో, హార ములు మున్నగు సాభరణములచేత అలంకరింపబడిన అవయవములతో, ఏనుగు వాహన ముతో, ఏనుగు పతాకతో నుండును.

మఱియొక విధముగా వీని రూపమును ధ్యానించు చున్నారు.

ఈతడు పైన వివరింపబడిన రూపముతో, నల్లని గుఱ్ఱము వాహనముతో, పతా కతో గాని, అల్లే ఎద్దు వాహనముతో, పతాకతో గాని, కుక్కుట ధ్వజముతో గాని, చతుర్భుజుడై మూడు కన్నులతో నుండును. (శ్యామవర్ణము)

# 68. శ్రీ నందికేశ్వర ధ్యానము

మూలపాఠః :

బిభ్రాణం పరశుం మృగం కరతలై రీశే ప్రణామాంజలిం
భస్మోద్ధూళితపాండరం శశికళాగంగాకపర్దోజ్జ్వలమ్ ।
పర్యాయ్యత్రిపురాంతకే జ్యేష్ఠాగణేంద్రావృతం
బ్రహ్మేంద్రాచ్యుతసంవతాంఘ్రికమలం శ్రీనందికేశం భజే॥

పరిష్కృతపాఠః :

బిభ్రాణం పరశుం మృగం కరతలై రీశే ప్రణామాంజలిం
భస్మోద్ధూళితపాండరం శశికళాగంగాకపర్దోజ్జ్వలమ్ ।
శ్రీకంఠే త్రిపురాంతకే ప్రణయినం జ్యేష్ఠాగణేంద్రావృతం
బ్రహ్మేంద్రాచ్యుతవందితాంఘ్రికమలం శ్రీనందికేశం భజే॥

శ్రీ నందికేశ్వరుడు గొడ్డలిని 1, లేడిని 2, ధరించిన కుడియెడమల పరహస్తము లతో, ఈశ్వరుని నమస్కరించుచున్న నిజకరములతో (నాల్గు చేతులతో), విభూతిపూతల చేత తెల్లనగు శరీరముతో, చంద్రరేఖ, గంగాదేవి కల జటాజూటముతో, ప్రకాశించు చుండును.

శ్రీ కంఠుడు త్రిపురాంతకుడగు పరమశివునియందు భక్తికలిగి, దేవతాశ్రేష్ఠులగు ఇంద్రాదులచే చుట్టుముట్టబడి బ్రహ్మ, విష్ణువు మున్నగు వారలచేత నమస్కరింపబడు చున్న శ్రీ నందికేశ్వరుని నేను భజించుచున్నాను. (శ్వేతవర్ణము)

# శ్రీ అష్టభైరవుల ధ్యానములు

అసితాంగో రురు శ్చండః క్రోధ శ్చోన్మత్తభైరవః
కపాలీ భీషణ శ్చైవ సంహార శ్చాష్టభైరవాః ॥

1 అసితాంగుడు　　2 రురువు
3 చండభైరవుడు　　4 క్రోధుడు
5 ఉన్మత్తభైరవుడు　　6 కపాలి
7 భీషణుడు　　8 సంహారుడు

అని అష్టభైరవుల నామములు. వీరి ధ్యానములు ఈ క్రింద చెప్పబడుచున్నవి.

## 69. శ్రీ అసితాంగభైరవ ధ్యానము

(పానపాత్రం చ ఖడ్గం చ అక్షమాలాం కమండలుమ్)

సపానపాత్రఖడ్గం చ సాక్షమాలాకమండలుమ్
త్రిణేత్రం వరదం శాన్తం కుమారం చ దిగంబరమ్ ॥

బ్రహ్మాణీశక్తిసహితం హంసారూఢం సుభూషణమ్
నీలవర్ణం కృపామూర్తి మసితాంగం భజా మ్యహమ్ ॥

అసితాంగభైరవుడు నల్లని శరీరచ్ఛాయలతో, దయగల రూపముతో, దిగంబరమగు శరీరముతో, మూడు కన్నులతో, బ్రాహ్మీశక్తితో గూడి శాంతుడై నాల్గు చేతులతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి అక్షమాలను 1, ఖడ్గమును 2, అట్లే ఎడమవైపున కమండలువును 1, పానపాత్రమును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును.

ఈ భైరవుడు హంసవాహనమునందు వరముల నిచ్చుచు ఎల్లభూషణములతో నలంకరింపబడి యుండును.

బాలరూపముతో ఇట్టులున్న శ్రీ అసితాంగభైరవుని నేను భజించుచున్నాను.

(నీలవర్ణము)

## 70. శ్రీ రురుభైరవ ధ్యానము

టంకం కృష్ణమృగం చైవ ఖడ్గం పాత్రం తథైవ చ
త్రిణేత్రం వరదం శాంతం కుమారం చ దిగంబరమ్ ॥
మాహేశ్వర్యా చ సహితం వృషారూఢం స్మితాననమ్
శుద్ధస్ఫటికసంకాశం నమామి రురుభైరవమ్ ॥

శ్రీ రురుభైరవుడు స్వచ్ఛమగు స్ఫటికమణి వలె తెల్లని శరీరచ్ఛాయలతో, మూడు కన్నులతో, నాల్గు చేతులతో, దిగంబరమగు (వస్త్రములులేని) శరీరముతో, చిఱునవ్వు మొగముతో, మాహేశ్వరీదేవితో కూడి కుమారరూపముతో, వృషభవాహనముతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి కత్తిని 1, టంకమును 2, అట్లే ఎడమవైపున పాత్రమును 4, లేడిని 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును.

ఇట్టి రూపముతో వరముల నిచ్చుచున్న రురుభైరవుని నమస్కరించుచున్నాను.
(శుభ్రవర్ణము)

## 71. శ్రీ చండభైరవ ధ్యానము

ధనుర్బాణధరం చైవ ఖడ్గపాత్రేణ సంయుతమ్
త్రిణేత్రం వరదం శాంతం కుమారం చ దిగంబరమ్ ॥
కౌమారీశక్తిసహితం శిఖివాహనభూషణమ్
గౌరవర్ణధరం దేవం వందే ఽహం చండభైరవం ॥

శ్రీ చండభైరవుడు తెల్లని శరీరచ్ఛాయలతో, మూడు కన్నులతో, నాల్గు చేతులతో, దిగంబరమగు (వస్త్రములులేని) శరీరముతో, కౌమారీశక్తితో కూడిన శాంతమగు కుమార రూపముతో, నెమలి వాహనముతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి ఖడ్గమును 1, బాణమును 2, అట్లే ఎడమవైపున పాత్రమును 1, విల్లుని 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించి యుండును.

ఇట్టి రూపముతో వరముల నిచ్చుచున్న శ్రీ చండభైరవుని నేను నమస్కరించుచున్నాను.
(శుభ్రవర్ణము)

# 72. శ్రీ క్రోధభైరవ ధ్యానము

శంఖచక్రధరం దేవం పానపాత్రగదాధరమ్
త్రిణేత్రం వరదం శాంతం కుమారం చ దిగంబరమ్ ॥

వైష్ణవీశక్తిసహితం తార్క్ష్యవాహనసంయుతమ్
(నీలవర్ణ మలంకారం)
అలంకృతం నీలవర్ణం వందే ఒహం క్రోధభైరవమ్ ॥

శ్రీ క్రోధభైరవుడు నల్లని శరీరచ్ఛాయతో, మూడు కన్నులతో, నాల్గు చేతులతో, దిగంబరమగు శరీరముతో, వైష్ణవీశక్తితో కూడిన శాంతమగు కుమార (బాల) రూపముతో, గరుడవాహనముతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి గదను 1, చక్రమును 2, అట్లే ఎడమవైపున పానపాత్రమును 1 శంఖమును 2, కుడియెడమల నాల్గు చేతులతో ధరించియుండును.

ఇట్టి రూపముతో అలంకరించుకొని వరముల నిచ్చుచున్న శ్రీ క్రోధభైరవుని నమస్కరింతును. (నీలవర్ణము)

# 73. శ్రీ ఉన్మత్తభైరవ ధ్యానము

ఖడ్గం చ ముసలం చైవ ఖేటకం చ కపాలకమ్
త్రిణేత్రం వరదం శాంతం కుమారం చ దిగంబరమ్ ॥

హేమవర్ణధరం దేవ మశ్వవాహనసంయుతమ్
వారాహీశక్తిసహితం వందే చోన్మత్తభైరవమ్ ॥

ఈ యున్మత్తభైరవస్వామి బంగారువలె పచ్చనగు శరీరచ్ఛాయలతో, మూడు కన్నులతో, నాల్గు చేతులతో, దిగంబరమగు శరీరముతో, వారాహీశక్తితో కూడిన శాంతమగు కుమార (బాల) రూపముతో, అశ్వ (గుఱ్ఱము) వాహనముతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి రోకలిని 1, కత్తిని 2, అట్లే ఎడమవైపున కపాలమును 1, ఖేటమును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించియుండును.

ఇట్టి రూపముతో వరముల నిచ్చుచున్న ఉన్మత్తభైరవుని నేను నమస్కరించు చున్నాను. (హేమవర్ణము).

## 74. శ్రీ కపాలభైరవ ధ్యానము

పాశం వజ్రాయుధం చైవ ఖడ్గం వై పానపాత్రకమ్
త్రిణేత్రం వరదం శాంతం కుమారం చ దిగంబరమ్ ॥

ఇంద్రాణీశక్తిసహితం గజవాహనసంయుతమ్
పద్మరాగప్రభం దేవం కాపాలం భైరవం భజే ॥

శ్రీ కపాలభైరవుడు పద్మరాగమణుల వలె ఎఱ్ఱనగు శరీరచ్ఛాయలతో, మూడు కన్నులతో, నాల్గు చేతులతో, దిగంబరమగు శరీరముతో, ఇంద్రాణీశక్తితో కూడిన శాంతమగు బాల రూపముతో, ఏనుగు వాహనముతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి వజ్రమును 1, ఖడ్గమును 2, అట్లే ఎడమవైపున పానపాత్రమును 1, పాశమును 2, కుడిఎడమల నాల్గు చేతులతో, ధరించియుండును.

ఇట్టి రూపముతో వరముల నిచ్చుచున్న శ్రీ కపాలభైరవుని నేను భజించు చున్నాను. (రక్తవర్ణము)

## 75. శ్రీ భీషణభైరవ ధ్యానము

శూలం చ ముద్గరం చైవ కపాలం ఖడ్గహస్తకమ్
త్రిణేత్రం వరదం శాంతం కుమారం చ దిగంబరమ్ ॥

చాముండాశక్తిసహితం హరివాహనసంయుతమ్
రక్తవర్ణధరం దేవం వందే భీషణభైరవమ్ ॥

శ్రీ భీషణభైరవుడు ఎఱ్ఱని శరీరచ్ఛాయలతో, మూడు కన్నులతో, నాల్గు చేతులతో, దిగంబరమగు శరీరముతో, చాముండాశక్తితో కూడిన శాంతమగు బాల రూపముతో, సింహవాహనముతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి శూలమును 1, ఖడ్గమును 2, అట్లే ఎడమవైపున కపాలమును 1, ముద్గరమును 2. కుడిఎడమల నాల్గు చేతులతో ధరించి యుండును.

ఇట్టి రూపముతో వరముల నిచ్చుచున్న శ్రీ భీషణభైరవుని నేను నమస్కరించుచున్నాను.

(రక్తవర్ణము)

## 76. శ్రీ సంహారభైరవ ధ్యానమ్

శూలం డమరుకం చైవ శంఖం చక్రం గదాధరమ్
ఖడ్గం పాత్రం చ ఖట్వాంగం పాశాంకుశధరం తథా ॥
దశబాహుం త్రినేత్రం చ సర్పరాజోపవీతినమ్
దిగంబరం కుమారం చ శ్వానవాహనసంయుతమ్ ॥
దంష్ట్రాకరాళవదన మష్టైశ్వర్యఫలప్రదమ్
చండికాశక్తిసహితం ధ్యాయేత్సంహారభైరవమ్ ॥

శ్రీ సంహారభైరవుడు మూడు కన్నులతో, పది చేతులతో, పాముల జందెముతో, దిగంబరమగు బాల రూపముతో, కోరలచేత భయంకరమగు మొగములో, శ్వానవాహనముతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి శూలమును 1, చక్రమును 2, గదను 3, ఖడ్గమును 4, అంకుశమును 5. అట్లే ఎడమవైపున పాత్రమును 1, శంఖమును 2, డమరుకమును 3, ఖట్వాంగమును 4, పాశమును 5, కుడిఎడమల పది చేతులతో ధరించి యుండును.

ఇట్టి రూపముతో, చండికాశక్తితో కూడి అష్టైశ్వర్య ఫలముల నిచ్చునట్టి శ్రీ సంహారభైరవుని ధ్యానింపవలెను.

## 77. శ్రీ స్వర్ణాకర్షణభైరవ ధ్యానము
(పాంచరాత్రము)

పీతవర్ణం చతుర్బాహుం త్రినేత్రం పీతవాససమ్
అక్షయస్వర్ణమాణిక్యగణపూరితపాత్రకమ్ ॥

అంసాహితమహాశూలచామరం తోమరోద్వహమ్
సతతం చింతయే ద్భక్త్యా భైరవం సర్వసిద్ధిదమ్ ॥

నానాభరణశోభాఢ్య మానందసుఖరూపిణమ్
మదోన్మత్తం సదానందం సర్వదేవనమస్కృతమ్ ॥

ఏవం ధ్యాయే చ్చ మంత్రజ్ఞః స్వర్ణాకర్షణభైరవమ్ ॥

శ్రీ స్వర్ణాకర్షణ భైరవుడు పసుపుపచ్చని శరీరచ్ఛాయలతో, మూడు కన్నులతో, నాల్గు చేతులతో, బంగారు నలె పచ్చని వస్త్రములతో, వివిధములగు మణిమయభూషణములతో, సుఖమును, ఆనందమును ప్రసాదించు రూపముతో,మదముచే నున్మత్తుడై ఎల్ల దేవతలచేత నమస్కరింపబడుచు నుండును. ఈతడు సర్వసిద్ధుల నిచ్చును.

ఈతడు కుడిపైపున క్రిందినుండి పైకి బంగారుతో, మాణిక్యములతో నింపబడిన అక్షయపాత్రమును 1, భుజమునం దుంచబడిన మహాశూలమును 2, అట్లే ఎడమపైపున తోమరమును 1, చామరమును 2, నాల్గు చేతులతో కుడిఎడమల ధరించి యుండును.

మంత్రశాస్త్రము నెఱింగిన పండితుడు శ్రీ స్వర్ణాకర్షణ భైరవస్వామిని ఈ రూపముతో ధ్యానింపవలెను. (పీతవర్ణము)

## 78. శ్రీ వటుకభైరవ ధ్యానము

(తత్కల్పము)

వికీర్ణలోహితజటం త్రిణేత్రం రక్తవిగ్రహమ్
శూలం కపాలం పాశం చ డమరుం దధతం కరైః ॥

నానారూపైః పిశాచైశ్చ నానారూపగణైర్వృతమ్
శ్వానారూఢం చ నిర్వాణం వటుకం భైరవం భజే ॥

శ్రీ వటుకభైరవుడు ఎఱ్ఱని శరీరచ్ఛాయలతో, మూడు కన్నులతో, విడివడిన ఎఱ్ఱని జడలతో, నాల్గు చేతులతో, నానారూపములుగల పిశాచములతో, గణములతో, శ్వానము (శునకము) వాహనముతో నిర్వాణరూపుడై యుండును.

ఈ స్వామి కుడివైపున క్రిందినుండి పైకి శూలమును 1, ఢమరుకమును 2. అట్లే ఎడమవైపున కపాలమును 1, పాశమును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించి యుండును.

ఇట్టి రూపములోనున్న శ్రీ వటుకభైరవస్వామిని నేను ధరించుచున్నాను.

(రక్తవర్ణము)






కాశ్యప శిల్పశాస్త్రములో చెప్పబడిన ఉత్తమదశతాళము ప్రకారము చేయదగిన శివమూర్తి కొలతలు




1. Maheswara Murthy

శ్రీ మహేశ్వర మూర్తి



2. Sri Gowri Devi
శ్రీ గౌరీదేవి



3. Sri Maha Kailasa Murthy

శ్రీ మహా కైలాస మూర్తి




5. Sri Dasa Bhuja Aghora Murthi

శ్రీ దశభుజ అఘోర మూర్తి



8. Sri Neela Kantha Murthy
శ్రీ నీలకంఠ మూర్తి




9. Sri Rudra Murthy

శ్రీ రుద్ర మూర్తి




No. 12 Sri Sadyojata Murty

శ్రీ సద్యోజాతమూర్తి




No. 13 Sri Vama Deva Moorthi
శ్రీ వామదేవమూర్తి




**14.** Sri Aghora Murty

శ్రీ అఘోర మూర్తి




No. 15 Sri Tatpurusha Murthy

శ్రీ తత్పురుషమూర్తి




16. Sri Esana Murthy
శ్రీ ఈశాన మూర్తి



17. Sri Ananda Tandava Murty
శ్రీ ఆనంద తాండవ మూర్తి



18. Sri Sandhya Tandava Murty
శ్రీ సంధ్యా తాండవ మూర్తి



19. Sri Uma Tandava Murty
శ్రీ ఉమా తాండవ మూర్తి



21. Sri Kalika Tandava Murty

శ్రీ కాళి తాండవ మూర్తి



22. Sri Thripura Tandava Murty
శ్రీ త్రిపుర తాండవ మూర్తి



23. Sri Samhara Thandava Murthy

శ్రీ సంహార తాండవ మూర్తి




24. Common Shape of Bava etc 8 Murthis
భవాది అష్ట మూర్తుల సామాన్య రూపము




No. 35 Sri Bhava Swarupam

శ్రీ భవస్వరూపము



No. 36 Sri Chandra Sekhara Murthi

శ్రీ చంద్రశేఖరమూర్తి



No. 39 Sri Vrishabharudha Murthi
శ్రీ వృషభారూఢమూర్తి



No. 40 Sri Natya Murti

శ్రీ నాట్యమూర్తి



No. 41 Sri Bhikshatana Murthi

శ్రీభిక్షాటనమూర్తి



No. 42 Sri Kamadahana Murti

శ్రీ కామదహన మూర్తి



No. 43 Sri Kala Samhara Murthi
శ్రీ కాల సంహార మూర్తి



No. 46 Sri Tripurari Murthi
శ్రీ త్రిపురారి మూర్తి



No. 47 Sri Jalandharahara Murthi

శ్రీ జలంధరహర మూర్తి



No. 48 Sri Brahma Sirachetru Murthi

శ్రీ బ్రహ్మ శిరచ్ఛేత్ర మూర్తి



No. 49 Sri Gajasura Samhara Murthi

శ్రీ గజాసుర సంహార మూర్తి



No.50 Sri Veerabhadra Murthi
శ్రీ వీరభద్ర మూర్తి



6

No. 51 Sri Harihara Murthi

శ్రీ హరిహరమూర్తి



No. 52 Sri Arthanareesvara Murthi
శ్రీ అర్థనారీశ్వరమూర్తి



No. 53 Sri Kiratharjuna Murthi

శ్రీ కిరాతార్జునమూర్తి



No. 54 Sri Kankala Murti

శ్రీ కంకాళమూర్తి



No. 55 Sri Chandesanugraha Murthi

శ్రీ చండేశానుగ్రహ మూర్తి



No. 56 Sri Vishapahara Murthi

శ్రీ విషాపహరమూర్తి



No. 57 Sri Chakradana Murthi

శ్రీ చక్రదానమూర్తి



No. 58 Sri Vighnesvara Prasanna Murthi
శ్రీ విఘ్నేశ్వర ప్రసన్నమూర్తి



No. 59 Sri Somaskanda Murthi
శ్రీ సోమాస్కందమూర్తి



No. 60 Sri Ekapada Murthi
శ్రీ ఏకపాద మూర్తి




**No. 61 Sri Sukasana Murthi**

శ్రీ సుఖాసనమూర్తి



No. 62 Sri Dakshina Murthi

శ్రీ దక్షిణామూర్తి



No. 64 Sri Sarabha Murthi

శ్రీ శరభమూర్తి



No. 65 Sri Veerabhadra Murthi
శ్రీ వీరభద్రమూర్తి



No. 66 Sri Dakshina Murthi
శ్రీ దక్షిణామూర్తి




No. 67 Sri Sastru Murthi

శ్రీ శాస్త్ర మూర్తి



**No. 68 Sri Nandhikeswara Murthi**

శ్రీ నందికేశ్వర మూర్తి



No. 69 Sri Asithanga Bhairava Murthi
శ్రీ అసితాంగ భైరవ మూర్తి



No. 71 Sri Chandabhairava Murthi

శ్రీ చండభైరవమూర్తి



No. 72 Sri Krodha bhairava Murthi
శ్రీ క్రోధ భైరవమూర్తి



No. 73 Unmatta Bhairava Murthi
శ్రీ ఉన్మత్త భైరవమూర్తి



No. 74 Kapala Bhairava Murthi
శ్రీ కపాలం భైరవమూర్తి



No. 75 Sri Bheeshana Bhairava Murthi
శ్రీ భీషణ భైరవమూర్తి



No. 76 Sri Samhara Bhairava Murthi
శ్రీ సంహార భైరవమూర్తి



No. 77 Sri Svarnakarshana Bhairava Murthi
శ్రీ స్వర్ణాకర్షణ భైరవమూర్తి



No. 78 Sri Vatukabhairava Murthi

శ్రీ వటుక భైరవమూర్తి



Mahakala

మహాకాళ (శివద్వారపాలక)



Gopati

గోపతి (శివద్వారపాలక)



Nandi

శ్రీనంది (శివద్వారపాలక)



Vijaya

విజయ (శివద్వారపాలక)



Mundi (Siva Dwapalaka)

ముండి (శివద్వారపాలక)



Anantha

అనంత (శివద్వారపాలక)



Dandi

దండి (శివద్వారపాలక)



Sri Ganga Devi

శ్రీ గంగాదేవి



Sri. Ganga Devi
శ్రీగంగాదేవి

ఓం

# శ్రీ విష్ణుమూర్తి ధ్యానములు

(పద్మపురాణము)

## 1. శ్రీ విష్ణు ధ్యానము

దేవదేవ స్తు కర్తవ్యః శేషసుప్తో ద్విబాహుకః
ఏకపాదో ఽస్య కర్తవ్యో లక్ష్మ్యుత్సంగగతః ప్రభోః ॥

త థాపర శ్చ కర్తవ్యః శేషభోగాంకసంస్థితః
ఏకః కరో ఽస్య కర్తవ్యః సవ్యజానౌ ప్రసారితః ॥

కర్తవ్యో మూర్ధదేశస్థ స్తథా త స్యాపరః కరః
నాభిసంభూతకమలే సుఖాసీనః పితామహః ॥

నాలే లగ్నౌ తు కర్తవ్యౌ పద్మ స్య మధుకైటభౌ
శంఖచక్రగదాదీని మూర్తాని పరితో న్యసేత్ ॥

దేవదేవుడగు శ్రీ మహావిష్ణువు రెండుచేతులతో, రెండుపాదములతో, శేషుని యందు పరుండి యుండును.

ఆ స్వామి ఎడమపాదము వామభాగమునందు కూర్చుండిన లక్ష్మీదేవి తొడపై నుండును. రెండవపాదము శేషుని శరీరమునందు చాపబడి యుండును.

అతని కుడిచేయి మోకాలునందు చాపబడి యుండును.

అతని నాభికమలమునందు బ్రహ్మ సుఖముగ కూర్చున్నవాడై యుండును. మధువు, కైటభుడు అను వార లిరువురు ఆ నాభికమలనాళమును (కాడను) పట్టుకొని యుందురు.

శంఖము, చక్రము, గద, ఖడ్గము, శార్ఙ్గము, మున్నగు నాయుధము లన్నియు ఆ స్వామి సమీపమున కనబడునట్లు నుండవలెను. (మేఘవర్ణము)

## 2. శ్రీ లక్ష్మి ధ్యానము

అరుణకమలసంస్థా తద్రజఃపుంజవర్ణా
కరకమలధృతేష్టాభీతియుగ్మాంబుజా చ
మణిమకుటవిచిత్రాలంకృతా కల్పజాతై
ర్భవతు భువనమాతా సంతతం శ్రీః శ్రియై నః ॥

లోకములకు తల్లియగు శ్రీ లక్ష్మిదేవి కమలముల పుప్పొడివలె పసుపు పచ్చని శరీరకాంతులతో, నాల్గు చేతులతో, కల్పవృక్షములనుండి పుట్టిన బంగారు కిరీటము, ఆభరణములు, వస్త్రములు, పుష్పములు మున్నగు వానిచే నలంకరింపబడినదై ఎల్లని కమలమునం దుండును.

ఆమె నిజకరములయందు కుడిభాగమున అభయముద్ర 1, ఎడమభాగమున వరముద్ర 2, పరహస్తములయందు రెండు పద్మములు-ఉండును. (కనకవర్ణము)

## 3. శ్రీ భూదేవీ ధ్యానము

(పాంచరాత్రము)

స్వర్ణవర్ణా ద్విహస్తా చ దక్షిణే నాభయప్రదా
దాడిమీఫలసంయుక్తా వామే కల్పతరో రధః ॥

వామపాదేన సంస్పృష్టనిధికుంభా ధరా మతా
సర్వాలంకారభూషాఢ్యా ధ్యేయా సర్వఫలప్రదా ॥

భూదేవి బంగరువంటి పచ్చని శరీరచ్ఛాయతో, రెండు చేతులతో, అవయవము లన్నింటియందు అలంకరింపబడిన వివిధభూషణములతో, నిధికుంభమునందు ఉంచిన ఎడమకాలితో కల్పవృక్షము క్రింద ఉండును.

ఆమె కుడిచేతియందు అభయముద్ర 1, ఎడమచేతియందు దానిమ్మపండు 2, ఉండును. ఆమె ఎల్లఫలముల నిచ్చును. (స్వర్ణవర్ణము)

# 4. శ్రీ నీలాదేవీ ధ్యానము

(పాంచరాత్రము)

నీలోత్పలదళశ్యామా నీలవస్త్రవిభూషితా
చతుర్భుజా సుఖాసీనా వరాభయకరాన్వితా ॥

ఇతరాభ్యాం తు హస్తాభ్యాం కువలయద్వయధారిణీ
సర్వాభరణసంయుక్తా నీలాదేవీ సవిహారితా ॥

శ్రీ నీళాదేవి నల్లకలువ వంటి నల్లని శరీరచ్ఛాయలతో, నల్లని వస్త్రములతో, అన్ని అవయవములయం దలంకరింపబడిన సర్వభూషణములతో, నాల్గు చేతులతో, సుఖముగ కూర్చున్నదై యుండును.

ఆమె నిజకరములయందు కుడివైపున అభయముద్రను 1, ఎడమవైపున వరముద్రను 2, రెండు పరకరములయందు కలువపువ్వులను ధరించును. (నీలవర్ణము)

# 5. శ్రీ వైకుంఠనారాయణ ధ్యానము

(అష్టాక్షరీకల్పము)

సవ్యం పాదం ప్రసార్య శ్రితదురితహరం
దక్షిణం కుంచయిత్వా
జాను న్యాధాయ సవ్యే కర మితరభుజం
నాగభోగే నిధాయ ।
పశ్చా ద్బాహుద్వయేన ప్రతిభటశమనే
ధారయన్ శంఖచక్రే
దేవీభూషాదిజుష్టో జనయతు జగతః
శర్మ వైకుంఠనాథః ॥

శ్రీ వైకుంఠనారాయణుడు మేఘమువలె నల్లనగు శరీరకాంతులతో, నాల్గు చేతులతో, సకలభూషణములతో, శేషశయనమునందు శ్రీ భూనీలాదేవులతో కూడి యుండును.

పాపములను పోగొట్టునట్టి అతని ఎడమకాలు చాపబడినదై, కుడికాలు వంచ బడినదై యుండును.

అతని కుడిచేయి సర్పమునంటును. ఎడమ చేయి ఎడమ మోకాలుపైన నుండును. ఈ రెండు నిజహస్తములు.

కుడి పరకరమునందు చక్రమును 1, ఎడమ పరకరమునందు శంఖమును ఉండును.

ఇట్టి రూపముతో నున్న శ్రీ వైకుంఠనాథుడు లోకమునకు సుఖమును కలిగించును గాక ! (మేఘవర్ణము)

# 6. శ్రీ శింశుమారమూర్తి ధ్యానము

(మయూఖదానఖండము)

శింశుమారః స్ఫురత్తారానిభకాంతి శ్చతుర్భుజః
శంఖచక్రవరాభీతిలసత్పాణి స్త్రయీమయః ॥

జ్యోతిశ్చక్రాధారపుచ్ఛ శ్శ్రితదేవగణోజ్జ్వలః
కాలరూపీ సదాధ్యేయో భక్తాభీష్టప్రదో హరిః ॥

శ్రీ శింశుమారమూర్తి యగు విష్ణువు నక్షత్రములవలె ప్రకాశించు తెల్లని శరీర కాంతులతో, ఋగ్యజుస్సామములను మూడు వేదముల రూపమై, నక్షత్రచక్రము తిరుగుటకు పక్షులకు తోకవలె ఆధారమై, దేవతాసమూహముచేత సేవింపబడుచు కాలరూపుడై నాల్గు చేతులతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, చక్రమును 2, ఎడమవైపున వరదముద్రను 1, శంఖమును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును.

ఇట్టి రూపముతో భక్తుల కోరికలను తీర్చునట్టి శ్రీ శింశుమారమూర్తి యగు విష్ణువు ధ్యానింప దగినవాడు. (శ్వేతవర్ణము)

# 7. శ్రీ హయగ్రీవ ధ్యానము

(పాంచరాత్రము)

వందే తురంగవదనం శశిబింబసంస్థం
చంద్రావదాత మమృతాత్మకరై స్స్రవంతాత్ ।
అండాంతరం బహి రపి ప్రతిభాసయంతం
శంఖాక్ష పుస్తకసుబోధయుతాబ్జబాహుమ్ ॥

శ్రీ హయగ్రీవస్వామి చంద్రుని వలె స్వచ్ఛమగు శరీరకాంతితో, నాల్గు చేతులతో, చంద్రబింబమునందు నివసించుచు, బ్రహ్మాండముయొక్క అంతర్భాగమును (లోపల), బహిర్భాగమును (వెలుపల) అమృతమయములగు తన కిరణములచేత ప్రకాశింపజేయుచుండును.

కుడిభాగమున క్రిందినుండి పైకి ఆస్వామి వ్యాఖ్యానముద్రను 1, అక్షమాలను 2, అట్లే ఎడమవైపున పుస్తకమును 1, శంఖమును 2, నాల్గు చేతులతో ధరించి యుండును.

అట్టి రూపముతోనున్న శ్రీ హయగ్రీవస్వామిని నేను నమస్కరించుచున్నాను.

# 8. శ్రీ హయగ్రీవ ధ్యానము

(వేదాంతదేశికుల హయగ్రీవస్తుతి)

వ్యాఖ్యాముద్రాం కరసరసిజైః పుస్తకం శంఖచక్రే
బిభ్రద్భిన్నస్ఫటికరుచిరే పుండరీకే నిషణ్ణః ।
అమ్లానశ్రీ రమృతవిశదై రంశుభిః ప్లావయ న్మాం
మావిర్భూయా దనఘమహిమా మానసే వాగధీశః ॥

విద్యలకు అధిదైవత మగు శ్రీహయగ్రీవస్వామి తెల్లని శరీరకాంతులతో, నాల్గు చేతులతో, చక్కగ విప్పారిన స్ఫటికమణివలె తెల్లనైన తామర పూవునందు చెక్కు చెదరని తేజముతో, కూర్చుండి యుండును.

ఆస్వామి కుడిభాగమున క్రిందినుండి పైకి వ్యాఖ్యానముద్రను 1, చక్రమును అట్లే ఎడమభాగమున పుస్తకమును 1, శంఖమును 2, నాల్గు చేతులతో ధరించి యుండును.

పాపము నెఱుంగని మహిమతో ప్రసిద్ధుడగు, వాగీశ్వరుడగు శ్రీ హయగ్రీవ స్వామి అమృతమువలె చల్లనివై, తెల్లనైన తన కిరణములచేత నన్ను తడుపుచు నామానసమునందు ప్రత్యక్ష మగునుగాక ! (శ్వేతవర్ణము)

## 9. శ్రీ భూవరాహమూర్తి ధ్యానము

(పాంచరాత్రము)

శ్యామః సుదర్శనదరాభయసద్వరైతో
భూవ్యాయుతో ఒఖిలనిజోక్తపరిగ్రహైశ్చ ।
ధ్యేయో నిజైశ్చ తనుభిస్సకలై రుపేతః
కోలో హరిః సకలవాంఛితసిద్ధయే నః ॥

భూవరాహమూర్తి నల్లని శరీరచ్ఛాయలతో, నాల్గు చేతులతో, భూదేవి, శ్రీదేవి మున్నగు భార్యలతో, ఇతరములగు తన శరీరములతో (రూపములతో) కూడినవాడై యుండును.

కుడి భాగమున క్రిందినుండి పైకి అభయముద్రను 1, సుదర్శన చక్రమును 2, అట్లే ఎడమభాగమున వరముద్రను 1, శంఖమును 2, నాల్గు చేతులతో ధరించి యుండును.

ఇట్టి రూపముతో, ధ్యానింపదగిన వరాహమూర్తి మాయొక్క కోరికలను సిద్ధింపచేయునుగాక ! (శ్యామవర్ణము)

## 10. శ్రీ ధరణీవరాహమూర్తి ధ్యానము

(హేమాద్రి దానకాండము)

వరాహరూపః కార్యస్తు శేషోపరిగతః ప్రభుః
శేషశ్చతుర్భుజః కార్య శ్చారురత్నఫణాన్వితః ॥
కర్తవ్యౌ సీరముసలౌ కరయో స్తస్య యాదవ
సర్పరూప శ్చ కర్తవ్య స్తథైవ రచితాంజలిః ॥

ఆలీఢస్థానసంస్థాన స్తత్పృష్ఠే భగవాన్ భవేత్
వామా రత్నగతా తస్య యోషిద్రూపా వసుంధరా ॥

నమస్కారపరా తస్య కర్తవ్యా ద్విభుజా శుభా
యస్మిన్ భుజే ధరా దేవీ తత్ర శంఖః కరే భవేత్ ॥

అన్యే తస్య కరాః కార్యాః పద్మచక్రగదాధరాః
పద్మాసనస్థాం కుర్వీత శ్రియం త్రైలోక్యమాతరమ్ ॥
గౌరవర్ణాం సురూపాం చ సర్వాలంకారభూషితామ్ ॥
రౌక్మపద్మకరవ్యగ్రాం వరదాం దక్షిణేన తు ॥
(వరాహః శ్యామపర్ణః భూమి శ్శుక్లవర్ణా
శ్రీ స్సువర్ణవర్ణా శేషః శ్శుభ్రవర్ణః)

శ్రీ వరాహస్వామి శేషునియం దుండవలెను. ఆశేషుడు చతుర్భుజములతో, సర్ప రూపుడై యుండవలెను. అతడు స్వచ్ఛమగు తెల్లని శరీరచ్ఛాయలతో నుండును. రత్నములతో కూడిన పడగ అతని కుండును. ఆ శేషుని నిజకరములు శ్రీ వరాహప్రభువునకు నమస్కారాంజలితో నుండును. పరకరములయందు కుడివైపున నాగలి 1, ఎడమవైపున ముసలము (రోకలి) 2, ఉండును. శ్రీ వరాహమూర్తి ఆ శేషుని పృష్ఠమునందు (పైన) ఆలీఢపాదముతో నుండును.

స్త్రీరూపముతో నున్న భూదేవి ఆ స్వామియొక్క ఎడమచేతి మణికట్టు భాగమునందుండును. ఆమెకు రెండుచేతులు. ఆ చేతులతో స్వామికి నమస్కారము చేయుచుండును.

శ్రీ వరాహస్వామికి నాల్గుచేతు లుండవలెను. నిజకరములయందు కుడివైపున పద్మము 1, ఎడమవైపున (భూదేవి ఉన్నవైపున) గద 2, పరకరములయందు కుడివైపున చక్రము 1, ఎడమవైపున శంఖమును 2. కుడిఎడమల నాల్గు చేతులయం దుండవలెను.

ఆ స్వామికి దక్షిణభాగమున శ్రీ లక్ష్మీదేవి ఉండవలెను. ఆమెకు రెండుచేతులు. ముల్లోకములకు తల్లియగు నా శ్రీదేవి సర్వాలంకారములతో, చక్కని రూపముతో, పసుపుపచ్చని శరీరకాంతులతో కుడివైపున వరదముద్రను 1, ఎడమవైపున బంగారు పద్మమును 2, ధరించిన రెండుచేతులతో నుండవలెను.

(స్వామి శ్యామవర్ణము, భూమి, శేషుడు శుభ్రవర్ణము ,లక్ష్మి పసుపుపచ్చని వర్ణము)

# 11. శ్రీ హంసమూర్తి ధ్యానమ్

(పాంచరాత్రమంత్రసారము)

ధ్యాయే ద్రవీందుకర మిందుసహస్రలక్ష
కాంతిం ప్రియాసహిత మాస్థిత మిందుబింబే।
శంఖారిదోర్ద్వయయు ముదర్క మమోఽహిందుబింబా
త్సంసిచ్యమాన మమృతేన రమాధినాథమ్ ॥

శ్రీ హంసమూర్తి కోట్లకొలది చంద్రులతో సమమగు శరీరచ్ఛాయతో, ప్రియురాలగు శ్రీదేవితో చంద్రబింబమునం దుండును.

ఈ స్వామికి నాల్గుచేతులు. కుడిభాగమున క్రిందినుండి పైకి చక్రమును 1, సూర్యుని 2, అట్లే ఎడమభాగమున శంఖమును 1, చంద్రుని 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును.

ఈతడు చంద్రబింబమునుండి అమృతమును భక్త సమూహముపై చల్లుచుండును.

ఇట్టి రూపముతో నున్న రమానాథుండగు శ్రీ హంసస్వామిని ధ్యానింపవలెను.

(శుక్లవర్ణము)

# 12. శ్రీ దధివామనమూర్తి ధ్యానమ్

(పాంచరాత్రము)

ధ్యాయే తప్తశుక్ల మరవిందదళాయతాక్షం
సౌవర్ణపాత్రదధిభోజ్య మథామృతం చ।
దోర్భ్యాం దధాన మఖిలైశ్చ సురై స్సమేతం
శీతాంశుమండలగతం రమయా సమేతమ్ ॥

శ్రీ దధివామనమూర్తి మిక్కిలి తెల్లనైన శరీరచ్ఛాయలతో, తామరపూరేకులవలె పొడవైన కన్నులతో, తనను సేవించుచున్న సకలదేవతలతో, ప్రియురాలగు రమాదేవితో, రెండు చేతులతో చంద్రమండలమం దుండును.

ఈ స్వామికి కుడిఎడమల రెండు చేతులయందు రెండు బంగారుపాత్రము లుండును. కుడిపాత్రమునందు దధ్యన్నమును, (పెరుగన్నము) రెండవ పాత్రమునందు అమృతమును ఉండును.

ఇట్టి రూపముతో, భక్తులకు దధ్యన్నమును, అమృతమును అనుగ్రహించుచున్న శ్రీ దధివామనమూర్తిని ధ్యానింపవలెను. (శుక్లవర్ణము)

## 13. శ్రీ అశ్వత్థనారాయణ ధ్యానము

(బ్రహ్మాండపురాణాశ్వత్థకల్పము)

శ్వేతవర్ణం సలక్ష్మీకం భుజాష్టకవిభూషితమ్ ।
శంఖచక్రధరం దేవం పీతవాసస మచ్యుతమ్ ॥

అభయం వరదం శాంతం ఖడ్గఖేటకధారిణమ్ ।
ధనుర్బాణసమాయుక్తం చింతయే త్పురుషోత్తమమ్ ॥

శ్రీ అశ్వత్థనారాయణస్వామి తెల్లని శరీరచ్ఛాయలతో, ఎనిమిది చేతులతో, ప్రియురాలగు లక్ష్మీదేవితో, పచ్చని బంగారువస్త్రములతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి వరుసన అభయముద్రను 1, ఖడ్గమును 2, బాణమును 3, చక్రమును 4, అట్లే ఎడమవైపున వరదముద్రను 1, ఖేటమును 2, ధనుస్సును 3, శంఖమును 4, కుడిఎడమల ఎనిమిది చేతులతో ధరించి యుండును.

ఇట్టి రూపముతో నున్న అశ్వత్థనారాయణుడగు పురుషోత్తముని ధ్యానింప వలెను. (శ్వేతవర్ణము)

## 14. శ్రీ లక్ష్మీనృసింహ ధ్యానము

శరచ్చంద్రనిభం దేవం శంఖచక్రవరాభయాన్
బిభ్రాణం పుండరీకాక్షం లక్ష్మ్యాలింగితవిగ్రహమ్ ॥

సింహవక్త్రం మహాకాయం నృసింహం హృది భావయేత్ ॥

శ్రీ లక్ష్మీనృసింహమూర్తి శరత్కాలచంద్రునివలె మిక్కిలి తెల్లని శరీర చ్ఛాయలతో, సింహముయొక్క మొగముతో, పెద్దశరీరముతో, తామరపూవులవంటి

చక్కని కన్నులతో. ప్రియురాలగు శ్రీ లక్ష్మిదేవిచేత కౌగలింపబడిన మూర్తితో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1. చక్రమును 2. అట్లే ఎడమ వైపున వరముద్రను 1. శంఖమును 2. నాల్గు చేతులతో ధరించి యుండును.

ఇట్టి రూపముతో నున్న శ్రీ లక్ష్మీనృసింహస్వామిని హృదయమునందు భావింప వలయును. (శ్వేతవర్ణము)

# కేశవాదులగు ఇరువదినాల్గు మూర్తుల ధ్యానములు

(పాంచరాత్ర క్రియాపాదము)

## 15. శ్రీ కేశవ ధ్యానము

కేశవ స్తు సువర్ణాభః శంఖచక్రగదాబ్జభృత్
శుక్లాంబరధరః సౌమ్యో ముక్తాభరణభూషితః ॥

శ్రీ కేశవమూర్తి బంగారము వలె పసుపుపచ్చని శరీరచ్ఛాయలతో, తెల్లని వస్త్రములతో, ముత్తెముల ఆభరణములతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి పద్మమును 1. శంఖమును 2. అట్లే ఎడమవైపున గదను 1. చక్రమును 2. నాల్గు చేతులతో ధరించును. (స్వర్ణవర్ణము)

## 16. శ్రీ నారాయణ ధ్యానము

నారాయణో ఘనశ్యామః పద్మశంఖగదారిభృత్
పీతవాసా మణిమయై ర్భూషణై రుత్తమై ర్వృతః ॥

శ్రీ నారాయణమూర్తి మేఘము వలె నల్లని శరీరచ్ఛాయలతో, బంగరు వలె పచ్చని వస్త్రములతో, నాల్గు చేతులతో, రత్నములు పొదిగిన బంగరు భూషణములతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి శంఖమును 1. పద్మమును 2. అట్లే ఎడమ వైపున చక్రమును 1. గదను 2 నాల్గు చేతులతో ధరించును. (మేఘశ్యామవర్ణము)

## 17. శ్రీ మాధవ ధ్యానము

మాధవ స్తూత్పలప్రఖ్య శ్చక్రశంఖగదాబ్జభృత్
చిత్రమాల్యాంబరధరః పుండరీకనిభేక్షణః ॥

శ్రీ మాధవమూర్తి నల్లకలువల వలె నల్లని శరీరకాంతులతో, చిత్రములైన (వివిధవర్ణములుగల) పూలమాలలతో, వస్త్రములతో, తామరపూవుల వలె విప్పారి ప్రకాశించు కన్నులతో నుండును.

ఆ స్వామి కుడి వైపున క్రిందినుండి పైకి గదను 1, చక్రమును 2, అట్లే ఎడమ వైపున పద్మమును 1, శంఖమును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించి యుండును.
(కృష్ణవర్ణము)

## 18. శ్రీ గోవింద ధ్యానము

గోవిందః శశివర్ణః స్యా త్పద్మశంఖగదారిభృత్
రక్తారవిందనయన స్తప్తకాంచనభూషణః ॥

శ్రీ గోవిందమూర్తి చంద్రుని వలె తెల్లనగు శరీరకాంతులతో, ఎఱ్ఱని తామర పూవులవంటి కన్నులతో, పదారువన్నె బంగరు నగలతో, నాల్గు చేతులతో నుండును.

కుడిభాగమున క్రిందినుండి పైకి చక్రమును 1, గదను 2, అట్లే ఎడమ భాగమున శంఖమును 1, పద్మమును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును.
(శ్వేతవర్ణము)

## 19. శ్రీ విష్ణుమూర్తి ధ్యానము

ధౌతవర్ణో భవే ద్విష్ణు శ్చక్రశంఖగదాబ్జభృత్
హేమాంబరధరః స్రగ్వీ కేయూరాంగదభూషితః ॥

శ్రీ విష్ణుమూర్తి తెల్లని శరీరచ్ఛాయలతో, బంగరు వలె పచ్చని వస్త్రములతో, పూలదండలతో, దండగడియములు, కంకణములు, మున్నగు సకలభూషణములతో, నాల్గు చేతులతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి గదను 1, పద్మమును 2, అట్లే ఎడమభాగమున చక్రమును 1, శంఖమును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును. (శ్వేతవర్ణము)

## 20. శ్రీ మధుసూదన ధ్యానమ్

అరవిందనిభః శ్రీమాన్ మధుజిత్కమలాశ్రయః
శంఖం చక్రం గదాం పద్మం దోర్భిర్నిత్యం బిభర్త్యసౌ ॥

శ్రీ మధుసూదనమూర్తి ఎఱ్ఱతామరపూవు వలె నెఱ్ఱని శరీరచ్ఛాయంతో, లక్ష్మీదేవితో, నాల్గు చేతులతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి చక్రమును 1, శంఖమును 2, అట్లే ఎడమవైపున గదను 1. పద్మమును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించు. (రక్తవర్ణము)

## 21. శ్రీ త్రివిక్రమ ధ్యానమ్

త్రివిక్రమో రక్తవర్ణః శంఖచక్రగదాబ్జభృత్
కిరీటహారకేయూరకుండలైశ్చ విరాజతే ॥

శ్రీ త్రివిక్రమమూర్తి ఎఱ్ఱని శరీరకాంతులతో, నాల్గు చేతులతో, కిరీటము, హారములు (మెడలో వ్రేలాడునవి), కేయూరములు (దండగడియములు), కుండలములు (చెవుల కుండునవి) మున్నగు మణులు పొదిగిన వివిధములగు బంగారు నగలతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి పద్మమును 1, గదను 2, అట్లే ఎడమవైపున శంఖమును 1, చక్రమును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును. (రక్తవర్ణము)

## 22. శ్రీ వామన ధ్యానమ్

వామనః కుందవర్ణః స్యాత్పుండరీకాయతేక్షణః
దోర్భిః శంఖం గదాం చక్రం పద్మం చైవ బిభర్త్యసౌ ॥

శ్రీ వామనమూర్తి మొల్లపువ్వుల వలె తెల్లని శరీరచ్ఛాయతో, తామరపువ్వుల వలె విప్పారిన విశాలమగు కన్నులతో, నాల్గు చేతులతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి శంఖమును 1, చక్రమును 2, అట్లే ఎడమవైపున పద్మమును 1. గదను 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును.

(శ్వేతవర్ణము)

# 23. శ్రీ శ్రీధరస్వామి ధ్యానము

శ్రీధరః పుండరీకాభ శ్చక్రశంఖగదాబ్జభృత్
రక్తారవిందనయనో ముక్తాదామవిభూషితః ॥

శ్రీ శ్రీధరమూర్తి తెల్లదామరపూపు వలె తెల్లని శరీరఛ్ఛాయతో, నాల్గు చేతులతో, ఎఱ్ఱదామరపూవు వంటి కన్నులతో, ముత్యాల హారములతో నుండును.

కుడిభాగమున క్రిందినుండి పైకి పద్మమును 1, చక్రమును 2, అట్లే ఎడమ భాగమున శంఖమును 1, గదను 1, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించి యుండును.

(శ్వేతవర్ణము)

# 24. శ్రీ హృషీకేశ ధ్యానము

విద్యుద్వర్ణో హృషీకేశ శ్చక్రశంఖగదాబ్జభృత్
రక్తమాల్యాంబరధరః పుండరీకావతంసకః ॥

శ్రీ హృషీకేశమూర్తి మెఱుపుతీగవలె పసుపుపచ్చని శరీరఛ్ఛాయలతో, ఎఱ్ఱని పూలమాలలతో, ఎఱ్ఱని వస్త్రములతో, తామరపువ్వు నలంకరించిన శిరముతో, నాల్గు చేతులతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి గదను 1, చక్రమును 2, అట్లే ఎడమభాగమున శంఖమును 1, పద్మమును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించి యుండును.

(కనకవర్ణము)

# 25. శ్రీ పద్మనాభ ధ్యానము

ఇంద్రనీలనిభ శ్చక్రశంఖపద్మగదాధరః
పద్మనాభః పీతవాసా శ్చిత్రమాల్యానులేపనః ॥

శ్రీ పద్మనాభస్వామి ఇంద్రనీలరత్నము వలె నల్లని శరీరఛ్ఛాయలతో, పసుపు పచ్చని వస్త్రములతో, వివిధవర్ణములుగల పూలమాలలతో, మైపూతలతో, నాల్గు చేతులతో నుండును.

కుడిభాగమున క్రిందినుండి పైకి శంఖమును 1, పద్మమును 2, అట్లే ఎడమ భాగమున గదను 1, చక్రమును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును.

(నీలవర్ణము)

## 26. శ్రీ దామోదర ధ్యానమ్

దామోదరః శాద్వలాభో గదాపద్మారిశంఖభృత్
పీతవాసా విశాలాక్షో నానారత్నవిభూషితః ॥

శ్రీ దామోదరమూర్తి లేతగడ్డివలె ఆకుపచ్చని శరీరచ్ఛాయలతో, పసుపుపచ్చని వస్త్రములతో విశాలములైన కన్నులతో, అలంకరింపబడిన వివిధములగు రత్నభూషణములతో, నాల్గు చేతులతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి పద్మమును 1, శంఖమును 2, అట్లే ఎడమవైపున చక్రమును1, గదను2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును. (దూర్వాశ్యామవర్ణము)

## 27. శ్రీ సంకర్షణ ధ్యానమ్

సంకర్షణః సితో ధత్తే శంఖపద్మారిసద్గదాః ॥

శ్రీ సంకర్షణమూర్తి తెల్లని శరీరచ్ఛాయలతో నుండును.

అతడు కుడిభాగమున క్రిందినుండి పైకి గదను 1, శంఖమును 3, అట్లే ఎడమ భాగమున చక్రమును 1, పద్మమును 2, నాల్గుచేతులతో ధరించును. (శ్వేతవర్ణము)

## 28. శ్రీ వాసుదేవ ధ్యానమ్

వాసుదేవః శంఖచక్రగదాపద్మధరః సితః ॥

శ్రీ వాసుదేవమూర్తి తెల్లని శరీరచ్ఛాయలతో, నాల్గు చేతులతో నుండును.

కుడిభాగమున క్రిందినుండి పైకి గదను 1, శంఖమును 2, అట్లే ఎడమవైపున పద్మమును 4, చక్రమును 2, నాల్గు చేతులతో ధరించును. (శ్వేతవర్ణము)

## 29. శ్రీ ప్రద్యుమ్న ధ్యానమం

ప్రద్యుమ్నః కనకాభః స్యా చ్ఛంఖాబ్జారిగదాధరః ॥

శ్రీ ప్రద్యుమ్నమూర్తి బంగారువలె పచ్చని శరీరకాంతులతో, నాల్గు చేతులతో నుండును.

కుడిభాగమున క్రిందినుండి పైకి చక్రమును 1, శంఖమును 2, అట్లే ఎడమ భాగమున పద్మమును 1, గదను 2, నాల్గు చేతులలో ధరించును. (కనకవర్ణము)

## 30. శ్రీ అనిరుద్ధ ధ్యానమం

అనిరుద్ధో నీలవర్ణః శంఖపద్మగదారిభృత్ ॥

శ్రీ అనిరుద్ధమూర్తి నల్లని శరీరకాంతితో నాల్గు చేతులతో నుండును.

కుడిభాగమున క్రిందినుండి పైకి చక్రమును 1, గదను 2, అట్లే ఎడమ భాగమున పద్మమును 1, శంఖమును 2, నాల్గు చేతులతో ధరించును. (నీలవర్ణము)

## 31. శ్రీ పురుషోత్తమ ధ్యానమం

పద్మశంఖగదాచక్రభృ చ్ఛ్వేతః పురుషోత్తమః ॥

శ్రీ పురుషోత్తమమూర్తి తెల్లని శరీరకాంతులతో, నాల్గు చేతులతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి చక్రమును 1, పద్మమును 2, అట్లే ఎడమవైపున గదను 1, శంఖమును 2, నాల్గు చేతులతో ధరించును. (శ్వేతవర్ణము)

## 32. శ్రీ అధోక్షజ ధ్యానమం

ధత్తే చాధోక్షజో నీలో గదాచక్రదరాబ్జకమ్ ॥

శ్రీ అధోక్షజమూర్తి నల్లని శరీరచ్ఛాయలతో నాల్గు చేతులతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి పద్మమును 1, గదను 2, అట్లే ఎడమవైపున చక్రమును 1, శంఖమును 2, నాల్గు చేతులతో ధరించును. (నీలవర్ణము)

# 33. శ్రీ నారసింహ ధ్యానము

నారసింహః శ్వేతవర్ణః గదాశంఖారిపద్మభృత్ ॥

శ్రీ నారసింహమూర్తి తెల్లని శరీరచ్ఛాయలతో, నాల్గు చేతులతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి చక్రమును 1, పద్మమును 2, అట్లే ఎడమవైపున శంఖమును 1, గదను 2, నాల్గు చేతులతో కుడిఎడమల ధరించును. (శ్వేతవర్ణము)

# 34. శ్రీ అచ్యుత ధ్యానము

ధత్తే ఒచ్యుతః స్వర్ణవర్ణో గదాశంఖారిసారసాన్ ॥

శ్రీఅచ్యుతమూర్తి బంగారువలె పచ్చనిశరీరకాంతులతో, నాల్గుచేతులతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి గదను 1, పద్మమును 2, అట్లే ఎడమవైపున శంఖమును 1, చక్రమును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును. (కనకవర్ణము)

# 35. శ్రీ జనార్దన ధ్యానము

జనార్దనో రక్తవర్ణ శ్చక్రశంఖగదాబ్జభృత్ ॥

శ్రీ జనార్దనమూర్తి ఎఱ్ఱని శరీరచ్ఛాయలతో, నాల్గు చేతులతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి పద్మమును 1, చక్రమును 2, అట్లే ఎడమవైపున గదను 1, శంఖమును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును.

(రక్తవర్ణము)

# 36. శ్రీ ఉపేంద్ర ధ్యానము

ఉపేంద్రో నీలవర్ణ స్తు గదాచక్రాబ్జశంఖభృత్ ॥

శ్రీ ఉపేంద్రమూర్తి నల్లని శరీరచ్ఛాయలతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి శంఖమును 1, గదను 2, అట్లే ఎడమవైపున పద్మమును 1, చక్రమును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును. (నీలవర్ణము)

# 37. శ్రీ హరి ధ్యానము

హరిః కనకవర్ణః స్యా చ్చక్రశంఖగదాబ్జభృత్ ॥

శ్రీ హరిమూర్తి బంగారు వలె పచ్చని శరీరకాంతులతో, నాల్గు చేతులతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి శంఖమును 1. చక్రమును 2. అట్లే ఎడమ వైపున గదను 1, పద్మమును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును.
(కనకవర్ణము)

# 38. శ్రీ కృష్ణ ధ్యానము

కృష్ణ స్తు కృష్ణవర్ణః స్యా ద్గదాబ్జధరచక్రభృత్ ॥

శ్రీ కృష్ణమూర్తి నల్లని శరీరచ్ఛాయతో నాల్గు చేతులతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి శంఖమును 1, గదను 2, అట్లే ఎడమవైపున చక్రమును 1. పద్మమును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును. (కృష్ణవర్ణము)

## శ్రీ కేశవుడు మున్నగువారియొక్క వర్ణములు

(పద్మపురాణము)

కేశవః కనకప్రఖ్యః స్యా దర్జునసమచ్ఛవిః
నారాయణః శ్యామవర్ణో మాధవః స్ఫటికప్రభః ॥

గోవిందః పద్మకింజల్కనిభో విష్ణు రుదాహృతః
అరుణాంబుజసంకాశో మధుసూదన ఉచ్యతే ॥

త్రివిక్రమః శిఖినిభో వామనో బాలసూర్యవత్
శ్రీధరః పీతవర్ణాభో హృషీకేశ స్తటిత్ప్రభః ॥

పద్మనాభః శ్యామవర్ణో బంధూకకుసుమచ్ఛవిః
దామోదరో ద్వాద శైతే కథితాః కేశవాదయః ॥

వాసుదేవాదిమూర్తీనాం యో వర్ణః పరికీర్తితః
స ఏవ వాసుదేవాది చతుర్ణాం తదుద్భవా మపి ॥

శుద్ధస్ఫటికసంకాశో విజ్ఞేయః పురుషోత్తమః
అధోక్షజః శ్యామవర్ణో నృసింహో హేమసన్నిభః ॥

పీతవర్ణో ఒచ్యుతో ఒతీవ రక్తవర్ణో జనార్దనః
ఉపేంద్రః శ్యామలః ప్రోక్తో హరిః పీతప్రభః స్మృతః ॥

కృష్ణః కృష్ణాంబుదప్రఖ్య శ్చతుర్వింశతిమూర్తయః ॥

| | | పాంచరాత్రము శ్రీతత్త్వనిధి | పద్మ పురాణము |
|---|---|---|---|
| 1. | కేశవుడు | పసుపుపచ్చ | పసుపుపచ్చ |
| 2. | నారాయణుడు | నలుపు | తెలుపు |
| 3. | మాధవుడు | నలుపు | నలుపు |
| 4. | గోవిందుడు | తెలుపు | తెలుపు |
| 5. | విష్ణువు | తెలుపు | పసుపుపచ్చ |
| 6. | మధుసూదనుడు | ఎఱుపు | ఎఱుపు |
| 7. | త్రివిక్రముడు | ఎఱుపు | ఎఱుపు |
| 8. | వామనుడు | తెలుపు | ఎఱుపు |
| 9. | శ్రీధరుడు | తెలుపు | పసుపుపచ్చ |
| 10. | హృషీకేశుడు | పసుపుపచ్చ | పసుపుపచ్చ |
| 11. | పద్మనాభుడు | నలుపు | నలుపు |
| 12. | దామోదరుడు | ఆకుపచ్చ | ఎఱుపు |
| 13. | వాసుదేవుడు | తెలుపు | తెలుపు |
| 14. | సంకర్షణుడు | తెలుపు | తెలుపు |
| 15. | ప్రద్యుమ్నుడు | పసుపుపచ్చ | పసుపుపచ్చ |
| 16. | అనిరుద్ధుడు | నలుపు | నలుపు |

| | | | |
|---|---|---|---|
| 17. | పురుషోత్తముండు | తెలుపు | తెలుపు |
| 18. | అధోక్షజుండు | నలుపు | నలుపు |
| 19. | నారసింహుండు | తెలుపు | పసుపుపచ్చ |
| 20. | అచ్యుతుండు | పసుపుపచ్చ | పసుపుపచ్చ |
| 21. | జనార్దనుండు | ఎఱుపు | ఎఱుపు |
| 22. | ఉపేంద్రుండు | నలుపు | నలుపు |
| 23. | హరి | పసుపుపచ్చ | పసుపుపచ్చ |
| 24. | కృష్ణుండు | నలుపు | నలుపు |

కేశవాదులగు ఇరువదినల్వుర వర్ణములు శ్రీ తత్వనిధిని (పాంచరాత్రాగమము) ననుసరించి, పద్మపురాణము ననుసరించి పై పట్టికయందు చూపబడినవి.

కేవలము ఆరుమూర్తులయందు తప్ప తక్కిన పదునెనిమిది మూర్తులయందు వర్ణములు సమముగనున్నవి.

# నలువ్వురు వ్యూహమూర్తుల ధ్యానములు

(భట్టభాస్కరీయము)

## 39. శ్రీ సంకర్షణ ధ్యానము

వాసుదేవ స్వరూపేణ కార్యః సంకర్షణః ప్రభుః
స తు శుక్లవపుః కార్యో నీలవాసా యదూత్తమః ॥
గదాస్థానే చ ముసలం చక్రస్థానే చ లాంగలమ్ ॥

శ్రీ సంకర్షణవ్యూహమూర్తి యదూత్తముడు (బలరాముడు) వాసుదేవుని స్వరూపముతోనే ఉండును. కొన్ని భేదములు కలవు.

ఈతడు తెల్లని శరీరచ్ఛాయతో, నల్లని వస్త్రముంతో, నాల్గు చేతులతో నుండును.

వాసుదేవుని గదాస్థానమున ముసలము, చక్రస్థానమున నాగలి ఉండును. అనగా

కుడివైపున క్రిందినుండి పైకి ముసలమును 1, శార్ఙ్గము అను విల్లును 2, అట్లే ఎడమవైపున నాగలిని 1, శంఖమును 2, కుడిఎడమల ధరించి యుండును.

(శ్వేతవర్ణము)

## 40. శ్రీ వాసుదేవ ధ్యానము

వాసుదేవః సితః శాంతః సితాబ్జస్థ శ్చతుర్భుజః
యోగముద్రోర్ధ్వశంఖ శ్చ దక్షే శార్ఙ్గధరః స్మృతః ॥

ధారయే దుత్తరే చక్రం దక్షిణే చ గదా మితి ॥

శ్రీ వాసుదేవవ్యూహమూర్తి తెల్లని శరీరచ్ఛాయతో, శాంతమగు రూపముతో, నాలుగు భుజములతో, తెల్లదామరపూవునందు ఉపవిష్టుడై (కూర్చున్నవాడై) ఉండును.

కుడివైపున క్రిందినుండి పైకి గదను 1, శార్ఙ్గము అను విల్లును 2, అట్లే ఎడమవైపున చక్రమును 1, శంఖమును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును.

(శ్వేతవర్ణము)

## 41. శ్రీ ప్రద్యుమ్న ధ్యానము

దక్షిణోర్ధ్వకరే పద్మం దధ్యా చ్ఛంఖ మధఃకరే
చక్ర మూర్ధ్వే తథా వామే గదాం దధ్యా దధఃకరే ॥

శ్రీ ప్రద్యుమ్నవ్యూహమూర్తి పచ్చని శరీరచ్ఛాయలతో. నాల్గు చేతులతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి శంఖమును 1. పద్మమును 2, అట్లే ఎడమవైపున గదను 1, చక్రమును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించి యుండును.

(పీతవర్ణము)

## 42. శ్రీ అనిరుద్ధ ధ్యానము

కృష్ణం చతుర్భుజం దక్షే శరం ఖడ్గం త థోత్తరే
ధనుః ఖేటధరం వీర మనిరుద్ధం ప్రచక్షతే ॥

శ్రీఅనిరుద్ధవ్యూహమూర్తి నల్లని శరీరచ్ఛాయలతో, నాలుగు చేతులతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి బాణమును 1, ఖడ్గమును 2, అట్లే ఎడమవైపున వింటిని 1, ఖేటకమును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించి యుండును.

(కృష్ణవర్ణము)

# మత్స్యము మున్నగు దశావతారమూర్తుల ధ్యానములు

(పాంచరాత్రము-వర్ణములు-పాద్మము)

## 43. శ్రీ మత్స్య ధ్యానము

వామే శంఖం గదాం దక్షే ద్విభుజో మత్స్యరూపధృత్
నరాంగోర్ధ్వం ర్మత్స్యరూపో వా మత్స్యరూపీ జనార్దనః ॥

చేపరూపమును ధరించిన శ్రీ జనార్దనుడు తెల్లని శరీరచ్ఛాయలతో, రెండు చేతులతో కేవలము క్రింద మత్స్యరూపముగల మనుష్యరూపముతోగాని, మనుష్యుని పాదములు కలిగిన మత్స్యరూపముతోగాని ఉండవలెను.

అతని కుడిచేతియందు గద 1, ఎడమచేతియందు శంఖము ఉండవలెను.

(శ్వేతవర్ణము)

## 44. శ్రీ కూర్మ ధ్యానము

కూర్మస్తు కచ్ఛపాకారో మత్స్యరూపోక్త రూపవాన్ ॥

తాబేలు రూపమును ధరించిన శ్రీ జనార్దనుడు తెల్లని శరీరచ్ఛాయలతో, రెండు చేతులతో కేవలము కూర్మరూపముతో గాని, మనుష్యుని పాదములు గలిగిన కూర్మ రూపముతో గాని ఉండవలెను.

అతని కుడిచేతియందు గద 1, ఎడమచేతియందు శంఖము 2, ఉండవలెను.

(శ్వేతవర్ణము)

## 45. శ్రీ నృసింహ ధ్యానము

జ్వలదగ్నిసమాకారం సింహవక్త్రం నరాంగకమ్
దంష్ట్రాకరాళవదనం లోలజిహ్వాసుభీషణమ్ ॥

వృత్తాస్యం జటిలం క్రుద్ధ మాలీఢం పీనవక్షసమ్
అభేద్య తీక్ష్ణనఖర వహాత్మోరుకృతదానవమ్ ॥

తద్వక్షో దారయంతం చ కరాభ్యాం నఖరై ర్భృశమ్
గదాచక్రధరం ద్వాభ్యాం నృసింహం ప్రణమే త్ప్రభుమ్ ॥

శ్రీ నృసింహరూపమును ధరించిన విష్ణువు మండుచున్న అగ్నివలె భయంకర మగు ఆకారముతో, తెల్లని శరీరచ్ఛాయలతో, సింహముయొక్క మొగముగల మనుష్య శరీరముతో, కోరలతో, కదలుచున్న నాల్కతో, గుండ్రని మొగముతో, బలమైన కేసరములతో, ఆలీఢపాదములతో, బలిసిన లావైన తొమ్ముతో, నాల్గు చేతులతో భేదింప వీలుపడని వాడియగు (తీక్ష్ణములగు) దృఢమగు గోళ్ళతోనుండును.

ఆ స్వామి తన తొడలయందున్న హిరణ్యకశిపుని తొమ్మును రెండు నిజ కరములు గోళ్ళచేత చీల్చుచుండును. పరకరములతో కుడిచేతితో చక్రమును 1, ఎడమ చేతితో గదను 2, ధరించి యుండును.

ఇట్టి రూపముతో నున్న శ్రీ నృసింహస్వామిని నమస్కరింపవలెను.
(శ్వేతవర్ణము)

## 46. శ్రీ వామన ధ్యానము

కుండీ ఛత్రధరో ద్వాభ్యాం వామనః పరికీర్తితః ॥

శ్రీ వామనరూపమును ధరించిన విష్ణువు నల్లని శరీరకాంతులతో, రెండు చేతులతో నుండును.

కుడిచేతియందు కమండలవును 1, ఎడమచేతియందు గొడుగును 2, ధరించును.
(శ్యామవర్ణము)

## 47. శ్రీ పరశురామ ధ్యానము

క్షత్రాంతకరణం ఘోర ముద్వహన్ పరశుం కరే
జామదగ్న్య శ్చ కర్తవ్యో రామ శ్శత్రునిషూదనః ॥

శ్రీ పరశురామరూపమును ధరించిన విష్ణువు కరమునందు గొడ్డలిని ధరించి శత్రువులగు క్షత్రియులను చంపుచుండును. ఆతడు పచ్చని శరీరచ్ఛాయను, రెండు చేతులను కలిగియుండును. (స్వర్ణవర్ణము)

## 48. శ్రీరామ ధ్యానము

యువా ప్రసన్నవదనః సింహస్కంధో ఽరుణేక్షణః
ఆజానుబాహుః కర్తవ్యో రామో బాణధనుర్ధరః ॥

శ్రీరాముడు నిర్మలము ప్రసన్నమగు మొగముతో, సింహముయొక్క మూపురముల వంటి మూపురములతో, ఎఱ్ఱని కన్నులతో, పడుచుదనముతో, మోకాలి వఱకున్న దీర్ఘములగు రెండు చేతులతో నుండును.

అతని కుడిచేతియందు బాణము 1, ఎడమచేతియందు విల్లు 2, ఉండవలెను. ఈతనిది నల్లని శరీరచ్ఛాయ. (శ్యామవర్ణము)

## 49. శ్రీ బుద్ధ ధ్యానము

కాషాయవస్త్రసంవీతః స్కంధసంసక్తచీవరః
పద్మాసనస్థో ద్విభుజో ధ్యేయో బుద్ధః ప్రకీర్తితః ॥

శ్రీ బుద్ధరూపమును ధరించిన విష్ణువు లేత ఎఱుపు రంగుగల శరీరచ్ఛాయతో, కాషాయవస్త్రములతో, భుజమునందున్న నారతో నేయబడిన ఉత్తరీయముతో, రెండు చేతులతో పద్మాసనము నందుండును.

అట్టి రూపముతో నున్న శ్రీ బుద్ధభగవంతుడు ధ్యానింప దగినవాడు. (పాటలవర్ణము)

## 50. శ్రీ కల్కి ధ్యానము

ఖడ్గోద్యతకరః క్రుద్ధో హయారూఢో మహాబలః
మ్లేచ్ఛచ్ఛేదకరః కల్కీ ద్విభుజః పరికీర్తితః ॥

శ్రీ కల్కిరూపమును ధరించిన విష్ణువు తెల్లని శరీరకాంతులతో, రెండు చేతులతో గుఱ్ఱము వాహనముతో, మహాబలముగల శరీరముతో నుండును.

కుడిచేతియందు ఖడ్గమును 1, ఎడమచేతియందు గుఱ్ఱముఖలీనమును(కళ్లెమును) 2, ధరించి యుండును.

మ్లేచ్ఛులను చంపుచు, మిక్కిలి కోపించిన రూపముతో నుండిన శ్రీ కల్కిభగవంతుని నమస్కరింతును.

(కొన్ని గ్రంథములలో దశావతారములయందు శ్రీ బుద్ధమూర్తి లేదు. ఆ స్థానమున శ్రీకృష్ణుని ధ్యానించుచున్నారు.)

## 51. శ్రీ కృష్ణ ధ్యానము

శంఖచక్రధరః శ్యామో ద్విభుజః కృష్ణసంజ్ఞకః ॥

శ్రీకృష్ణుడు నల్లని శరీరముతో, రెండు చేతులతో నుండును, కుడిచేతియందు చక్రమును 1, ఎడమచేతియందు శంఖమును 2, ధరించును.

## మత్స్యము మొదలుగాగల దశావతారమూర్తుల వర్ణములు

(పద్మపురాణము)

మత్స్యః స్ఫటికసంకాశః కూర్మః కాంచనసప్రభః
వరాహః శ్యామలనిభో ధవళాకృతి రేవ వా ॥

నృసింహ శ్చంద్రవర్ణాభః ప్రహ్లాదః కాంచనప్రభః
వామనః శ్యామలనిభో కాలవర్ణో మహాబలః ॥

జామదగ్న్యః సువర్ణాభో రాఘవః శ్యామలాకృతిః
భరతః శ్యామలః ప్రోక్తో లక్ష్మణః కనకప్రభః ॥

శత్రుఘ్నో రక్తవర్ణాభో సీతా హేమనిభాకృతిః
మాండవీ రక్తవర్ణాభా చోర్మిలా శ్యామలాకృతిః ॥

శ్రుతకీర్తిః సితాంగీ స్యా ద్ధనుమాన్ కనకప్రభః
అంగదో రక్తవర్ణాభః సుగ్రీవో హేమపింగలః ॥

నీలోత్పలనిభః ప్రోక్తో జాంబవాన్ కనకప్రభః
గుహ స్తు తిలవర్ణాభః కాలవర్ణో విభీషణః ॥

బలః క్షీరనిభ శ్చైవ రక్తవర్ణా చ రేవతీ
మేఘశ్యామో భవే త్కృష్ణో రుక్మిణీ కనకప్రభా ॥

కల్కి శ్వేతనిభ శ్చైవ వర్ణా ఏషాం ప్రకీర్తితాః ॥

| | పాంచరాత్రము | పాద్మము |
|---|---|---|
| 1. మత్స్యము | తెలుపు | తెలుపు |
| 2. కూర్మము | పసుపుపచ్చ | పసుపుపచ్చ |
| 3. వరాహము | నలుపు (తెలుపు) | నలుపు |
| 4. నృసింహుడు | తెలుపు | తెలుపు |
| ప్రహ్లాదుడు | ... | పసుపుపచ్చ |
| 5. వామనుడు | నలుపు | నలుపు |
| బలి | ... | నలుపు |
| 6. పరశురాముడు | పసుపుపచ్చ | పసుపుపచ్చ |
| 7. రాముడు | నలుపు | నలుపు |
| భరతుడు | ... | నలుపు |
| లక్ష్మణుడు | ... | పసుపుపచ్చ |
| శత్రుఘ్నుడు | ... | ఎఱుపు |
| సీత | ... | పసుపుపచ్చ |
| మాండవి | ... | ఎఱుపు |
| ఊర్మిల | ... | నలుపు |
| శ్రుతకీర్తి | ... | తెలుపు |
| హనుమ | ... | పసుపుపచ్చ |
| అంగదుడు | ... | ఎఱుపు |
| సుగ్రీవుడు | ... | లేతపసుపు |
| జాంబవాన్ | ... | నలుపు |
| గుహుడు | ... | పసుపుపచ్చ |
| విభీషణుడు | ... | నలుపు |

| | | | |
|---|---|---|---|
| 8. | బలరాముడు | తెలుపు | తెలుపు |
| | రేవతి | ... | ఎఱుపు |
| 9. | బుద్ధుడు | లేతఎఱుపు | ... |
| 9. | కృష్ణుడు | నలుపు | నలుపు |
| | రుక్మిణి | ... | పసుపుపచ్చ |
| 10. | కల్కి | తెలుపు | తెలుపు |

## 52. శ్రీ లక్ష్మీనారాయణ ధ్యానము

(భట్టభాస్కరీయము)

నారాయణశ్చతుర్బాహుః శంఖచక్రీ తథోత్తరే
దక్షిణే తు గదాపద్మే నీలజీమూతసన్నిభః ॥
వామే శ్రీ ర్వల్లకీహస్తా పుష్టా పద్మకరా పరే ॥

శ్రీ లక్ష్మీనారాయణులు నల్లని మేఘమువంటి శరీరకాంతులతో, నాల్గు చేతులతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి పద్మమును 1. చక్రమును 2. అట్లే ఎడమ వైపున చక్రమును 1. శంఖమును 2. కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును.

ఆ స్వామికి అవయవస్ఫూర్తిగల లక్ష్మీదేవి ఎడమభాగమున కుడిచేతితో వీణను 1. ఎడమచేతితో పద్మమును 2. ధరించి ఉండును. (శ్యామవర్ణము)

## 53. శ్రీ సూర్యనారాయణ ధ్యానము

ధ్యేయః సదా సవితృమండలమధ్యవర్తీ
నారాయణః సరసిజాసనసన్నివిష్టః ।
కేయూరవాన్ మకరకుండలవాన్ కిరీటీ
హారీ హిరణ్మయవపు ర్ధృతశంఖచక్రః ॥

శ్రీ సూర్యనారాయణుడు సూర్యబింబముయొక్క నడుమ పద్మమునందు బంగారుకాంతులతో, ఉపవిష్టుడై యుండును.

ఆ స్వామి కిరీటము, దండగడియములు, మకరకుండలములు, హారములు మున్నగు సర్వాలంకారములతో నుండును.

ఈ సూర్యనారాయణునకు రెండు చేతులు. కుడిచేతిలో చక్రమును 1. ఎడమ చేతితో శంఖమును 2. ధరించును. (స్వర్ణవర్ణము)

## 54. శ్రీ అష్టముఖ గండభేరుండ నృసింహ ధ్యానము

వందే ఒహం క్రూరఘోరప్రబలతరమహా
గండభేరుండసింహ
వ్యాఘ్రాశ్వక్రోడశాఖామృగవరఖగరా
డ్భల్లుకాద్యష్టవక్త్రమ్ ।
ద్వాత్రింశత్కోటిబాహుం హలముసలగదా
శంఖచక్రాది హేతి
స్ఫ్రభాణం భీమదంష్ట్రం శరభఖగగజాన్
భక్షయంతం నృసింహమ్ ॥

శ్రీ అష్టముఖగండభేరుండ నృసింహమూర్తి మిక్కిలి భయంకరమైన రూపము కలవాడు. గండభేరుండము 1. సింహము 2. వ్యాఘ్రము 3. గుఱ్ఱము 4. వరాహము 5. కోతి 6. గరుత్మంతుడు 7. ఎలుగు 8. అను నీ జంతువులయొక్క మొగములవంటి మొగములతో. ముప్పదిరెండు కోట్ల చేతులతో. నాగలి 1. రోకలి 2. గద 3. శంఖము 4. చక్రము 5. కత్తి 6. మున్నగు ననేకములగు ఆయుధములతో. భయంకరములగు కోరలతో. శరభములను పక్షులను ఏనుగులను తినుచు ఉండును.

ఇట్లు భయంకర రూపముతో నున్న అష్టముఖ గండభేరుండ నృసింహమూర్తిని నేను నమస్కరించుచున్నాను. (అథర్వణరహస్య మంత్రసారము)

## 55. శ్రీ పంచవక్త్ర నారసింహ ధ్యానము

(మంత్రసారము)

పంచవక్త్రం మహాభీమం కాలానలసమప్రభమ్
ముండమాలాధరం రౌద్రం కంఠహారేణ శోభితమ్ ॥

నాగయజ్ఞోపవీతాఢ్యం పంచాననసుశోభితమ్
చంద్రమౌళిం నీలకంఠం ప్రతివక్త్రం త్రిలోచనమ్ ॥

భుజైః పరిఘసంకాశై ర్దశభి శ్చోపశోభితమ్
అక్షసూత్రం గదాం పద్మం శంఖం గోక్షీరసన్నిభమ్ ॥

ధను శ్చ ముసలం చైవ తథా చక్రం మహాప్రభమ్
ఖడ్గం చ శూలపాశౌ చ నృసింహం రుద్రరూపిణమ్ ॥

ఇంద్రగోపకనీలాభం చంద్రాభం స్వర్ణసన్నిభమ్
పూర్వాదిమోత్తరాంతాస్య మూర్ధ్వాస్యం సర్వవర్ణకమ్ ॥

బిభ్రాణం సర్వజగతా మాధారం గిరికన్యకే ॥

ఓ పార్వతీ ! శ్రీ పంచవక్త్రనారసింహమూర్తి ఎఱ్ఱని శరీరచ్ఛాయలతో, ఐదు మొగములతో, మిక్కిలి భయంకరమైన రూపముతో, కపాలముల దండలతో, ఇతరములగు కంఠహారములతో, పాముల జంధెముతో, శిరమునందు చంద్రకళతో, నల్లని కంఠములతో, ప్రతిముఖమునందు మూడుమూడు కన్నులతో, రుద్రరూపియై యుండును.

ఈ స్వామి కుడివైపున క్రిందినుండి పైకి క్రమమున ఖడ్గమును 1, అక్షమాలను 2, గదను 3, శూలమును 4, చక్రమును 5, అట్లే ఎడమవైపున ధనుస్సును 1, పద్మమును 2, రోకలిని 3, పాశమును 4, శంఖమును 5, కుడిఎడమల పదిచేతులతో ధరించును.

తూరుపు మొగము ఎఱ్ఱనిది. దక్షిణపు మొగము నల్లనిది. పడమర మొగము తెల్లనిది. ఉత్తరపు మొగము పసుపుపచ్చనిది. ఊర్ధ్వముఖము వివిధవర్ణములు కలది.

ఇట్టి రూపముతో, సర్వజగములకు ఆధారమగు రుద్రరూపుడగు శ్రీ పంచవక్త్ర నృసింహమూర్తిని ధ్యానింతును. (రక్తవర్ణము)

## 56. శ్రీ ప్రతాపరామ ధ్యానము

(మంత్రసారము)

దోర్భిః ఖడ్గం త్రిశూలం దధతం మణిధను
ర్దంచబాణాం ప్రతాపం

శంఖం చక్రం కృపాణం హలముసలగదా
భిండివాలం చ పాశమ్ ;
ఉద్యద్బాహుం చ ముష్టిం హ్యభయవరకరం
బిభ్రతం శుక్లవర్ణం
వందే రామం త్రినేత్రం త్రిపురరిపుకులం
మర్దయంతం ప్రతాపైః ॥

శ్రీ ప్రతాపరామమూర్తి తెల్లని శరీరచ్ఛాయలతో, మూడుకన్నులతో కూడిన ఒక్క మొగముతో, ఇరువది చేతులతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, నాగలిని 2, భిండి వాలమును 3, గదను 4, ఖడ్గమును 5, బాణమును 6, చిన్నకత్తిని 7, డమరుకమును 8, శూలమును 9, చక్రమును 10, అట్లే ఎడమవైపున వరదముద్రను 1, రోకలిని 2, ముష్టిని 3, ఎత్తబడినచేతిని 4, దండమును 5, విరటిని 6, చిన్నకత్తిని 7, పాశమును 8, గొడ్డలిని 9, ఖడ్గమును 10, కుడిఎడమల ఇరువది చేతులతో ధరించును.

తన పరాక్రమముచేత దానవకులమును మర్దించునట్టి శ్రీ ప్రతాపరాముని నమస్కరించుచున్నాను.

## 57. శ్రీ అనంతమూర్తి ధ్యానము

(భవిష్యోత్తరము-అనంతకల్పము)

నవామ్రపల్లవాభాసం పింగభ్రూశ్మశ్రులోచనమ్
దక్షిణోర్ధ్వకరే పద్మం శంఖం తస్యాప్యధఃకరే ॥

చక్ర మూర్ధ్వ కరే వామే గదాం తస్యాప్యధఃకరే
బిభ్రతం పుండరీకాక్షం ఫణసప్తాన్వితం భజే ॥

క్రొత్త మామిడిచిగురువంటి లేత పచ్చని శరీరచ్ఛాయలతో, అట్టి రంగుతోనే ఉన్న గడ్డము, మీసలు, కనుబొమలు, కనుగ్రుడ్లు కలిగి, తామరపూవులవలె విప్పారిన విశాలములగు కన్నులతో, ఏడు పడగలతో, అనంతమూర్తి (శేషుడు) ఉండును.

అతడు కుడివైపున క్రిందినుండి పైకి శంఖమును 1, పద్మమును 2, అట్లే ఎడమవైపున గదను 1, చక్రమును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును.

ఇట్టి రూపముతో నున్న శ్రీ అనంతమూర్తిని నేను ఎల్లప్పుడు భజించుచున్నాను. (గోమూత్రవర్ణము)

## 58. శ్రీ గోపాలకృష్ణ ధ్యానము

(భాగవతము)

నౌ మీడ్య తే ఽభ్రవపుషే తటిదంబరాయ
గుంజావతంసశిఖిపిచ్ఛలసన్ముఖాయ ।
వన్యస్రజే కబలవేత్రవిషాణవేణు
లక్ష్మశ్రియే మృదుపదే పశుపాంగజాయ ॥

శ్రీ గోపాలకృష్ణుడు మేఘమువలె నల్లనగు శరీరచ్ఛాయలతో, మెఱుపుతీగవలె బంగారుకాంతిగల వస్త్రములతో, గురువిందగింజలు పొదగబడిన నెమలిపింఛముచే ప్రకాశించు ముఖముతో, అడవిపూవుల దండలతో, నాల్గు చేతులతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి వేణువును 1, కొమ్మును 2, అట్లే ఎడమవైపున చిన్నముద్దను 1, చిరుకోలను 2, ధరించి యుండును.

మృదువైన పాదములతో నున్న నందపుత్రుడవగు ఓ స్వామీ: నీకు నమస్కరించుచున్నాను. (నీలవర్ణము)

## 59. శ్రీ మదనగోపాల ధ్యానము

రక్తవర్ణో దశభుజః సర్వాలంకారభూషితః
శంఖచక్రగదాపద్మ పాశాంకుశసుమాశుగాన్ ॥

ఇక్షుకోదండ పుణ్యాభ్యాం వాదయన్ వేణు మాదరాత్
షోడశచ్ఛదపద్మస్థషట్కోణోపరిసంస్థితః ॥

గోపాలమదనాఖ్యో ఽయం మందస్మితముఖాంబుజః
స్వపత్రస్థగోపీభి రాదరా దీక్షితో ఽవతాత్ ॥

శ్రీ మదనగోపాలస్వామి ఎఱ్ఱని శరీరచ్ఛాయలతో, సర్వాభూషణములతో, పది చేతులతో నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి (నిజహస్తములు కాక) పూలబాణమును 1, పద్మమును 2, గదను 2, అంకుశమును 3, చక్రమును 4, అట్లే ఎడమవైపున చెఱకు వింటిని 1, గదను 2, పాశమును 3, శంఖమును 4, ఎనిమిది చేతులతో ధరించి యుండును.

రెండు నిజకరములతో పిల్లనగ్రోవిని మ్రోగించుచుండును.

ఈ మదనగోపాలుడు పదునారుదళములు కల పద్మమునందు ఆరు కోణములుగల పీఠమునం దుండును.

ఆ పద్మములయొక్క పదునారుదళములయందు పదునారుగురు గోపికలు పరమ లావణ్యమూర్తి యగు శ్రీ మదనగోపాలుని అనురాగముతో చూచుచుందురు.

ఇట్టి రూపముతో చిఱునవ్వులను చిందుచున్న శ్రీ స్వామి మనలను రక్షించును గాక!

(రక్తవర్ణము)

## 60. శ్రీ సుదర్శన ధ్యానమ్
(పాంచరాత్రము)

శంఖం చక్రం చ పాశం పరశు మసి మిషుం
శూలచాపాంకుశాగ్నిం
(బిభ్రత్తం) బిభ్రాణం వజ్రఖేటం హలముసలగదా
కుంతమత్యుగ్రదంష్ట్రమ్ ।
జ్వాలాకేశం త్రినేత్రం జ్వలదనలనిభం
హారకేయూరభూషం
ధ్యాయే త్షట్కోణసంస్థం సకలరిపుజన
ప్రాణసంహారచక్రమ్ ॥

శ్రీ సుదర్శనమూర్తి మండుచున్న అగ్నివలె నెఱ్ఱని శరీరకాంతులతో, మూడు కన్నులతో కూడిన ఒక్క మొగములో, భయంకరమగు కోరలతో, అగ్నిజ్వాలలవంటి

కేశములతో, పదునారుచేతులతో, హారముదు, దండగడియములు మున్నగు సర్వాలంకార ములతో, ఆరుకోణములుగల పీఠమునందు ఉండును.

కుడివైపున క్రిందినుండి పైకి వరుసన శూలమును 1, కత్తిని 2, రోకలిని 3, నాగలిని 4, గొడ్డలిని 5, బాణమును 6, అంకుశమును 7, చక్రమును 8, అట్లే ఎడమవైపున గదను 1, ఖేటమును 2, పాశమును 3, కుంతమును 4, అగ్నిని 5, విండిని 6, వజ్రమును 7, శంఖమును 8, కుడిఎడమల పదునారు చేతులలో ధరించి యుండును.

ఇట్టిరూపముతో సకలశత్రుజనమును సంహరించునట్టి శ్రీ సుదర్శనమూర్తిని ధ్యానింపవలయును. (రక్తవర్ణము)

## 61. శ్రీ సుదర్శనచక్ర ధ్యానమం

(పాంచరాత్రము)

తిర్యగ్జ్వాలాగ్నిరూప జ్వలితశిఖిశిఖో
త్తుంగకేయూరబాహుం
పింగాక్షం దీప్తజిహ్వం దశశతవిలస
త్తీక్ష్ణధారాతిరౌద్రమ్ ।
శార్ఙ్గం చక్రాబ్జశంఖాన్ శరముసలధరం
సర్వశత్రూన్ దహంతం
షట్కోణాభ్యంతరస్థం రవినియుతనిభం
చక్రరాజం (ప్రసన్నమ్) నమామి॥

శ్రీ చక్రమూర్తి ఎగుదుదిగురుగా మండుచున్న అగ్నివలె ఎఱ్ఱని శరీరకాంతు లతో, అగ్నిజ్వాలలవలె ఎత్తైన అంగదములు (దండగడియములు) కల చేతులతో, లేత పసుపురంగుగల కన్నులతో, పదివేల సూర్యుల కాంతులతో, ఆరు చేతులలో, ప్రకా శించుచున్న నాల్కలతో, మిక్కిలి పదునుగల వాడియగు వేయి అంచులతో, ఆరు కోణ ములుగల పీఠముయొక్క మధ్యమునం దుండును.

కుడిపైపున క్రిందినుండి పైకి చక్రమును 1, బాణమును 2, రోకలిని 3, అట్లే ఎడమపైపున శంఖమును 1, శార్ఙ్గ మను విల్లుని 2, పద్మమును 3, కుడిఎడమల నారు చేతులతో ధరించును.

ఇట్టి రూపముతోనున్న చక్రరాజమునకు నమస్కరింతును. (రక్తవర్ణము)

# 62. శ్రీ విష్వక్సేన ధ్యానము

(పాంచరాత్ర-పాద్మసంహిత)

శ్యామవర్ణః చతుర్భుజైః స్తర్జనీశంఖచక్రగదా దధానః
పీఠాధస్తాత్ప్రసారితదక్షిణపాదః ఆకుంచితవామపాదః
కిరీటాదిసర్వాలంకారభూషితో విష్వక్సేనః ॥

శ్రీ విష్వక్సేనమూర్తి నల్లని శరీరఛ్ఛాయలతో, కిరీటము మున్నగు సర్వాలంకారములతో, నాలుగు చేతులతో నుండును.

కుడిపైపున క్రిందినుండి పైకి తర్జనీముద్రను 1, చక్రమును 2, అట్లే ఎడమపైపున గదను 1, శంఖమును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించి యుండును.

అతని కుడిపాదము పీఠము క్రిందికి చాపబడి యుండును. ఎడమపాదము వంచబడి యుండును. (శ్యామలవర్ణము)

# 63. శ్రీ పంచముఖాంజనేయ ధ్యానము

(సుదర్శనసంహిత)

పంచవక్త్రం మహాభీమం త్రిపంచనయనైర్యుతమ్
కోటిసూర్యప్రతీకాశం కపివక్త్రం సుతేజసమ్ ॥

దంష్ట్రాకరాళవదనం భ్రుకుటీకుటిలేక్షణమ్
అస్యైకం దక్షిణం వక్త్రం నారసింహం మహాద్భుతమ్ ॥

అత్యుగ్రతేజోవపుషం భీషణం భయనాశనమ్
పశ్చిమే గారుడం వక్త్రం వక్రతుండం మహాద్యుతి ॥

ప్రాతాలసిద్ధిదం ఘోరం విషభూతాదికృంతనమ్ ।
ఉత్తరం సౌకరం వక్త్రం కృష్ణం దీప్తం శిఖోజ్జ్వలమ్ ॥

సర్వభూతప్రశమనం తాపజ్వరనివారణమ్
ఊర్ధ్వం హయాననం ఘోరం దానవాంతకరం పరమ్ ॥

ఖడ్గత్రిశూలఖట్వాంగపాశ మంకుశపర్వతౌ
ముష్టిగోవృక్షదికామ్రుండం దధానం సురవందితమ్ ॥

శ్రీ పంచముఖాంజనేయమూర్తి బంగారువంటి పచ్చని శరీరఛ్ఛాయలతో, మూడుమూడు కన్నులుగల ఐదుముఖములతో, పదిచేతులతో నుండును.

తూరుపున నుండు మొగము కపి (కోతి) ముఖము. అది కోటి సూర్యుల కాంతులతో నుండును.

దక్షిణపు మొగము నారసింహము. నరసింహమూర్తి మొగమువంటి మొగము. ఆ మొగము బొమముడితో క్రూరమైన కోరలతో భయంకరముగ నుండును.

పడమర మొగము గారుడము. గరుత్మంతుని మొగమువలె నుండును. గొప్ప తేజముతో, భయమును కలిగించుచు వంకరముక్కుతో నుండును. ఇది భయములను తొలగించును.

ఉత్తరముఖము సౌకరము. అనగా వరాహమునకు సంబంధించినది వలె నుండును. ఇది నల్లనిదై ప్రకాశించుచుండును.

ఊర్ధ్వముఖము గుఱ్ఱమునకు సంబంధించినదివలె నుండును. ఇది సర్వభూత భయములను, తాపజ్వరములను నివారించును. భయంకరమై దానవులను నశింప చేయును.

ఈతడు కుడివైపున క్రిందినుండి పైకి గోముఖముద్రికను 1, ఖడ్గమును 2, త్రిశూలమును 3, అంకుశమును 4, పర్వతమును 5, అట్లే ఎడమవైపున కపాలమును 1, ఖట్వాంగమును 2, పాశమును 3, చెట్టును 4, ఊర్ధ్వబాహువును 5, (పైకెత్తబడిన చేయి), కుడిఎడమల పదిచేతులతో ధరించును.

దేవతలచేత స్తుతింపబడుచున్న ఇట్టి రూపముతో నున్న శ్రీ పంచముఖాంజనేయుని నమస్కరించుచున్నాను.

# శ్రీమన్నారాయణుని శయనవిగ్రహములు వాని ఉపయోగములు

బ్రహ్మోవాచ :

భగవన్ పద్మజానాథ హరే రాజీవలోచన
శయనాసనయో శ్చాపి స్థానకస్య క్రమేణ చ ॥
లక్షణం కథయ స్వేశ నవగ్రామాదివాస్తుషు ॥

భగవంతుడవైన లక్ష్మీపతీ హరీ తామరపూవుల వంటి కన్నులుకలవాడా! శయన (పరుండిన) విగ్రహము, ఆసన (కూర్చుండిన) విగ్రహము, స్థానక (నిలుచుండిన) విగ్రహము అనునవి నవగ్రామాదులైన వాస్తువులయందు (భూములయందు) ఏవిధముగ నుందునదియును, వాని లక్షణములను క్రమముగ వివరింపుము అని బ్రహ్మ విష్ణువు నడిగెను.

శ్రీ భగవానువాచ :

శృణు బ్రహ్మన్ గదిష్యే ఒహం
త్వత్ప్రశ్నవశతః క్రమాత్ ॥

యోగం సృష్టి స్తథా భోగం సంహారం చ చతుర్విధమ్
ముక్త్యర్థం వృద్ధిభుక్త్యాభిచారార్థం శయనం క్రమాత్ ॥

యోగశయ్యా ముముక్షూణాం ప్రయోక్తవ్యం ప్రయత్నతః
పుత్రపౌత్రాభివృద్ధ్యర్థం తత్సృష్టిశయనం మతమ్ ॥

భోగవృద్ధికరం భోగశయనం సర్వదం నృణామ్
శత్రుపక్షవినాశాయ సంహారశయనం భవేత్ ॥

అప్పుడు విష్ణు విట్లు పలుకదొడగెను.

బ్రహ్మదేవా! నీ వడిగినదానికి సమాధానము చెప్పెదను వినుము. శయన విగ్రహములు యోగము, సృష్టి, భోగము, సంహారము అని నాలుగు విధములుగా నున్నవి. అవి వరుసన ముక్తికి, వృద్ధికి, భుక్తికి, అభిచారికమునకు ఉపయోగపడును.

ముముక్షువులు అనగా మోక్షము కోరువారు యోగశయనమును, పుత్రపౌత్రాభివృద్ధి కోరువారు సృష్టిశయనమును, భోగవృద్ధి కావలసినవారు భోగశయనమును, శత్రువుల నాశనము కోరువారు సంహారశయనమును ఉపయోగింపవలెను.

గ్రామాగ్రహారయో ర్మధ్యే శయనం సర్వకామదమ్
బ్రహ్మస్థానే నవాంశైకం త్యక్త్వా మధ్యే సమంతత: ॥

అవాచ్యాం చ ప్రతీచ్యాం చోదీచ్యాం ప్రాచ్యాం తథైవ చ
యోగశయ్యా తథా భోగశయ్యా సృష్ట్యభిధాయినీ ॥

సంహారశయ్యా చేత్యేతా శ్చతస్ర: స్యు ర్యథాక్రమాత్ ॥

గ్రామముయొక్క, అగ్రహారముయొక్క మధ్యనున్న శయనము అన్నికోర్కెలను తీర్చును. దేవాలయమునడుమ తొమ్మిది భాగములు చేసి మధ్యభాగమును విడచి ఈ శయనవిగ్రహమును ప్రతిష్ఠింపవలెను. దక్షిణము, పడమర, ఉత్తరము, తూర్పు దిక్కులలో వరుసన యోగశయనము, భోగశయనము, సృష్టిశయనము, సంహారశయనము అనునవి ఉండవలె నని చెప్పబడినవి.

ప్రాగ్గామిప్ర పశ్చిమంద్వారం ప్రాఙ్ముఖం పశ్చిమాలయమ్ ॥

దక్షిణోదీచికాద్వార మందగ్దక్షిణదిఙ్ముఖమ్
ప్రాఙ్ముఖో వాగుదక్ గ్రామే బాహ్యే ప్యేవ ముదీరితమ్ ॥

ప్రాగ్ద్వారం సంపద్వృద్ధ్యై స్యాత్ సర్వసంపద్వినాశనమ్
ప్రత్యఙ్ముఖం ఉదగ్ద్వారం జ్ఞానసంపద్వివృద్ధిదమ్ ॥

వైరాగ్యం స్యాత్ దక్షిణా త్తు ద్వార మేవం వినిర్ణయేత్ ॥

గ్రామమునకు తూర్పున కట్టినచో పశ్చిమద్వారమును, పశ్చిమమున కట్టినచో తూర్పుద్వారమును, ఉత్తరమున కట్టినచో దక్షిణద్వారమును, దక్షిణమున కట్టినచో ఉత్తరద్వారమును నిర్మింపవలెను. తూర్పువైపున ద్వారమైనచో సర్వసంపదలు కలుగును. పడమటి ద్వారమైనచో సర్వసంపదలు తొలగును. ఉత్తరద్వారమైనచో జ్ఞాన సంపద పెంపొందును. దక్షిణద్వారమైనచో వైరాగ్యము పెరుగును.

గ్రామా దన్యేషు సర్వే షూత్తరాస్యం శయనం భవేత్ ॥

సరస్తటే నదీతీరే యోగశయ్యా విధీయతే
స్వస్తికం వృత్తభద్రం చ వృత్తగేహ మవేదికమ్ ॥

ప్రేష్యాగృహం మహారాజ చ్ఛంద శ్చ శ్రీప్రతిష్ఠితమ్
మండలం శయనే యోగ్యం మాత్రాఖండం చతుష్పుటమ్॥

గణికావిహారకం శుద్ధస్వస్తికం చ నలీనకమ్
ఇత్యాదీ న్యాయతాశ్రాణి వర్తులా న్యాయతాని చ ॥

గ్రామాదులయందు కానిచో శయన మెల్లప్పుడు ఉత్తరముఖముగా ఉండును. సరస్సుల ప్రక్క, నదీతీరమున యోగశయనాలయము ప్రశస్తమైనది.

1 స్వస్తికము, 2 వృత్తభద్రము, 3 వృత్తగేహము, 4. అవేదికము, 5 ప్రేష్యాగృహము, 6 మహారాజము, 7 ఛందము, 8 శ్రీప్రతిష్ఠితము, 9 మండలము, 10 మాత్రాఖండము, 11 చతుష్పుటము, 12 గణికావిహారము, 13 శుద్ధస్వస్తికము, 14 నళీనకము, మొదలైన ఆలయములు శయనస్వామి నివాసమునకు శ్రేష్ఠములు. ఇవి దీర్ఘచతురశ్రముగా (నిడివిచదరముగా) గాని, ఆయతవృత్తములుగా గాని ఉండవలెను. శయనాలయములపై విమానము గుండ్రనిది, చతురశ్రయమైనది తగదు. దీర్ఘచతురశ్రముగా గాని, దీర్ఘవృత్తముగా గాని ఉండవలెను.

## 1. యోగశయనము

యోగశయ్యాక్రమం వక్ష్యే శృణు త్వం పంకజాసన
శంఖేందుభాసుర శ్శేషో యోగే శయన ఇష్యతే ॥

గౌరశ్యామనిభో వాథ పీతశ్యామనిభో హరిః
అర్ధాఖ్యం శయనం ప్రోక్తం ద్విభుజం సాత్త్వికో గుణః ॥

యోగనిద్రాసంభాసక్తో రక్తోత్పలదళేక్షణః
పూజావిష్టరపార్శ్వే తు దక్షిణే దక్షిణేతరే ॥

భృగుమార్కండేయకౌ వా పూర్కండేయోర్వారే తథా
మధుకైటభసంయుక్తం బ్రహ్మపంచాయుధై ర్యుతమ్ ॥

వందమానై ర్మునీంద్రైశ్చ యుక్తం యోగాఖ్య మిష్యతే
మధ్యం వినా పూజకై స్తై రసురాభ్యాం వి నాధమమ్ ॥

ఓ బ్రహ్మదేవా! యోగశయనమునుగూర్చి చెప్పెదను వినుము. శేషుడు శంఖము వలె, చంద్రుని వలె తెల్లగా ఉండును. దానిమీద శయనించిన విష్ణువు గౌరశ్యామ వర్ణముతో గాని, పీతశ్యామవర్ణముతో గాని ఉండును. శ్రీ స్వామి రెండు భుజములు కలిగి ఒక్కపక్కగా పడుకున్నట్లున్నచో అది అర్ధశయన మని చెప్పబడును.

ఆ స్వామి ఎఱ్ఱతామరరేకులవంటి కన్నులతో యోగనిద్రాసుఖమునం దుండును. అట్టి విష్ణుదేవుని పూజాపీఠమునకు కుడివైపున భృగువు, ఎడమవైపున మార్కండేయ మహర్షి ఉండవలెను. లేదా కుడివైపున మార్కండేయుడు, ఎడమవైపున భూదేవి ఉండవలెను. మధుకైటభులు, బ్రహ్మదేవుడు, పంచాయుధములు, నమస్కరించుచున్న మహర్షులు ఉండవలెను. ఇట్లున్నచో నది ఉత్తమయోగశయనము.

పూజకులు అనగా భృగుమార్కండేయులు లేనిది మధ్యమయోగశయనము.

పూజకులు, అసురులు (మధుకైటభులు) లేనిది అధమయోగశయనము.

## 2. సృష్టి శయనము

దేవశ్రీభూమివేధోభి ర్యుక్తం పంచభి రాయుధైః
సూర్యచంద్రేంద్రసంయుక్త మప్సరోభి స్సమన్వితమ్ ॥

మునిభి ర్వసుభి రుద్రై రాదిత్యైః కిన్నరై ర్యుతమ్
సనకాదిభి స్తథా దేవై ర్నారదాద్యై స్సమన్వితమ్ ॥

మార్కండేయభృగుభ్యాం చ మధుకైటభసంయుతమ్
పద్మేక్షణం రజోభావం శ్యామచ్ఛవి మవిచ్యుతమ్ ॥

రక్తపాదాంతశయనం తత్సృష్టిశయనం భవేత్
మధ్యమం మనుజహీనం తద్ధీనం పూజకహీనకమ్ ॥

లక్ష్మి, భూదేవి, బ్రహ్మ, సూర్యుడు, చంద్రుడు, ఇంద్రుడు, అప్సరసలు, మునులు, వసువులు, రుద్రులు, ఆదిత్యులు, కిన్నరులు, సనకాదులు, నారదాదులును, మార్కండేయుడు, భృగువు, మధుకైటభులును, కలిగినది ఉత్తమసృష్టిశయనము.

ఈ స్వామి పద్మములవంటి కన్నులతో, రాజసభావముతో, నల్లని శరీరచ్ఛాయతో, ఎఱ్ఱని అరికాళ్ళతో, శాశ్వతుడై యుండును.

మధుకైటభులు లేనిది మధ్యమసృష్టిశయనము.

పూజకులైన భృగుమార్కండేయులు, మధుకైటభులు లేనిది అధమసృష్టిశయనము.

## 3. భోగశయనము

పరివారాన్వితం భోగశయనం వక్ష్యతే ఒధునా
నాభే రూర్ధ్వాంబుజా సీన స్వర్ణ వర్ణ పితామహమ్ ॥

స పంచాష్టాయుధం బ్రహ్మపార్శ్వయో రుభయో రపి
సర్వాయుధానా మగ్రే తు స్థాపయే ద్వినతాత్మజమ్ ॥

శ్రీ భూ సరస్వతీ శాంత్య శ్చతస్రో దేవ్య ఏవ చ
అవామ బాహు పాదాబ్జ పార్శ్వే లక్ష్మీ స్సరస్వతీ ॥

వామపాద భుజాభ్యాం సవర్తినీ శాంతి రుర్వరా
సహార్యాచంద్రమసౌ వ్యేమ్ని స్థాప్యౌ తుంబురునారదౌ॥

సప్తర్షయో ఒప్సరోభి శ్చ లోకపాలా స్త థాశ్వినౌ
నారసింహ స్తు వారాహః పూజావిష్టరపార్శ్వకే ॥

మధుకైటభౌ పత్పార్శ్వే కర్తవ్యౌ నవతాలతః
తౌ క్షీరార్ణవసమ్మానౌ శేషః శయనతాం గతః ॥

రక్తపీతనిభ స్స స్యాఘ్యామపద్మో మహాచ్యుతః
అర్ధాభ్యశయ్యావృష్టాంగో ద్విభుజో వా చతుర్భుజః ॥

సుస్థితం ఫుల్లపద్మాభం ముఖం శృంగారసంయుతమ్
పద్మపత్రేక్షణం పూర్ణచంద్రతుల్యం సమన్వితమ్ ॥

ఏత దుత్తమ ముద్దిష్టం భోగాఖ్యశయనం మయా
శాన్తిసరస్వతీనారసింహవరాహకై ర్వినా ॥

మధ్యమం స్యా దధమం తై స్తు దేవై ర్దనుజహీనకమ్
బ్రహ్మణ మాయుధం దేవ్యౌ సర్వస్మి న్నేవ కారయేత్ ॥

శ్రీ మన్మహావిష్ణుదేవుని భోగశయనము వివరింపబడుచున్నది. ఇందు శ్రీ స్వామి పరివారముతో కూడినవాడై శేషునియందు పరుండి యుండును. అతని నాభినుండి వికసించిన తామరపూవునందు కూర్చున్న బ్రహ్మ బంగారురంగుతో ఉండును. బ్రహ్మకు రెండు ప్రక్కల శంఖము, చక్రము, గద, ఖడ్గము, శార్ఙ్గము అను పంచాయుధములును, పద్మము, వనమాల, కౌస్తుభము పై ఐదింటితో కూడి అష్టాయుధములు నుండును. ఈ ఆయుధముల ముందు గరుత్మంతు డుండును. ఆ స్వామి కుడిచేతి ప్రక్కన లక్ష్మి, కుడి కాలి ప్రక్కన సరస్వతి, ఎడమచేతి ప్రక్కన శాంతి, ఎడమపాదము ప్రక్కన భూమి ఇట్లు నల్వురు దేవతలు ఉందురు.

ఆకాశమున సూర్య చంద్రులు, తుంబురునారదులు సప్తర్షులు, అప్సరసలు, లోకపాలురు, అశ్వినీదేవతలు నుందురు. స్వామి పూజాపీఠమ్ము ప్రక్క నారసింహ వరాహ మూర్తులు ఉందురు. పాదముల దగ్గర మధుకైటభు లుందురు. వారి విగ్రహములను నవతాళమున చేయవలెను. వారు క్షీరసముద్రమునుండి వచ్చిన ట్లుండవలెను. మధువు ఎఱ్ఱగను, కైటభుడు పచ్చగను ఉందురు. విష్ణుమూర్తి నస్యశ్యామలవర్ణముతో నుండును.

శ్రీస్వామి సగముప్రక్కగా నిద్రించుచున్నట్లు రెండుభుజములతో గాని, నాలుగు భుజములతో గాని, వికసించిన ముఖముతో, శృంగారవేషముతో, తామరరేకుల వంటి కన్నులతో, పూర్ణచంద్రుని వంటి ముఖముతో నుండవలెను.

ఇట్లు సర్వపరివారముతో నుండిన శయనమును ఉత్తమభోగశయన మందురు.

శాంతిదేవి, సరస్వతీదేవి, నారసింహుడు, వరాహము అనుమూర్తులు లేనిదానిని మధ్యమభోగశయన మందురు.

శాంతి సరస్వతులను, ఇతరదేవతలు, దనుజులను (మధుకైటభులు) లేని దానిని అధమభోగశయన మందురు.

భోగశయనములయందు బ్రహ్మను, ఆయుధములను, శ్రీ భూదేవులను తప్పక నిర్మింపవలెను.

## 4. సంహారశయనము

ఆనున్నతశిరోభాగం ద్విఫణం వలయద్వయమ్
ధూమ్రవర్ణయుతం శేషం శయనం సమ ముచ్యతే ॥

మీలేక్షణం మహానిద్రం తామసం నయనత్రయమ్
శుష్కవక్త్రం సశుష్కాంగం శ్యామవస్త్రం భుజద్వయమ్ ॥

నీలవర్ణసమాయుక్తం రుద్రరూపాదిమూర్తికమ్
బ్రహ్మాదిభి ర్వినాధిష్ఠం సంహారం కేవలం మతమ్ ॥

సంహారశయనమునందు శ్రీమన్నారాయణుడు శేషునియందు సమముగ పరుండి యుండును. ఆశేషుడు వంచిన (పైకిలేవని) రెండుశిరములతో(పడగలతో),పొగరంగుతో నుండును.

ఆశేషునియందు శయనించి శ్రీస్వామి గాఢనిద్రయందు మూయబడిన కన్నులతో, తామసభావమును వ్యక్తముచేయు మూడు కన్నులతో, వాడిన మొగము మున్నగు సర్వాంగములతో, నల్లని వస్త్రములతో, రెండు చేతులతో, నల్లని శరీరకాంతులతో, రుద్రుడు మున్నగు దేవతల భయంకర రూపములతో నుండును.

ఇట్టిది సంహారశయనము, దీనియందు పూర్వశయనములయందు చెప్పబడిన బ్రహ్మ మున్నగువారు ఎవ్వరును ఉండరాదు.

## వర్ణములు

శంఖచక్రగదాశార్ఙ్గఖడ్గాః పంచాయుధాః స్మృతాః
పంకజం ముసలం త్వై స్తు వనమాలాష్ట సమ్మతాః॥

ఖడ్గం చ పంకజం శార్ఙ్గం స్త్రీరూపం వనమాలికా
శంఖ చక్రౌ పుమాంసౌ ముసలదండే నపుంసకే ॥

శంఖారిదండమాలాబ్జముసలాసిధనూంషి తు
చంద్రార్క పీతపింగాబ్జనీలమంజిష్ఠమేచకాః ॥

పాంచజన్యం తు భూతాత్మా వైనతేయ స్స్వర్ణభాః
మధుకైటభౌ మధుశ్యామౌ విస్మృతాస్యా భయానకా ॥

చామీకరనిభా లక్ష్మీ ర్వాణీ కింశుకపుష్పభా
శాంతి స్సస్యాంకురాభాసా సస్యశ్యామని భోర్వికా ॥

శంఖము, చక్రము, గద, శార్ఙ్గము, ఖడ్గము, అనునవి పంచాయుధములు. వానికి పద్మము, రోకలి, వనమాల, కలిపినచో అష్టాయుధము లగును. ఖడ్గము, పద్మము, వనమాల, శార్ఙ్గములు స్త్రీరూపముతో నుండును. శంఖచక్రములు పురుషరూపముతో నుండును. ముసలము, దండము (గద) నపుంసకములు.

| | |
|---|---|
| శంఖము = తెలుపు | పద్మము = తెలుపు |
| చక్రము = ఎఱుపు | ముసలము = నలుపు |
| గద = పసుపు | ఖడ్గము = కావిరంగు |
| వనమాల = లేతపసుపు | శార్ఙ్గము (ధనుస్సు) = నలుపు |

వర్ణములతో నుండును.

శంఖము భూతాత్మమై (దేవతాత్మకమై) యుండును. గరుత్మంతుడు పసుపుపచ్చ రంగుతో నుండును. మధుకైటభులు తేనెరంగులోను నల్లనివర్ణములోను ఉండురు. వారి ముఖము భయంకరమై ఉండును. లక్ష్మీదేవి బంగారుచాయలో నుండును. సరస్వతి మోదుగుపూవు రంగులో నుండును. శాంతిదేవి ధాన్యపు మొలకవర్ణముతో నుండును. భూదేవి సస్యశ్యామవర్ణములో నుండును.

## ఉన్నతి (ఎత్తు = ఉదయము) వివరములు

ద్వ్యాసోదయం త్రిభాగేఽంశం మధ్యమం శయనోదయమ్
అష్టాంశాధిక ముత్కృష్ట మష్టాంశోనం నికృష్టకమ్ ॥

షట్త్రింశదంగులం శ్రేష్ఠం షడ్డంగులహీనకమ్
మధ్యం చాయామ మధికం షట్సప్తాష్టాంశమాత్రకైః ॥

శిరోభాగోదయం భోగసృష్టియోగేషు కారయేత్
క్రమా దింద్రియవేదాగ్నిమాత్రాభి ర్మధ్యమా నతిః ॥

పంచసప్తనవాదిష్టాః ఫణా స్తస్య సమాహితాః

ద్వారముఎత్తును మూడు భాగములు చేసి అందులో ఒకభాగము ఎత్తుతో చేసినది మధ్యమమైన శయనవిగ్రహము. ఈ మధ్యమశయన విగ్రహమునకు ద్వారముఎత్తును 8 భాగములు చేసి, 1 భాగము కలిపినచో అది ఉత్తమశయనవిగ్రహము ఎత్తుగను, అట్లే ద్వారము ఎత్తులో $\frac{1}{3}$ భాగము తీసివేసినచో (మధ్యమశయనవిగ్రహము నుండి) అది అధమశయనవిగ్రహ మగును. అట్లే ఈ విగ్రహము దేవాంగుళమానములో 36 అంగుళముల ఎత్తైన శ్రేష్ఠము. 30 అంగుళములైన మధ్యమము. 24 అంగుళములైన అధమము. యోగశయనముఎత్తును 6 భాగములు చేసి 1 భాగము విగ్రహముఎత్తునకు కలపగా పాముపడగ యొక్క ఎత్తు వచ్చును. సృష్టిశయనమును 7 భాగములు చేసి 1 భాగము కలిపిన పాము పడగఎత్తు వచ్చును. యోగశయనమును 8 భాగములుచేసి అందులో 1 భాగమును విగ్రహముఎత్తునకు కలిపినపాముపడగయొక్క ఎత్తు వచ్చును. శేషునకు యోగశయనమున 5 పడగలు, భోగశయనమున 7 పడగలు, సృష్టిశయనమున 9 పడగలు ఉండును.

ముఖం వ్యాళసమం తస్య శృంగమధ్యే శిరోమణిః ॥

సవ్యాశాలంబితం దేవబేరం చార్ధుకభారభాక్
సవ్యాశాలంబితం కాయ మాభచారస్య కారణమ్ ॥

ఊర్ధ్వాశ్రయః కర్తరీ వా వామహస్త స్తు పల్లవః
మౌల్యాగ్రపట్టసీమాన్త స్సవ్యహస్త శ్చ పల్లవః ॥

సవ్య స్తు పూర్వవిస్తృత మన్యత్పాద స్తు కుంచితమ్
యోగశయ్యా భవేత్ సవ్యహస్తదండ స్సపల్లవః ॥

వామహస్తః కర్కరీ వామస్స్యా స్సృష్టిశయ్యాకే
దక్షిణాదక్షిణౌ పాదౌ ప్రసారితసకుంచితౌ ॥

దండః స్యా ద్దక్షిణో హస్తః తస్యోర్ధ్వే మౌళిసంస్థితిః
ఊర్ధ్వాశ్రయో వామకరస్థితో ఒన్యత్ కటకం భవేత్ ॥

ఆకుంచితో వామపాదస్థితో ఒన్యత్కుంచితం స్మృతమ్
వింశన్మాత్రాంతరం ప్రోక్తం పాదాంగుష్ఠాగ్రయో రపి ॥

భోగం పార్శ్వాంతరం జాన్వో శ్చతుర్దశాంగులం మతమ్
త్ర్యంగులం స్యాత్ ముఖం తిర్యక్ దక్షిణే బ్రహ్మసూత్రతః॥

దినే దినే ఒభివృద్ధ్యర్థం శయనం చోన్నతం శిరః
శయ్యాశిర శ్చేత్ క్షయదా గోభూధాన్యధనక్షయమ్ ॥

చాపాభం పుష్టిదం బేరం ధర్మకామార్థవృద్ధిదమ్
భోగాఖ్యం స్యాద్ధి శయనం సంహారం ప్రసృతం మతమ్ ॥

స్వామినో మరణం కుర్యాత్ విసృతం శయనం క్షణాత్
బ్రహ్మసూత్రాత్ బహిర్నాభే ర్దక్షిణే సూత్ర మూర్ధ్వగమ్ ॥

బ్రహ్మస్థిత్యా శ్రయం తస్య వామపార్శ్వే తు నారదః
లోకపాలా స్తథా సప్తమునయో ఒప్సరసాం గణః ॥

తస్యైవ వామపార్శ్వే తు సాతోద్య స్తుంబురు స్తథా

శేషునకు 5-7-9 పడగ లుండవలెను. శేషుని ముఖము వ్యాళమువలె నుండవలెను. పడినెత్తిన శిరోమణి ఉండవలెను.

దేవునిశరీరము కుడివైపునకు వంగియుండవలెను. ఎడమవైపునకు తిరిగినది అభిచారికమున కుపయోగించును. దేవుని ఎడమహస్తము తొడపైనుంచి గాని కర్తరీ ముద్రలో గాని పల్లవముద్రలో గాని ఉండును. అట్లే తలక్రింద కిరీటపట్టము క్రింద నున్న చేయికూడ పల్లవముద్రలోనే ఉండును. వామ హస్తము కర్తరీ ముద్రలో నుండును. కుడిఎడమ పాదములు కొంచెము కుంచితములై ఉండును. కుడిచేయి దండ హస్తముగ నుండును. దానిమీద తల నిలిచి ఉండును. ఎడమచేయి తొడమీద అని

ఉండును. కుడిచేయి కటకముద్రలో నుండును. స్వామి కుడిపాదమును చాపియు, ఎడమ పాదమును వంచియు ఉండును. రెండుపాదముల బొటన వ్రేళ్లమధ్య నందు 20 దేహ లబ్ధాంగుళము లుండును. రెండు జానువుల మధ్యను – మడిమల మధ్యను 14 అంగుళ ముల దూర ముండును.

బ్రహ్మసూత్రమునుండి స్వామివారి ముఖము మూడు అంగుళముల దూరము కుడివైపునకు వంగి ఉండును. దినదినాభివృద్ధికొఱకు శయనవిగ్రహముయొక్క శిరస్సు ఎత్తుగా ఉండవలెను. శిరస్సు క్రిందికి పరుండినచో గోభూధాన్యధనములు క్షీణించును. చాపమువలె వంగిన శరీరముగల విగ్రహము పుష్టిని ధర్మకామార్థములను ఇచ్చును. భోగశయనము భర్తకు (చేయించినవానికి) భోగమును, సంహారశయనము మరణమును కలిగించును.

బ్రహ్మసూత్రము వెలుపల నాభిదగ్గఱ కుడివైపునుండి పైకిపోవును. దానిమీద బ్రహ్మదేవుడు కూర్చుండుటకు పుష్ప ముండును. దానికెడమవైపున నారదుడు, లోక పాలకులు, సప్తర్షులు, మునులు అప్సరసలు ఉందురు. వీరి ఎడమవైపున తుంబురు డుండును.

బేరాయామం దశాంశైకం ముఖం తేన ప్రచిరాయతే ॥

బ్రహ్మయామం త్రితాలం స్యాత్ శార్ఙ్గం ఖడ్గం చ తత్సమమ్
చక్రం దండం చ చంద్రార్కౌ హలాబ్జముసలం తథా ॥

ద్వితాలం త్ర్యంగులాయామం శంఖం ప్రోక్తం ద్వితాలభాక్
తథా విద్యాధరాః ప్రోక్తాః కిన్నరాః షోడశాంగులాః ॥

త్రయోదశాంగులా బాలా సషణ్మాత్రం చతుర్యవమ్
గరుడ స్యాయితం ప్రోక్తం మధుకైటభయో స్తథా ॥

సషణ్మాత్రం తు షట్తాలం దేవ్యో బాహుసమోదయాః
నారసింహ శ్చ వారాహ స్తథా దేవ్యాయతాస్వితౌ ॥

స్తనాంత మపి దేవీనా మాయామం క్వచి దిష్యతే
ఏతస్మా దధికం హీనం మానం మానధనక్షయమ్ ॥

నవకోలకవిస్తీర్ణం పద్మం పద్మాసనాసనమ్
చతుర్మాత్రోన్నతి స్తస్య మూలస్య కమలస్య చ ॥

స్వత్రిమాత్రోన్నతం చోర్ధ్వదళం కర్ణిక యాన్వితమ్
మూలాద్దశాంశోన మూర్ధ్వం శతపత్ర ముపర్యధః ॥

మాత్రార్ధమాత్రామాత్రం స్యా న్నాళస్య తు విశాలకమ్
(పార్శ్వబాలస్య పత్రస్య వృద్ధస్య చ తథైవ చ) ॥

నాళస్య దక్షిణే పార్శ్వే బాలపత్రం ప్రశస్యతే
వామే తు వృద్ధపత్రం స్యా న్నాళం తత్ర త్రిధా మతమ్ ॥

పత్రనాళస్య విస్తార మధ్యస్తా దంగుళేన తు
పద్మమధ్యే స్థితి ర్ధాతు స్తదంత ర్ద్వారపద్మకమ్ ॥

ఇతి

బ్రాహ్మీయే చిత్రకర్మశాస్త్రే శయన విధానమ్ ॥

స్వామి విగ్రహము పొడవు పదింటిలో 1 భాగము ముఖము ఉండవలెను. బ్రహ్మదేవుని ఎత్తు 3 తాళము లుండును (36 అంగుళములు). స్వామివారి విల్లు (శార్ఙ్గము) ఖడ్గము కూడా అంతే ఎత్తుండును. చక్రము-దండము (గద)-చంద్రుడు-సూర్యుడు-మాల-అబ్జము-ముసలము-రెండుతాళముల ఎత్తున ఉండును. (27 అంగుళములు). శంఖము గూడ రెండుతాళముల ఎత్తే ఉండును. అట్లే విద్యాధరులు కూడ రెండవతాళములోనే ఉందురు. (24 అంగుళములు). కిన్నరులు 16 అంగుళములలో నుందురు. బాలికలు 13 అంగుళములలో నుందురు. గరుత్మంతుని ఎత్తు స్వామి విగ్రహము ముఖము కొలతకు నాల్గింత లుండును (54 అంగుళములు). అట్లే మధుకైటభులు కూడ 6 తాళముల 4 అంగుళములు. కొందరి మతమున దేవీవిగ్రహము స్వామివారి బాహ్వంతముల వర కుండవలె నందురు. నరసింహ వరాహమూర్తులు దేవీ విగ్రహమునకు సమానమైన ఎత్తులో నుండవలెను, లేక దేవీవిగ్రహము స్తనాంతము వరకైన చేయవచ్చును. ఇంతకన్న ఎక్కువగా గాని తక్కువగా గాని కొలతలో చేసినచో గౌరవమును ధనమును నశించును.

బ్రహ్మదేవుడు కూర్చుండవలసిన పద్మము 18" విస్తీర్ణములో నుండవలెను. పద్మము క్రింది భాగము 4 అంగుళముల ఎత్తులో ఉండును. కర్ణికలో కూడిన పై దళము యొక్క ఎత్తు 3 అంగుళములు. క్రింది దళము పది భాగములలో ఒక భాగము పై దళముయొక్క విశాల మగును. పైన క్రింద మొత్తము నూరు దళము లుండవలెను.

పద్మముయొక్క నాళము లావు 1 అంగుళము. నాళము కుడివైపున లేత ఆకుండును. ఎడమవైపున ముదురా కుండును. ఆ బాలపత్రముయొక్క వెడల్పు ½ అంగుళము. పెద్ద ఆకు వెడల్పు 1 అంగుళము.

మధ్యలో ఉన్న నాళముయొక్క కుడిప్రక్కన చిన్న ఆకులును, ఎడమప్రక్కన పెద్ద ఆకులును ఉండవలెను. పత్రముయొక్క నాళము 1 అంగుళము ఉండవలెను. పద్మము మధ్యలో బ్రహ్మదేవు డుండవలెను. బ్రహ్మదేవుని క్రిందినుండి పద్మము మధ్యలోనుండి ద్వార ముండవలెను.

## ఆసనవిధిః

ఆసనస్య విధిం వక్ష్యే శృణు పంకజవిష్టర
గ్రామమధ్యం తు నవధా సాష్టధా విభజేత్తతః ॥

వ్యతీత్య బ్రాహ్మకం తస్య పశ్చిమే తు సుఖాసనమ్
భోగవృద్ధికరం భోగాసనం స్యాత్ పూర్వదిఙ్ముఖమ్ ॥

నలీనకం సర్వతోభద్రం విమానం చతుర్ముఖమ్
ఉత్తరాస్యం భవేత్ సృష్ట్యాసనం సర్వజనేష్టదమ్ ॥

విష్ణుచ్ఛందం తథా శ్రీప్రతిష్ఠితం పర్వతాకృతి
నంద్యావర్తం మహాపద్మం విమానం ప్రాఙ్ముఖం మతమ్ ॥

ప్రాచ్యాం సృష్ట్యాసనం ప్రత్యఙ్ముఖం సర్వాభివృద్ధిదమ్
భోగాఖ్యం వా భవేద్ భోగవృద్ధిదం పుండరీకజ ॥

నలీనక మథాష్టాంగం సర్వతోభద్ర సాహ్వయమ్
చిత్రశిల్పమహాపద్మం వృత్తభద్రం చతుర్ముఖమ్ ॥

యోగాసనం తథా వాచ్యం ప్రాఙ్ముఖం జ్ఞానవృద్ధిదమ్
దిక్స్వస్తికం మహాపద్మం యోగకాన్తం చతుష్పుటమ్ ॥

పర్వతాకృతికం చాండగృహ ముద్వ్యోమపద్మకమ్
బాహ్యే ప్యేవం సముద్దిష్ట మాసనం పంకజాసన ॥

యోగాసనం స్యా దద్రౌ తు యోగకాంతవిమానకమ్
గ్రామాంతరైకదేశే స్తృష్ట్యాసనం ధ్వజధిష్ణ్యకమ్ ॥

రాష్ట్రసంధౌ భవేత్ సంహారాసనం శత్రుదిఙ్ముఖమ్
వక్ష్యే యోగాసన స్యాహం వినిర్మాణక్రమం క్రమాత్ ॥

పద్మమున కూర్చున్న ఓ బ్రహ్మదేవుడా! ఆసనవిధిని చెప్పెదను వినుము. గ్రామములో నున్న మధ్యప్రదేశమును 8 గా గాని, 9 గా గాని విభజించి మధ్యలోనున్న బ్రహ్మభాగమును విడచి పశ్చిమములో యోగాసనమును చేయవలెను. భోగములను వృద్ధి పరచు భోగాసనమూర్తిని తూర్పుదిక్కుగ చేయవలయును. నళినకము, సర్వతో భద్రము అను దేవాలయ విమానము (స్వామివి ప్రతిష్ఠింపవలసిన) నాలుగు వైపుల ముఖములలో గాని, ఉత్తరపు వైపు ముఖములో గాని ఉండవలెను. సృష్ట్యాసనము అందరి కోర్కెలను దీర్చునది. (ఈ మూర్తిని) ఆ విగ్రహమును విష్ణుచ్ఛందము - శ్రీప్రతిష్ఠితము - పర్వతము - నంద్యావర్తనము - మహా పద్మము - అను విమానములు గల దేవాలయములలో ప్రతిష్ఠింపవలెను. అవి తూర్పుదిక్కు ముఖముతో నుండవలెను. తూర్పున కూర్చుండి పడమరకు తిరిగి ఉన్న సృష్ట్యాసనము సర్వవిధములైన అభివృద్ధులను కలుగజేయును. దీనికి ఈ మూర్తిని నాలుగు ముఖములతో నళినకము, అష్టాంగము, సర్వతోభద్రము, చిత్రశిల్పములు గల మహాపద్మము, వృత్తభద్రము అను నాలుగు రకము లుండును. చతుర్ముఖము అను విమానములు గల దేవళములలో ప్రతిష్ఠింపవలెను. యోగాసనములో నున్న మూర్తి తూర్పునకు తిరిగి ఉన్నచో జ్ఞానవృద్ధికరము. ఇక ఉండదగిన విమానము లేవి అనగా దిక్స్వస్తికము, మహాపద్మము, యోగకాంతము, చతుష్పుటము పర్వతాకృతికము అండగృహము, వ్యోమపద్మకము అనునవి. ఇవి మూర్తిని ప్రతిష్ఠించుటకు అనువైనవి. పర్వతముమీద యోగాసనమూర్తిని ప్రతిష్ఠింపవలసినచో యోగకాంత విమానమున ప్రతిష్ఠింపవలెను. గ్రామమునకు చివర ఒక భాగములో సృష్ట్యాసనమూర్తిని ధ్వజధిష్ణ్యమున ప్రతిష్ఠింపవలెను. రెండు రాష్ట్రి

ము ఎల్లలలో శత్రువుల కెదురుగ సంహారాసనమూర్తిని ప్రతిష్ఠింపవలెను. ఇక యోగాసనమూర్తి నిర్మాణము చెప్పెద వినుము.

## యోగాసనమూర్తిః

సమాసనసమాసీన శ్వేతపద్మాసనోపరి
దక్షిణే దక్షిణౌ పూర్వౌ పూర్వాధరతలౌ కరౌ ॥

పద్మపౌ యోనిమూలస్థౌ కర్తవ్యౌ పరహస్తకౌ
శంఖచక్రధరౌ వామావపరౌ సకటకౌ చ వా ॥

శుక్లరక్తాంబర స్సోపవీతీ సత్వగుణాన్వితః
కుండలీ చాంగదీ హారీ శుక్లవస్త్రోత్తరీయకః ॥

కిరీటీ వా జటామౌళి రీషన్మీలేక్షణాన్వితః
శంఖగోక్షీరకుందాభో హరి ర్యోగాసనే ద్విజ ॥

దక్షిణే ఒదక్షిణే కేశా వాకాశే సూర్యశీతలౌ
తథా సనత్కుమార శ్చ సనక శ్చాంతరిక్షకే ॥

మార్కండేయభృగుభ్యాం మర్చితం యోగాసనం పరమ్
దేవః కేశయుతం మధ్యం దేవ వీ వాధవం భవేత్ ॥

తెల్లని తామరపూవుపై సమమైన ఆసనముతో కూర్చున్నవాడును, కుడి ఎడమ చేతులు ఒక హస్తముపై మఱియొకటి యుంచి ఒడిలో నుంచుకొన్నవాడును, పైకెత్తిన పరహస్తములలో శంఖచక్రములు ధరించినవాడుగను ఉండును. ఆ పరహస్తములు కటక ముద్రతో నుండును. తెల్లని వస్త్రమునుగాని, ఎఱ్ఱని వస్త్రమునుగాని ధరించి యుండును. జందెముండును. సత్వగుణముతో చెవులకు కుండలములు, అంగదములు, హారములు, తెల్లని ఉత్తరీయము ధరించి, కిరీటమును గాని, జటామకుటమును గాని ధరించి కొంచెము మూసిన కన్నులతో శంఖము వలె, ఆవుపాల వలె, మల్లెమొగ్గల వలె, తెల్లనైన శరీరముగల, శ్రీ మహావిష్ణువు కూర్చుండి యుండగా ఆకాశమున సూర్యచంద్రులు సనక

సనత్కుమారులు నుండవలెను. క్రింద భృగుమార్కండేయులు కూర్చుండి సేవచేయుదురు. ఇది ఉత్తమయోగాసనము.

బ్రహ్మశంకరులు లేకుండ యున్నచో మధ్యమయోగాసనమూర్తి - కేవలము విష్ణువు ఒక్కడే యున్నచో అధమయోగాసనమూర్తి.

ఏకవీరం ముముక్షూణాం ప్రయోక్తవ్యం పితామహ ॥

ఓ బ్రహ్మదేవుడా ! ఈ ఏకవీరమూర్తి ముముక్షువులు కొలువతగినది.

## భోగాసనమూర్తిః

సస్యశ్యామనిభో విష్ణు స్సింహాసనసుఖాసనః ॥

శంఖచక్రగదాపద్మధారీ వా శంఖచక్రయుక్
శ్రీభూమిభ్యాం మునిభ్యాం చ బ్రహ్మేశాభ్యాం సమన్వితమ్ ॥

మాయాసంహ్లాదినీభ్యాం చ సనకాభ్యాం చ కిన్నరైః
యక్షాభ్యాం సోమసూర్యాభ్యాం కల్పవృక్షకసంయుతమ్ ॥

నారదాద్యై శ్చ గంధర్వై ర్యుక్తం భోగాసనం మహత్
యక్షకిన్నరనారదాద్యై ర్విహీనం చ మధ్యమమ్ ॥

మహిషీభ్యాం మునిభ్యాం చ యక్షశంకరకై ర్యుతమ్
అన్యై ర్విహీనం హీనం స్యాత్ భోగాసనం పితామహ ॥

సస్యశ్యామమైన రంగుతో విష్ణువు సింహాసనముపై సుఖముగా కూర్చుండి శంఖమును, చక్రమును, గదను, పద్మమును ధరించి శ్రీదేవి, భూదేవి, మునులు, బ్రహ్మ, శివుడు ప్రక్క నుండగా మాయ, సంహ్లాదిని, సనకాదులు, కిన్నరులు, యక్షులు, సూర్యచంద్రులు, కల్పవృక్షము, నారదుడు, గంధర్వులు నిలుచుండి యుండునది ఉత్తమ భోగాసనమూర్తి.

యక్షకిన్నరులు, నారదుడు మాత్రము లేనిది మధ్యమభోగాసనమూర్తి. శ్రీభూదేవులు, మునులు, యక్షులు, శంకరుడు మాత్రముండి తక్కినవారు లేకున్నచో అది అధమమైన భోగాసనమూర్తి.

# సృష్ట్యాసనమూర్తిః

ఆసనోర్ధ్వే భవేత్ పద్మం పద్మమధ్యే సుఖాసనమ్
సర్వాభరణసంయుక్తో బాలసూర్యసమప్రభః ॥

శంఖచక్రగదాపద్మధరః పీతాంబరో హరిః
శ్రీమహీప్రమదే వామే ఒవామే ర్చాపీఠపార్శ్వగే ॥

పద్మయోని శ్చ త్వష్టా చ దక్షిణే స్యా దదక్షిణే
సంకర్షణ స్త థాగ్ని శ్చ భృగు శ్చైవ త థాపరే ॥

వామే ఒవామే రతి ర్వాణీ భవే చ్చామరధారిణీ
సనత్కుమారా వాదిత్యసోమౌ తుంబురునారదౌ ॥

ఏభి స్తు సహితం సృష్ట్యాసన ముత్తమ ముచ్యతే
సోమార్కనారదాద్యై శ్చ హీనం త న్మధ్యమం భవేత్ ॥

ఏభి స్సనత్కుమారేణ సనకేన వి నాధమమ్ ॥

పీఠముపై పద్మము. పద్మము మధ్యలో సుఖాసనముతో కూర్చొంది సర్వాభరణములు ధరించుకొని బాలసూర్యునివంటి తేజస్సుతో శంఖ - చక్ర - గదా-పద్మములను ధరించి పీతాంబరముతో శ్రీహరి శ్రీదేవితో, మహాదేవితో కూడి యుండును. పూజాపీఠమునకు ఇరుప్రక్కల బ్రహ్మదేవుడు, త్వష్టయు కుడిఎడమలలో కూర్చొంది యుందురు. వారికి వెనుక సంకర్షణుడు, అగ్ని, భృగువు నుందురు. ఎడమ కుడివైపుల రతీదేవి. సరస్వతీదేవి వింజామరలు ధరించి నిలబడుదురు. సనత్కుమారుడు, సూర్య చంద్రులు, తుంబురునారదులు నిలబడి ఉందురు. ఇట్లున్నది ఉత్తమసృష్ట్యాసనమూర్తి.

సూర్యచంద్రులు, నారదులు లేనిది మధ్యమసృష్ట్యాసనమూర్తి. వీరేగాక సనత్కుమారులు లేనిది అధమసృష్ట్యాసనమూర్తి.

## సంహారాసనమూర్తిః

ద్విభుజం నీలవర్ణం చ శ్యామవస్త్రం తమోగుణమ్ ॥

ఊర్ధ్వేక్షణం విరూపాంగం పైశాచపదసంశ్రితమ్
సంహారసంజ్ఞకం స్యా దాభిచారవేదికాసనమ్ ॥

సంహారమూర్తి రెండు భుజములతో, నీలవర్ణముతో, నల్లని వస్త్రములతో, తమోగుణయుతుడై, పైకి చూచుచున్నట్లుండును. విరూపముగ నుండును. పైశాచిక పదములో ప్రతిష్ఠింపబడి యుండును. అతనికి అభిచారికమున వేదికాసనమున కుపయోగించునది సంహారక మను పేరుగలది బలిపీఠ మగును.

## కొలతలు

శృణు పద్మాసనాదీనాం ద్వాదశాంశే ద్విభాగికమ్
కంఠం భాగార్ధకం కంపం శేషాంశం పట్టికా భవేత్ ॥

భానుభాగకృతే ద్వారే వేదాంశం మధ్యమాసనమ్
భూతాంశం మధ్యమం ప్రోక్తం రసాంశం ప్రోక్త ముత్తమమ్॥

దేవాంగులేన షట్త్రింశన్మాత్రం స్యా దధమాసనమ్
తస్మాత్ షడంగులాధిక్యం మధ్యం స్యా దాసనం వంతమ్॥

చతుర్ముఖం భవే త్తద్వత్ శ్రేష్ఠం విష్టర తుంగకమ్
ఏకవింశ త్కృతే తస్మి న్నంశకం పాదుకం భవేత్ ॥

పంచభాగం చ జగతీ చాబ్జమూర్ధాంశకం భవేత్
కంఠ మర్ధాంశ మంశేన కుముదాధార మంబుజమ్ ॥

భాగం తు కుముదం త స్యోప ర్యబ్జం వీకభాగకమ్
ఊర్ధ్వాధః పట్టికోర్ధ్వాంశే కంబుకంఠం చతుర్యవమ్ ॥

పద్మ మేకాంశకం శేషు పట్టికా మహతీ భవేత్
కరపాదాః సమానాః స్యుః పాదాంతే సింహధారణమ్ ॥

సింహాసనం స్యాత్ పక్షీంద్రధృతం తత్ గరుడాసనమ్
పీఠోచ్చే భూతభాగే ఒంశం పద్మం శేష మథాసనమ్ ॥

పద్మాసన మిదం పద్మాసనం పూర్వాదికోదయమ్
సహస్రపత్ర మూర్ధ్వాథ శతపత్ర మ థాపి వా ॥

అష్టాంశోనార్ధతుంగేన చోర్ధ్వపద్మదళోదయమ్
మూలనాహోద్దశాంశోన మగ్రనాహం ప్రయోజయేత్ ॥

పద్మపీఠ మిదం ప్రోక్తం మధ్యమే కర్ణికాన్వితమ్
పీఠోత్సేధసమా చాష్టసప్తభాగోనతుంగకా ॥

శ్రేష్ఠా మధ్యా కని ష్ఠేతి (త్రివిధా) విజి రిష్యతే
తత్తుంగే వసుభాంగే ఒంశం నక్రతుండం తదర్ధకమ్ ॥

పద్మం పద్మాసనం (కంపం) శేషం పాదోచ్చ మీరితమ్
ఈషదానతపృష్ఠా సా విజి రిష్టా సృహృష్టిదా ॥

సింహవ్యాళధృతం నక్రముఖోత్కీర్ణమృగాధిపమ్
స్కంధాధిరూఢబాలం త న్నానాచిత్రవిచిత్రితమ్ ॥

పద్మరాగమహానీలేంద్రనీలై ర్మరకతై రపి
ప్రవాళైః స్ఫటికై స్సాధ్యగుటికా ఫలకాదిభిః ॥

నానారత్నయుతైః కంపై ర్విచిత్రై రపి శోభయేత్
అత్యంతమృదుభి శ్శుభ్రై ర్నానావర్ణయుతై రపి ॥

ఉపధానై శ్చ సంయుక్తం శ్రియం పీఠ ముదాహృతమ్
బాహ్యాంతం కర్ణపర్యంతం ముఖపర్యంత మధ్యమమ్ ॥

ఏతాని సప్తసూత్రాణి విష్టరే నిష్ఠితా న్యథ
లంబసూత్రప్రదేశాని స్థానే వక్ష్యా మ్యశేషతః ॥

వామాంఘ్రిం శాయయే త్పీఠే దక్షిణం తు ప్రలంబయేత్
జానూపరిష్ఠా త్కేశాన్త మధ్యం తస్మా త్తు విష్టరమ్ ॥

జాన్వోః పార్శ్వం చ పార్శ్వాభ్యాం బాహుపార్శ్వే తథైవ చ
అపూర్వహస్తమణిబంధయో ర్బాహ్యం చ మధ్యమమ్ ॥

తయోరభ్యంతరం వైతే చోర్ధ్వకాయసమాహితాః
తస్యార్ధం స్కంధయో రగ్రం నాభే స్సూత్రాత్ ద్వయాధికమ్॥

ముఖం సూత్రా త్తు నళకాలంబితాంఘ్రే స్తథైవ చ
కూర్పరం తు ద్విమాత్రం వా త్రిమాత్రం వా తతోఽధికమ్ ॥

సూత్రా న్మధ్యా త్తు స్యాతాం స్యా త్తు తస్మా త్కలోనకమ్
దక్షిణేతరహస్తస్య తలమధ్యం హి సూత్రతః ॥

తస్మాత్ ద్విమాత్రహీనం స్యాత్ సవ్యహస్తతలమధ్యమమ్
బాహుపార్శ్వా న్మణిబంధపార్శ్వం స్యాత్ పరహస్తయోః ॥

నిమ్నం దశాంగులం హిక్కాసూత్రద్వయసతంగకాః
కరాగ్రాంగులయో ర్నాభే స్తయో ర్మధ్యాంగులాగ్రకమ్ ॥

హిక్కాదియోనిమూలాన్త మానేన సమ విధారితమ్
అర్ధాంగులోన్నతం నిమ్నం వసురవ్యంగులాంతరే ॥

తథా నేత్రసమౌ శంఖచక్రౌ కలాంగులాయుతౌ
మేఢ్రాంతా దక్షమధ్యం చ త్రికలాంతర మిష్యతే ॥

(మధ్యా త్తు) వామజాన్వంతం ఊర్ధ్వకాయాంతమానకమ్
(తథా) దక్షిణజాన్వంతం వేదం వా త్ర్యంగులోనకమ్ ॥

అభయం స్వాగతం వాపి సందంశం వరదం తథా
(దక్షిణ శ్చాదక్షిణ శ్చ కర్తవ్యః పూర్వహస్తకః) ॥

(రక్షకం త్వభయ స్తు స్వాగ) తం గతభయం భవేత్
సందంశం పద్మసంయుక్తం జ్ఞానదం శాంతిదం పరమ్ ॥

వరదం వరదం ప్రోక్తం సపద్మం శాంతిదం పరమ్
సవ్యహస్తం కరం సింహకర్ణం వా కటకం తు వా ॥

పల్లవం వా భవే ద్వామం సంగతం విగతం తథా
శంఖచక్రధరౌ కర్తవ్యౌ స్యాతాం పరహస్తకౌ ॥

దక్షిణే ఒదక్షిణే చ శ్రీ ర్భూః పద్మోర్ధ్వకరే భవేత్
స పుష్పం కటకం సవ్యాక్ దేవపార్శ్వాకరం తు వా ॥

వరదం స్వాగతం వాన్య త్తయోః కరికరాసనమ్
ఆసనా చ్చిబుకాస్యాంతం చోర్ధ్వకాయ మధ స్తథా ॥

అనుక్త మేవ ముహ్యాం స్యా ద్విష్టరే పద్మవిష్టర ॥

ఇతి

బ్రాహ్మీయే చిత్రకర్మశాస్త్రే ఆసనవిధిః

సప్త దశోఽధ్యాయః

# పద్మాసనము

వినుము ఆసనము ఎత్తును 12 భాగములు చేయగా కంఠము 8 భాగములు, కంపము 2 భాగములు, పట్టిక 2 భాగములు చేయవలెను. ద్వారముయొక్క ఎత్తు 12 భాగములు చేయగా మధ్యలో ఆసనము 4 భాగము యుండవలయును. ఇక కనీసము 5 భాగము యున్నచో మధ్యమము 6 భాగములు ఉత్తమము అయిన పీఠము. విగ్రహము ననుసరించి దేవాంగుళముల కొలతలో నైనచో 36 అంగుళములు అధమాసనము. 6 అంగుళములు కలసినచో 42 అంగుళములగును. అది మధ్యమాసనము. దానికి 6 . 48 అంగుళములు కలిపిన ఉత్తమాసనము అగును.

ఈ పీఠము మొత్తము ఎత్తును 21 భాగనులు చేయగా అందులో (ఉపానము) పాదుకము 1 భాగము, జగతి 5 భాగములు, అబ్జము ½ భాగము, కంఠము ½ భాగము, కుముదము 1 భాగము, అబ్జము 1 భాగము, ఊర్ధ్వపట్టిక 1 భాగము, అధః పట్టిక 1 భాగము, కంపకంఠము 4 భాగములు, పద్మము 1 భాగము, పట్టిక 4 భాగములు, పాదముల చివర సింహములు లేక సింహముఖములను లేక గరుత్మంతుని ముఖమును కల్పింపవలెను. పీఠము ఎత్తును 5 భాగములుచేసి అందులో 1 భాగము పద్మము చేయవలెను. మిగిలినది ఆసనము. ఇది పద్మాసనముయొక్క లక్షణము.

పద్మాసనము ఎత్తులో సింహాసనము ఎత్తుతో సమానముగా వేయి తామరరేకులుగా అమర్చవలెను. 8 లో 4 భాగములతో ఊర్ధ్వపద్మముయొక్క దళములు కల్పింపవలెను.

పద్మము రేకుయొక్క ఎత్తు మొదటి రేకుకన్న రెండవది 1 అంగుళము తక్కువగా ఉండును. ఇట్లు పద్మముయొక్క రేకులు చేయవలెను.

క్రింద వెడల్పుకన్న చివరి వెడల్పు 1/10 భాగములు తక్కువగా ఉండును. మధ్యలో కర్ణిక ఉండవలెను. అట్లున్నది పద్మపీఠము. పీఠముయొక్క ఎత్తునకు సమానముగా ఉండి 8, 7 భా॥ ఎత్తుతో నున్నది శ్రేష్ఠము, మధ్యమము, కనిష్ఠము అని మూడు విధములుగా ఉండును. ఎత్తులో ½ భాగము మకరముయొక్క తుండము. దానిలో సగము పద్మము (కంపము) మిగిలినది పాదముయొక్క ఎత్తు. వాని పాదములు చివర కొంచెము వంగి ఉండవలెను. చివరలో సింహము, వ్యాళము, మకరము, మృగముల ముఖము లమర్చవలెను. లేక బాలకులు వీపుపై మోయుచున్నట్లు చిత్ర

విచిత్రములతో నిర్మింపవలెను. పద్మరాగము, మహానీలము, మరకతము, పగడము, స్ఫటికము, సాధ్యమూటికాఫలకము మొదలైన అనేకవిధములైన రత్నములతో శోభింప జేయవలెను. దానిపై మిక్కిలి మృదువుగనున్న దిండ్లతో విష్ణువుయొక్క పీఠము ఉండవలెనని చెప్పబడినది.

2 బాహువులవరకు, 2 చెవులవరకు, ముఖమువరకు (ముందు వెనుక మధ్యలో)

విగ్రహమునకు 7 సూత్రములు చెప్పబడినవి. వీనిని పీఠమునుండి కొలుతురు. ఇవి నిలువుగా ఉండును. వీనిని లంబసూత్రము లందురు. వాని ప్రదేశములు చెప్పుచున్నాను.

ఎడమ కాలిని పీఠముపై అడ్డముగా పరుండబెట్టవలెను. కుడి కాలిని క్రిందికి వ్రేలాడదీయవలెను. మోకాటినుండి వెంట్రుకలవరకు అటనుండి పీఠము వరకు. మోకాటి ప్రక్కనుండి రెండవ ప్రక్కవరకు. బాహువుల ప్రక్క నుండియు. ముంజేతి మణిబంధముల వెలుపలకును. వాని లోపలి కొలతల కును సూత్రములను వ్రేలాడదీయవలెను.

ఇవన్నియు ఊర్ధ్వకాయమునకు సమానముగా ఉండును. ఇవి నాభిసూత్రము నుండి రెండింత లుండును. అట్లే ముఖసూత్రమునుండి నలకవరకును ఉండును.

ముందు సూత్రమునుండి కూర్పరము 2 లేక 3 అంశముల దూరము ఉండును. ఎత్తి ఉంచిన పరహస్తముల స్త్రీవక్షః 10 అంగుళముల దూరములో హిక్కా సూత్ర మునకు రెండుపైపుల సమానమైన ఎత్తులో నుండును. చేతి వ్రేళ్ళు, వానిలో మధ్య వ్రేళ్ళ చివరలు హిక్కా మొదలైన వాని కొలతలతో సమముగ ఉండును. నాభినుండి చేయి నడిమి వ్రేలు చివరవరకు హిక్క నుండి యోనిమూలమువరకును సమానమైన దూరములో ఉండును.

నాభి ½" లోతులో నుండును. ఇది సూత్రమునుండి 8 - 12 అంగుళము లుండును. శంఖచక్రములు నేత్ర సూత్రమునకు సమానముగా నుండును. అవి

16 అంగుళములు ఉండును. మేఢ్రాంతమునుండి రెండు పరుండబెట్టిన కాలి గిలకల వరకు 6 అంగుళముల దూరముండును.

మధ్యనుండి ఎడమకాలి ముడుకువరకు ఊర్ధ్వకాయము ఎత్తులో సగము కొలత దూరములో ఉండును. కుడి జాన్వంతము 4 లేక 3 అంగుళముల దూరము ఉండును. 2 లేక 3 అం.లు తక్కువ ఉండును.

అభయమో, స్వాగతమో, సందంశమో, వరదమో కుడి ఎడమ (క్రింది) చేతులలో మాత్రమే ఉండవలెను.

రక్షణకు, స్వాగతమునకు అభయముద్ర లుండవలెను.

సందంశముద్ర పద్మములో కూడి యుండును. అది జ్ఞానమును, శాంతిని కలిగించును.

వరదము వరము లిచ్చును. సపద్మము శాంతిదాయకము. కుడి చేతిలో సింహకర్ణ ముద్రయో, కటకముద్రయో ఉండవలెను. రెండు చేతులలో పల్లవముద్ర సంగత ముగనో విగతముగనో ఉండవలెను. పరహస్తములలో అనగా పైకెత్తిన హస్తములలో శంఖ, చక్రములు ధరించినట్లు చేయవలెను. కుడి ఎడమలలో శ్రీదేవి, భూదేవు లుండ వలయును. వారి చేతులలో పద్మము లుండవలెను. వారి చేతులలో కటకముద్రతో పుష్పము ధరించి నట్లుండవలెను. ఆ చేతులు దేవుని ప్రక్క నున్నట్లుండవలెను. మిగిలిన చేతులు వరదముద్రతో గాని, స్వాగతముద్రతో గాని, గజహస్తములో గాని ఉండవలెను. ఆసనమునుండి చిబుకమువరకు గలది ఊర్ధ్వకాయము. క్రిందిది అధఃకాయము. ఓ బ్రహ్మదేవుడా ! ఇందులో చెప్పని కొలతలు యథాశక్తి ఊహించు కొనవలెను.

బ్రాహ్మీయ చిత్రకర్మ శాస్త్రములో ఆసనవిధి యను

పదునేడవ అధ్యాయము ముగిసినది.

## స్థానకవిధిః

స్థానం చతుర్విధం విద్ధి యోగభోగం తథైవ చ
సృష్టిసంహార మేతేషాం స్థానభేదో విధీయతే ॥

స్థానకవిధి (నిలుచున్న విగ్రహముల పద్ధతి) నాలుగు రకములుగా చెప్పబడు చున్నవి. అవి యేవనగా 1 యోగస్థానకము, 2 భోగస్థానకము, 3 సృష్టిస్థానకము, 4 సంహారస్థానకము అనునవి.

## వాని ఫలములు

బ్రహ్మాంశం నవధా కృతా ఒజాంశే భోగస్థితి ర్భవేత్
భోగవృద్ధ్యై చ స్థితయే స్యాదింద్రే దార్తిగోచరే ॥

సృష్టిస్థానం భవేత్ సర్వప్రాణినా మభివృద్ధయే
పాశిని ధనదే స్యాత్ తు భోగస్థానం సుఖావహమ్ ॥

యోగస్థానం భవేత్ జ్ఞానవృద్ధ్యై కోణచతుష్టయే
ప్రాగ్గేహం పశ్చిమాస్యం స్యా దైశాన్యాం చానలం తథా ॥

ఏవ మంతర్బహిః కార్యం గ్రామాదీనాం పితామహ ॥

గర్భాలయమును 9 భాగములు చేసి మధ్యలో భోగస్థానకమూర్తిని చేయవలెను. ఇది భోగవృద్ధిని, స్థితిని కలుగజేయును. తూర్పుదిక్కునకు సృష్టిస్థానకమూర్తిని ఉంచవలెను. అది సర్వప్రాణులకు అభివృద్ధి కలుగజేయును.

దక్షిణదిక్కునను, వాయవ్యమునను భోగస్థానకమూర్తిని స్థాపించినచో సుఖము కలుగును. యోగస్థానకమూర్తిని నాలుగు కోణములలో ఎచ్చటనైనను స్థాపింపవచ్చును. అది జ్ఞానవృద్ధి కలుగజేయును. దేవలము తూర్పున నున్నచో స్వామి ముఖము పడమటి కుండవలెను. గ్రామమునకు ఈశాన్యముననో, ఆగ్నేయముననో ఈ దేవాలయమును కట్టవలెను.

# దేవాలయ స్థానములు

నదీతీరే తటాకే చ పర్వతే చ వనాంతరే
నదీసంగమతీర్థే చ యోగస్థాన ముదీరితమ్ ॥

సంహారస్థానకం కార్యం రాష్ట్రాంతే శత్రుదిఙ్ముఖమ్
సర్వతోభద్రకాదీని విమానాని పితామహ ॥

బ్రహ్మ న్నీశానపర్యంతం క్రమేణ వినివేశయేత్
యోగకాంతం భవే ద్యోగస్థానకస్య విధీయతే ॥

చతురస్రా వృత్తగేహాః ప్రాసాదాః స్థానకస్య తు

1. యోగస్థానకమూర్తిని నదీతీరముననుగు, తటాకముకడ, పర్వతముమీద, వనమున, నదీసంగమమున, తీర్థములదగ్గర స్థాపింపవలెను.

2. సంహారస్థానకమూర్తిని రాష్ట్రము ఎల్లలమీద శత్రువుల నివాసముల కెదుటి దిక్కులలో స్థాపింపవలెను.

ఓ బ్రహ్మదేవుడా! ఈ దేవతలకు సర్వతోభద్రము మొదలైన విమానములను అన్ని దిక్కులలోను నిర్మింపవచ్చును. యోగస్థానకమూర్తికి యోగకాంత విమానము చేయవలెను. ఈ స్థానకమూర్తులకు చతురశ్రము - వృత్తముగా నున్న రూపములలో ప్రాసాదములను కట్టవచ్చును.

# పరివారము

వక్ష్యే హం పరివారాణాం యోగాదీనాం క్రమాత్ ద్విజ
సనకో హేమకాశౌ సనత్కుమార శ్చ వామకే ॥

దక్షిణే భాస్కర శ్చైవ సోమో వామే తథైవ చ
తథా చామరధారిణ్యౌ శ్రీభూమీ చ త థాపరే ॥

పూజావిష్టరవామే తు మార్కండేయః పరే భృగుః
(భూదేవతా తథాఽ వామే మార్కండేయ శ్చ వామకే) ॥

తత్రైవ దక్షిణౌ వామే బ్రహ్మేశౌ భిత్తిసంశ్రితౌ
లక్ష్మీ (భూ)భ్యాం వినా మధ్యం తాభ్యాం పూజకహీనకమ్॥

అ థాధ మం చ నిర్దిష్టం యోగస్థానం పితామహ

ఇక పరివారము చెప్పబడుచున్నది :

ఆకాశమున కుడివైపున సనకుడు ఎడమవైపున సనత్కుమారుడు
ఆకాశమున కుడివైపున భాస్కరుడు ఎడమవైపున చందురుడు
ఆకాశమున కుడివైపున చామరధారిణులు ఎడమవైపున శ్రీదేవి, భూదేవి

పూజాపీఠము ప్రక్కన భృగు, మార్కండేయులును లేక భూదేవి, మార్కండేయులును.

అల్లే కుడి ఎడమల గోడప్రక్కన బ్రహ్మ - శివులును ఉందురు. అది ఉత్తమ భోగస్థానకమూర్తి.

భూదేవి, లక్ష్మీదేవి లేవిచో మధ్యమము.

వీరును, పూజకులును లేవిరి అధమము.

## యోగస్థానకములో - స్వామి రూపము

సాత్త్వికస్తు గుణో రక్తోత్పలతుల్యేక్షణోఽచ్యుతః
దక్షిణాదక్షిణౌ పూర్వకరా వభయపల్లవౌ ॥

దక్షిణం వరదం వామం సింహకర్ణ మథాపి వా
ఊర్వాశ్రితో వామకరః శంఖచక్రధరౌ పరౌ ॥

సస్యశ్యామనిభః శ్రీమాన్ శంఖచక్రధర స్తథా

స్వామి సాత్వికుడుగను, ఎఱ్ఱ కలువలవంటి కన్నులు కలవాడుగను, కుడి ఎడమ చేతులలో అభయముద్ర, పల్లవముద్రలు ధరించిన వాడుగను, కుడిచేత వర

దము, ఎడమచేత సింహకర్ణ ముద్రను ధరించి గాని, ఎడమచేయి తొడపై నుంచుకొని గాని, పైకెత్తిన చేతులలో శంఖ చక్రముల ధరించి ఉండును. సస్యశ్యామల గాత్రుడైన విష్ణువు శంఖచక్రధారియై యుండును.

## భోగస్థానకములో స్వామి రూపము

భోగస్థానే హరి స్సస్యశ్యామ స్సత్వరజోగుణా
అభయం దక్షిణం హస్తం శేషం పూర్వవ దాచరేత్ ॥

పుండరీకదళాకారం నేత్రం శృంగారసంయుతమ్
లక్ష్మీ క్షోణీ వ్యపో హ్యస్మిన్ మాయాసంహ్లాదినీ తథా ॥

శ్రీ రమ్యామి ర్దక్షిణే వామే (పూజావిష్టకపార్శ్వకే)
మార్కండేయభృగూ స్యాతాం నారద స్తుంబురు స్తథా ॥

కిన్నరా శ్చాపి గంధర్వా స్తథా విద్యాధరా అపి
అప్సరోయక్షసిద్ధా శ్చ విశేషం భోగసంజ్ఞితమ్ ॥

శేషం పూర్వవదుద్దిష్టం (భోగస్థానక ముత్తమమ్)
బ్రహ్మేశాభ్యాం మునిభ్యాం చ దేవీభ్యాం సనకేన తం ॥

తథా సనత్కుమారేణ సూర్యేందుభ్యాం సమన్వితమ్
పూజకాభ్యాం వి నాహీనం భోగస్థానం పితామహ ॥

భోగస్థానకమూర్తిగ ఉన్నపుడు శ్రీ మహావిష్ణువు సస్యశ్యామవర్ణములోనున్న శరీరముతోడను, సత్వముతో గూడిన రజోగుణముతోడను, కుడిచేత అభయమును ధరించి మిగిలిన విశేషము లన్నియు పూర్వము చెప్పబడిన రీతిలోనుండి తామర పూరేకులవంటి కన్నులతోడ శృంగారమూర్తియై ఇరుప్రక్కల శ్రీదేవి, భూదేవియు, మాయా దేవియు, సంహ్లాదినీదేవియు నుందురు. శ్రీదేవియు, భూదేవియు పూజాపీఠము ప్రక్క నను, వారి ప్రక్కన మార్కండేయభృగువులును, వారికి ప్రక్కన నారద, తుంబురు, కిన్నరగంధర్వవిద్యాధరులును, వారికి ప్రక్కన అప్సరసలు, యక్షులు నున్నయది భోగస్థానకములో ఉత్తమమైనమూర్తి. బ్రహ్మ, ఈశ్వరుడు, మునులు, దేవులు,

సనకసనత్కుమారులు, సూర్యచంద్రులు లేనిది మధ్యమభోగస్థానకము. పూజకులైన భృగుమార్కండేయులు లేనిది హీనస్థానకము.

## సృష్టిస్థానకమూర్తి రూపము

ఏతదేవ భవేత్ సర్వం శంఖచక్రగదాబ్జభృత్
హరి దేవంవిశేషః స్యాత్ మధ్యమం చాధమం తథా ॥

సృష్టిస్థాన మితి ఖ్యాతమ్

సృష్టిస్థానకములో గూడ స్వామి శంఖమును, చక్రమును, గదను, పద్మమును ధరించి అట్లే ఉండును.

## సంహారస్థానకమూర్తిః

పైశాచకపదర్శితమ్ ॥

ధూమ్రవర్ణం విరూపాంగం శ్యామవస్త్రం భుజద్వయమ్ ॥
ఊర్ధ్వేక్షణం చ శుష్కాంగం శుష్కవక్త్రం తమోగుణమ్

సంహారస్థాన మిత్యుక్తం సర్వసంహారకారణమ్ ॥

స్వామి పైశాచకపదములో స్థాపింపబడి ఉండును. పొగవంటి రంగుతో, వికృతాకారములో నల్లని వస్త్రము ధరించి రెండుభుజములతో, పైచూపులతో, ఎండిపోయిన శరీరములో, ఎండిన మొగములో తమోగుణాన్వితుడై సర్వులను సంహరింపగల రూపము గలవాడు సంహారస్థానకమూర్తి యనబడును.

శాంతికం పౌష్టికం చైవ జయదం చాభిచారకమ్
యోగాదయః క్రమేణ స్యుః శయనాసనయోః స్థితౌ॥

మధ్యమధ్యం పురోమధ్యం పృష్ఠమధ్యం చ పార్శ్వయోః
మధ్యం చ వక్త్రబాహ్యం చ కర్ణబాహ్యం త థైవ చ॥

బాహుబాహ్యం చ పార్శ్వాభ్యాం సూత్రా ణ్యేకాదశ స్థితా
మూర్ధ్నః కంఠస్య మధ్యే తు వంశదండస్య మధ్యమే ॥

గండమధ్యే ఒక్షయో ర్మధ్యే మధ్యమధ్యం విధీయతే
మధ్యే శిఖామణే ర్మూలే మూర్ధ్నో భ్రూసంగమస్య చ ॥

కుక్షౌ నాభే శ్చ యోనే శ్చ పాదయో శ్చ ప్రలంబయేత్
స్పృశన్ తత్ కుక్షినాసాగ్రం పురోమధ్యం సరోజజ ॥

తస్మా న్మౌల్యగ్రపట్టం తత్ త్రికలా తు భవేత్ తథా
తస్మాత్ పంచాంగులం మౌలిమధ్యమం తు ప్రకీర్తితమ్ ॥

లలాటసూత్రమధ్యం తు కోలకం నయనా కలా
సూత్రా ద్ధనో స్తు మధ్యం స్యాత్ సూత్రా ద్ధిక్కా త్రికోలకా ॥

ఉరోమధ్యం ద్విమాత్రం స్యాత్ హృదయం షడ్యవం భవేత్
నాభిమధ్యం కలార్ధం స్యాత్ యోనిమూలం ద్విమాత్రకమ్॥

మధ్యమోరు స్త్రిమాత్రం స్యాత్ జాన్వంతం కోలకత్రయమ్
సార్ధమష్టాంగులా సూత్రాత్ నళకా తు భవే త్తథా ॥

సూత్రా దంగుష్ఠకాగ్ర స్తు ద్వ్యర్ధమాత్రం ప్రకీర్తితమ్
మధ్యమధ్యా త్పురోమధ్య స్యాంతరం రుద్రమాత్రకమ్ ॥

మౌళిమూర్ధ్ని కృకాటీనాం కకుద్వంశస్పృజో రపి
పార్ష్ణై శ్చ మధ్యమే సూత్రం పృష్ఠమధ్యం ప్రలంబయేత్ ॥

మధ్యే శిఖామణే ర్మూర్ధ్ని కర్ణపాళ్యంతరే తథా
గ్రీవాంసజానుజంఘానాం మధ్యే గుల్ఫస్య మధ్యమే ॥

లంబితవ్యం తథా గండపార్శ్వే స్కంధస్య సీమకే
మండలాంతఃప్రదేశస్య మధ్యే శ్రోణ్యా శ్చ పార్శ్వయోః ॥

తథోరుజానుజంఘానాం మధ్యే చాంగుష్ఠ బాహ్యకే ॥

లంబయేత్ వక్త్రబాహ్యం తత్ కర్ణబాహ్య మథోచ్యతే
కర్ణావర్తౌ చ స్కంధే చ చూచుకాగ్రస్య మధ్యమే ॥

పాదమధ్యే ప్రదేశిన్యా మధ్యమే తు ప్రలంబయేత్
బాహుకూర్పరయోః పార్శ్వే బాహుబాహ్యం ప్రలంబయేత్ ॥

ఏవ మూహ్యం విధాతవ్యం సూత్రం శాస్త్రవిశారదైః
ఉపమాన మహం వక్ష్యే మూర్ధ్వకాయం పురోక్తవత్ ॥

ఊరుమూలాంతరం మాత్రం మధ్యోరుద్వ్యర్ధమాత్రకమ్
జాన్వంతర్భాగ ముద్దిష్టం ప్రపదం తత్ త్రికోణకమ్ ॥

అంగుష్ఠాంతర మష్టాంగుల్యంతరం స్థానకం సమమ్
పీతాంబరం తథా దామాంబరం చిత్రాంబరం తథా ॥

దుకూలాంబర మిత్యేవం చత్వా ర్యే వాంబరాణి చ
పీతాంబరం జపాతుల్యం దామాంబరం సపుష్పకమ్ ॥

లతావిచిత్రచిత్రం స్యా న్నానావర్ణం దుకూలకమ్
ఏభి శ్చతుర్విధై ర్వస్త్రై రలంకుర్వీత శాస్త్రవిత్ ॥

నాభేః పంచాంగులాధస్తాత్ వస్త్రపర్యంత మీరితమ్
గుల్ఫాత్ షడంగులా దూర్ధ్వం వస్త్రా స్యాలంబితం భవేత్ ॥

ఏవ మీదృగ్విధం స్థానం సర్వకర్మసమృద్ధిదమ్ ॥

మధ్యాగ్రం చూచుకోర్ధ్వద్వయసమభిహితం
దక్షిణం వామహస్తం

సాభ్యం తం స్వాగతం చేత్ వరదకరజ పృ
ష్ఠంమతం శ్రోణిదఘ్నమ్
మేఢ్రాంతం హ్యాత్రవామం సగదకర మథో
ర్వాశ్రిత స్యాంగులోనం
కిర్దర్యగ్రం తం హిక్కాసమం మథ కటకా
గ్రం తుజత్రుప్రమాణమ్ ॥

ఇతి

బ్రాహ్మీయే చిత్రకర్మశాస్త్రే స్థానకవిధి

షష్టాదశో ఽధ్యాయః

శయనము ఆసనములలో ఉన్నట్లే స్థానకములో కూడ యోగము భోగము మొద లైనవి ఉన్నవి వానిని శాంతికొఱకు పుష్టికొఱకు జయము కొఱకు అభిచారికము కొఱకు నాడుదురు.

స్థానక విగ్రహములలో 11 సూత్రములు ఉండును. 1. మధ్య మధ్య సూత్రము 2 పురోమధ్య సూత్రము, 3 పృష్ఠమధ్య సూత్రము, 4 పార్శ్వమధ్య సూత్రము, 5 వక్త్రబాహ్య సూత్రము, 6 కర్ణబాహ్య సూత్రములు2, 1 బాహుబాహ్య సూత్రములు 2 పార్శ్వబాహ్య సూత్రములు 2 వెరసి 11 సూత్రములు.

మధ్యమధ్య సూత్రము అనునది గుదమధ్యమునుండి, రెండు కనులమధ్య నుండి నడినెత్తిలోనుండి వచ్చును. తలమధ్య కంఠముమధ్య పృష్ఠమధ్య గుద మధ్యము కన్నుల మధ్యమునుండి మధ్యమధ్య సూత్రము చెప్పబడినది.

శిఖామణి మధ్యనుండి కనుబొమ్మల మధ్యనుండి నాసికాగ్రము కంఠము హిక్కా- హృదయము, కుక్షి, యోని, పాదముల మధ్యనుండి పురోమధ్య సూత్రము వచ్చును.

ఈ పురస్సూత్రము కుక్షినుండి ముక్కు మీదుగా నుండును. పురస్సూత్రమునుండి మౌళ్యగ్రము. 6 అం॥ల దూరములో నుండును. సూత్రమునకు లలాటమునకు మధ్య 2 అం॥ల దూరములో ఉండును. సూత్రమునకును గడ్డమునకును, 2.1. అం॥ల దూర ములో ఉండును. సూత్రమునకు హిక్కకు 6 అం॥ల దూరము ఉండును.

సూత్రమునకు బొమ్మకు మధ్య 2 అం॥లు ఉండును. హృదయము 6 యవల దూరము ఉండును. నాభిమధ్యము 2 అం॥ల 4 యవలు. యోనిమూలము, 2 అం॥ల దూరము ఉండును. సూత్రమునుండి తొడలమధ్యనుండి, 3 అం॥ల దూరము ఉండును. మోకాళ్ళనుండి సూత్రమునకు, 6 అం॥ల దూరము ఉండును. నళక, 8 అం॥ల 4 యవలు ఉండును. కాలి పెద్దవ్రేలు, 2 అం॥ల 4 యవల దూరము ఉండును. మధ్య మధ్య సూత్రమునకు, పురోమధ్య సూత్రమునకు మధ్య దూరము 11 అం॥లు ఉండును.

మౌళి, శిరస్సు, కృకటి, పార్ష్ణులనుండి పృష్ఠమధ్యసూత్రము పోవును.

శిఖామణి మధ్యనుండి కర్ణపాలి మధ్యనుండి కంఠము భుజములు, మోకాళ్ళ ప్రక్కనుండి పార్శ్వసూత్రము పోవును.

శ్రోణి పార్శ్వమునుండి ఊరు జాను జంఘల మధ్యనుండి కాలి బొటనవ్రేలి చివరనుండి వక్షోబాహ్యసూత్రము వ్రేలాడదీయవలెను.

రెండు చెవుల ప్రక్కనుండి స్కంధములమీదనుండి, చూచుకముల మీదనుండి పాద మధ్యమునుండి ప్రదేశినీ మధ్యమునుండి యీ సూత్రము పోవును.

బాహుల కూర్పరముల ప్రక్కనుండి బాహుబాహ్య సూత్రములు వ్రేలాడదీయవలెను. ఇట్లూహించి శాస్త్రము తెలిసినవారు సూత్రములను ఉంచవలెను.

కొలతలు : (ఉపమానములు) చెప్పబడుచున్నవి.

ఊర్ధ్వకాయమును, ముందు చెప్పినట్లే చేయవలెను. ఊరుమూలము అనునది ఊరు మధ్యమునకు రెండింతలు ఉండును. జాన్వంతర్భాగము, 2 రెండు అంగుళముల 4 యవలు, 2 మోకాళ్ళమధ్య దూరము 4 అం॥లు.

రెండు పాదతలముల మధ్య దూరము 6 అం॥లు.

రెండు పెద్ద వ్రేళ్ళమధ్య దూరము 8 అం॥లు.

ఇది సమపాద స్థానకముయొక్క లక్షణము.

స్వామికి అలంకరింపవలసిన వస్త్రములు, 1 పీతాంబరము, 2 దామాంబరము, 3 చిత్రాంబరము, 4 దుకూలాంబరము అని నాలుగురకముల వస్త్రములుండును. పీతాంబరమనునది-జపాపుష్పమువలె నుండును. దామాంబరమనునది పుష్పములతో అలంకరింపబడి ఉండును. దుకూలము అనునది లతలు పుష్పములు కలిగి నానావర్ణములతో నుండును. ఈ నాల్గు విధములైన వస్త్రములతో స్వామిని అలంకరింపవలెను, ఈ శాస్త్రమును, నాభి క్రిందుగా 5 అంగులముల దూరమునుండి కాలి గుల్ఫముమీద 6 అం॥ల వరకు వ్రేలాడుచుండునట్లు అలంకరింపవలెను. ఈ విధముగా అలంకరింపబడిన స్థానక మూర్తి సర్వకర్మ సమృద్ధిని కలుగజేయును. కుడి ఎడమచేతులలో అభయహస్తము నడిమివ్రేలు స్తనచూచుకమువరకు ఉండవలెను.

స్వాగతహస్తము నాభి చివరవరకు ఉండవలెను. వరద హస్తము శ్రోణివరకు ఉండవలెను. గదాహస్తముగాని ఊరు హస్తముగాని అయినచో అవి మేఢ్రాంతమువరకు ఉండవలెను. కర్తరీ హస్తములు అయినచో నవి హిక్కాసూత్రమునకు సమానముగా ఉండవలెను.

కటకహస్తమైనచో జత్రువునకు సమానముగా నుండవలెను.

బ్రాహ్మీయ చిత్రకర్మ శాస్త్రములో స్థానవిధియను

పదునెనిమిదవ అధ్యాయము ముగిసినది.





UTHAMA DASATHALAM
VISHNU MURTHY

ఉత్తమ దశతాళములో చేయదగిన విష్ణుమూర్తి విగ్రహము కొలతలు
(కాశ్యప శిల్పశాస్త్రము ప్రకారము)



No. 1 Sri Vishnumurthi

శ్రీ విష్ణుమూర్తి



No. 3 Sri Bhu Devi
శ్రీ భూదేవి




No. 4 Sri Neela Devi
శ్రీ నీళాదేవి



No. 3 Sri Bhu Devi
శ్రీ భూదేవి



No. 4 Sri Neela Devi

శ్రీ నీలాదేవి



No. 5 Sri Vaikuntha Narayana Murthy
శ్రీ వైకుంఠ నారాయణమూర్తి



No. 6 Sri Simsumara Murthy
శ్రీ శింశుమార మూర్తి



No. 7 Sri Hayagreeva Murthy

శ్రీ హయగ్రీవ మూర్తి



No. 9 Sri Bhuvaraha Murthy
శ్రీ భూవరాహ మూర్తి



No. 10 Sri Dharani Varaha Murthy
శ్రీ దరణీ వరాహమూర్తి



No. 11 Sri Hamsa Murthy
శ్రీ హంసమూర్తి



No. 12 Sri Dadhi Vamana Murthy
శ్రీ దధి వామనమూర్తి



No. 13 Sri Aswatha Narayana Murthy
శ్రీ అశ్వత్థ నారాయణమూర్తి




No. 14. Sri Laxmi Narasimha Swamy
శ్రీ లక్ష్మీ నరసింహస్వామి



No. 15 Sri Kesava Murthi

శ్రీ కేశవమూర్తి



No. 16 Sri Narayana Murthi
శ్రీ నారాయణమూర్తి



No. 17 Sri Mathava Murthi

శ్రీ మాధవమూర్తి



No. 18 Sri Govinda Murthi

శ్రీ గోవిందమూర్తి



No. 19 Sri Vishnu Murthy
శ్రీ విష్ణుమూర్తి



No. 20 Sri Madhusudana Murthy

శ్రీ మధుసూదనమూర్తి



No. 21 Sri Thrivikrama Murthy

శ్రీ త్రివిక్రమమూర్తి




No. 22 Sri Vamana Murthy
శ్రీ వామనమూర్తి



No. 23 Sridhara Murthy
శ్రీధరమూర్తి



No. 24 Sri Hrishikesa Murthy
శ్రీ హృషీకేశమూర్తి



No. 25 Sri Padmanabha Murthy

శ్రీ పద్మనాభమూర్తి



No. 26 Sri Damodara Murthy
శ్రీ దామోదరమూర్తి



No. 27 Sri Sankarshana Murthy

శ్రీ సంకర్షణమూర్తి




No 28 Sri Vasudeva Murthy
శ్రీ వాసుదేవమూర్తి




No. 29 Sri Pradyumna Murthy
శ్రీ ప్రద్యుమ్నమూర్తి



No. 30 Sri Aniruddha Murthy
శ్రీ అనిరుద్ధమూర్తి



32. No Sri Adhokshaja Murthy
శ్రీ అధోక్షజ మూర్తి



33. No Sri Narasimha Murthy
శ్రీ నరసింహ మూర్తి




34. No Sri Achyutha Murthy
శ్రీ అచ్యుతమూర్తి



No. 35 Sri Janardhana Murthy
శ్రీ జనార్దన మూర్తి




No. 36 Sri Upendra Murthy
శ్రీ ఉపేంద్రమూర్తి



37. No Sri Hari Murthy

శ్రీ హరి మూర్తి



38. No Sri Krishna Murthy

శ్రీ కృష్ణమూర్తి




No. 39 Sri Sankarshana Murthy
శ్రీ సంకర్షణమూర్తి



No. 40 Sri Vasudeva Murthy
శ్రీ వాసుదేవ మూర్తి



41. No Sri Pradyumna Murthy
శ్రీ ప్రద్యుమ్న మూర్తి



No 42. Sri Aniruddha Murthy

శ్రీ అనిరుద్ధ మూర్తి



No. 43 Sri Mastyavatara Murthy
శ్రీ మత్స్యావతార మూర్తి



No. 44 Sri Kurmaavatara Murthy
శ్రీ కుర్మావతార మూర్తి




No 45. Sri Narasimha Avatara Murthy
శ్రీ నృసింహావతారమూర్తి




No 46. Sri Vamana Avatara Murthy

శ్రీ వామనావతార మూర్తి



No. 47 Sri Parasurama Avatara Murthy
శ్రీ పరశురామావతారమూర్తి



No. 48 Sri Rama Avatara Murthy

శ్రీ రామావతార మూర్తి



No. 49 Sri Budha

శ్రీ బుద్ధ



No. 50 Sri Kalki Avatara Murtny

శ్రీ కల్క్యవతార మూర్తి



No 51. Sri Krishna avatara Murthy

శ్రీ కృష్ణావతార మూర్తి



No. 52 Sri Laxmi Narayana Murthy
శ్రీ లక్ష్మీనారాయణ మూర్తి




No. 53 Sri Suryanarayana Murthy

శ్రీ సూర్యనారాయణమూర్తి



No. 55 Sri Pancha Vaktra Narasimha Murthy

శ్రీ పంచవక్త్ర నరసింహమూర్తి



No. 56 Sri Prathapa Rama Murthy

శ్రీ ప్రతాపరామ మూర్తి



No. 57 Sri Anantha Murthy'

శ్రీ అనంత మూర్తి



No. 58 Sri Gopala Krishna Murthy
శ్రీ గోపాలకృష్ణ మూర్తి



No. 59 Sri Madana Gopala Murthy
శ్రీ మదనగోపాల మూర్తి



No. 60 Sri Sudarshana Murthy (front Portion)
శ్రీ సుదర్శన మూర్తి (ముందు భాగము)



No. 61 Sri Sudarshara Murthy (Obverse Side)
శ్రీ సుదర్శన మూర్తి (వెనుక భాగము)



**No. 63 Sri Panchamukha Anjaneya Swamy**

(శ్రీ) పంచముఖ ఆంజనేయస్వామి




Sri Garuda Murthy

శ్రీ గరుడ మూర్తి



Sri Hanuman Murthy
శ్రీ హనుమాన్ మూర్తి



Sri Vira Laxmi Devi
శ్రీ వీరలక్ష్మీదేవి

# శ్రీ అష్టలక్ష్మీ ధ్యానములు

## 1. ఆదిలక్ష్మీ ధ్యానము

ద్విభుజాం చ ద్వినేత్రాం చ పద్మాభయవరాంచితామ్
పుష్పమాలాసమాయుక్తాం ప్రభామండలమండితామ్ ॥

సర్వలక్షణసంపన్నాం సర్వాభరణభూషితామ్
(సుందరీ) వందేహ మాదిలక్ష్మీం (చ) తా
మష్టమంగళసంయుతామ్ ॥

ఆదిలక్ష్మీదేవి రెండు చేతులతో, రెండు కన్నులతో, కాంతిపుంజములతో, పూల దండలతో, ఉత్తమములగు సర్వలక్షణములతో, సర్వాభరణములతో ఉండును.

కుడిచేతియందు పద్మముతో కూడిన అభయముద్రను, ఎడమచేతియందు వర ముద్రను ధరించును.

అష్టమంగళములతో కూడిన ఇట్టి ఆదిలక్ష్మీదేవిని నేను నమస్కరింతును.

## 2. సంతానలక్ష్మీ ధ్యానము

జటామకుటసంయుక్తాం స్థిరాసనసమంచితామ్
అభయం ఖడ్గఖేటం చ వరదం చ చతుర్భుజైః ॥

కంచుకచ్ఛన్నవీరై శ్చ మౌక్తికాభరణోజ్జ్వలైః
దీపచామరహస్తై శ్చ (ధారీభిః) పార్శ్వద్వయవిరాజితామ్॥

శ్రీ సంతాన లక్ష్మీదేవి నాల్గు చేతులతో, జటామకుటముతో, స్థిరమైన ఆసనముతో, ముత్యాలహారములను ధరించిన, దీపములను చామరములను హస్తములయందు కలిగిన, కవచములను ధరించిన వీరులు రెండువైపుల ప్రకాశించగా నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1. ఖడ్గమును 2. అట్లే ఎడమవైపున వరముద్రను 1. ఖేటమును 2. కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును.

## 3. శ్రీ గజలక్ష్మీ ధ్యానము

లాక్షారససవర్ణాభాం పద్మద్వయవిరాజితామ్
అభయం వరదం చైవ కిరీటమకుటాన్వితామ్ ॥

పద్మాసనస్థితాం చైవ వ్యాకీర్ణకుంతలాన్వితామ్
సవ్యదక్షిణపార్శ్వే చ గజతుండాభిషేచనమ్ ॥

శ్రీ గజలక్ష్మీదేవి లాక్షారసము వలె ఎఱ్ఱనైన శరీరచ్ఛాయలతో, ప్రకాశించు కిరీటముతో, నాల్గు చేతులతో వ్యాపించిన కుంతలములతో, (వెంట్రుకలతో) పద్మాసనమునం దుండును.

కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1. పద్మమును 2. అట్లే ఎడమవైపున వరముద్రను 1. పద్మమును 2. కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును.

ఆమె కుడిఎడమల ఉభయపార్శ్వములయందు రెండు ఏనుగులు తమ తొండముతో నీటిని పోయుచు ఆమెను అభిషేకించు చుండును.

## 4. శ్రీ ధనలక్ష్మీ ధ్యానము

కిరీటమకుటాయుక్తాం స్వర్ణాభాం చ సుయౌవనామ్
చక్రం బాణం చ తాంబూలం దక్షిణేన కరేణ తు ॥

శంఖం చైవ ధనుః కుండీం దధానాం
(ధారయేత్) కరవామకే
స్తనకంచుకసంయుక్తాం (సర్వాభరణ) వందే
భూషావిభూషితామ్ ॥

శ్రీ ధనలక్ష్మీదేవి బంగారువంటి పచ్చని శరీరకాంతులతో, చక్కని యౌవనముతో, చక్కని కిరీటముతో, ఆరు చేతులతో, స్తనములను కప్పిన కంచుకముతో, అన్ని అవయవములయందు అలంకరింపబడిన భూషణములతో, ఉండును.

కుడివైపున క్రిందినుండి పైకి చక్రమును 1, బాణమును 2, తాంబూలమును 3, అట్లే ఎడమవైపున శంఖమును 1, వింటిని 2, కమండలమును 3, కుడిఎడమల ఆరు చేతులతో ధరించును.

ఇట్టి రూపముతో నున్న ధనలక్ష్మీదేవిని నేను నమస్కరించుచున్నాను.

## 5. శ్రీ ధాన్యలక్ష్మి ధ్యానము

అభయం వరదం చైవ కిరీటమకుటాంచితామ్
అంబుజం చేక్షుశాలీం చ ద్రోణకాం కదలీఫలైః ॥

అంగదం దక్ష వామే తు శ్వేతరూపాం చ ధారిణీమ్ ॥
కృపామూర్తిం గజారూఢాం (సర్వా) వందేఽ
లంకారసంయుతామ్ ॥

తెల్లని శరీరచ్ఛాయలతో, ప్రకాశించుచున్న కిరీటముతో, కుడిఎడమ చేతులయందు అందగడియములతో, ఆరు చేతులతో, కృపతో నిండిన రూపముతో, గజవాహనముతో, సర్వాలంకారములతో, శ్రీ ధాన్యలక్ష్మి ఉండును.

కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, అరటిపండ్ల పాత్రమును 2, వరికంకిని 3, అట్లే ఎడమవైపున వరముద్రను 1, చెఱకుగడను 2, పద్మమును 3, కుడిఎడమల ఆరు చేతులతో, ధరించును.

ఇట్టి రూపముతో నున్న శ్రీ ధాన్యలక్ష్మీదేవిని నేను నమస్కరించుచున్నాను.

## 6. శ్రీ విజయలక్ష్మి ధ్యానము

అబ్జహస్తయుతాం లక్ష్మీం సింహాసనసుసంస్థితామ్
(స్వర్ణాభాం చ ద్వినేత్రాం చ ఏకవక్త్రాం భుజాష్టకామ్)
స్వర్ణాభా మేక వక్త్రాం చ ద్వినేత్రాం చ భుజాష్టకామ్ ॥

ఖడ్గం పాశం చ చక్రం చాభయం (చ) వై సవ్యహస్తకే
ఖేటకం చాంకుశం శంఖం వరదం వామహస్తకే ॥

హంసవాహన ఆసీనాం పుష్పమాలాభి రావృతామ్ ॥

శ్రీ విజయలక్ష్మీదేవి బంగారువంటి పచ్చని శరీరకాంతులతో, ఎనిమిది చేతులతో, పద్మములవంటి హస్తములతో, రెండు కన్నులతో, ఒక్క మొగముతో, పూలదండలతో, హంసవాహనమునందు స్థిరముగ కూర్చుండి యుండును.

కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, ఖడ్గమును 2, పాశమును 3, చక్రమును 4, అట్లే ఎడమవైపున వరదముద్రను 1, ఖేటమును 2, అంకుశమును 4, శంఖమును 4, కుడిఎడమల ఎనిమిది చేతులతో, ధరించును.

ఇట్టి రూపములో నున్న శ్రీ విజయలక్ష్మీదేవిని నమస్కరింతును.

## 7. శ్రీ ఐశ్వర్యలక్ష్మీ ధ్యానము

(ఆయుధములు లేవు గనుక వ్యాఖ్యానించుట లేదు)

## 8. శ్రీ వీరలక్ష్మీ ధ్యానము

అష్టబాహుయుతాం లక్ష్మీం సింహాసనసుసంస్థితామ్
అభయం వరదం చైవ హస్తద్వంద్వే చ ధారిణీమ్ ॥

చక్రం బాణం చ శూలం చ ధనుః
శంఖం కపాలకమ్
సర్వలక్షణసంపన్నాం ధ్యాయేత్ కాంచన
(తప్తకాంచన) సన్నిభామ్ ॥

శ్రీ వీరలక్ష్మీదేవి బంగారువలె పచ్చని శరీరకాంతులతో, ఎనిమిది చేతులతో, సర్వశుభలక్షణములతో, సింహాసనమునం దుండును.

కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, శూలమును 2, బాణమును 3, చక్రమును 4, అట్లే ఎడమవైపున వరముద్రను 1, కపాలమును 2, వింటిని 3, శంఖమును 4, కుడిఎడమల ఎనిమిది చేతులతో, ధరించును.

ఇట్టి రూపములో నున్న శ్రీ వీరలక్ష్మిని ధ్యానింపవలెను.




No. 1 Sri Adilakshmi Devi

శ్రీ ఆదిలక్ష్మిదేవి



**No. 3 Sri Gajalakshmi Devi**

శ్రీ గజలక్ష్మీదేవి




No. 4 Sri Dhana Lakshmi Devi
శ్రీ ధనలక్ష్మీదేవి




No. 5 Sri Dhanya Lakshmi Devi

శ్రీ ధాన్యలక్ష్మిదేవి




No. 6 Sri Vijaya Lakshmi Devi

శ్రీ విజయలక్ష్మీదేవి




No. 7 Aisvarya Lakshmi Devi

శ్రీ ఐశ్వర్యలక్ష్మీదేవి




No. 8 Sri Veeralakshmi Devi

శ్రీ వీరలక్ష్మీదేవి



Sri Balarama Avatara Murthy
శ్రీ బలరామ అవతారమూర్తి



Sri Sita Laxmana Sahita Srirama Chandra Murthy
శ్రీ సీతాలక్ష్మణ సమేత శ్రీరామచంద్రమూర్తి




Sri Vishvaksena Murthy
శ్రీ విష్వక్సేన మూర్తి




Sri Vishnu Dwara Palaka
శ్రీ విష్ణు ద్వారపాలకుడు



Sri Vishnu Dwara Palaka
శ్రీ విష్ణు ద్వారపాలకుడు



Sri Rama Murthy
శ్రీ రామమూర్తి



Bhadrachala Sri Sitarama Chandra Murthy
శ్రీ భద్రాచలం సీతారామచంద్ర మూర్తి

## 9. శ్రీ కామాక్షీదేవీ ధ్యానము

కంచన కాంచీనిలయం కరధృతకోదండబాణసృణిపాశమ్
కఠినస్తనభరనమ్రం కైవల్యానందకంద మవలంబే ॥

కఠినములగు స్తనముల భారముచేత కొంచెము వంగిన శరీరముగల ముల్లోకము లకు తల్లియగు శ్రీ కామాక్షీదేవి కాంచీపురమునందు నివసించుచుండును.

ఈ తల్లికి నాల్గుచేతులు. కుడివైపున క్రిందినుండి పైకి వరుసన బాణమును 1, అంకుశమును 1, అల్లే ఎడమవైపున వింటిని 1, పాశమును 2, కుడియెడమల నాల్గు చేతులతో ధరించుచుండును.

ఇట్టి రూపముతో మోక్షానందమునకు నివాసమగు (బ్రహ్మానందమును ఇచ్చెడి) శ్రీ కామాక్షీదేవిని ఆశ్రయించుచున్నాను.

## శ్రీ శక్తిత్రయ ధ్యానములు

(ఉత్తరకారణాగమము)

అ థాతః స్సంప్రవక్ష్యామి సర్వలోకహితాయ చ
సర్వజ్ఞానప్రదం చైవ శక్తిత్రయ మి హోచ్యతే ॥

ఎల్లలోకములకు మేలును చేకూర్చుటకై సర్వజ్ఞానప్రదమైన శక్తిత్రయము యొక్క అనగా యోగశక్తి, భోగశక్తి, వీరశక్తి అను ముగ్గురు శక్తులయొక్క రూప ధ్యానములను చెప్పెదను వినుము.

యోగం పీఠసమాయుక్తం భోగం వామసమన్వితమ్
వీరం స్వతంత్ర మిత్యుక్తం శక్తిత్రయ మి హోచ్యతే ॥

శక్తిత్రయమునందు మొదటిదగు యోగశక్తి పీఠముతోకూడినదై యుండును. రెండవది యగు భోగశక్తి పరమశివుని వామభాగమున నుండును. మూడవదియగు వీరశక్తి స్వతంత్రురాలై వేఱుగ ఒక్కరితయే యుండును.

## 10. శ్రీ యోగశక్తి

మూలలింగసమీపే తు వామభాగే ఒర్ధమండపే

శ్రీ యోగశక్తి పరమశివుని రూపమగు లింగమునకు పీఠరూపమై అనగా పాన వట్టమై, శ్రీమన్మహాపరమేశ్వరునకు నివాసయోగ్యమగు పీఠమైయుండును. ఈమె మూల లింగమునకు ఆధారమై లేదా ఎడమవైపున అర్ధమంటపమునం దుండును. ఈమెకు వేఱుగ ధ్యానము లేదు.

## 11. శ్రీ భోగశక్తి

ఆసనం స్థానకం ప్రోక్తం ద్వివిధా భోగశక్తికా ॥

భోగశక్తి ఆసనము (కూర్చుండిన విగ్రహము), స్థానకము (నిలుచుండిన విగ్రహము) అని ద్వివిధముగా నుండును.

ఈ రెండు దశలయందును ఆమె పరమశివుని వామభాగమునందే యుండును. కనుకనే భోగశక్తి యనుచున్నది.

## 12. శ్రీ ఆసనభోగశక్తి ధ్యానమం

ద్వ్యక్షాం చ ద్విభుజాం శాంతాం సరత్నమకుటోజ్జ్వలామ్
వామం భుజం నిపే శ్యాథ చాసనోపరి విన్యసేత్ ॥

లంబితం వామపాదం తు సవ్యాంఘ్రిం కుంచితం పదమ్
సవ్యం కటకహస్తం స్యా దథ వోత్పలధారిణమ్
సర్వావయవసంపూర్ణాం సర్వలక్షణసంయుతామ్ ॥

ఆసనభోగశక్తి రెండుకన్నులతో, రెండు చేతులతో, వివిధములగు రత్నములు పొదుగుటచే ప్రకాశించుచున్న కిరీటముతో పీఠమునందు కూర్చుండి యుండును.

ఆమె ఎడమ భుజము పీఠమునకు ఆనుకొని యుండవలెను. కుడిచేతితో కటక ముద్రను గాని, కలువపువ్వును గాని ధరించి యుండును. ఎడమచేయి లంబితమై యుండును.

ఆమె ఎడమకాలు చాపబడినదై, కుడికాలు కుంచితమై (ముడుపబడినదై) యుండును.

ఈ విధముగా ఆసనభోగశక్తి రూపము అన్ని అవయవములతో, అన్ని లక్షణములతో, సంపూర్ణమై యుండును.

## 13. శ్రీ స్థానక భోగశక్తి ధ్యానమ్

చతుర్భుజం త్రిణేత్రం చ సరత్నమకుటాన్వితమ్
పద్మాక్షమాలాసంయుక్త మభయం వరదం తథా ॥

శిర శ్చక్రసమాయుక్తం చిత్రవస్త్రైః సమన్వితమ్
పుచ్ఛత్రయం పార్శ్వయో శ్చ కటిదేశే ద్విపార్శ్వయోః ॥

చూళికాకార మాబధ్య త్రిపత్రాకృతి మధ్యమే
కర్ణపత్రసమాయుక్తం కర్ణపత్రసమన్వితమ్ ॥

తాలుమూలాచ్ఛదం దీర్ఘ మంసాగ్రే లంబితం తథా
శిర శ్చక్రసమాయుక్తం భద్రపీఠోపరిస్థితమ్ ॥

మూలబేర మితి ప్రోక్తం యద్వా వక్ష్యే షడానన ॥

ఓషణ్ముఖుడా ! (కుమారా :) స్థానక (నిలిచిఉన్న) భోగశక్తి రూపమును చెప్పుచున్నాను వినుము.

ఆ స్థానకభోగశక్తి వెనుక భాగమున చక్రముతో కూడిన శిరముతో, వివిధములగు వర్ణములుగల వస్త్రములతో, నడుమునకు రెండువైపుల ముందుభాగమునను మూడు మడతలతో (వేలాడు కుచ్చిళ్ళతో (అంచులతో) చెక్కిళ్ళ పైభాగమునుండి (తాలు మూలములనుండి) భుజాగ్రము వరకు (వేలాడు దీర్ఘములగు చెవుల పోగులతో, భద్ర పీఠమునందు నాల్గు చేతులతో నిలిచి యుండును.

ఆమె కుడివైపున (క్రిందినుండి పైకి అభయముద్రను 1, జపమాలను 2, అట్లే ఎడమవైపున వరముద్రను 1. పద్మమును 2, కుడిఎడమల నాల్గు చేతులం తో ధరించి యుండును.

ఇట్టి స్థానకభోగశక్తి విగ్రహమును మూలబేర మని (ప్రధానమైన దని) చెప్పు చున్నాను. నేను మఱియొక విధముగా చెప్పునంతవఱకు ఈ భోగశక్తి విగ్రహలక్షణము ఈ విధముగానే ఉండవలెను.

## 14. శ్రీ వీరశక్తి ధ్యానము

భోగశక్తిః పురా ప్రోక్తా వీరశక్తి రి హోచ్యతే
యద్వా పద్మాక్షమాలాభ్యా మూరుహస్తం త థాభయమ్ ॥
సమాంగం సమపాదం చ పూర్వవద్భూషణాకృతిః ॥

ఓ కుమారా! భోగశక్తిని గూర్చి చెప్పితిని. ఇప్పుడు వీరశక్తి లక్షణమును చెప్పుచున్నాను వినుము.

ఈ వీరశక్తియును స్థానకమూర్తియే. ఈమెయును స్థానకభోగశక్తి వలె వెనుక భాగమున చక్రముతో కూడిన శిరముతో, వివిధవర్ణములు గల వస్త్రములతో, నడుమునకు రెండువైపుల, ముందుభాగమునను మూడు మడతలతో వ్రేలాడు కుచ్చిళ్ళతో (అంచులతో), చెక్కిళ్ళపై భాగమునుండి (శాలు మూలమునుండి) భుజాగ్రమువఱకు వ్రేలాడు దీర్ఘములగు చెవులపోగులతో, భద్రపీఠమునందు నాల్గు చేతులలో నిలిచి యుండును.

సమభంగమగు శరీరముతో సమపాదములతో నీమె యుండును.

కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, జపమాలను 2, అట్లే ఎడమ వైపున ఊరుహస్తమును 1, పద్మమును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును.

ఈ ఆయుధభేదము తప్ప యెట్టి భేదము లేదు.

## 15. శ్రీ గౌరీ ధ్యానము

గౌర్యా శ్చ లక్షణం వక్ష్యే ద్విభుజా చ ద్వినేత్రకా
కిరీటమకుటోపేతా స్తనే పీనా సుయౌవనా ॥

కటకం సవ్యహస్తే చ లంబహస్తం తు వామకే
కించి ద్వామాంఘ్రి దాయస్థపద్మపీఠోపరిస్థితమ్ ॥
సర్వావయవసంపూర్ణం గౌరీలక్షణ ముచ్యతే ॥

శ్రీ గౌరీదేవి రెండు కన్నులతో, రెండు చేతులతో, మణుల పొదిగిన బంగరు కిరీటముతో, సమపీనోన్నతమగు స్తనమండలముతో, మంచి యౌవనముతో, సుందరములగు సర్వావయవములతో, పద్మపీఠమునందు ఎడమపాదమును కొలదిగ వంచి స్థిరమగు కుడికాలితో నుండును.

ఈ దేవి కుడిచేతితో కటకముద్రను 1, చాపబడిన ఎడమచేతిని 2, ధరించియుండును.

వీతే శక్తిచతుర్భేదా మూలబేరస్య శక్తయః ॥

పైన వివరింపబడిన యోగశక్తి, భోగశక్తి, వీరశక్తి, గౌరి యను నీ నలుగురు మూలవిగ్రహములగా నుండదగిన శక్తులు. కావున శక్తులయందు ఇవి నాలుగు భేదములు.

## 16. శ్రీ వల్లీ ధ్యానము

శ్యామాం పంకజధారిణీం మణిలస
త్తాటంకకర్ణోజ్జ్వలాం
సవ్యే లంబకరాం కిరీటమకుటాం
తుంగస్తనీకంచుకామ్
వన్యాం వ్యాధనృపాన్వయాం శరవణో
ద్భూతస్య సవ్యే స్థితాం
గుంజామాల్యధరాం ప్రవాళవదనాం
వల్లీశ్వరీం తాం భజే ॥

శ్రీ వల్లీదేవి నల్లని శరీరచ్ఛాయలతో, మణులచేత ప్రకాశించు బంగరు చెవుల పోగులతో, రత్నములతో నొప్పారు పసిడికిరీటముతో, లావైన స్తనములను కప్పుచున్న పట్టురవికతో (కంచుకము), పవడమువలె నెఱ్ఱనగు మొగముతో, రెండుచేతులతో, త్రిభంగమగు శరీరముతో, గురివిందగింజల దండలతో నుండును.

ఈ దేవి కుడిచేయి లంబితముగా నుండును. ఎడమచేతితో కలువపువ్వును ధరించును.

ఇట్టి రూపముతో శ్రీ కుమారస్వామి కుడిభాగమునందు నివసించుచున్న కిరాత రాజవంశమునందు పుట్టి, కిరాతస్త్రీరూపముతో నున్న శ్రీ వల్లీదేవిని నేను భజించుచున్నాను.

## 17. శ్రీ దేవసేనా ధ్యానము

పీతా ముత్పలధారిణీం శచిసుతాం
దివ్యాంబరాలంకృతాం
వామే లంబకరాం మహేంద్రతనయాం
మందారమాల్యోజ్జ్వలామ్
దేవై రర్చితపాదుకాం శశిముఖీం
సేనానివామే స్థితాం
దివ్యాం భూషణభూషితాం ద్వినయనాం
సేనాం త్రిభంగీం భజే ॥

శ్రీ దేవసేనాదేవి బంగారువంటి పసుపుపచ్చని శరీరకాంతులలో, అలంకరించుకొనబడిన దివ్యాంబరములతో, రెండు కన్నులతో, రెండు చేతులతో, కల్పవృక్షముల హారములతో, వివిధములగు మణిమయ భూషణములతో, త్రిభంగమగు (మూడు వంపులు గల) శరీరముతో, శ్రీ కుమారస్వామి యెడమ భాగమున నుండును.

ఈమె కుడిచేతితో కలువపువ్వును ధరించును. యెడమచేయి లంబకరమై యుండును.

శచీదేవికి, దేవేంద్రునకు ముద్దుల బిడ్డయై, దేవత లెల్లరిచేత పూజింపబడుచు ఇట్టి రూపముతో నున్న శ్రీదేవసేనాదేవిని నేను భజించుచున్నాను.

## 18. శ్రీ మనోన్మణీ ధ్యానము

ఇందునిభవేటకరవహ్నినయనం స్యాత్
పంకజవరాభయజపాక్షసరయుక్తమ్
అంగహిమభూషణవిచిత్రనయనం స్యాత్
తుంగమకుటోజ్జ్వలమనోన్మనిసురూపమ్ ॥

శ్రీ మనోన్మణీదేవి రూపము తెల్లని శరీరచ్ఛాయలతో. మూడు కన్నులతో, నాల్గు చేతులతో, శరీరమునం దలంకరింపబడిన ముత్యముల దండలతో, మణులు పొదిగిన ఎత్తైన జటామకుటముతో నుండును.

ఈమె కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, జపమాలను 2, అట్లే ఎడమవైపున వరముద్రను 1, పద్మమును 2, కుడియెడమల నాల్గు చేతులతో ధరించును.

త్రినేత్ర యగుటవలన విచిత్రనయనములు గల ఇట్టి రూపముతో నున్న శ్రీ మనోన్మణీదేవిని నేను ధ్యానించుచున్నాను.

## 19. శ్రీ శీతలాదేవీ ధ్యానము

అరుణమణినిభాంగాం చాగ్నికేశాం కరండం
ధృతడమరుకశూలాం ఖడ్గహస్తాం కపాలమ్
అనలనయనయుక్తాం పద్మపీఠా దధానా
మఖిలభువనధాత్రీం శీతలాదేవి మీడే ॥

శ్రీ శీతలాదేవి పద్మరాగమణులవలె నెఱ్ఱని శరీరచ్ఛాయలతో, అగ్నివలె ప్రకాశించు కేశములతో, మూడు కన్నులతో, నాల్గు చేతులతో, కరండమకుటముతో పద్మపీఠమునం దుండును.

కుడివైపున క్రిందినుండి పైకి ఖడ్గమును 1, డమరుకమును 2, అట్లే యెడమవైపున కపాలమును 1. శూలమును 2, కుడియెడమల నాల్గు చేతులతో ధరించును.

ఇట్టి రూపముతో సమస్త భువనములను పరిరక్షించుచున్న శ్రీ శీతలాదేవిని ప్రార్థించుచున్నాను.

## 20. శ్రీ పూర్ణాదేవీ ధ్యానము

పూర్ణాం వై కనకాభాసాం ద్వినేత్రాం ద్విభుజాన్వితామ్
దక్షిణే లంబితం పాదం వామపాదం సుఖాసనమ్
పుష్పం వామకరే చైవ వరదం దక్షిణే కరే
శ్యామవస్త్రధరా మీడే కర్ణే శంకరకుండలామ్ ॥

శ్రీ పూర్ణాదేవి పదారువన్నె మేలిమి బంగరువలె పచ్చని శరీరచ్ఛాయలతో, రెండు కన్నులతో, బంగారు మకరకుండలములతో (చెవిపోగులతో) నల్లని వస్త్రములను ధరించి యుండును.

ఈమె కుడిచేతియందు వరదముద్రను 1. ఎడమ చేతియందు పుష్పములను 2. ధరించును.

ఈమె కుడికాలు వ్రేలాడుచు ఎడమకాలు సుఖముగ నాసనమునం దుండును.

ఇట్టి రూపముతో నున్న శ్రీ పూర్ణాదేవిని నేను ప్రార్థింతును.

## 21. శ్రీ పుష్కళాదేవీ ధ్యానము

శ్యామదేహం ద్వినేత్రాం చ ద్విభుజాం చ ద్విపాదకామ్
కటకం వామపాణౌ చ పుష్పం వై దక్షిణే కరే ॥

లంబితం వామపాదం తు దక్షిణం చ సుఖాసనమ్
సింహకుండలకర్ణాం చ కనకాంబరధారిణీమ్ ॥

శ్రీ పుష్కళాదేవి నల్లని శరీరచ్ఛాయలతో రెండు కన్నులతో, రెండు చేతులతో, రెండు పాదములతో, చెవులయందు సింహములను చెక్కిన బంగరు కుండలములలో మేలిమి వంటి పచ్చని వస్త్రములను ధరించి యుండును.

ఈమె కుడిచేతియందు పుష్పము 1. ఎడమచేతియందు కటకముద్ర 2. ఉండును.

ఈమె ఎడమకాలు వ్రేలాడు చుండును. కుడికాలు సుఖముగ నాసనమునం దుండును.

ఇట్టి రూపములో నున్న శ్రీ పుష్కళాదేవిని భజింతును.

## 22. శ్రీ విష్ణుదుర్గాదేవీ ధ్యానము

శంఖచక్రసహితద్వయహస్తా
మూరుబాహు ముభయం శుచినేత్రామ్
అర్జునాం చ మహిషస్య శిరస్థాం
నౌమి సావ్యవరదాం హరిదుర్గామ్ ॥

శ్రీ విష్ణుదుర్గాదేవి తెల్లని శరీరచ్ఛాయలతో, మూడు కన్నులతో, ప్రసన్నమగు మొగముతో, నాల్గు చేతులతో, మహిషముయొక్క ఎమునం దుండును.

ఈమె కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, చక్రమును 2, అట్లే ఎడమవైపున ఊరు హస్తమును (నడుమునందు చేతిని) 1, శంఖమును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును.

ఇట్టి రూపముతో నున్న శ్రీ విష్ణుదుర్గాదేవిని నమస్కరించును.

## 23. శ్రీ త్రిపురసుందరీదేవీ ధ్యానము

ఇక్షుకోదండపుష్పేషుపాశాంకుశకరాన్వితామ్
ఉద్యత్సూర్యనిభాం దేవీం వందే త్రిపురసుందరీమ్ ॥

శ్రీ త్రిపురసుందరీదేవి ఉదయించు సూర్యునివలె నెఱ్ఱనగు శరీరచ్ఛాయలతో, నాల్గు చేతులతో, నుండును.

కుడివైపున క్రిందినుండి పైకి పుష్పబాణములను 1, అంకుశమును 2, అట్లే ఎడమవైపున చెఱకువింటిని 4, పాశమును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును.

ఇట్టి రూపముతో నున్న శ్రీ త్రిపురసుందరీదేవికి నమస్కరించుచున్నాను.

## 24. శ్రీ గంగాదేవీ ధ్యానము

పాశాంకుశవరాభీతీ ర్దధానా మరుణప్రభామ్
గ్రాహారూఢా మహం వందే గంగాం సర్వసరిద్వరామ్ ॥

శ్రీ గంగాదేవి ఎఱ్ఱని శరీరచ్ఛాయలతో, మొసలి వాహనముతో, నాల్గు చేతులతో నుండును.

ఈమె కుడివైపున క్రిందినుండి పైకి అభయముద్రను 1, అంకుశమును 2, అట్లే ఎడమవైపున వరదముద్రను 1, పాశమును 2, కుడియెడమల నాల్గు చేతులతో ధరించును.

ఇట్టి రూపముతో ఎల్లనదులయందు శ్రేష్ఠురాలగు శ్రీ గంగాదేవిని నమస్కరించు చున్నాను.

## 25. శ్రీ యమునాదేవీ ధ్యానము

కృష్ణకచ్ఛప మారూఢాం కంఠనీలోత్పలస్రజమ్
వరాభయకరాం వందే కాలిందీం కాలవిగ్రహామ్ ॥

శ్రీ యమునాదేవి నల్లని శరీరచ్ఛాయలతో, మెడలో నల్లగలువ పూవుల దండలతో, నల్లని తాబేలు వాహనముతో, రెండు చేతులతో నుండును.

ఈమె కుడిచేతియందు అభయముద్రను 1, ఎడమచేతియందు వరదముద్రను 2, ధరించును.

ఇట్టి రూపముతో నున్న శ్రీ యమునాదేవిని నమస్కరించుచున్నాను.

## 26. శ్రీ ద్రౌపదీదేవీ ధ్యానము

ఏకవక్త్రాం త్రినేత్రాం చ కిరీటమకుటాన్వితామ్
కృష్ణవర్ణసమాయుక్తాం ద్విభుజాం చిత్రవస్త్రకామ్ ॥

పంకజం దక్షిణే హస్తే వామే లంబకరాన్వితామ్
సర్వాభరణసంయుక్తాం దధానాం నవయౌవనామ్ ॥

త్రిభంగి మధ్యగణ్యాం తాం ద్రౌపదీం సుందరీం భజే ॥

ద్రుపదపుత్రియై పాండవపత్నియగు శ్రీ ద్రౌపదీదేవి నల్లని శరీరచ్ఛాయలతో, ఒక్క మొగముతో, మూడు కన్నులతో, రత్నములు పొదిగిన బంగరు కిరీటములతో, రెండు చేతులతో, వివిధ వర్ణములుకల వస్త్రములతో, అవయవములయందు అలంకరింపబడిన సర్వాభరణములతో, నూతన యౌవనమును ధరించి యుండును.

ఆమె కుడిచేతియందు పద్మమును ధరించును. ఎడమచేయి లంబకరమై (వ్రేలాడుచు) యుండును. ఆమె శరీరము త్రిభంగములు కలిగి (మూడు వంపులు కలిగి) యుండును. ఆమె పాండవపత్నులలో ప్రథమురాలు.

ఇట్టి రూపములో పరమలావణ్యమూర్తియగు శ్రీ ద్రౌపదీదేవిని నేను భజింతును.

## 27. శ్రీ కల్యాణసుందరమూర్తి ధ్యానము

(కల్యాణసుందరం రూపం వక్ష్యతే ఒద్య జగత్పతేః)
కుంచితం దక్షిణం పాదం వామపాదం తు సుస్థితమ్ ॥

సవ్యపూర్వకరే చైవ దేవ్యాః సవ్యకరం గ్రహేత్
వరదం వామహస్తం తు పరహస్తద్వయో ఒపి ॥

పరశుం సవ్యహస్తే తు మృగం వామే తు సంధరేత్
జటామకుటసంయుక్తం దివ్యాభరణభూషితమ్ ॥

దివ్యవస్త్రై రలంకృత్య ప్రవాళసదృశప్రభమ్
శ్యామవర్ణనిభాం గౌరీం దుకూలవసనాన్వితామ్ ॥

ఉత్పలం వామహస్తే తు మకుటం కేశబంధితమ్
సుస్థితం వామపాదం చాపీతరం కుంచితాన్వితమ్ ॥

ఈషల్లజ్జితవక్త్రాఢ్యాం దక్షిణే తు వ్యవస్థితామ్
తస్యా శ్చైవాపరే పార్శ్వే శ్రీభూమీ చైవ కారయేత్ ॥

తయో ర్హస్తాభయాభ్యాం తు గౌర్యా స్త మపరం స్పృశేత్
దేవ స్యాగ్రే చ కుండే తు జుహుయా త్తు ప్రజాపతిః ॥

హోమ స్యోత్తరదేశే తు హరి ర్వర్ధనిసంయుతః
దేవస్య వరదే హస్తే గౌరీం దద్యా త్తదంబునా ॥

శక్రాదిసర్వదేవా శ్చ భక్తియుక్తా వృతాః స్థితాః ॥

ముల్లోకములకు ప్రభువగు శ్రీ మన్మహాపరమేశ్వరుని కళ్యాణ సుందరరూపము వర్ణింపబడుచున్నది.

శ్రీ కళ్యాణసుందరమూర్తి ఎఱ్ఱని శరీరచ్ఛాయలతో, జటామకుటముతో, అలంకరింపబడిన దివ్యములగు ఆభరణములతో, వస్త్రములతో, నాల్గు చేతులతో నుండును.

ఈ స్వామికి కుడివైపున నల్లని శరీరచ్ఛాలతో, జటామకుటముతో, పట్టు వస్త్రములతో, రెండు చేతులతో. కొంచెము సిగ్గుచే వంచబడిన ముఖముతో, జగన్మాతృమూర్తి గౌరీదేవి ఉండును.

శ్రీ స్వామి కుడికాలు కొంచెము వంగినదై ఎడమకాలు స్థిరముగ నిలిచినదై యుండును.

శ్రీ గౌరీదేవికి ఎడమకాలు వంగినదై కుడికాలు స్థిరముగ నిలిచినదై యుండును.

శ్రీ స్వామి తనకుడి నిజకరముతో గౌరీదేవి కుడిచేతిని పట్టుకొనును 1, ఎడమ నిజకరమునందు వరముద్ర 2, కుడిపరకరమునందు గొడ్డలి 3, ఎడమపరకరమునందు మృగము 4, ఉండును.

శ్రీ గౌరీదేవికి కుడివైపున శ్రీదేవి (లక్ష్మీదేవి), భూదేవియును ఉందురు. వారలు తమ కుడిచేతులతో శ్రీ గౌరీదేవి కుడిచేతిని పట్టుకొని యుందురు.

శ్రీ పరమేశ్వరుని ముందు హోమకుండమునందు పురోహితుడగు బ్రహ్మ మంత్రపూర్వకముగ ఆహుతులను వ్రేల్చుచు హోమము చేయుచుండును.

హోమకుండమునకు ఎడమవైపున శ్రీమన్మహావిష్ణువు బంగారు కలశమును పట్టుకొని యుండును. శ్రీ పరమేశ్వరుని పంముద్రగల వామహస్తమునందు తన బంగారు కలశమునందలి జలములను విడచుచు వధువగు శ్రీ గౌరీదేవిని దానముచేయుచుండును.

ఇంద్రుడు మున్నగు సకలదేవతలు భక్తితో శ్రీ కళ్యాణసుందరమూర్తిని చుట్టుముట్టి శ్రీ పార్వతీపరమశివుల కళ్యాణమును తిలకించుచుందురు.

## 28. శ్రీ తేజశ్చండ ధ్యానము

చండం రక్తం (కరాళాస్యం) భజే నిత్య
మబ్జాభయకరద్వయమ్
దంష్ట్రాకరాళదీప్తాస్యం
జటిలం రక్తవాససమ్ ॥

శ్రీ తేజశ్చండమూర్తి ఎఱ్ఱని శరీరచ్ఛాయలతో, ఎఱ్ఱని వస్త్రములతో, జడలతో, కోరలచేత భయంకరమై ప్రకాశించు మొగముతో, రెండు చేతులతో నుండును.

ఈ స్వామి కుడిచేతియందు అభయముద్రను 1, ఎడమచేతియందు పద్మమును 2, ధరించియుండును.

ఇట్టి రూపముతో నున్న శ్రీ తేజశ్చండమూర్తిని నేను భజించుచున్నాను.

## 29. శ్రీ శివచండ ధ్యానము

శివాంజలికృతం చండం శివధ్యానపరాయణమ్
శివార్చాఫలదాతారం శివచండేశ్వరం భజే ॥

శ్రీ శివచండేశ్వరుడు దోసిలితో శివునకు నమస్కరించుచు, నిశ్చలముగ శివుని ధ్యానించుచుండును. ఈతడు శివుని పూజించినవారికి తగిన ఫలమును ఇచ్చుచుండును.

ఇట్టి శ్రీ శివచండేశ్వరుని నేను భజించుచున్నాను.

## 30. శ్రీ ఆదిచండేశ్వర ధ్యానము

పీతాభం గుణలోచనం శశియుతం
సవ్యే ఒక్షమాలాధరం
సవ్యేర్ధ్వే పరశుం దధాన మపరే
ఘంటాం త్రిశూలం పరమ్
సవ్యే లంబపదం కునీకృతపదం
వామే తు పద్మాసనమ్
దీవ్యత్కుండలమండితానన ముఖం
నౌ మ్యాదిచండేశ్వరమ్ ॥

శ్రీ ఆదిచండేశ్వరమూర్తి మేలిమి బంగరు వంటి పచ్చని శరీరచ్ఛాయలతో, మూడు కన్నులతో, నెలవంక శిరోభూషణముతో, మణులు పొదిగిన పసిడికుండలముల చేత ప్రకాశించు మొగముతో, నాల్గు చేతులతో, పద్మాసనము నం దుండును.

ఈ స్వామి కుడివైపున క్రిందినుండి పైకి వరుసన జపమాలను 1, గొడ్డలిని 2, అట్లే యెడమవైపున గంటను 1, త్రిశూలమును 2, కుడియెడమల నాల్గు చేతులతో ధరించును.

ఈ స్వామి కుడికాలు పద్మాసనమునుండి వ్రేలాడుచుండును. ఎడమకాలు వంగి ఆసనమునందు సుఖముగ నుండును.

ఇట్టి రూపముతో నున్న శ్రీ ఆదిచండేశ్వరస్వామిని నేను నమస్కరించుచున్నాను.

# 31. శ్రీ చతుర్ముఖ ధ్యానము

చతుర్ముఖం చతుర్బాహుం కమండల్వక్షధారిణమ్
యజ్ఞసూత్రోత్తరీయం చ జటామకుటసంయుతమ్ ॥

సవ్యహస్తే ఒక్షమాలాం చ వామహస్తే కమండలుమ్
స్రువం దక్షిణహస్తే చ పుస్తకం వామహస్తకే ॥

అంబుజాసన ఆసీనం ధ్యానసంమీలితేక్షణమ్
పద్మపత్రదళాగ్రాభం ధ్యాయే దేవం చతుర్ముఖమ్ ॥

శ్రీ చతుర్ముఖ బ్రహ్మ తామరపూరేకుల కొనల కాంతుల వలె ఎఱ్ఱని శరీరచ్ఛాయతో, నాల్గు మొగములతో, నాల్గు చేతులతో, జందెముతో, ఉత్తరీయముతో(పై వస్త్రంతో), జటాజూటముతో, ధ్యానముచేత మూయబడిన కన్నులతో, పద్మాసనమునం దుండును.

కుడివైపున, క్రిందినుండి పైకి జపమాలను 1, స్రువమును 2, అట్లే ఎడమ వైపున కమండలువును 1, పుస్తకమును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించి యుండును.

ఇట్టి రూపముతో నున్న చతుర్ముఖ బ్రహ్మను ధ్యానింపవలయును.
(పాటలవర్ణము).

# 32. శ్రీ సూర్య ధ్యానము

పద్మాసనః పద్మకరః పద్మగర్భసమద్యుతిః
సప్తాశ్వరథసంయుక్తో ద్విభుజః స్యాత్సదా రవిః ॥

సూర్యుడు తామరపూవు లోపలి భాగము వలె ఎఱ్ఱని శరీరచ్ఛాయలతో, రెండు చేతులతో, ఏడు గుఱ్ఱములను గట్టిన రథమునందు పద్మాసనమున నుండును.

కుడిఎడమల రెండు చేతులయందు రెండు పద్మములను ధరించు.
(పాటలవర్ణము)

# 33. శ్రీ చంద్ర ధ్యానము

(శారదాతిలకము)

కర్పూరస్ఫటికావదాత మనిశం పూర్ణేందుబింబాననం
ముక్తాదామవిభూషితేన వపుషా నిర్మూలయంతం తమః
హస్తాభ్యాం కుముదం వరం చ దధతం నీలాలకోద్భాసితం
స్వస్యాంకస్థమృగోదితాశ్రయగుణం సోమం సుధాబ్ధిం భజే॥

కర్పూరమువలె, స్ఫటికమువలె తెల్లని శరీరచ్ఛాయలతో, పూర్ణచంద్రబింబము వంటి సుందరని మొగముతో, ముత్తెముల దండలచే నలంకరింపబడిన శరీరముతో, చీకటి గుంపులను నిర్మూలించుచు, నల్లని ముంగురులతో ప్రకాశించుచు రెండు చేతులతో నుండును.

కుడిచేతియందు కలువపూవును 1, ఎడమచేతియందు వరదముద్రను 2, ధరించును.

ఇట్టి రూపముతో తన తొడయందు మృగమునకు ఆశ్రయమిచ్చిన దయాగుణము కలిగిన అమృతమయుడగు శ్రీ చంద్రుని నేను భజించుచున్నాను. (శ్వేతవర్ణము)

# 34. శ్రీ అంగారక ధ్యానము

రక్తమాల్యాంబరధరః శక్తిశూలగదాధరః
చతుర్భుజో మేషగమో వరదః స్యా ద్ధరాసుతః ॥

అంగారకుడు ఎఱ్ఱని శరీరకాంతులతో, నాలుగు చేతులతో, ఎఱ్ఱని వస్త్రములతో, ఎఱ్ఱని పూలదండలతో, మేషవాహనముతో నుండును.

ఈతడు క్రిందినుండి పైకి కుడిభాగమున శక్తిని 1. శూలమును 2, అట్లే ఎడమ వైపున వరదముద్రను 1, గదను 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును.

(రక్తవర్ణము)

# 35. శ్రీ బుధ ధ్యానము

పీతమాల్యాంబరధరః కర్ణికారసమద్యుతిః
ఖడ్గచర్మగదాపాణిః సింహస్థో వరదో బుధః ॥

శ్రీ బుధగ్రహము కర్ణికార పుష్పము వలె పసుపు పచ్చని శరీరకాంతులతో, పసుపుపచ్చని వస్త్రములతో, పూలదండలతో, నాల్గు చేతులతో, సింహవాహనముతో యుండును.

కుడివైపున క్రిందినుండి పైకి వరదముద్రను 1, ఖడ్గమును 2, అట్లే ఎడమవైపున గదను 1, ఖేటమును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును.

(కనకవర్ణము)

## 36. శ్రీ బృహస్పతి ధ్యానము

అష్టభిః పాండరై ర్యుక్తో వాజిభిః కాంచనే రథే
తిష్ఠన్ తరతి వై వర్షం రాశౌ రాశౌ బృహస్పతిః ॥

దేవదైత్యగురూ శుద్ధౌ పీతశ్వేతౌ చతుర్భుజౌ
దండినౌ వరదౌ కార్యౌ సాక్షసూత్ర కమండలూ ॥

శ్రీ బృహస్పతి పసుపుపచ్చని శరీరకాంతులతో, ఎనిమిది తెల్లని గుఱ్ఱములను కట్టిన బంగారు రథమునందు ఉపవిష్టుడై ఒక్కొక్క రాశియందు ఒక్కొక్క సంవత్సరము ప్రయాణించుచు, పన్నెండు రాశులను పన్నెండు వత్సరములలో చుట్టి భగోళమంతయును పరిభ్రమించును.

ఈతనికి నాల్గు చేతులు. కుడివైపున క్రిందినుండి పైకి దండమును 1, జపమాలను 2, అట్లే ఎడమవైపున వరముద్రను 1, కమండలువును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును. (కనకవర్ణము)

## 37. శ్రీ శుక్ర ధ్యానము

సవరూథ స్సానుకర్షో యుక్తో భూసంభవై ర్హయైః
సోపాసంగపతాక స్తు శుక్రః స్యా త్తు రథో మహాన్ ॥

దేవదైత్యగురూ శుద్ధౌ పీతశ్వేతౌ చతుర్భుజౌ
దండినౌ వరదౌ కార్యౌ సాక్షసూత్రకమండలూ ॥

శ్రీ శుక్రుడు తెల్లని శరీరచ్ఛాయలతో, నాల్గు చేతులతో, భూమియందు పుట్టిన తెల్లని ఎనిమిది గుఱ్ఱములను పూన్చిన, తెల్లని పతాకము కలిగిన, తెల్లని రథమునందు సైన్యయుక్తుడై యుండును.

ఈతడు కుడివైపున క్రిందినుండి పైకి దండమును 1, జపమాలను 2, అట్లే ఎడమవైపున వరదముద్రను 1, కమండలువును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును. (శ్వేతవర్ణము)

# 38. శ్రీ శనైశ్చర ధ్యానమ్

ఇంద్రనీలద్యుతిః ఖడ్గీ వరదో గృధ్రవాహనః
బాణచాపధరో వీరః కర్తవ్యో ఽర్కసుతః సదా ॥

శ్రీ శనైశ్చరుడు ఇంద్రనీలమణుల వలె నల్లని శరీరచ్ఛాయలతో, నాల్గు చేతులతో, గ్రద్ద వాహనములో వీరుడై యుండును.

కుడివైపున క్రిందినుండి పైకి ఖడ్గమును 1, బాణమును 2, అట్లే ఎడమవైపున వరదముద్రను 1, వింటిని 2, కుడి ఎడమల నాల్గు చేతులతో ధరించును.

(కృష్ణవర్ణము)

# 39. శ్రీ రాహు ధ్యానమ్

కరాళవదనః ఖడ్గచర్మశూలీ వరప్రదః
నీలసింహాసనస్థశ్చ రాహు ర్మే స్యా చ్ఛుభప్రదః ॥

శ్రీ రాహువు నీలమేఘము వంటి నల్లని శరీరచ్ఛాయలతో, భయంకరమగు మొగముతో, నాలుగు చేతులతో నల్లని సింహాసనము నందుండును.

కుడివైపున క్రిందినుండి పైకి వరుసన శూలమును 1, ఖడ్గమును 2, అట్లే ఎడమవైపున వరముద్రను 1, ఖేటమును 2, కుడిఎడమల నాల్గు చేతులతో ధరించును.

ఇట్టి రాహువు నాకు శుభములను ఇచ్చుగాక! (నీలమేఘవర్ణము)

# 40. శ్రీ కేతు ధ్యానము

ధూమ్రాః సుఖావహాః సర్వే గదినో వికృతాననాః
కపోతవాహనా నిత్యం కేతవః స్యు ర్వరప్రదాః ॥

(కేతువునకు బహుత్వ ప్రసిద్ధి కలదు. అందుచేత బహువచనముతో ఇచ్చట చెప్పబడిరి. అయినను ఒక్క కేతువునే ధ్యానించుట జరుగుచున్నది.)

శ్రీ కేతువు ధూమము వలె లేత నలుపు శరీరచ్ఛాయలతో, వికృతమగు మొగముతో, రెండు చేతులతో, పావురము వాహనముతో సుఖమును కలిగించువారై యుండును.

కుడిచేతితో వరదముద్రను 1, ఎడమచేతితో గదను 2, కుడి ఎడమల రెండు చేతులతో ధరించును. (ధూమ్రవర్ణము)

సర్వే కిరీటినః కార్యా గ్రహా లోకహితావహాః ॥

పైన వివరింపబడిన సూర్యాదులగు తొమ్మండుగురు గ్రహములు లోకమునకు మేలును కలిగింతురు. వారల నెల్లరిని కిరీటముల కలవారినిగా నిర్మింపవలెను.





Sri Kamakshi Devi
శ్రీ కామాక్షీదేవి



Sri Yogasakthi (Karanagamam)

శ్రీ యోగశక్తి (కారణాగమము)




Sri Bhogasakthi (Asana) (Karanagamam)

శ్రీ భోగశక్తి (కారణాగమము)



Sri Veerasakthi (Karanagama)

వీరశక్తి ( కారణాగమమ్ )



Sri Gowri (Karanagama)
శ్రీ గౌరి ( కారణాగమమ్ )



Sri Valli Devi

శ్రీ వల్లీదేవి



Sri Devasana Devi

దేవసేనాదేవి



Sri Manonmani Devi

శ్రీ మనోన్మణీదేవి



Sri Seethala Devi (Mariyamma)

శ్రీ శీతలాదేవి (మారియమ్మ)



Sri Purna Devi

శ్రీ పూర్ణాదేవి



Sri Vishnu Durga Devi
శ్రీ విష్ణుదుర్గాదేవి



No. 1 Sri Surya Graham
శ్రీ సూర్య గహమ్



No. 2 Sri Chandra Graham

శ్రీ చంద్ర గ్రహమ్



Sri Angaraka Graham

శ్రీ అంగారక గ్రహమ్




No. 4 Sri Budha Graham

శ్రీ బుధగ్రహమ్




No. 5 Sri Brihaspathi Graham

శ్రీ బృహస్పతి గ్రిహమ్



No. 8 Sri Rahu Graham

శ్రీ రాహు గ్రహమ్



No. 9 Sri Kethu Graham

శ్రీ కేతుగ్రహమ్




Sri Chathurmukha Brahma

శ్రీ చతుర్ముఖబ్రహ్మ

Sri Kalyana Sundara Murthy

శ్రీ కల్యాణ సుందరమూర్తి






Sri Chandikeswara Murthi

శ్రీ చండికేశ్వరమూర్తి



Sri Chandikeswara Devi
శ్రీ చండికేశ్వరదేవి




Sri Devi
శ్రీదేవి



Sri Svapna Varahi Devi
శ్రీ స్వప్న వరహాదేవి



శ్రీ రాజరాజేశ్వరీదేవి

Sri Rajarajeswari Devi



Sri Bhuvaneswari Devi

శ్రీ భువనేశ్వరీదేవి